శ్రీలీలాశుక యోగీంద్రవిరచిత

వెలగపూడి - వెంగనామాత్యవిరచిత

ఆంధ్ర పద్యసహితము.

తంజనగరము - తేవప్పెరుమాళ్లయ్యగారిచే

వ్రాయబడిన టీకాతాత్పర్యములతోఁగూడినది.

...పట్టణము - రామానుజయ్యగారిచేఁ

బరిశోధింపబడినది.

వేం... వేంకటకృష్ణమ సెట్టి అండ్ సన్సుచేఁ

బ్రకటింపఁబడుచుండినది

ఈకూర్పు



ప్రకాశకులు :

పబ్లిషర్సు - ఏలూరు.

286, చైనాబజార్ రోడ్డు,

1939.

 [Price Re. 1-8-0.

# ఉపోద్ఘాతము

ఈగ్రంథమును రచించినకవి 'లీలాశుకేన రచితం తవ దేవకృష్ణ కర్ణామృతం వహతు కల్పశతాన్తరేఽపి' అను నిందలి శ్లోకముంబట్టి లీలాశుకుఁ డని తెలియుచున్నది. మఱియుఁ బండితపరంపరగా వాడుకొనం బడు విషయములంబట్టి కాక యితని జీవితవిషయములను వ్రాయుటకు వేఱొండాధార మంతగాఁ గానిపింపదు. ఇతఁ డాంధ్రదేశమున శ్రీకాకుళ పువాస్తవ్యుఁ డని ప్రతీతి కలదు. ఇతనిజీవించియుండిన కాల మిది యని నిశ్చయించుటకు నాధారము లింతవఱకుఁ గానిపింపకున్నవి. ఈ గ్రంథము భక్తిరసప్రధాన మగుటంబట్టి, యిందుకు గవిచరిత్ర వ్రాయుటకు నిదర్శనము లంతగాఁ గనుబట్టవు. ఇందలి ప్రథమశ్లోక మగు

'చిన్తామణి ర్జయతు సోమగిరి ర్గురు ర్మే
శిక్షాగురు శ్చ భగవా ఞ్ఛిఖిపిఞ్ఛమౌళిః'

అనుదానికిం గలవ్యాఖ్యయందు, నితఁడు చింతామణి యను వేశ్యయం దాసక్తుఁడై యుండెననియు, నావేశ్య యితనివిద్యావిలసనమును గవితాపటిమయును వ్యర్థము లగుటంజూచి సోమగిరి యనుగురువు నాశ్రయింపఁజేసిన దనియు, నితం డాసద్గురూత్తముని యనుగ్రహమువలన మంత్రోపదేశము నొంది తన్మంత్రజపప్రభావమున శ్రీకృష్ణమూర్తిసాక్షాత్కారముం బడసె ననియుఁ దెలియవచ్చుచున్నది. ఇది యెంతవఱకు నిజమో తెలియరాదుగాని సోమగిరిగురువు నాశ్రయించుట సత్యమని యీగ్రంథమే యుద్ఘోషించుచున్నది. మఱియుఁ గృష్ణునినిరతిశయ సౌందర్య సౌకుమార్య హావభావ విలసనముల నత్యంతస్ఫుటముగాను నపూర్వమనోజ్ఞముగాను నిరూపించువర్ణనాపటిమంబట్టియు, దన్మూర్తికసాధారణములైనపింఛాద్యలంకారపరికరము నేతరచుగా శ్లోకములన్నిటఁ జెప్పుచుంటంబట్టియుఁ జూడఁగా నితనికి నాగురువునుపదేశమువలన

గోపాలమంత్రసిద్ధియుఁ గలిగి కృష్ణమూర్తిసాక్షాత్కారము లభించి యుండుననియు నూహింపఁ దగియున్నది. కావుననే యయ్యెయెడల మంత్రాధిష్ఠానమూర్తిని శేషములను వర్ణించుటయు, 'చిన్తయే స్నీల భాసమ్॥ వస్త్రీ' అని గోపాలమంత్రాధికారిచింతనప్రకారమును మూఁడవయాశ్వాసముతుదను బొందుపఱచుటయుఁగానంబడుచున్నవి. ఇంతే కాక, బహుతరముగా శ్లోకములందు నెడతెగక గోపీజనముతోడికూడి కను నత్యంతశృంగారరసోద్దీపకముగా వర్ణించుటయు నితనికిం గల చింతామణి వేశ్యాలంపటత్వమును గొంత సూచించుచున్నది. మఱియు,

"శైవా వయంన ఖలు తత్ర విచారణీయం
పఞ్చాక్షరీజపపరా నితరాం ..."

అన్నట్లు కేవలశైవుఁడై యుండుటయుఁ, బిదప

... ... ...'తథాపి
చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్'

అని, బాలగోపాలకృష్ణునికి భక్తుఁ డగుటయుఁ, బూర్వోక్తము లైన యూహలకుఁ గొంత యుపోద్బలకములుగానున్నవి. ఆకృష్ణమూర్తి యందలిభక్తియుసామాన్యమైనది గాదు. అది యతిమాత్ర మగుటం జేసి, యాకృష్ణావతారమునం దప్పఁదదపరపర్యాయము లే యగుతక్కిన రామాద్యవతారములందును శివుని యందుంబోలెఁ గవికి వైరస్యముక ల్పించినదయ్యె.. కావుననే యిందలిశ్లోకము లన్నియుఁ గృష్ణావతారైకప రములుగానే చూపట్టుచున్నవి. ఇందలికవనమును, గోనులమగుశయ్యాను నొయ్యారంబు గులుకుశైలిని, మకరందరసప్రవాహములు చిప్పిలుచు, సహృదయహృదయంగమముగా నుండును.

ఈగ్రంథమున మూఁడాశ్వాసములు గలవు. అందు మొదటి యాశ్వాసమున శ్రీకృష్ణమూర్తిని, దదీయమనోజ్ఞవేషసౌందర్యాది విశేషములను వర్ణించుచు, సాక్షాత్కరింపఁ బ్రార్థించుచున్నాఁడు.పిద పఁ గృష్ణుఁడు సాక్షాత్కరించుటయు,

'తేజసేఽస్తు నమో ధేనుపాలినే లోకపాలినే।

రాధాపయోధరోత్సఙ్గశాయినే శేషశాయినే'

అని యద్దేవుని ప్రస్తుతించుచున్నాడు. కవికి, శ్రీకృష్ణమూర్తి యందుఁ గలనిరతిశయభక్తియుఁ దదీయసాక్షాత్కారమందుఁ గలయార్తియు శ్రీకృష్ణవేషాదివైభవవర్ణనానల్పచాతురియు ననన్యశములు. ఈ కవికిఁ గృష్ణుని శైశవదశయందు మిక్కిలియనురాగాతిశయము చూపట్టుచున్నది. కావుననే

'అస్తి... ...అఖిలోదారం కిశోరాకృతి'

'బాలం నీల మమీ వయం మధురిమస్వారాజ్య మారాధ్నుమః'

'బాలం కదా నామ విలోకయిష్యే'

'శిశిరీకురుతే కదాను నశ్శిఖిపిఞ్ఛాభరణః శిశు ర్దృశోః'

అని బాల్యాకృతిని బాగుగఁ జూడ నువ్విళ్లూరుచున్నాడు. అందు, నాశైశవము,

'ప్రోన్మీలన్నవయౌవనమ్'

'తారుణ్యాసంవలితశైశవవైభవేన'

'అస్పృష్టయౌవన మనష్టకిశోరభావమ్'

'అవ్యక్తయౌవన పరీత కిశోరభావమ్'

అని యొకింత తలసూపుచున్నయౌవనముతోఁ గూడి యౌవనోదయప్రయుక్తమైనశృంగారరస తరంగితము గలదై యుండుట మీఁదుమిక్కిలి కవియభీష్టసార మై యున్నది. ఇట్టిశైశవమునందు

'త్వచ్ఛైశవం త్రిభువనాద్భుత మిత్యవైమి'

'యచ్చాపలం చ మమ వాగవివాదగమ్యమ్'

అని కవికిఁ గలచాపలము వాచామగోచరము. మఱి యీకవి కృష్ణునికిఁ గూర్చినగొనబుసొమ్ము నెమిలిపురి. కవి చెప్పినొక్కొకశ్లోకము నందును ప్రాయికముగా నెమిలిపురి పిరిగొనియుండకపోదు. మఱి చేతి యందుఁ బిల్లఁగ్రోవి కూఁగవి యిడకమానఁడు. ఈ నెమిలిపురి యొకటియే

'బర్హంనామ విభూషణం బహుమతం వేషాయ శేషైరలమ్'

అని కృష్ణమూర్తికిఁ గవిమతమున జాలినభూషణకలాపసర్వస్వము. మహాకవికి నిసర్గసిద్ధములై నిరుపాధికములైనయలంకారము లే యిష్టములు. తళుకుబెళుకులా లతనికి వలపు గొలుపవు. కురులయందుఁ జెరివిన

నెమిలిపురియు, నమ్మోతపు లొలుకుచున్న పిల్లఁగ్రోవిరవళియు, నెలజవ్వనము తలసూపుచున్న శైశవమును, ముగ్ధలును మోహపరవశలునగు గోపికలు పరివేష్టించియుండుటయు, నివియే కవిమతమున మిక్కిలి మనోజ్ఞములైనకృష్ణునిపరిచ్ఛదములు. ఇవియే

'బర్హోత్తంసవిలాసి కున్తలభరం మాధుర్యమగ్నాననం
ప్రోన్మీలన్నవయౌవనం ప్రవిలసద్వేణుప్రణాదామృతం
ఆపీనస్తనకుట్మలాభి రభితో గోపీభి రారాధితం
జ్యోతిశ్చేతసి న శ్చకాస్తి జగతామేకాభిరామాద్భుతమ్॥'

అని జగదేకాద్భుతమైనశ్రీకృష్ణునిమోహనపరికరసామగ్రి. ఇట్టిపరికరమును గ్రంథారంభమునఁ జెప్పి పయింబయి దీనినే సాకల్యమునఁ గాని యొక్కొకటిగాఁగాని యయ్యైయెడల నతిస్ఫుటముగాను, బహుమనోజ్ఞముగాను సహృదయహృదయములంజిత్రితమగునట్లు సందర్భములను గల్పించికొనియు రచనల నలవరించుకొనియు వర్ణించుచున్నాఁడు. మఱియు నిందు గోపీజనాకర్షకమగు వేణురవామృతమును, గోపీజననయనోత్సవకర మగుమదశిఖిశిఖండవిభూషణమును, గోపీజనభోగోపయుక్తమగు తారుణ్యసంకేతమును, మిఁదుమిక్కిలి యలవరుపంబడియుండుటంబట్టి, కృష్ణుని గోపీజనైకసంగశృంగారమే కవికి మిక్కిలిహృదయంగమమైయున్నదనియుఁ, గావుననేయతఁడన్ని శ్లోకములను నాశృంగారరసముననేయూరునట్లు చేసినాఁడనియుఁ దోఁచుచున్నది. కాన వేశ్యాసంగతిని జవిచూచినశృంగారరసమంతయుఁ గవికృష్ణునికిని జుబ్బనచూఱగా నిచ్చినాఁడు. తొలుదొలుతఁ దనకు హృదయమున సాక్షాత్కరించినబాలకృష్ణమూర్తిని, నతని నెమిలిపురియుఁ బిల్లఁగ్రోవియుఁ గొల్ల యిల్లాలిబలఁగమును, మఱువకయే కన్నులకు సాక్షాత్కరించునట్లు వర్ణించువర్ణనము లతిమనోజ్ఞములు. నెమిలిపురిని నెఱికురులం దుఱిమిన మురువును, నునుఁజిఱునవ్వు దొలఁకుముద్దుమొగమును, బచ్చితేనియలు చిప్పిల్లుపిల్లఁగ్రోవిరవళియును, బరివేష్టించి యున్నగొల్లముద్దియల మరునితోడిమిటారమును నతిసూక్ష్మ మధురసంభితములు యత్యంతరసోద్దీపకములు రచనావైఖరిని నానా [illegible] నవైనామునట్లను, మోహనుని ప్రేమ న్నను, వర్ణించుచున్నాఁడు. అవర్ణనములం జూపట్టునతిస్ఫుటత్వమును, నత్యంతమాధు

ర్యమును జూడఁగాఁ గవికిం గలిగినసాక్షాత్కార మతివిశదమై యపూర్వభోగ్యమై యుండు నని తెలియుచున్నది.

మఱియు నల్పపదపరికరమున, నతినిబిడమై రసోత్కటమై చమత్కారకారి యగునర్థవైభవమును హావణించువిన్నాణము మహాకవిసొమ్ము. కావుననే యీకృష్ణమూర్తి కవికి 'మధురిమసామ్రాజ్య' మయ్యె. ఆదేవుఁడతనికి 'మారః స్వయంను మధురద్యుతిమణ్డలంను, మాధుర్య మేవ ను మనోనయనామృతంను' 'మత్పుణ్యానాం పరిణతి' 'దేవకీపుణ్యరాశి' యు నయ్యె. కవికంటికిం గృష్ణుఁడు కృష్ణుఁడుగాఁడు. అతఁడొక 'జగతా మేకాభిరామాద్భుత'మైనజ్యోతి, 'కిఞ్చన' ధామము, 'భువనార్ద్రి'మగునోజస్సు; 'కిమపి' తేజము, 'సమస్తజగతామ్' స్వస్త్యయనము. 'ఉపనిషదర్థ'ము. వేయేల '|బహ్మ'ము. అయినను గవికి 'నిగమవాగగోచర'మైన యీ 'జ్యోతి'యు 'గోపాలాజిరకర్దమ'ములం దిరుగునొకమిసుఁగుటుఁబుర్వు. ఈ 'కిఞ్చనధామ' 'వ్రజభాగ్యసీమ.' ఈ 'యుపనిషదర్థ'ము వల్లవీజనులకు 'ఉలూఖలే నిబద్ధ'ము. సమస్తజగత్తులకు నగు 'స్వస్త్యయనము' 'గోపకన్యాధన్యస్తనస్వస్త్యయన'ము. ఈ 'బ్రహ్మ'ము గోపీ'సమ్భోగచిహ్నజర్జితసర్వగాత్ర'ము. 'మునీనాంపరిషది'పరామృశ్యమైనయిది, 'వ్రజవధూదృశాం' దృశ్యమైనదే. వేయేల, ఇది 'వల్లవీభాగధేయ'ము. 'మానిమనోంతర'ములందు వెలుఁగునీవెలుఁగు 'బాలాస్తనాంతర' ములందుఁ గవికంటికి మఱియు వెలుఁగుచున్నది. మహాయోగీంద్రుల కందరాని స్వామిగా నుండుటకన్నను గొల్లముగుదలకు గులా మగుటయే కవికి మిక్కిలియు రుచ్యము. పరత్వసౌలభ్యముల యీసమ్మేళనమై చిత్రియే లీలాశుకునికి మిక్కిలియు జీవాతువు. పరత్వంపుఁగాముఁ జెప్పునప్పుడును దానికాఠిన్యమును సౌలభ్యముతో మెదచి కొంత మృదువుసేసియున్నాఁడు. గొల్లచెలువలకు గులాముపనులు సేయించుచునే యీసౌలభ్యాతిశయపుఁబేలవతకుఁ బరత్వంపుబిగుసునుం గూర్చియున్నాఁడు.

ద్వితీయాశ్వాసమునందుఁ గృష్ణునిలీలలు పెక్కువిధముల మిగుల నిపుణముగా వర్ణించియున్నాఁడు. కృష్ణునకునుగోపికకును, కృష్ణునకును యశోదకును, గలుగును త్తరప్రత్యుత్తరములును, కృష్ణునికి లక్ష్మికినిగలుగు సరసవిరసములు మిక్కిలిసరసములు, కృష్ణునిధార్త్యలీలలు నతిమనో

జ్ఞములు. ఇందు 'శమ్భోస్స్వాగతమ్' అని పరత్వప్రయుక్తమైనస్వామిత్వ మాడిగా 'ఉలూఖలేనిబద్ధమ్' అని యవతారప్రయుక్తమైనసౌలభ్యమువ అవిఁ గలమహత్త్వవిశేషములును లీలావిలసితములును, మిక్కిలి సొబ గుగాఁ గవి రూపించినాఁడు. మఱియు నిందు,

'యద్రోమరన్ధ్రపరిపూర్తివిధా వదక్షా
వారాహజన్మని బభూవు రమీ సముద్రా
స్తన్నామ నాథ మరవిన్దదృశం యశోదా
పాణిద్వయాన్తరజలైః స్నపయాంబభూవ'

అని సముద్రము లన్నియుఁ జేరి రోమకూపములనేని పూరింపఁజాల నట్టియమేయమహిమ గలవానికియశోదదోయిటిజలములోఁ దొప్పఁదోఁ గుచుండుసామాన్యాకారముఁగూర్చినాఁడు. ఇట్టిపరాత్పరుఁడని తెలిసియు

'ఏతే లక్ష్మణ జానకీవిరహితం మాం ఖేదయన్త్యమ్బుదాః'
'రామోనామ బభూవ హుం తదబలా సీతేతి హుం తౌ పితుః'

అని, రాముఁడే యితఁ డని యెఱిఁగియుఁ, దుదకు రాముఁడై పొడసూ పఁగాఁ జూడనొల్లక,

'విహాయ కోదణ్డశరౌ ముహూర్తం
గృహాణ పాణౌ మణిచారువేణుం।
మాయూరబర్హంచ నిజోత్తమాఙ్గే
సీతాపతే త్వాం ప్రణమామి పశ్చాత్'

అని, పిల్లఁగ్రోవితోడను నెమిలిపురితోడను గూడినకృష్ణమూర్తినే కోరి నాఁడు. రాముఁడు కృష్ణుఁ డగుటను దానే యనుసంధించియు, నెమిలిపురి యుఁ, బిల్లఁగ్రోవియు, గొల్లచెలువలతోడికూడికయు, రామునికి లేనందున దండముగూడఁ బెట్టఁడయ్యె. వేశ్యాసంగశృంగారరసముం మూరియూరి యున్నకవికి వైరాగ్యదశయందును గోపీలంపటునియందే కాని సీతావల్ల భునియం దాసక్తిగానరాదు. విషయలోలత్వమునందుఁ దలమున్కలై యుండినశృంగారరసమే వైరాగ్యదశయందును వాసనాబలమున ననువ ర్తించుచున్నది కాని, యది పూర్వమువలెఁ బ్రాధాన్యమును గానక వైరాగ్యమున కంగమై శాంతరసముకటుత్వమును మాన్పి దాని

కోకభోగ్యత్వమును గూర్చుచుండుట పెక్కుమహనీయులచరితలం జూపట్టుచున్నది. కాన కవియందిదియొకయొప్పిదమే. మునుపటిశృంగారమున కాలంబనము వేశ్యయగుచింతామణి; ఇప్పటిశాంతరసానుగృహీతశృంగారమున కాలంబనము వశ్య గోపాలచింతామణి. మఱియు నిందు

'రత్నస్థలే జానుచరః కుమారః
సఙ్క్రాన్త మాత్మీయముఖారవిన్దమ్
ఆదాతుకామ స్తదలాభఖేదాత్
విలోక్య ధాత్రీవదనం రురోద.'

అను నీమాధ్యనాటితకమునకన్న నెక్కుడు విష్ణునకుసుం జూపశక్యము గాదు. మఱియు నిందు రాసక్రీడాష్టకము నతికౌశలముగాఁ బేశలకవనమున వావణించి యున్నాఁడు.

మూఁడవయాశ్వాసమునందుఁగవి కృష్ణునిఁగూర్చియనేకవిధముల సంకీర్ణముగాఁ జేయువర్ణనములు చూపట్టుచున్నవి.

శ్లో॥ 'నిసర్గసరసాధరం నిజదయార్ద్రదివ్యేక్షణం
మనోజ్ఞముఖపఙ్కజం మధురసార్ద్రమన్దస్మితమ్।
రసజ్ఞహృదయాస్పదమ్ రమితవల్లవీలోచనమ్
పునఃపున రుపాస్మహే భువనలోభనీయం మహః'

ఇందు మధురగుంభితములును, నర్థసౌకుమార్యమును మిక్కిలి యొప్పిదములు. ఇందు మంత్రాధిష్ఠానమూర్తులను గొన్నిటిని

'కోదణ్డం మసృణం సుగన్ధి విశిఖం చక్రాబ్జపాశాఙ్కుశమ్'
'కోదణ్డ మైన్దవ మఖణ్డ మిషుంచ పౌష్పమ్'

అని ప్రతిపాదించియున్నాఁడు. ఇం దెట్టినిచాయయు నష్టబాహువులును జెఱకువిల్లును బూవుందూపులునుగూడఁ జూఁపట్టుచున్నవి. ఇది మదనగోపాలమంత్రాధిష్ఠానమూర్తివిశేషము గానోపు.

ఇట్లుమొయొడలఁ బెక్కులు మంత్రాధిష్ఠానమూర్తివర్ణనములు గానిపించుటచే నీ కవి సోమగిరిగురుమూలమున మంత్రోపదేశము నొంది తన్మూలమునఁ గృష్ణసాక్షాత్కారపరమభాగ్యముం బడసి యిట్లు నర్గళమృదుమధురమధురసధారాధురీణముగాఁగర్ణామృతమును రచింపఁ

గలిగినాఁ డనుట తేటతెల్ల మగుచున్నది. ఇట్లు కృష్ణునినానావిధస్వరూపముల ననేకరచనావైచిత్రీవిశేషములతో వర్ణించి కడపట

'యా ప్రీతి ర్విదురార్పితే మురరిపో కున్త్యర్పితే యాదృశీ
యా గోవర్ధనమూర్ధ్ని యాచ పృథుకే స్తన్యే యశోదార్పితే,
భారద్వాజసమర్పితే శబరికాదత్తేఽధరే యోషితాం
యా ప్రీతి ర్మునిపత్నిభక్తిరచితేఽప్యత్రాపి తాం తాం కురు'

అని యధికారితారతమ్యమును బాటింపక భక్తిమాత్రమును బట్టి పరిగ్రహించునట్టివిష్ణుదేవునికృపాసౌభాగ్యమునుద్ఘాటించుట, యెంతయు సరసమును నత్యంతప్రౌఢమును నతులచమత్కారకారియునై కవి కవితాసౌభాగ్యంపుమేలిమికి మఱింత మెఱుంగు గూర్చుచున్నది.

ఈకర్ణామృతమున శ్లోకము లనేకములు పాఠదుష్టము లైయుండుటఁ జూచి కోశాంతరములఁ దెప్పించి చాల శ్రమపడి పెక్కింటికి సమంజసపాఠములను నలవరించియున్నవాఁడ. దీనికిఁ గలచవకమను సంస్కృతవ్యాఖ్యయు, నున్నదాని కున్నట్టె యర్థములెట్లో పన్ను పూర్వాచారములోఁ జేరినదే కాని, కవిహృదయపరీక్షాపూర్వకముగ నౌచిత్యమును బరామర్శించునదిగాఁ గానరాదు. ఇందులకు వెలఁగపూడి వెంగనామాత్యుఁడు తెనుఁగుపద్యములు రచించియున్నాఁడు. అవియు నింపుఁ గూర్పంబడి యున్నవి. తెనుఁగుకవియుఁ బూర్వోక్తవ్యాఖ్యానానుసారముగానే పాఠములు గ్రహించి తెలిఁగించియున్నాఁడు. అయినను దెనుఁగుపద్యములు చాలహృద్యము లై రసవంతములుగా నున్నవి. ఇందు నాపడినపరిశ్రమము చదువరులకే విదితముగాన విశేషించి వ్రాయక విరమించుచున్నాఁడ.

త. తే.



శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# శ్రీకృష్ణకర్ణామృతము.

## సటీకము

## ప్రథమాశ్వాసము



శ్లో॥ చిన్తామణి ర్జయతు సోమగిరి ర్గురు ర్మే
శిక్షాగురు శ్చ భగవా ఞ్ఛిఖిపిఞ్ఛమౌళిః ।
యత్పాదకల్పతరుపల్లవ శేఖరేషు
లీలాస్వయంవరరసం లభతే జయశ్రీః ॥ 1

టీ. లీలాశుకుం డనుకవివరుండు తానురచింపఁబూనిన యీగ్రంథమునిర్విఘ్నముగా నెఱవేఱుటకై మంగళము నాచరింపఁగోరి 'ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్' అనువచనముచొప్పున ఆశీరూపమైన మంగళము నాచరించుచున్నాఁడు. చిన్తామణిః = చింతామణి యనుమంత్రము, జయతు=సర్వోత్కృష్టమై యుండుఁగాక; చిన్తామణిః=(కేవలవిషయలోలుఁడై యుండినతన్ను భగవద్విషయమందుఁ బ్రవర్తింపఁజేసిన) చింతామణి యనువేశ్యయు, జయతు=సర్వోత్కృష్టురాలై యుండుఁగాక; చింతామణిః=చింతామణివలె నభీష్టముల నొసఁగువాఁడైన, సోమగిరిః=సోమగిరియను, మే=నాయొక్క, గురుః=ఆచార్యుఁడును, జయతు=సర్వోత్కృష్టుఁడై యుండుఁగాక; శిక్షా=ప్రవృత్తినివృత్తులకు, గురుః=గురుప్రభు. భగవాన్ = ఐశ్వర్యాదిషడ్గుణసంపన్నుఁడునైన, శిఖిపిఞ్ఛమౌళిః—శిఖిపిఞ్ఛ=నెమిలిపురిని, మౌళిః=శిరసునందుఁగలిగియున్న శ్రీకృష్ణస్వామియు, జయతు = సర్వోత్కృష్టుఁడై యుండుఁగాక. యత్ ... శేఖరేషు—యత్=ఎవరియొక్క, పాద=అడుగులనెడి, కల్పతరు పల్లవశేఖరేషు=కల్పవృక్షముయొక్క శ్రేష్ఠమైన చిగురుటాకులయందు - మిక్కిలిమేలైనకల్పవృక్షపుఁజిగురుటా

తులవలెనుండు నెవ్వానియనఘగుణయుం డనుట—లేక, యత్ పాద కల్పతరు పల్లవ = ఎవ
రియడుగులనెడి కల్పవృక్షపుఁ జిగురుటాకులను, శేఖరేషు=శిరోభూషణములుగాఁ గల
వారలయందు అనియు నర్థము, జయశ్రీః=జయలక్ష్మి, లీలా...రసం-లీలా=విలా
సప్రయుక్తమైన, స్వయంవర=తానే వరించుటయందు, రసం=అభిలాషను, లభతే =
పొందుచున్నదో, అట్టిగురువగు సోమగిరియును, శిక్షాగురువగు భగవంతుఁడును, సర్వో
త్కృష్టులై వర్తింతురుగాక యని పూర్వముతో నన్వయము. లేక 'యత్పాదః' అనుటను
భగవంతునికిమాత్రము విశేషణముగానైనను గ్రహింపవచ్చును. ఇచటసద్విషయములందుఁ
దన్నుపయోగించెడువిద్యను తనకుఁ గలిగించినది చింతామణిమంత్ర మనియును, ఆ
సద్విషయములలో నుత్తమంబగుభగవద్విషయమునందుఁ దన్నుఁ బ్రవర్తింపఁజేసినది
చింతామణియను వేశ్య యనియును, భగవద్విషయంబునఁ బ్రవర్తించినతనకు భగవత్సా
క్షాత్కారసాధనంబగు నుపదేశము ననుగ్రహించి కృతార్థునిఁజేసినగురువుసోమగిరి య
నియు, సదాచార్యానుగ్రహమునంబడసిన తనయందంతర్యామియైసత్కార్యప్రవృత్తియు
దుష్కార్యనివృత్తియుఁ జేయించునట్టిపరమగురుండై మోక్షపదవి నొసఁగునట్టివాఁడు
భగవంతుఁ డనియు నుత్తరోత్తరాతిశయముఁ దెలియునది. కావుననే వీరికెల్ల మంగ
ళాచరణము గావించునంతప్రేమాతిశయము కవికిఁ గలిగిన దనియును గ్రహించునది.
'భగవాన్' అని జ్ఞానశక్త్యాదిషడ్గుణసంపత్తిని జెప్పుటవలన పరబ్రహ్మమగుట రూపిత
మగుచున్నది. యోగిజనధ్యానైకగోచరుఁ డగు పరాత్పరుఁ డయ్యు నస్మాదృశులు ఉజ్జీ
వించుటకై 'శిఖిపిఞ్ఛమౌళిః' శిఖిపిఞ్ఛాద్యలంకారాలంకృతమైన గోపాలవేషమున సుల
భుఁడై శ్రీకృష్ణమూర్తిగా నవతరించెనని భావము. మఱియు 'శిఖిపిఞ్ఛమౌళిః' అనువిశేష
ణముచే దక్కిన యవతారములకంటె సౌలభ్యాతిశయము గలదిగాన శ్రీకృష్ణావతారమందే
తనకు భక్త్యతిశయము గలిగిన దనుస్వారస్యము సూచిత మయ్యెడి. ఇదియే 'విహా
యకోదండశరౌ' ఇత్యాదులందు మీఁద వ్యక్తంబయ్యెడి. పాదములను కల్పతరుపల్లవ
ములుగా రూపించుటచే నవి వానివలె సకలాభీష్టప్రదములనియు నతిసుకుమారములనియు
భావము. కావుననే వానిని జయలక్ష్మి తానై వరించుచున్నదనఁబడెను. వారిస్వరూ
పములనుగాక పాదములను వరించుననుటచే వారి కత్యంతపరాధీనురాలగుట యూహ్య
ము. అట్టిపాదముల నుపాసించువారికి సకలకార్యములందును జయము తనంత సిద్ధించు
నని భావము. జయలక్ష్మి ఎవ్వరిపాదములను వరింపఁగోరునో, అట్టివారిం గూర్చి
'జయతు' అనుట మిక్కిలి వ్యర్థమేకదా యన్నచో నది ప్రేమాతిశయముచేతను మం
గళాచరణపద్ధతినిబట్టియుఁ జెప్పఁబడినదిగాన వైయర్థ్యము గలుగదు. పాదపల్లవములు
శేఖరములుగాఁ గలవార లనెడియర్థాంతరమందు లోకమున మంచిభూషణములు గల
పురుషులందుఁ గన్యలాశపడునట్లు తత్పాదపల్లవములను శిరోభూషణములుగాఁ గల
వారియందు విజయలక్ష్మీకన్యయు నాశపడెనని భావము.

శా. శ్రీచింతామణి యోగి సోమగిరియున్ శ్రీకృష్ణదేవుండు దా
రాచార్యస్థితిఁ జెందఁ దచ్చరణకల్యాణాంకురంబుల్ మహాశిఖైఁ
దాచం గల్గినవారిఁ జూచి తన సాక్షాత్కారం బ్రాన లీలన్ శుభ
శ్రీచాతుర్యముతో వరించు జయలక్ష్మీకన్య ప్రౌఢాకృతిన్. 1

తా. చింతామణి యనుమంత్రము, చింతామణి యనువేశ్యయు, సర్వోత్కృష్టులై వర్తింతురు గాక. కల్పతరువు మేలిచిగుళ్ళవంటి యెవ్వరిపాదములను జయలక్ష్మి తానై విలాసముతో వరించునో యట్టిమహాచార్యుం డగుసోమగిరియు మానవులప్రవృత్తినివృత్తులఁ గావించు పరమగురుఁడై జ్ఞానశక్త్యాదిషడ్గుణసంపన్నుం డగుపరుం డయ్యును శిఖిపింఛాద్యలంకృతగోపాలవేషమున సకలజనసులభుఁడై యవతరించిన శ్రీకృష్ణదేవుండును సర్వోత్కృష్టులై వర్తింతురుగాక.

అవ. కవి తాను గురునిర్దేశపూర్వకముగాఁ బేర్కొని ప్రేమాతిశయమున నాశీర్వదించిన దైవమును లేడనువారలను ధిక్కరించుచు శ్రీకృష్ణరూపం బగుపరతత్త్వవస్తువు విలసిల్లుచున్నదని నిర్దేశించుచు దానిచే వస్తునిర్దేశరూపమైన మంగళము నాచరించుచున్నాఁడు.

శ్లో. అస్తి స్వస్తరుణీకరాగ్రవిగలత్కల్పప్రసూనాప్లుతం
వస్తు ప్రస్తుతవేణునాదలహరీనిర్వాణనిర్వ్యాకులమ్ ।
స్రస్తస్రస్తనిరుద్ధనీవివిలసద్గోపీసహస్రావృతం
హస్తన్యస్తనతాపవర్గ మఖిలోదారం కిశోరాకృతిః॥ 2

టీ. ప్రస్తుత...నిర్వ్యాకులమ్-ప్రస్తుత=(అత్యంతమాధుర్యముచే) మిక్కిలి కొనియాడఁబడిన, వేణు=పిల్లనగ్రోవియొక్క, నాద=ధ్వనియొక్క, లహరీ=ప్రవాహముచేతఁ గలిగిన, ఎడతెగక చేయఁబడుచున్న వేణుగానముయొక్క మాధుర్యమువలననైన యనుట, నిర్వాణ=సుఖాతిశయముచేత, నిర్వ్యాకులం=నిశ్చలమైయుండునదియు-వేణుగానధ్వనివైఖరిచేఁ జొక్కి చలింప కుండునదియు ననుట; స్వస్తరుణీ...ప్లుతం-స్వస్తరుణీ=(ఆ మనోజ్ఞగానధ్వనికి మెచ్చిన) దేవతాస్త్రీలయొక్క, కరాగ్ర=చేతికొనలనుండి, విగళత్=జాఱుచున్న-పడుచున్న, కల్పప్రసూన=కల్పవృక్షపు పుష్పములచేత, ఆప్లుతం=వ్యాప్తమైనదియు; స్రస్త...వృతం-స్రస్తస్రస్త=(కామాతిశయముచే) మాటిమాటికి జాఱునవియు, కావుననే, నిరుద్ధ=అడ్డగింపఁబడినవియు-జాఱునిక పట్టుకొనఁబడినవియు, అగు, నీవి=పోకముళ్ళచే, విలసత్=ప్రకాశించుచున్న, గోపీసహస్ర=వేవురకొలఁది గోపికలచేత, ఆవృతం=చుట్టఁబడినదియు-గోపికలు మోహాపార

వశ్యమున మాటికి జాఱుచున్న పోకముళ్లను జాఱనీక పట్టుకొనుచు వేవురకొలఁదిని జుట్టు పరివేష్టించి యుండఁగా నొప్పునదియు ననుట; హస్త...వర్గం-హస్త = చేతియందు, న్యస్త=పెట్టుకొనఁబడిన, నత=శరణాగతులయొక్క, అపవర్గం = మోక్షము గలదియు-ఆశ్రయించిన భక్తులకు మోక్షమును సిద్ధముగా నొసంగుట కాయత్తమై యుండునదియు ననుట; కావుననే,అఖిలోదారం-అఖిల=(తుచ్ఛములగు నితరపురుషార్థములిచ్చు దేవతలు) అందఱికంటెను, ఉదారం=(మిక్కిలి యుత్కృష్టమగు మోక్షపురుషార్థము నొసంగుట వలన) గొప్పదియు-లేక, (అతిదుర్లభ మగునట్టి పురుషార్థమునుగూడ నొసంగ సిద్ధమై యుండునది గావున) మిక్కిలి దాతృత్వము గలదియు; మోక్షమొసంగునట్టి పరత్వము గలదయ్యును, కిశోరాకృతి = (సౌలభ్యాతిశయనిరూపక మగు) బాలునియొక్క ఆకారము గలదియు, అగ్ర,వస్తు=వస్తువు-'యత్ర వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' అన్నట్లు అసాధారణపరత్వమహిమచే నిట్టి దట్టి దని నిరూపింపరాక, కేవలము వస్తువని మాత్రము నిర్దేశింపఁదగు శ్రీకృష్ణాఖ్యపరబ్రహ్మము, అస్తి=ఉన్నది. ఇచట 'హస్త...వర్గమ్' 'అఖిలోదారమ్' అనుటచే పరత్వమును, తక్కినవిశేషణములచే సౌలభ్యమును గ్రాహ్యములు. వేణుపూరణమువలన సర్వజనాకర్షణమందుఁ గల ప్రయోగలాలిత్యమును కిశోరాకృతివలన సకలాశ్రయణీయత్వహేతు వగుసౌలభ్యాతిశయమును స్ఫురించెడి. ప్రేమాతిశయమున దేవతాస్త్రీలు పూవులుగురిసిరనియు కామపారవశ్యమున గోపస్త్రీల పు పోకముళ్లు జాఱెననియు సూచ్యము. మఱియు 'కిశోరాకృతి' యనుటచే బాలుఁడే యిట్లూఁదె నని యాశ్చర్యముచే దేవతలు పువ్వులు విశేషించి (విగళత్, కురిసిరనియు బాలుఁడు గదా యని గోపికలు నిశ్చయముగా వేలకొలఁదిని (సహస్ర) పరివేష్టించి యుండిరనియు స్వారస్యము. అపవర్గమును హస్తన్యస్తముగాఁ జెప్పుటచే ఆశ్రితాభీష్ట ప్రదానమందుఁ గల అత్యంతసన్నాహమును ధ్వనించెను. ఇంపుగా వేణువు నూఁదుచుఁ జొక్కి నిలిచి దివ్యస్త్రీలు మెచ్చి పూలసోనలు గురియఁగా, గోపకన్యలకు మరులున పోకముళ్ళు జాఱఁగా, విలసిల్లుచున్న కృష్ణాఖ్యబాలరూపము, అపవర్గప్రద మగుపర బ్రహ్మమే కాని వేఱు కాదని యాశయము.

శా. కోకల్ జాఱఁగఁ గేలఁ బూని గుములై గోపాంగనల్ గొల్వఁగా
నాకస్త్రీల్ దివినుండి కల్పసుమముల్ సంధార వర్షింపఁగా
జోకన్ వేణువినోదనాదలహరిం జొక్కించుచుం జొక్కుచున్
శ్రీకైశోరముఁ బూను దేవుని సతశ్రీముక్తిదుం గొల్చెదన్. 2

టీ. మిక్కిలి హస్తకక్కి- పిల్లనగ్రోవి నూఁదుచు దానినాదముయొక్క మాధురికిఁ జలింపక చొక్కినిలిచి,మీఁదినుండి దేవతాస్త్రీలు మెచ్చి పువ్వులసోనలు పయినిగురియఁగా,మరులుకొల్పిన మాటికి జాఱుచున్న పోకముళ్లను తెరువుకొనుచు గోపస్త్రీలు వేల

కోలఁదిని జుట్టుకొనియుండఁగా, నాశ్రయించినవారికి మోక్షము నఱచేత నుంచుకొని యిచ్చునట్టి సర్వోత్కృష్టపరబ్రహ్మ మయ్యు సౌలభ్యవశమున బాలభావంబున విలసిల్లుచున్న శ్రీకృష్ణాఖ్యవస్తువు గలదు.

అవ. ఇట్లు కల దని ప్రతిపాదించినవస్తువునకు నమస్కారరూప మంగళము నాచరించుచున్నాఁడు.

శ్లో. చాతుర్యైకనిధానసీమచపలాపాంగచ్ఛటామన్థరం
లావణ్యామృతవీచిలాలితదృశం లక్ష్మీకటాక్షాదృతమ్ ।
కాళిన్దీపులినాఙ్గణప్రణయినం కామావతారాఙ్కురం
బాలం నీల మమీ వయం మధురిమస్వారాజ్య మారాధ్నుమః॥ 3

టీ. అమీ=ఈ-సంసారులైనయనుట, వయం=మేము-ఇదికర్త. చాతు...మన్థరమ్ చాతుర్య = చతురత్వమునకు-నేర్పునకు ఏక=అద్వితీయమైన-ఒక్కటియేయైన, నిధాన=ఉనికిపట్టుయొక్క, సీమ=మేరలైనవియు-నిరతిశయమైన చాతుర్యముతోఁగూడినవియు ననుట,చపల=చంచలములైనవియు-మిక్కిలియు నిటుగులుపుచు నిటునటుచలించునవియనుట, అగు, అపాఙ్గ=కడగన్నులయొక్క, ఛటా=కాంతిసమూహముచే, మన్థరమ్=భారముగలవాఁడును-కాంతిపుంజము మిక్కిలియుఁ గలవాఁడనుట; లావణ్యా... దృశమ్-లావణ్య=ముత్యపుతేటవంటి తలతలలాడు కాంతియనెడి, అమృత=అమృతముయొక్క, వీచి=అలలచేత, లాలిత=బుజ్జగింపఁబడిన,అయలలతో జెలువుగాఁ గూడియున్న, దృశమ్=కన్నులుగలవాఁడును-అమృతశబ్దముచే అత్యంతభోగ్యత్వమును-అనఁగా నిరతిశయమనోహరత్వమును, వీచిశబ్దముచే సుభగప్రసారమును-అనఁగా చెలువుగా నిగుడుటయు స్ఫురించెడిని; కావున తళతళమని ముత్తెపు తేటవంటి తెలిమెఱుఁగు లతిమనోహరముగా వెల్లిగొనుచున్న కన్నులుగలవాఁడనుట,లక్ష్మీ...దృతం-లక్ష్మీ =శ్రీమహాలక్ష్మియొక్క, కటాక్ష=కడగంటిచూపులచే, ఆదృతం= ఆదరింపఁబడినవాఁడును,ప్రేమవశమున శృంగారరసకలితముగా శ్రీదేవిచేఁ గడగంటిచూపులతోఁ జూడఁబడినవాఁడనుట; కాళిన్దీ...ప్రణయినమ్-కాళిన్దీ= యమునానదియొక్క, పులిన=ఇసుకదిన్నెలయొక్క, అఙ్గణ=ప్రదేశములయందు, ప్రణయినం=ఆసక్తిగలవాఁడును- అందువర్తించువాఁడనుట,కా...ఙ్కురమ్-కామ = మన్మథునియొక్క,అవతార= అవతరించుటకు,అఙ్కురం=మొలకయైనవాఁడును,మన్మథుఁడు ప్రద్యుమ్నాకారమునఁ బుట్టుటకుఁ గారణమైన వాఁడనుఁబాలుఁడుగాన అంకురావస్థయందున్న కారణమైనవాఁడని స్వారస్యము, లేక, గోపికాదులకు మన్మథావేశముఁ బుట్టించువాఁడును, మధురిమస్వారాజ్యమ్-మధురిమ=సౌందర్యమునకు, స్వారాజ్యమ్=స్వర్గరాజ్యమైనవాఁడును- స్వర్గరాజ్యమనుటచే మహోన్నతపదాధికారవైభవము స్ఫురించెడిఁగాన సౌందర్యముయొక్క మహో

న్నతవిభవ మైనవాఁడు-అనఁగా నిరతిశయసౌందర్యవైభవముగలవాఁ డనుట, నీలం=నల్లనివన్నె గలవాఁడును, అగు, బాలం=చిన్నవానిని, ఆరాధ్నుమః=ఆరాధింతుము. సంసారబద్ధులగు మేము బంధనివృత్తికొఱకు జ్ఞానశక్త్యాదులగు అప్రాకృతగుణములు గలిగి అవాఙ్మానసగోచరమై యున్న పరస్వరూపమును దెలిసియారాధింప నేరము. సౌలభ్యమునకు ప్రయోజకములైన సామాన్యలక్షణములగు సౌందర్యసౌకుమార్యాదులు గల మూర్తివిశేషమునే యారాధింపఁజాలువారము. అట్టిది యీకృష్ణాఖ్యరూపమేగానదీనినే యారాధింతు మని భావము. మఱియు నిందు, 'చాతుర్యైక...మన్దిరమ్' అనుటచే చిత్తాకర్షకత్వమును, 'లావ...దృశమ్' అనుటచే, శీతలకృపాతిశయమును, 'లక్ష్మీ...దృతమ్' అనుటచే అఖండసౌభాగ్యమును, 'కాళిన్ది...ణయినమ్' అనుటచే వైకుంఠముపలె అగమ్యముగాక గమ్యమైనస్థానమున వర్తనమును, 'కామా...కుతమ్' అనుటచే జగన్మోహనత్వమును, 'మధురిమస్వారాజ్యమ్' అనుటచే నిసర్గలక్షణములును, సౌలభ్యమున కుపయుక్తములై స్ఫురించెడిని. 'కాళిన్దిపులినాఙ్గణప్రణయినమ్' అను విశేషణము రామావతారాదులను వ్యావర్తించుచున్నదని తెలియునది.

శా. బాలుఁ మంజులతాలవాలచపలాక్షపాంగోల్లసల్లీలునిం
గాళిందీపులినాంగణప్రణయిశృంగారైకఖేలుఁ శుభ
శ్రీలోలుం గరుణావలోకనసుధాశీలుఁ వినీలప్రభా
జాలుం గొల్చెద రామణీయకరసస్వారాజ్యపాలుఁ మదిన్. 3

తా. నెఱసీటు మిటారించుచు చలించు కడగన్నుల నిగనిగని కాంతులు దొంతరలుగొన, ముత్తెపుతేటవంటి తళతళమను తెలిమెఱుంగులు తుఱంగలించుచు నతిమనోహారముగఁ బొలయు చల్లనిచూడ్కులు కన్నుంగవఁ గడనుకొన, యమునానదియిసుకదిన్నెలఁ జెన్నారవర్తించుచు, మరునిపుట్టుకకు మూలమై, చక్కఁదనంబుల కెల్లఁ బుట్టినిల్లై, విలసిల్లు నల్లనిచిన్నబాలుని మే మారాధించెదము.

అవ. కవి తా నారాధింపఁ గోరినపరతత్త్వము ధ్యానవశంబునఁ దనహృదయంబున సౌలభ్యోపయుక్తములైన లక్షణములతో సాక్షాత్కరించినప్రకారమును అనుసంధించుచున్నాఁడు

శ్లో॥ బర్హోత్తంసవిలాసికున్తలభరం మాధుర్యమగ్నాననం
ప్రోన్మీలన్నవయౌవనం ప్రవిలసద్వేణుప్రణాదామృతమ్ ।
ఆపీనస్తనకుట్మలాభి రభితో గోపీభి రారాధితం
జ్యోతిశ్చేతసి న శ్చకాస్తి జగతా మేకాభిరామాద్భుతమ్॥

టీ. బర్హో...భరం-బర్హ = నెమలిపురి యను, ఉత్తంస = శిరోభూషణము చేత, విలాసి=ప్రకాశించుచున్నట్టి, కుస్త ల=ముంగురులయొక్క, భరం=భారముగలదియు-దట్టంపుముంగురులసమూహము గలది యనుట; మాధుర్య...ననమ్-మాధుర్య=సౌందర్య విశేషమందు, మగ్న = మునిగిన-పరిపూర్ణ సౌందర్యమయమైనయనుట, అననం=ముఖము గలదియు; ప్రో...వనమ్-ప్రోన్మిలత్=మిక్కిలి తలసూపుచున్న, నవయౌవనమ్=ఎల ప్రాయముగలదియు; ప్రవిల...మృతమ్-ప్రవిలసత్ = మిక్కిలి యొప్పుచున్న, వేణు = పిల్లఁగ్రోవియొక్క, ప్రణాద=ధ్వని యను, అమృతమ్ = అమృతముగలదియు- అమృతమువలె నత్యంతభోగ్యమగు వేణుధ్వనిగలదియనుట; ఆపీన...లాభిః—ఆపీన = అంతట నుబ్బిన, స్తనపట్మల=చనుమొగ్గలుగలవారగు-మొగ్గలవంటి స్తనములు గలవారగు,గోపీభిః=గోపికలచేత,అభితః=నలుప్రక్కలను,ఆరాధితం=ఉపచరింపఁబడినదియు;కౌతుకనే జగతాం=లోకములకు, ఏకాభిరామాద్భుతం - ఏక=అద్వితీయమును - సాటిలేనిదియు, అభిరామ=మనోహరమును; అగు, అద్భుతం = ఆశ్చర్యమయినదియు; అగు, జ్యోతిః= తేజస్సు, నః=మాయొక్క, చేతసి=చిత్తమందు, చకాస్తి=ప్రకాశించుచున్నది. కేవల జ్యోతిస్స్వరూపమైనవస్తువు, ముంగురులు, ముద్దుమొగము, ఎలజవ్వనము, పిల్లనగ్రోవియును గలిగి, అలంకారము, ఆకారము, దశావికారము, లీలావ్యాపారములును బొంది పొడసూపుటచే జగత్తులకు ఏకమైన అద్భుతమైనది; బర్హోత్తంసవిలాసికుంతలములు మొదలైనవానివలన జగత్తులకు అభిరామమైన అద్భుత మైనది. వరుసగా మొదటి నాలుగు విశేషణములందును భృశార్థకములై యున్న 'భర' 'భగ్న' 'ప్ర' 'ప్ర' శబ్దములు గోపీ స్తనపట్మలము లాపీనము లగుటకు పోషకములు.

చ. చక్కనిముద్దునెమ్మొగముచందము నందపుమంనహాసముం
జొక్కపుజవ్వనంబు సిగఁ జుట్టినబర్హము వేణుగానముస్
నెక్కొనఁ జొక్కి గోపికలు నింపుతమిం గుచపట్మలాళిచే
నొక్కుచు గారవించినమనోహర తేజము వొల్చు నామదిన్. 4

తా. నెమలిపురిఁ జెరివిన మురువుఁజూపు దట్టంపుముంగురులును, జక్కఁదనంబులయిమ్మయిన నెమ్మొగంబును, మిక్కిలియు, బొటమరించుచున్న యెలజవ్వనమును,అమృతమువలెఁ జవులుగులుకు పిల్లనగ్రోవిరవళియు, నొప్పఁగా, నిట్టితన్నుఁ జూచి గబ్బిచనుగుబ్బ లుబ్బ నలుగడల గొల్లగుబ్బెతలు చుట్టుకొని పరిచరింపఁగా, లోకంబులకెల్ల సౌందర్యాదులచే నత్యంతమనోహరంబై, లీలావైచిత్రిచే నృత్యాశ్చర్యంబై యొప్పు తేజస్సు నామనస్సున వెలుఁగుచున్నది.

శ్లో॥ మధురతరస్మితామృతవిముగ్ధముఖాంబురుహం
మదశిఖిపింఛలాంఛితమనోజ్ఞకచప్రచయమ్।

విషయవిషామిషగ్రసనగృధ్నుని చేతసి మే
విపులవిలోచనం కి మపి ధామ చకాస్తి చిరమ్॥ 5

టీ. మధుర...హమ్-మధురతర=మిక్కిలి మనోహరమైన, స్మిత=చిఱునవ్వనియెడు, అమృతే=అమృతముచేత, విముగ్ధ=మిక్కిలిసుందరమయిన, ముఖ+అంబురుహమ్=తామరవంటిమొగము గలదియు; మద...ప్రచయమ్—మద=మత్తిల్లిన- శిఖి = నెమిలి యొక్క, పిఞ్ఛ=పురిచేత, లాఞ్ఛిత = గుఱుతుగలదిగాఁ జేయఁబడిన-నెమలిపురి చెరివిన యనుట, మనోజ్ఞ=మనోహరమైన, కచప్రచయమ్ = కురులసమూహము గలదియు, కిమపి=అనిర్వచనీయమైనది యు-ఇట్టిదట్టిదని నిర్దేశింపరానిదియు, అగు, ధామ=తేజస్సు, విషయ...గృధ్నుని-విషయ = శబ్దాదివిషయము అనెడి, విష+ఆమిష = విషముతోఁ గూడిన మాంసముయొక్క, గ్రసన=మ్రింగుటయందు, గృధ్నుని = ఆసక్తమైయున్న - విషముగలిసిన మాంసము మొదటఁ జవిచూపి పిదప నెట్లు చంపునో యట్లు మొదట సుఖప్రదములై వెనుక దుఃఖకారణములగు శబ్దాదివిషయములందు తొలుచవికి చేలు పోయి తగులబడియున్నట్టిదైన యనుట, మే = నాయొక్క, చేతసి = మనసునందు, చిరం=చిరకాలముగా, చకాస్తి=ప్రకాశించుచున్నది. ఇంద్రియగోచరములైన శబ్దాది విషయములను విషామిషమువంటి వని తెలిసికొనఁజాలని నన బోంటికి అవాఙ్మనస గోచరమై కావున అనిర్వాచ్యమై యొప్పుజ్యోతిని (కిమపిధామ) తెలిసికొను టెక్కడ? అట్టిజ్యోతి మదీయభాగ్యపరిపాకమున విముగ్ధముఖాంబురుహంబును మనోజ్ఞకచప్రచయంబును గలమనోహరాకారముతో నాహృదయంబున వెలుంగుచున్న దని భావము. తామరవంటిమొగము చిఱునవ్వుచే మఱింత 'విముగ్ధ'మును, నెఱికురులు నెమలిపురిచే మఱింత 'మనోజ్ఞ'ము నయ్యెనని, యర్థము. ముఖాంబురుహమును కచప్రచయమును తమ సహజమనోహరత్వముచే నెట్టిదానినైని ఆకర్షింపఁజాలిన వైనను విషయములందు మిక్కిలి మగ్నమైయున్న నా చిత్తంబును మఱింతదృఢముగా నాకర్షించుటకు స్మితముయొక్కయు శిఖిపింఛముయొక్కయు శోభావిశేషములను సహాయముగాఁ గైకొని నవని సారస్యము. స్మితముయొక్కయు శిఖిపింఛముయొక్కయు రంజకత్వమునకు అమృతశబ్దమును మదశబ్దమును బుష్టికములు. ఇట్టిసహకారసంపత్తిచే చిత్తము నాకర్షించిన దార్ఢ్యమును 'చిర' శబ్దము ఘోషించుచున్నది.

చ. వదల కసహ్య మహావిషయస్వాంఛకు లోనయి సంచరించు నా
మది శిఖిపింఛభూషణసమంచితకుంతలభవ్యవేషమున్
మృదుమధురస్మితామృతసమృద్ధముఖాబ్జము లోలదృష్టి లిం
పొదవినదివ్యతేజము సమున్నతి నున్నది నిత్యసిద్ధమై. 5

తా. మిక్కిలియుఁ జెలువారు చిఱునవ్వుచే మఱింతసుందరం బగు మోముఁదామరయు, మత్తిల్లిన నెమిలిపురిచే మనోహరంబు లగు నెఱికురులును, మిగుల వెడందలై చెన్నారు కన్నులును, గలిగినదై యిట్టి దట్టి దని నిరూపింపరాని తేజస్సు, విషముతోఁ గూడిన నంజుకువలె సుఖదుఃఖమిళితమై యుండు విషయములందుఁ దగులువడి యున్న నా హృదయము నాకర్షించి యందు చిరకాలముగా వెలుఁగుచున్నది.

అవ. కవి నిజహృదయంబున సౌలభ్యానురూపము లగు రూపచేష్టావిశేషములతోఁ బ్రకాశించుచున్న జ్యోతి యిట్లై మఱియుం బ్రకాశించుఁగాక యని ప్రార్థించుచున్నాఁడు.

శ్లో॥ ముకుళాయమాననయనాంబుజం విభో
ర్మురళీనినాదమకరన్దనిర్భరమ్॥
ముకురాయమాణమృదుగణ్డమణ్డలమ్
ముఖపఙ్కజం మనసి మే విజృమ్భతామ్॥ 6

టీ. ముకు......మ్బుజం-ముకుళాయమాన=మొగిడినట్లున్న - ముకుళించినదానివలె నాచరించుచున్న, నయన అమ్బుజమ్ = కన్నుఁదామరలు గలదియు-తామరలవంటి కన్నులు మోడ్చినది యనుట, కన్ను మోడ్చుట యేల నః-మురళీ...ర్భరం-మురళీ=పిల్లఁగ్రోవియొక్క, నినాద = ధ్వని యనెడి, మకరంద=తేనెచేత, నిర్భరం=భరింపరానిదియు-మిక్కుటమైనది యనుట-మురళి రవళి యనెడి మిక్కుటమైన తేనె గలది యని యర్థము - మిక్కుటమైన తేనియవలె నత్యంతమధురమును నతిబహుళము నైన వేణుధ్వని గలదియు నని భావము. ఈ వేణుగానమందలి పారవశ్యముచేఁ గన్నులరమోడ్చినదని తెలియునది; మఱియు, ముకు...మణ్డలమ్-ముకురాయమాణ=అద్దమువలె నాచరించుచున్న-అద్దమువలె నిద్దమై నిగనిగ లీనుచున్న యనుట, మృదు=మెత్తని, గణ్డ=చెక్కులయొక్క, మణ్డలం = గుండ్రనిప్రదేశము గలదియు-వేణుపూరణముచే నుబ్బి మఱింత గుండ్రనై నిగనిగలాడు నునుబుగ్గలు గలదియు ననుట; అగు, విభోః=ప్రభువు (అయిన శ్రీకృష్ణదేవుని) యొక్క, ముఖపఙ్కజమ్ = మోముఁదామర-తామరవంటి నెమ్మొగము, మే=నాయొక్క, మనసి=మనస్సునందు, విజృమ్భతామ్=చెలఁగునుగాక-పెంపుబయి ప్రకాశించునుగాక-వేణుగానసమయంబున, అరమోడ్చిన కన్నుఁదమ్ములును, తేనియలుగాఱు వేణురవళియు, నిగనిగలాడు నునుబుగ్గలును ముఖారవిందముయొక్క సౌందర్యాతిశయమునకు, ముఖ్యావయవములు గాన నామూఁడు నిటఁ జెప్పఁబడినవి.

మ. మురళీనాదమరందబిందుబహుళీక్రమోదంబుచే లోచనాం
బురుహంబుల్ ముకుళింప నోష్ఠమణిసాంద్రపుల్ మీఱ నాదర్శభా

సురగండస్థలి యొప్ప స్రస్తచికురస్తోమంబు ఫాలంబుపై
ముకువుల్ సూపఁ జెలంగు కృష్ణవదనాంభోజంబు భావించెదన్. 6

తా. పిల్లనఁగ్రోవి యూఁదునపుడు కొంచెము మొగిడియున్న కన్నుఁదమ్ములును మిక్కిలి తేనియలొలుకు మురళీరవళియు, ఊఁదుటచే నుబ్బి యద్దమువలె స్వద్దమై నిగనిగలాడు గుండ్రని మనుబుగ్గలును, గలదై, తామరవలెఁ గొమరారు కృష్ణుని ముద్దుమొగము నామనస్సున మిక్కిలి చెలఁగుచుండుఁగాత.

అవ. ఇట్లు మనస్సున విజృంభించువస్తువు నావాక్కునను విజృంభించుఁ గాత మనుచున్నాఁడు.

శ్లో॥ కమనీయకిశోరముగ్ధమూర్తేః, కలవేణుక్వణితాదృతాననేన్దోః।
మమ వాచివిజృమ్భతాం మురారేః, మధురిమ్ణః కణికాపి కాపి కాపి॥

టీ. కమ...మూర్తేః-కమనీయ=కోరఁగాఁ దగినదియు, కిశోర=బాల్యముతోఁ గూడినదియు, ముగ్ధ=సుందరమైనదియు, నగు, మూర్తేః=దేహముగలవాఁడును, సహజముగానే 'ముగ్ధ' మైనది: మఱి (కిశోర) బాల్యముచే మిక్కిలియు ముద్దులు గొలుపునది-కావున నది మఱిమఱి చూచుటకు (కమనీయము) ఆశింపఁదగినది యని యర్థము: మఱియు, కల...న్దోః-కల=అవ్యక్తమధురమైన, వేణు=పిల్లఁగ్రోవియొక్క, క్వణిత=ధ్వనిచేత, ఆదృత=ఆదరింపఁబడిన-ఇచట ఆదరించుట యనఁగా ఒప్పిదముగా గూడుట గాన వేణుధ్వని యొప్పిదముగాఁ గూడియున్న యనుట, ఆనన ఇన్దోః=ముఖచంద్రుఁడు గలవాఁడును-చంద్రునివంటి మొగము గలవాఁడనుట-ముఖమే చంద్రునివంటిది: అందును అవ్యక్తమధురమైన మురళీధ్వని యొప్పిదముగాఁ గూడి యుండుటచే నది మఱింత యొప్పు లొలుకుచున్నదని యర్థము; ఇట్టివాఁడైన, మురారేః=శ్రీకృష్ణునియొక్క, మధురిమ్ణః=సౌందర్యముయొక్క, కాపి కాపి=ఏదో యొక్కింత - మిక్కిలియు స్వల్పమైన యనుట, కణికా అపి=లేశమైనను-ఆసౌందర్యమందుఅత్యంతసూక్ష్మభాగమైనను, మమ=నాయొక్క, వాచి=వాక్కునందు, విజృమ్భతామ్=చెలఁగును గాక. ఆచక్కఁదనమందు ఆవంతయైనను నేను వర్ణింపఁగలుగుదును గాక యని యర్థము. 'మధురిమ్ణః' అనుటకు తీయన యని యర్థాంతరమునుబట్టియు, 'వాచి' యనుశబ్దమును బట్టియు -కృష్ణుని చక్కఁదనమనెడి తీయని యమృతమందొకచిన్నబిందువైనను నానాలుకయందుఁ బడునుగాక' యను నర్థమును ధ్వనించుచున్నది. మధురిమమునకు (సౌందర్యమునకు) ముగ్ధమూర్తియు ఆననేందువును గారణములు, ముగ్ధమూర్తి- కమనీయకైశోరమును, ఆననేందువునకు కలవేణుక్వణితమును పోషకములు. ఇట్లు సౌందర్యము వెల్లిగొని వాక్కునకు మిక్కిలి అలవిగాకుండుటచే దానిని వర్ణించుటయే తలఁపరాదు, అయినను అందు రవ్వంతయైనను కృష్ణానుగ్రహముచే వర్ణింపఁగలుగుదును గాక యని యాశయము.

మ. కలవేణుక్వణితాద్భుతాననము రాకాచంద్రసాంద్రద్యుతిం
దిలకింపం గమనీయముగ్ధశిశుమూర్తిస్ఫూర్తి వర్తిల్లు ను
త్పలపత్త్రోజ్జ్వలనీలవర్ణ గుణసంకథామాధురీసాధురీ
తులలో నించుక యైన నావచనసందోహంబులం జెందెడున్. 7

తా. చూడంజూడఁగా మఱిమఱి యాశలు గొలుపునట్టి చక్కఁదనమును బాలత్వమును గలదేహముగలిగి, అవ్యక్తమధురమైన వేణుధ్వనిచే మఱింతమనోహరమై చంద్రునివలెఁ బ్రకాశించుచున్న ముఖముతోఁ గూడి, బెడఁగారుచున్న శ్రీకృష్ణునియొక్క యప్పటియపూర్వసౌందర్యాతిశయమును, అంతయు వర్ణింపఁ జాలనివాఁడనైనను, మిక్కిలి యించుకంతయైనను వర్ణింపఁగలుగుదునుగాక.

అవ. ఆజ్యోతి తాను వేఁడికొన్నట్లు తనవాక్కునందును విజృంభింపఁగా దానిని మంగళాశాసనము సేయుచున్నాఁడు.

శ్లో॥ మదశిఖణ్డిశిఖణ్డవిభూషణం
మదనమన్థరముగ్ధముఖామ్బుజమ్
వ్రజవధూనయనాఞ్చలవఞ్చితం
విజయతాంమమ వాఙ్మయజీవితమ్॥ 8

టీ. మద...షణం-మద=మత్తిల్లిన, శిఖణ్డి=నెమిలియొక్క, శిఖణ్డ=పురియనెడి, విభూషణం=భూషణముగలదియును - నెమిలిపురిని జెరువుకొన్నదియనుట, మదన...మ్బుజమ్-మదన=మన్మథునిచేత, మన్థర=బరువైన-మన్మథావేశము మిక్కుటముగాఁగల, ముగ్ధ=సుందరమైన, ముఖ అమ్బుజమ్=మోముదామర గలదియు-తామరవలె చెలువుగానున్న మొగము మరులువెల్లుచే మఱింతసుందరముగా నున్న దనుట; ఇట్లు మిక్కిలిమన్మథవికారము కలిగియుండుటచేతనే, వ్రజ...ఞ్చితమ్-వ్రజవధూ=గొల్లపడఁతులయొక్క, నయన=కన్నులయొక్క, అఞ్చల=కొనలచేత-కడగంటిచూపులచేత ననుట, వఞ్చితం=వంచింపఁబడినదియు - ఆకడగంటి చూపులకు బేలుపడి వారివశమై తిరుగుచున్నదియనుట, నయనములకన్న నయనాంచలములుమఱింత మోహాకరములుగాన వంచించి వశముచేసికొన్నవని భావము. ఇట్టిపూర్వోక్తలక్షణములు గలదియై, మమ=నాయొక్క, వాఙ్మయజీవితం-వాఙ్మయ=కవిత్వమునకు, జీవితం=జీవనమైనవస్తువు-దేనిచేతనే నాకు కవిత్వము పుట్టెనో యావస్తువనుట, విజయతాం=సర్వోత్కర్షము కలిగియుండునుగాక.

ఉ. చక్కనిముద్దుమోము సుమసాయకు లెక్కుల ధిక్కరింపఁగాఁ
జొక్కపునెమ్మికోదనునుసోగసరంబు శిరంబునందుఁ బెం-

పెక్కు వ్రజాంగనాజననిరీక్షణవంచిత మైనవాదున
మ్యాకృతవాక్యజీవిత మహాజాండకటాహము నిండి యుండెడిన్. 8

తా. చక్కని నెమిలిపురిని జెరువుకొనిన ముఖారవిందమును మఱింత సుందరముగా వించుచున్న మరులు పెల్లున. గొల్లగుబ్బెతలకడగంటిచూపులకు లోనయి-వారివెంటఁదిరుగుచును నాకవిత్వమునకుఁ బ్రాణమై రాణించువస్తువు సర్వోత్కృష్టమై వర్తించుఁగాత.

అవ. ఇట్లు కవిత్వమునుగృపసేసినవస్తువును భక్తికృతజ్ఞతాపూర్వకముగా రెండుశ్లోకముల నాశ్రయించుచున్నాఁడు.

శ్లో॥ పల్లవారుణపాణిపఙ్కజసఙ్గివేణురవాకులం
ఫుల్లపాటలపాటలీపరివాదిపాదసరోరుహమ్
ఉల్లసన్మధురాధరద్యుతిమఞ్జరీసరసాననం
వల్లవీకుచకుమ్భకుఙ్కుమపఙ్కిలం ప్రభుమాశ్రయే॥ 9

టీ. పల్ల...కులమ్-పల్లవ=చిగుళ్లవలె, అరుణ=ఎఱ్ఱనైన, పాణిపఙ్కజ=కేలుఁదమ్మితో-తామరవంటిచేతితో, సఙ్గి=కూడియున్న, వేణు=పిల్లఁగ్రోవియొక్క, రవ=ధ్వనియందు, ఆకులమ్=ఆసక్తమైనవాఁడును, లేక, రవ=ధ్వనిచేత, ఆకులమ్=నెఱసిన వాఁడును, వేణుధ్వని మిక్కిలిగలవాఁడనుట, ఫుల్ల...రుహమ్-ఫుల్ల=వికసించిన, పాటల-కలిగొట్టుపూవులయొక్క, పాటలీ=ఎఱుపును, పరివాది=దూషించుచున్న; పాద సరోరుహమ్=అడుగుఁదమ్ములు గలవాఁడును, తామరలవంటిచరణములు గలవాఁడనుట ఉల్ల...సాననమ్-ఉల్లసత్=ప్రకాశించుచున్న, మధుర=చక్కనైన- తీయనైన, అధర=మోవియొక్క, ద్యుతి=కాంతులయొక్క, మఞ్జరీ=గుత్తులచేత-మోవిని గుత్తులవలె గుబురుకొన్న యెఱ్ఱనికాంతులచేత ననుట, సరస=రసముతోఁ గూడిన, సౌఖ్యరసముఁ గలిగించునట్టియనుట, ఆననం = ముఖముగలవాఁడును; వల్లవీ...పఙ్కిలమ్=వల్లవీ=గోపికలయొక్క, కుచకుమ్భ=కుంభములవంటి స్తనములయందలి, కుఙ్కుమ=కుంకుమముచేత. పఙ్కిలం=రొంపిగలవాఁడును-గొల్లపడుచులచన్నులయందలికుంకుమ దట్టముగా నంటుకొని రొంపియైయున్న దేహము గలవాఁడనుట, అగు, ప్రభుమ్=(ఆశ్రితరక్షణమునకు)సమర్థుండైనకృష్ణుని, ఆశ్రయే=ఆశ్రయించుచున్నాను, కవియిచట శ్రీకృష్ణనిమూర్తినంతయు నెఱుపుగావించినాఁడు. చిగుళ్ళవంటిచేతులును కలిగొట్టుపూవులవంటిపాదములును మోవియును సహజముగా నెఱ్ఱనివి, తక్కినయవయవములున్నల్లనివిగాన వానిలో మొగమునకు మోవియొక్క ద్యుతిమంజరులచేతను తక్కినదేహమునకు గోపికలకుచకుంకుమము రొంపిచేతను ఎఱుపుఁగూర్చినాఁడు కుచకుంకుమముచే పఙ్కిలమైనాఁడనుటచే పెక్కుగోపికా కుచాశ్లేషము స్ఫురించెడిని. ఇట్లు మేనంతయు నెఱ్ఱగాఁ గానిపించుటచే ఎఱ్ఱనిపూవులు పూచినపల్లనిమ్రానువలెఁ జూపట్టునని తాత్పర్యము ధ్వనించుచున్నది.

ఉ. పల్లవకోమలం బయినపాణితలంబునఁ దేనెమోవి రం
జిల్లెడుమోముఁదమ్మిపయిఁ జేర్చినవేణువు మ్రోయఁ జొక్కుచు
న్వల్లవకామినీజనఘనస్తనకుంకుమపంకభాసి యై
వెల్లిత పాటలారుణనవీనపదాబ్జు విభుం దలంచెదన్. 9

తా. కలుగొట్టుపూవులవంటి పాదములతో నిలిచి చిగుళ్ళవలె నెఱ్ఱనైన చేతులలో వేణువును బట్టి రవళిని వెలుఁగం జేయుచు, కెమ్మోవికాంతులు పువ్వుగుత్తులవలె గుములుకొని నెమ్మొగమునందుఁ బ్రసరింపఁగా, వట్టిసొంపును జూచి మరులుగొని గోపికలు కౌఁగిలించుకొనునపుడు వారికుచములయందలి కుంకుమము తనదేహమునందు దట్టముగా నంటుకొని రొంపిగొనఁగా, నాశ్రితరక్షణసమర్థుఁడై యొప్పు కృష్ణుని ఆశ్రయించెదను.

శ్లో॥ అపాఙ్గరేఖాభి, రభఙ్గురాభి, రనఙ్గలేఖారసరఞ్జితాభిః
అనుక్షణం వల్లవసున్దరీభి, రభ్యర్చ్యమానం విభు మాశ్రయామః॥

టీ. వల్లవసుందరీభిః = గొల్లచెలువలచేత, అన...రఞ్జితాభిః-అనఙ్గ = మన్మథునియొక్క, లేఖా = పత్రికలయొక్క, రస = సారస్యముచేత-పత్రికలవలె రసమును గలిగించు విన్నాణముచేత. రఞ్జితాభిః = మనోహరములుగాఁ జేయఁబడినవియు-మన్మథుఁడు పంపినజాబులవలె శృంగారరసమును ఉద్దీపింపఁజేయు శక్తివలన మనోజ్ఞములుగాఁ గావింపఁబడినవియు ననుట, అభఙ్గురాభిః=వంకరలేక నిడుదలై సాగునవియు, అగు, అపాఙ్గ రేఖాభిః-అపాఙ్గ=కడగన్నులయొక్క కడగంటిచూపులయొక్క, రేఖాభిః=పంక్తులచేత, అనుక్షణం=మాటిమాటికి, అభ్యర్చ్యమానం=పూజింపఁబడుచున్నవాఁడగు, విభుమ్ = ప్రభుండైన కృష్ణుని, ఆశ్రయే = ఆశ్రయించుచున్నాను. అభంగురములైన రేఖ లనుటచే లేఖలవలె నుండెడు సామ్యము సిద్ధించుచున్నది. అవి అత్యంతమోహనములైన యపాంగములయొక్క అభంగురరేఖ లగుటచే జగన్మోహనుఁడైన యనంగునియొక్క లేఖలుగా రూపింపఁబడినవి. అపాంగరేఖలు అభిప్రాయములను జెప్పకయే రహస్యముగా లేఖలవలెఁ దెలుపుటచే లేఖ లనఁబడినవి. మఱియు, లేఖలు తమ్ముఁ బంపువారిసందేశమును దెలుపునట్లే అపాంగరేఖలనెడి లేఖలు మన్మథప్రేరితములైనవి గావున మన్మథునిసందేశమును దెలుపును. అనఁగా మన్మథుఁడు గోపికల నావేశించి యుండుటను దెలుపునని భావము. లేక, రాజుపంపులేఖ యెట్లు ప్రజలకు ఆజ్ఞ సేయునో, యట్లే త్రిలోకరాజ్యము వశమైయుండు మన్మథునియీలేఖలును గృష్ణునకాజ్ఞ సేయును. అనఁగా 'వ్రజవధూనయనాఞ్చలవఞ్చితమ్' అన్నట్లు గోపికలకు వశవర్తియై యుండునట్లు నియమించుననియు భావ మూహ్యము. ఆయపాంగరేఖలు మన్మథోద్దీపకము లని యాశయము. 'అనుక్షణమ్' అనుటచే గోపికలకామాతిశయము దెలియుచున్నది. కావుననే వారిచేఁ గేవలము 'అర్చ్యమానుఁడు' గాక 'అభ్యర్చ్యమా

నుఁ' డయ్యె. 'అపాంగరేఖ' లచే 'అభ్యర్చ్యమానుఁ' డనఁగా భక్తులయర్చనలచే నెట్టిప్రీతిమో గోపికలయపాంగరేఖలచేతను అట్టిప్రీతిని బొందు నని భావము. 'అభి' యను ఉపసర్గ ఆప్రీతియొక్క అతిశయమును దెలుపుచున్నది.

ఉ. ఇంచుకయైనఁ జాలు నని యెంచక ప్రేతలమించుఁబొండ్లు క్రో
మ్మించులమించు లీనెడు నప్రమేయమనోభవమాధురీరసో
దంచితచారుచంచలదృగంచలధారల సారె పూజఁ గా
వించఁగఁ జెల్వు మీఱువిభు వేణునినాదవినోదుఁ గొల్చెదన్.10

తా. గోపసుందరులు, మన్మథుఁడు పంపు చీట్లవలె మరులు కొలుపునట్టి నిడువాలుఁగడకంటిచూడ్కులచాలును మాటిమాటికి నిగుడ్చుచుఁ దనను మిక్కిలి ప్రీతిగలిగింపఁగా వెలుఁగువిభుం డగు కృష్ణుని ఆశ్రయించెదము.

అవ. తా నాశ్రయించినజ్యోతిని తనహృదయమునందుఁ బొడసూపునట్లు ఏడుశ్లోకములచేఁ బ్రార్థించుచున్నాఁడు.

శ్లో॥ హృదయే మమ హృద్యవిభ్రమాణాం
హృదయం హర్ష విశాలలోలనేత్రమ్ ।
తరుణం వ్రజబాలసున్దరీణాం
తరళం కిఞ్చన ధామ సన్నిధత్తామ్ ॥ 11

టీ. హృద్యవిభ్రమాణాం - హృద్య=మనోహరములైన, విభ్రమాణాం=విలాసములయొక్క, హృదయం=సారమైనదియు-విలాససర్వస్వమైనది యనుట, లేక 'అశ్వహృదయమ్' 'అక్షహృదయమ్' ఇత్యాదిప్రయోగములందు హృదయశబ్దమునకు రహస్యశాస్త్ర మని యర్థముగాన విలాసరహస్యములను బ్రతిపాదించుశాస్త్రమైనదియు ననియర్థము. మనోజ్ఞములైన విలాసవిశేషములు ప్రకాశించునది యనుట. హర్ష...నేత్రమ్ - హర్ష = సంతోషముచేత, విశాల = మిక్కిలివిరివియై, లోల = చంచలములైన-బెళుకులీనెడు, నేత్రమ్ = కన్నులుగలదియు, తరుణమ్=యౌవనము గలదియు, కావునచే, వ్రజ...రణామ్ - వ్రజ = వ్రేపల్లెయందలి, బాల = లేఁబ్రాయముగల, సున్దరీణామ్=చెలువలకు, తరళమ్=చపలమైనదియు-వారికొఱకు చాపల్యముగలదియు యనుట, కిఞ్చన = ఇట్టిదట్టిదని చెప్పనలవికానిదియు, అగు, ధామ = తేజస్సు, మమ = నాయొక్క, హృదయే = హృదయమునందు, సన్నిధత్తామ్ = సన్నిధిగలిగియుండును గాక. లేక, హృద్యవిభ్రమాణాం = మనోహరములైన విలాసములు గల, వ్రజబాలసున్దరీణామ్ = గొల్లప్రాయపుచెలువలకు, హృదయమ్ = ప్రాణపదమైనదియు - లేక వారియభీప్సితసర్వస్వమైనదియు - లేక 'హృత్ + అయతే' అను వ్యుత్పత్తిచే, వారి హృదయములను బొందినదియు, తరుణమ్ = లేజవ్వనముగలదియు, కావునచే, తరళమ్ = చంచలమైనదియు, స్థిరముగా సన్నిధానము సేసియుండనిదియు, అగుధామము

అనియు నర్థము సేయవచ్చును. వస్తువో అనిర్వాచ్యమైన తేజస్సు. అది యట్టియప్రాకృతస్వరూపముతో నాహృదయమునఁ దోఁచెనేని నే ననుభవింప శక్తుఁడను గాను. కావున విలాసంపువగలును వాలుబెళుకుఁగన్నులును యౌవనంపుసొంపును గలిగి జవరాండ్రవెంబడి తిరుగుచు, శృంగారరసము లొలుకుచున్నరూపముతో నాహృదయము నందుఁ బొడసూపునుగాక యని కవిప్రార్థనము.

ఉ. మంజువిలాసవిభ్రమసమగ్రమూర్తియమున్ వ్రజభామినీమనో
రంజక యౌవనాకరము రాజితహార్దవిలాసదృక్ప్రభా
పుంజము పింఛభూషణవిభూషితధామము నెమ్మి నామనః
కంజనివాస మై మనుచుఁ గావుత సత్కరుణాధురీణ మై. 11

తా. మనోహరములగు విలాసములు గలుగుచు, హర్షముచే మఱింతవిశాలము లైన బెళుకుఁగన్నులు గలిగి, యౌవనంబుఁదమిచే గొల్లపూపజవరాండ్రతో లోనయి వర్తించునట్టి యనిర్వాచ్యతేజస్సు నామనస్సునందుఁ బొడసూపుఁ గాత.

అవ. శ్రీకృష్ణునిపాదాబ్జములను స్తుతించుచున్నాఁడు.

శ్లో॥ నిఖిలభువనలక్ష్మీనిత్యలీలాస్పదాభ్యాం
కమలవిపినవీథీగర్వసర్వఙ్కషాభ్యామ్ ।
ప్రణమదభయదానప్రౌఢిగాఢోద్ధతాభ్యాం
కిమపి వహతు చేతః కృష్ణపాదామ్బుజాభ్యామ్॥ 12

టీ. నిఖిల...లీలాభ్యామ్-నిఖిల = సమస్తములైన, భువన = లోకములందలి, లక్ష్మీ=లక్ష్మియొక్క, కాంత్యధిదేవతయొక్క, నిత్య=ఎడతెగని, లీలా=విలాసక్రీడలకు, ఆస్పదాభ్యామ్=స్థానములైనవియు, లోకములందలి శోభాసంపత్తియంతయు ఎపుడును అందు వన్నెలు చూపుచుండునని యర్థము; మఱియు, కమల...షాభ్యామ్ - కమల విపిన=పద్మవనములయొక్క తామరతంపరలయొక్క, వీథీ=పంక్తులయొక్క, గర్వ = గర్వమును-మనోజ్ఞత్వముయొక్కనిక్కును, సర్వఙ్కషాభ్యామ్=అంతటిని బోఁగొట్టునవియు-తామరతంపరవరుసలయొక్క, చెలువంపునిక్కు నంతయు కొంచెమైనను నిలువక నిర్మూలము గావించునవియనుట; ప్రణమ...ద్ధతాభ్యామ్ - ప్రణమత్ = నమస్కరించువారలకు, అభయదాన=అభయము నిచ్చుటయొక్క, ప్రౌఢి = ఆధిక్యమునందు. మిక్కిలి యభయమిచ్చుటయం దనుట, గాఢ=మిక్కిలి, ఉద్ధతాభ్యామ్ = విజృంభించి యుండుననియు - నమ్రులకు మీఁదుమిక్కిలి యభియమిచ్చువిషయమునందు ఎంతయు నుత్సాహముతో నాయత్తమై యుండునవియనుట: అగు, కృష్ణపాదామ్బుజాభ్యామ్=శ్రీకృష్ణునిచరణారవిందములచేత, చేతః=నామనస్సు, కిమపి = చెప్పనలవికానిసంతోషమును, వహతు=వహించుఁగాక. ఇచట కేవలలక్ష్మిని జెప్పక 'నిఖిలభువన' మనలక్ష్మియనుటచే

లోకములలోని లక్ష్ములనన్నిటినేర్చికూర్చి చేయఁబడుటచే, ఈపాదములలక్ష్మి నిరుప మానమైనదనియు, నిత్యశబ్దముచే తక్కినలక్ష్ములవలె అనిత్యముగాక అది నిత్య మైన దనియు స్ఫురించెడి కేవల 'కమల'మును చెప్పక కమలములయొక్క 'విపినవీథు' లను జెప్పుటచే తామరతంపరలన్నింటి యొప్పులను కుప్పచేసినను దానినిగూడ అవి నిరసింపఁ జాలినంత నిరతిశయమైనవనియు, 'స్వాంకష' శబ్దముచే ఆనిరసించుటయొక్క ఔద్ధత్య మును దానిచే వానిశోభాప్రకర్షమును దెలియుచున్నవి. కేవల 'మభయదాన' మందుఁగాక 'అభయదానప్రౌఢి' యందు 'ఉద్ధత'ములైన వనుటచే ఆదానమునుకోరఁదికి మీఱనిచ్చునట్టి కారుణ్యాతిశయము గలదనియు, ఉద్ధతత్వమును 'గాఢ' మైన దనుటచే ఆ కరుణాతిశయముయొక్క ఔత్కృష్ట్యమును సూచితము లయ్యెడిని. ఇట్లు నిరవధి కాతిశయలక్షణలక్షిత మైన కృష్ణపాదాంబుజములచే నామనస్సు నిరవధికాతిశయ మైనదేదో కలిగియున్నది. దానిని సంతోషమని చెప్పుట చాలదు. కాన 'కిమపి' 'ఏదోయొకటి' యనిమాత్రము చెప్పెననిభావము. మఱియు అంబుజములందు లక్ష్మి యున్నది. కృష్ణపాదములనెడి యంబుజములందో నిఖిలభువనలక్ష్మియున్నది. మఱియు నివి తక్కినయంబుజములన్నిటికంటె విలక్షణము లైనవనియుఁ దాత్పర్యముస్ఫురించెడి.

మ. లలితాశేషదిశాధినాథనగరీశ్రీలక్ష్మీవిలాసాస్పదం
బులు నీరేరుహగర్వసర్వవిభవప్రౌఢత్వమ్మాలనశ్రీపదం
బులు వందారుమనోరథార్థఘటనాశ్రపూర్ణానుకంపాస్పదం
బులు శ్రీకృష్ణపదంబు లూని మన మాశ్రమోదంబునం బొందెడిన్.

తా. సకలలోకంబులందలి సిరులకు చెలువారుపట్టులై తామరపువ్వులం దెగడు నట్టివిట్టులై శరణాగతులకు మీఁదుమిక్కిలి యభయము నొసంగుటయందు మిక్కిలి యుత్సాహము గలిగియున్న చిన్నికృష్ణునియడుగుఁదమ్ములు నామనంబునకింతింతనరాని సంతసంబును గూర్చుచున్నవి.

అవ. లోచనములను వర్ణించుచున్నాఁడు

శ్లో॥ ప్రణయపరిణతాభ్యాం ప్రాభవాలమ్బనాభ్యామ్
ప్రతిపదలలితాభ్యాం ప్రత్యహం నూతనాభ్యామ్।
ప్రతిముహురధికాభ్యాం ప్రస్నువల్లోచనాభ్యామ్
ప్రభవతు హృదయే నః ప్రాణనాథః కిశోరః ॥ 13

టీ. ప్రణయపరిణతాభ్యామ్-ప్రణయ = ప్రేమచేత, ఆశ్రితులయెడల అనురక్తి యందు, పరిణతాభ్యామ్=పరిపక్వములైనవియు, భక్తులయెడ పరిపక్వమైనప్రేమ గలవి యగుట-ఇది సౌలభ్యసూచకము; ప్రాభవ ఆలమ్బనాభ్యామ్-ప్రాభవ = ప్రభుత్వము నకు, ఆలమ్బనాభ్యామ్=ఆశ్రయములైనవియు, ఐహికాముష్మికసామ్రాజ్యాధిపత్యము

దేలుపునట్టి గరువంపుఠీవి గులుకునదియు ననుట-ఇది పరత్వసూచకము; ప్రతిపదలలితాభ్యామ్-ప్రతిపద=అడుగడుగునకు-ప్రతిక్షణమును అనుట, లలితాభ్యాం=సుందరములైనవియు-ఇది సౌలభ్యమునకుఁ బోషకము; ప్రత్యహం = ప్రతిదినమును, నూతనభ్యామ్ = క్రొత్తలైననియు-ఇది సౌలభ్యము జగన్మోహనముఁ గావించునది-మఱియు నీ రెండు విశేషణముల చేత 'ప్రతిక్షణం యన్నవతాముపైతి, తదేవరూపం రమణీయతాయాః-క్షణక్షణమును ఏది క్రొత్తక్రొత్తగా నీటుగుల్కునో యదియే రమణీయత్వమునకు రూపము' అనఁబడు రామణీయకము ప్రతిపాదింపఁబడినది; ప్రతిముహుః = మాటిమాటికి, అధికాభ్యామ్=(విలాసమునందుఁ గాని ప్రభుత్వంపుఠీవియందుఁ గాని) హెచ్చు అగునదియు-ఇది పరత్వసౌలభ్యప్రకాశకము, ఇట్టివి యగు, ప్రస్నువత్ లోచనాభ్యామ్-ప్రస్నువత్=మిక్కిలి (కారుణ్యరసము) ఒలుకుచున్న-లేక, ఆశ్రితాభీష్టములను గురియుచున్న, లోచనాభ్యామ్=నేత్రములతోడ, ప్రాణనాథః=మాజీవితమునకు అధినాథుఁడైన-మాకెంతయు ఏలికయైన, కిశోరః=బాలుఁడు-చిన్నికృష్ణుఁడు, నః=మాయొక్క, హృదయే = చిత్తమందు, ప్రభవతు = కలుగుఁగాక - మాకు ధ్యానగోచరుం డగుఁ గాక యనుట, 'ప్రాణనాథ'శబ్దము అంతర్యామిత్వలక్షణమైన పరత్వమునకును, 'కిశోర'శబ్దము అవతారప్రయుక్తమైన సౌలభ్యమునకును సీమలు. ఇట్లు పరత్వసౌలభ్యములుగల వస్తు వగుటచేతనే తదీయలోచనములకును, పరత్వసౌలభ్యనిరూపకములైన విశేషణములను కవి గూర్చినాఁడు.

చ. ప్రతిదినమున్ విలాసరసభాసురమై నిరతంబుఁ జూచినన్
మతిహితమై ప్రభుత్వమహిమంబున కెల్లను బట్టుఁగొమ్మయై
యతులదయాకలోదితమునై విలసిల్లెడుకన్నుదోయితో
సతతముఁ బ్రాణబంధుఁ డగుచక్కనిబాలుఁడు దోఁచుఁ గావుతన్.

తా. మిక్కిలి ప్రేమను సూపుచు, ప్రభుత్వమును ప్రకాశింపఁజేయుచును, క్షణక్షణమును సొబగై, నాఁడునాఁటికి వింతయై, మాటిమాటికి మురువు హెచ్చుచు, ఇష్టార్థములఁ గురియుచున్నట్టి కన్నుఁగవతో ప్రాణేశ్వరుఁడైన చిన్నారికృష్ణుఁడు మాహృదయమునందుఁ బొడసూపును గాక.

శ్లో॥ మాధుర్యవారిధిమదాన్ధతరఙ్గభఙ్గీ
శృఙ్గారసఙ్కలితశీతకిశోరవేషమ్ ।
ఆమన్దహాసలలితాననచన్ద్రబిమ్బ
మానన్దసంప్లవ మనుప్లవతాం మనో మే ॥ 14

టీ. మాధుర్య... శేషమ్-మాధుర్య=సౌందర్యమనెడి, వారిధి=సముద్రముయొక్క, మద+అన్ధ=మదముచే కన్నుగాననిదైన-మిక్కుటముగా విజృంభించుచున్నదైనయనుట,

తరఙ్గ=అలలయొక్క, భఙ్గీ = పంక్తులరూపముగా నున్న, శృఙ్గార = శృంగారరసముతోడ, సజ్వలిత=కూడినట్టి, శీత=చల్లని-చూచువారికన్నులకు సుఖప్రదమైనట్టియనుట, కిశోరవేషం=బాలునియాకారముగలదియు-ఇట సౌందర్యమును సముద్రముగాను అందు పొంగి పొరలుచున్న యలలే శృంగారరసముగాను రూపితములైనవి. కావున సౌందర్యము మిక్కిలి విజృంభించి శృంగారరస మొలుకుచున్నదని యర్థము. అట్టిశృంగారరసముచేత ఆర్ద్రమగుటచే కిశోరవేషము శీతముగానున్నదని చమత్కారము; మఱియును, ఆమన్ద...బిమ్బమ్-ఆమన్దహాస=కొంత నెఱసిన చిఱునవ్వుచేత, లలిత = మనోహరమైన, ఆనన=ముఖము అనెడి, చన్ద్రబిమ్బమ్=చంద్రబింబము గలదియు-చిఱునగవుచే సొగసుగులుకుచు చంద్రబింబమువలెఁ బ్రకాశించుచున్న మొగము గలదియు ననుట; ఇటువంటిదైన, ఆనన్ద సంప్లవమ్=ఆనందప్రవాహమును, మే=నాయొక్క, మానః=మనస్సు, అనుప్లవతాం = అనుసరించునుగాక, లేక, అను=అనుసరించి, ప్లవతామ్=తెప్పలఁదేలుచునుగాక-ఆనందమయమైన యాప్రవాహమునందు నామనసు ఓలలాడునుగాక యనుట, ఇందు 'ఆమన్దహాస' అని మందహాసరూపమైన వెన్నెలగల 'ఆననచన్ద్రబిమ్బమ్' అని ఆననరూపమైన చంద్రునిచేత, 'మాధుర్య' మనెడి 'వారిధి,' 'మదాన్ధ తరఙ్గభఙ్గీ' యని పొంగి, 'ఆనన్దసంప్లవమ్' అని యానందమయముగా ప్రవహించినదనియు, ఆప్రవాహమునందుఁ దనమనంబు నోలలాడుఁగాక యనియు నర్థము శబ్దశక్తిచే ధ్వనించుచున్నది.

చ. కందళితస్మితామృతవికాసముఖాబ్జము మాధురీవిని
ష్యందతరంగభంగినవయౌవనవిభ్రమగోపవేష మా
నందరసైకరూప మగునందకుమారసుధాబ్ధిలోన నా
డెందము తేలియాడఁగఁ గడిందియఘం బనుపంక మంటునే! 14

తా. చక్కఁదనము మిక్కిలి యతిశయించి సింగారము గులుకుచున్న చల్లని చిన్నిబాలునిరూపుఁదాల్చి, చిఱునవ్వుతోఁ గూడినచంద్రునివంటిమొగము గలిగి, వెలుఁగుచున్న కృష్ణుండనెడి యానందప్రవెల్లియందు నామనస్సు తేలియాడును గాక.

శ్లో॥ అవ్యాజమఞ్జులముఖామ్బుజముగ్ధభావై
రాస్వాద్యమాననిజవేణువినోదనాదమ్ ।
ఆక్రీడతా మరుణపాదసరోరుహాభ్యా
మార్ద్రే మదీయహృదయే భువనార్ద్రమోజః ॥ 15

టీ. అవ్యాజ...భావైః-అవ్యాజ = నిరుపాధికముగా- మఱియొకహేతువుచేతఁగాక తనంతటనే, మఞ్జుల = సుందరమైన-స్వభావసిద్ధమైన సౌందర్యముగల యనుట, ముఖ అమ్బుజ=తామరవంటి మొగముయొక్క, ముగ్ధ=సొగసైన, భావైః=చేష్టలతోడ-

వేణువు నూఁదునపుడు గలుగు బొమలువంచుట కనులు ద్రిప్పుట మొదలగుశృంగారచేష్టలతోఁ గూడ ననుట, ఆస్వా...నాదమ్-ఆస్వాద్యమాన=అనుభవింపఁబడుచున్న, నిజ=తనదైన, వేణు=పిల్లఁగ్రోవియొక్క, వినోద=క్రీడార్థమైన, నాదమ్ = ధ్వనిగలదియు-భ్రూవిక్షేపాదులైన ముఖచేష్టలు సొగసుగాఁ జేయుచు వినోదముగా వేణువు నూఁదుచున్నదియనుట, మఱియు, భువన ఆర్ద్రమ్-భువన = లోకములను-మూఁడులోకములకెల్లననుట, ఆర్ద్రమ్=శృంగారరసముచేఁ దడిసినదియు-చల్లనైనది యనుట, అగు, ఓజః=(కృష్ణాఖ్యమైన) తేజము, అరుణ...హాభ్యామ్-అరుణ = ఎఱ్ఱనైన, పాదసరోరుహాభ్యామ్=తామరలవంటి యడుగులతో, ఆర్ద్రే = భక్తిరసముచేఁ దడసియున్న-గడుసుగాక మెత్తనైయున్న యని భావము. మదీయహృదయే=నాహృదయమునందు, ఆక్రీడతామ్=అంతట విహరించుఁ గావుత. ముఖము 'అవ్యాజమంజుల'మైనది గావుననే దాని భావములు 'ముగ్ధ'ము లయ్యె. వీనుల విం దయినవేణుగానముయొక్క మనోజ్ఞత యిట్టిముగ్ధభావములచే మఱింత యతిశయము నొందిన దని యాశయము. ముగ్ధభావములచేఁ గన్నులపండువును వేణువినోదనాదముచే వీనులవిందును జేయుటచే నాహృదయము ఆర్ద్రమైనది యని ఆకూతము. ఆర్ద్రమైనతేజస్సు ఆర్ద్రమైన హృదయమున విహరించుట తగునని చమత్కారము. పాదములు 'అరుణసరోరుహములవలె మృదువైనవి గాన దాని కనుగుణముగా నాహృదయమును ఆర్ద్రమై మెత్తగిలియున్నదని యాశయము. అరుణపాదసరోరుహములతో క్రీడించుటను జెప్పుటచే క్రీడాసౌకుమార్యమును అట్టిదానిని అనుభవించుటయందుఁ గలభోగ్యతాతిశయమును ధ్వనితములు.

మ. హాసదవ్యాజమనోహరాననముతో సనాలోలదృక్పాళితో
నసకృల్లీఢనిరూఢవేణులతతో సనాత్తాభ్రమక్రమాంఘ్రిసా
రసయుగ్మంబున నింపుసొంపులు దలిర్పం దాండవం బాడుచు
న్వసియించున్ భువనార్ద్రతేజము మహానందంబునన్ నామదిన్. 15

తా. మఱియొకయలంకారముచేతఁ గాక స్వభావసిద్ధముగానే సుందరమైయున్న ముఖారవిందముయొక్క భ్రూవిక్షేపాదివ్యాపారములు మనోహరముగా నెఱపుచు, వినోదముగా వేణువు నూఁదుచు, జగంబులకెల్లఁ జల్లనై యున్న కృష్ణాఖ్యతేజము భక్తిరసముచేఁ దడిసి మృదువై యున్న నాహృదయమునందు నెఱ్ఱనియడుగుఁ దామర లిడుచుఁ గ్రీడించుఁగాక.

శ్లో॥ మణినూపురవాచాలం, వన్దేతచ్చరణం విభోః
లలితాని యదీయాని, లక్ష్మాణి వ్రజవీథిషు ॥ 16

టీ. యదీయాని=దేనివైన-ఏపాదమును సంబంధించినట్టి, లక్ష్మాణి = (హలకులిశాంకుశాదిరేఖారూపము లైన) చిహ్నములు, వ్రజవీథిషు = వ్రేపల్లెవీథులయందు, లలి

తాని=మనోజ్ఞములైనవో, విభోః=వ్యాపకుండైన శ్రీకృష్ణునియొక్క, మణి...చాలం- మణినూపుర = పద్మరాగాదిమణులు దాపిన యందియలచేత, వాచాలం = మ్రోయు చున్నట్టి, తత్ = ఆ, చరణం = పాదమునుగూర్చి, వందే = నమస్కరించుచున్నాను 'విభోః' అని సర్వవ్యాపకుండైన పరుండయ్యును, వ్రేపల్లెవీధుల నందియలు మెరయ దిరిగినాఁడనుటచే సౌలభ్యాతిశయమును లీలాసౌభాగ్యమును దెలియుచున్నది.

చ. హలకులిశాదిలక్షణసహమూహితము(ద నచంచలస్థితిన్
వెలసి సిరిం జెలంగు వ్రజవీథుల నూపురరత్నకింకిణీ
లలితఝుళంఝుళారవముఁ గలన్ నలుదిక్కులు పిక్కటిల్లఁగాఁ
దలవరి నాఁ బ్రవర్తిలుపదద్వయి గల్గుహరిన్ భజించెదన్. 16

తా. హలకులిశాంకుశాదిరేఖాలక్షణంబులచే వ్రేపల్లెవీథుల నలంకరించుచు, రత్నసంపుటందియలరవళిని జెలఁగించుచున్న శ్రీకృష్ణచరణంబులను భజించుచున్నాఁడను.

అవ. అందియలరవళిని వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ మమ చేతసి స్ఫురతు వల్లవీవిభో
ర్మణినూపురప్రణయిమఞ్జుశిఞ్జితమ్ ।
కమలావనేచరకళిన్దకన్యకా
కలహంసకణ్ఠకలకూజితాదృతమ్॥ 17

టీ. కమలా...తాదృతమ్-కమలా = లక్ష్మీదేవియొక్క, వనే = విహారవనమైన పద్మవనమందు, చర=సంచరించుచున్నవియు, కళిన్దకన్యకా = యమునానదియందుండు నవియు, అగు, కలహంస=రాజహంసలయొక్క యమునానదియందలి తామరతంపరలో తిరుగునట్టిరాయంచలయొక్క యనుట, కణ్ఠ=కంఠములందలి,కల = అవ్యక్తమధురమైన, కూజిత=కూఁతలచేత,ఆదృతమ్ = ఆదరింపఁబడినదియైన-అకూజితములవంటిదైన యనుట, 'కూజితాదృతమ్' అనుపాఠమున కూజితములవంటిదైన యని యర్థము, వల్లవీవిభోః = గొల్లచెలువలకు నాయకుండైన శ్రీకృష్ణునియొక్క, మణి...శిఞ్జితమ్-మణినూపుర = రత్నపుటందియలయొక్క-ప్రణయి = ప్రేమసహితమైనదియు-లేక, ప్రేమఁ జూపునదియు, మఞ్జు=ఇంపైనదియు, అగు, శిఞ్జితమ్=రవళి, మమ=నాయొక్క, చేతసి = హృదయము నందు, స్ఫురతు-స్ఫురించునుగాక. 'కాళిన్దీ పులినాఙ్గణ ప్రణయినమ్' అన్నట్లు కాళిందికడ తిరుగువాఁడు గావున అందలి రాయంచలకూఁతలచే అందియలరవళి ఆదృతము అగుటను జెప్పినాఁడు. అనఁగా కృష్ణుని నూపురశింజితమును విని యాకలహంసలు తమ జాతివానిధ్వని యని యెంచి మాఱుకూజితములు సేయుచున్న వనుట. హంసలను 'కమలావనేచరము' లనుటచేతను, అందును 'కలహంస' ములనుటచేతను వానిపుష్టియు మత్త

తయుఁ దెలియుచున్నది. వానిచే అకూజితధ్వనులయొక్క పెంపును దన్నూలముగా వానిం బోలునట్టి నూపురశింజితముయొక్క సొంపును వ్యంజితము లగుచున్నవి.

మ. దినముఁ నాదుహృదంతరాళమున వర్తిల్లుం గళిందాత్మజా
వనజాళిఁ విహరించు నంచ కలరావంబున్ విడంబించు న
వ్వనజాతేక్షణు పాదనూపురమణిక్వాణంబు గోపాంగనా
జనరాసోత్సవనృత్తగీతకలనాసాచివ్యధౌరేయమై. 17

తా. యమునానదియందలి తామరతంపరయందు విహరించు రాయంచలయొక్క యవ్యక్తమధురకంఠధ్వనులకు సమానమై యింపుచూపు శ్రీకృష్ణుని యందియల రవళి నామనస్సునందు స్ఫురించుఁ గాత.

అవ. ఇట్లు దివ్యపాదాబ్జములతోను, ప్రసన్నవల్లోచనముల తోను, శీతకిశోరవేషముతోను, ముగ్ధభావములతోను, వేణువినోద నాదముతోను, మణినూపురప్రణయిమంజుశింజితముతోను, తనహృద యమునందుఁ గ్రీడించునట్లు కవి ప్రార్థించినాఁడు. శ్రీకృష్ణుఁడును అట్టి నయనములతోను, అట్టి రూపములతోను, అట్టి మురళీధ్వనితోను,తన హృదయమందుఁ గ్రీడించుటను గవి తెలుపుచున్నాఁడు.

శ్లో॥ తరుణారుణకరుణామయవిపులాయతనయనం
కమలాకుచకలశీభరవిపులీకృతపులకమ్ ।
మురళీరవతరళీకృతమునిమానసనలినం
మమ ఖేలతి మదచేతసి మధురాధరమమృతమ్॥ 18

టీ. తరుణ...నయనమ్-తరుణ అరుణ=లేతయెఱ్ఱదనముగలవియు - కొంచెము గా నెఱ్ఱనివియు, కరుణామయ = దయాస్వరూపము లైనవియు, విపుల = వెడలుపుగల వియు, ఆయత=నిడుద లైనవియు, అగు, నయనమ్ = కన్నులుగలదియు-కొంతయెఱ్ఱనై కరుణారస మొలుకు నిడువాలుఁగన్నులు గలది యనుట: కమలా...పులకమ్ - కమలా =లక్ష్మియొక్క, కుచకలశీ = కలశములవంటి కుచములయొక్క, భర=ప్రేకనయందలి- ప్రేకనిగబ్బిగుబ్బలయందు అనుట, విపులీకృత = మిక్కిలిగా చేయఁబడిన, పులకమ్ = గగుర్పాటుగలదియు-లక్ష్మీదేవికి శృంగారరసపరవశమునఁ జన్నుఁగవ పయిపయి గగుర్పాటుచునట్లు చేయునది యనుట; మురళీ...నలినమ్-మురళీరవ=వేణునాదముచేత, తర ళీకృత=చలింపఁజేయఁబడిన, ముని = మునులయొక్క-మననశీలురై యున్న యోగుల యొక్క, మానసనలినమ్=హృదయకమలములు గలదియు-దృఢనిష్ఠతో మననము సేయు చుండు మునులచిత్తములనుగూడ జలింపఁజేయఁజాలినంత మోహనముగా మురళిని ఊఁ

దునట్టిది యనుట; మధుర + అధరమ్-మధుర=మనోజ్ఞమైన, అధరమ్=క్రిందిపెదవి గల దియు; అగు, అమృతమ్=అమృతమువలె నత్యంతభోగ్యమైన-లేక మోక్షస్వరూపమైన శ్రీకృష్ణాఖ్యవస్తువు, మమ=నాయొక్క, మనచేతసి=మత్తమైన చిత్తమునందు, ఖేలతి =క్రీడించుచున్నది. నాచేతస్సు విషయవిషామిషభోగముచే మత్తిల్లినది. దాని కాయ మృతంపుభోగ్యత తెలియదు. అయినను ఆ యమృతము తన యెజ్జని నిడువాలుఁగన్ను లును, లచ్చికిని చన్నుఁగవయందు గగుర్పుట్టించునట్టి చక్కఁదిరూపును, మునులమనస్సు లనుగూడఁ గలంచునట్టి మోహనమైన మురళిరవళిని, మధురమైన యధరమును, జూపి అట్టి నామనస్సును వశము చేసికొని యందుఁ గ్రీడించుచున్నదని యాశయము.

మ. తరుణాబ్జారుణలోచనద్వయిఁ గృపాసాధారేయమై యొప్ప సా
గరకన్యాకుచకుంభపాళిఁ బులకల్ గన్పట్ట మౌనీంద్రహృ
త్సరసీజంబులు సంచలింప మురళీసంజాతగీతామృత
స్ఫురణన్ రాల్ గరఁగం జరించుహరికైశోరంబు భావించెదన్. 18

తా. ఇందుకంతె యెఱ్ఱనైకమలజారస మొలుపునిడువాలువెడఁదగన్నులు చెన్నా ర, లచ్చియొక్క బంగారుమండలవంటి గుబ్బపాలిండ్లయందు మిక్కిలి గగురుపుట్టించు శృంగారరసమొలుపు చక్కఁదనము దళుకొత్త, మునులయొక్క సమాధినిగూడఁ గలం చునఁతె మోహనముగా మురళినూఁదుచు, మధురమైన యధరము గలిగియున్నకృష్ణాఖ్య మగు నమృతము నామత్తచిత్తమునందుఁ గ్రీడించుచున్నది.

అవ. అట్టిముగ్ధభావములను స్ఫురించుట చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆముగ్ధ మర్ధనయనామ్బుజచుమ్బ్యమాన
హర్షాకులవ్రజవధూమధురాననేన్దోః
ఆరబ్ధవేణురవ మాదికిశోరమూర్తే
రావిర్భవన్తి మమ చేతసి కేఽపి భావాః ॥ 19

టీ. అర్ధ... నేన్దోః-అర్ధ=అర్ధనిమీలితములైన-అరమోడ్చిన, నయన అమ్బుజ= కన్నుఁదామరలచేత= తామరలవంటికన్నులచేత, చుమ్బ్యమాన=చుంబింపఁబడుచున్న- కన్నులు చుంబించుటయనఁగా చుంబనమువలె సుఖప్రదముగాను మోహోద్దీపకముగాను జూచుట యని యర్థముగాన కన్నులచే అట్లుచూడఁబడుచున్నదియైన, హర్ష ఆనంద= సంతోషముచే తత్తఱపాటుకలవా రగు, వ్రజవధూ=గోపస్త్రీలయొక్క, మధుర = మనోజ్ఞమైన, ఆనన ఇన్దోః=ముఖచంద్రులు - అనఁగా చంద్రునివంటి మొగములుగల వాఁడైన, ఆది...మూర్తేః-ఆది = పురాణుఁడైన, కిశోరమూర్తేః=బాలకృష్ణమూర్తి యొక్క, కేఽపి=ఇట్టివియని చెప్పనలవిగాని, భావాః=చేష్టలు, ఆముగ్ధమ్=అంతటను

సుందరమగునట్లుగాను, ఆరబ్ధవేణురవమ్-ఆరబ్ధ=ఆరంభింపఁబడిన, వేణురవమ్ = వేణునాదము గలుగునట్లుగాను, ఆవిర్భవన్తి=స్ఫురించుచున్నవి. ఆదికిశోరమూర్తి వేణురవము నారంభించి ముగ్ధములైన భావములను జేయుచున్నాఁడు ఇవియె, 'అవ్యాజమఞ్జులముఖామ్బుజ ముగ్ధభావైః-అనఁబడినవి. ఆచేష్టలను ఇట్టి వట్టివని వర్ణింప నాతరము గాదు. అయినను అం దొకచేష్టను చెప్పెదను. అది యేదనఁగా, వేణు వూఁదునప్పుడు కన్నుఁదమ్ములు అరమోడ్చినవాఁడై యావేణుధ్వనికిసంతోషపడి తొడిఁబడుచున్న గొల్ల ముద్దుగుమ్మలనెమ్మొగములందు మోహోద్దీపకముగాఁ జూడ్కులు నిగుడ్చుచున్నాఁ డని భావము. అరమోడ్పుఁగంటి చూడ్కు లత్యంతమోహనము లని తెలియునది.

మ. మురళీగానసుధాపయోనిధి మదిం ౘ బొంగం దరంగావళు
  ల్దరికిన్ మీఱె ననం గటీతటదుకూలంబుల్ వడిన్ జాఱన
  బ్బురపుంగొల్లమిటారినీటు లరమోడ్పుంగన్నులం గాంచుచి
  త్తరపున్ముద్దులగోపబాలకువినోదప్రౌఢి భావించెదన్. 19

తా. వేణుగానము విని సంతసముచేఁ దత్తఱపడుచున్న గొల్లచిత్తరులచందురుని వంటి నెమ్మొగంబులందు, అరమోడ్చిన కన్నుఁదామరలను మరులుపుట్టునట్లు నిగుడ్చుచు, మురళీగానము సేయుచున్న పురాణపురుషుం డగు బాలకృష్ణుండు ఇట్టి వట్టి వని వర్ణింప నలవిగాకుండునట్లు అతిమనోహరముగాఁ జేయుశృంగారచేష్టలు నామనంబునఁ దోఁచుచున్నవి.

అవ. మదనకేళిశయ్యనుండి లేచు ముగ్ధభావమును వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ కలక్వణితకఙ్కణం కరనిరుద్ధపీతామ్బరం
  క్రమప్రసృతకున్తలం కలితబర్హభూషం విభోః ।
  పునఃప్రసృతిచాపలం ప్రణయినీభుజాయన్త్రితం
  మమ స్ఫురతు మానసే మదనకేళిశయ్యోత్థితమ్॥ 20

టీ. విభోః=విభుండైన శ్రీకృష్ణునియొక్క, మదనకేళిశయ్యోత్థితమ్-మదనకేళి=రతిక్రీడకొఱకైన-రతిగావించినట్టి, శయ్యా=సెజ్జనుండి, ఉత్థితమ్=లేచుట-ప్రియురాలితో రతి సలిపి. పడుకనుండి లేచుట-ఇది కర్త. ఇచట ఉత్థితశబ్దమునకు భావమున క్త ప్రత్యయము, ఆ ఉత్థిత మెట్టిదనఁగాఁ జెప్పుచున్నాఁడు:- కల...కణమ్-కల=అవ్యక్త మధురమైన, క్వణిత=ధ్వనిగల, కఙ్కణమ్=కడియములుగలది; కర...బరమ్-కర = హస్తముచేత, నిరుద్ధ=జాఱనీక అడ్డగింపఁబడిన, పీతామ్బరం=పచ్చనిపలువగలది. పీతాంబరధరుఁడు గనుక నిచట పీతాంబరము చెప్పఁబడియె; క్రమ ..తలమ్-క్రమ=సరిగా,

ప్రస్తుత=సాగింపఁబడిన- సాఁగునట్లు దువ్వఁబడినయనుట, హస్తలమ్=వెంట్రుకలుగలది; కలిత బర్హాభూషమ్ _ కలిత=అమర్పఁబడిన, బర్హా=నెమిలిపురి యనెడు, భూషమ్= భూషణము గలది- జాతిన నెమిలిపురిని జెరువుకొన్న దనుట, ప్రణయినీభుజాయన్త్రితమ్- ప్రణయినీ=ప్రియురాలియొక్క, భుజా=బుజములచేత, యన్త్రితమ్ సత్=అడ్డగింపఁబడినది అగుచు- ప్రియురాలు బిగియఁ గౌఁగిలించుకొని యాలేచుటను సాఁగ నీయక నిలుపఁగా ననుట, కౌపునసే, పున...లమ్ పునః=మరల, ప్రసృతి=నిష్క్రమణయందు, చాపలమ్=ఆసక్తిగలది-నిష్క్రమించుచుండిన ఉత్థితము ప్రణయినిచే అడ్డగింపఁబడుటచే నిలిచి మరల నిష్క్రమణముఁ బూనినదనుట, ఇట్టిఉత్థితము, మమ=నాయొక్క మానసే=మనస్సునందు, స్ఫురతు=ప్రకాశించుఁగాత. ఇచట-ఉత్థితమ్ _ అని లేచి యుండుట చెప్పఁబడినది. ఈలేచుటకే _ పునః ప్రసృతిచాపలమ్ _ అనువిశేషణము చెప్పఁబడినది. ఇట్లు లేచియే యుండఁగా _ పునః ప్రసృతి_అని మరల లేచుటకై నిష్క్రమట యెట్లు? అని సందేహముగలిగెడిని కాన-ఉత్థితమ్ - అనుటచే శయ్యనుండి సగము లేచె ననియు, అపుడే ప్రణయిని భుజాయంత్రణముచే దానిని అల్లేనిలిపెననియు, మరల కడమసగమును లేవఁ గోరుటచే_పునః ప్రసృతి చాపలమ్ _ అని చెప్పఁబడె ననియు గ్రహించునది దీనిచే మొదట లేచుట శయ్యనుండి యనియు, పిదపలేచుట ప్రియురాలియొడినుండి యనియు వ్యంజిత మగుచున్నది.

చ. అరవిరిజాఱుకుంతలము 5 లట్టిటు వీడినపీలిదండయుం
గరవలయంబు ఘల్లు రనఁ 5 గైకొనునట్టి సువర్ణచేలముం
బరఁగఁగ సెజ్జ డిగ్గుతఱిఁ 5 బద్మవిలోచన గౌఁగిలించుచోఁ
దిరుగ రమింపఁగాఁ దివురుదేవుని నామది నాశ్రయించెదన్. 20

తా. కంకణము అవ్యక్తమధురముగా మెఱయ, వీడినపీతాంబరమును జేతం బట్టుకొని, చెదరి చిక్కువీడిన వెంట్రుకలను సాఁగ దువ్వి, చక్కఁగా నమర్చిననెమిలి పురితో, ప్రియురాలితో రతిసలిపినపడుకనుండి కొంతలేచునపు డాప్రణయిని బుజములందిఱియఁ బట్టుకొని యట్టే నిలుపఁగా మరల మిగత లేవ నంకించుచున్న విభుండు శ్రీకృష్ణుండు నామనస్సునందు వెలుంగుఁ గాత.

అవ. కపటనిద్ర యనుముగ్ధభావమును వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ స్తోకస్తోకనిరుధ్యమానమృదులప్రస్యన్దిమన్దస్మితం
ప్రేమోద్భేదనిరర్గళప్రసృమరప్రవ్యక్తరోమోద్గమమ్ ।
శ్రోత్రశ్రోతృమనోహరవ్రజవధూలీలామిథోజల్పితం
మిథ్యాస్వాపముపాస్మహే భగవతః క్రీడానిమీలద్దృశః॥ 21

టీ. క్రీడా...దృశః-క్రీడా = వేడుకకొఱకు-నిజముగాఁ గాదనుట, నిమీలత్ = మొగుడుచున్న, దృశః = కన్నులు గల-వేడుకకై కన్నులు మోడ్చుచున్నవాఁడైన యనుట, భగవతః=భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తియొక్క, మిథ్యాస్వాపం = కపటనిద్రను, ఉపాస్మహే=ఉపాసించుచున్నారము. ఆమిథ్యాస్వాప మెట్టిదనఁగా-శ్రోత్ర...జల్పితమ్-శ్రోత్ర=వినువారలకు, శ్రోత్ర=చెవులకు,మనోహర=ఇంపైన, వ్రజవధూ=గోపస్త్రీల యొక్క, లీలా = విలాసప్రయుక్తమైన, మిథోజల్పితమ్ = పరస్పరసంభాషణముగలది. గొల్లచెలువలుచెవుల కింపుగా విలాసముతోఁ దన్ను గుఱించి యొకరితో నొకరు మాటలాడికొనుమాటలు గలది-కృష్ణుఁడు గోపస్త్రీలమర్మము తెలియఁగోరుటకై కపటనిద్ర వోవఁగా నిజముగా నతఁడు నిద్రించె నని ఆతని గుఱించి గొల్లకన్నియలు ఒండొరులతో విలాసముతో నింపుగులుకుమాటలాడుకొనుచు రనుట; అట్లు తనపుఁ దెలియదని తలంచి వా రాడుకొనుమాటలు వినుటచే, 'స్తోక...స్మితమ్-స్తోకస్తోక=కొంచెము కొంచెముగా, నిరుధ్యమాన=అడ్డగింపఁబడుచున్నదియు, కావుననే, మృదుల=కోమలముగా-మెల్లగా, ప్రస్యన్ది = పిక్కటిలుచున్నదియు, అగు, మన్దస్మితమ్ = చిఱునవ్వుగలది-ఇది మిథ్యాస్వాపమునకు విశేషణము- వా రాడుకొను మాటలు విని నవ్వు పిక్కటిలఁగా దానినివెలు వడకుండునట్లు కొంతకొంత లోపల నాఁగుచున్నాఁడనుట; ఆజల్పితములు 'శ్రోత్రమనోహర'ములును 'లీలా'ప్రయుక్తములు నగుటచే, ప్రేమా...ద్గమమ్ - ప్రేమ = వలపుయొక్క, ఉద్భేద=ఆవిర్భావముచేత, నిర్గళ=అడ్డములేనట్టుగా, ప్రస్మర=దేహమెల్ల వ్యాపించుచున్నట్టియు, కావుననే, ప్రవ్యక్త=మిక్కిలి స్పష్టముగాఁ దెలియునదియు, అగు, రోమ ఉద్గమమ్=వెండ్రుకలు నిట్టవొడుచుట - గగుర్పాటుగలదియు - ఇదియు మిథ్యాస్వాపవిశేషణము. వారి లీలాప్రయుక్తములైన శ్రుతిమనోహరజల్పితములను వినుటచే మరులుపుట్టి మేనెల్ల గగుర్పొడిచెననుట. ఇట్టిమిథ్యాస్వాపమును, ఉపాసించుచున్నామని యన్వయము. 'మిథః' అనుట మందస్మితమునకును, 'లీలా' అనుట రోమోద్గమమునకును హేతువు లని తెలియునది.

చ. వలపులు గుల్కు గోపిక లర్కవారణ నొండొరులతోడ నాడుమా
టలఁ జెవి కింపుగా వినఁ దొరకఁగి తనర్చినమందహాసముం
బలుమఱు నాఁగి మేను గరుర్పాటుఁగ నూరక కన్నుమోడ్చు న
జ్జలరుహపత్రనేత్రునియకసత్యపునిద్దుర కేను మ్రొక్కెదన్. 21

తా. తాను వేడుకకొఱకు నిదురించువానివలె కన్నులు మూసికొనియుండఁగా, గొల్లయిల్లాండ్రు వీనులవిందుగా నొకరితో నొకరు మాటాడుకొను విలాసంపుఁబలుకులు వినుచును, దానిచేఁ దనకు పిక్కటిల్లిన వెడనవ్వును వారికిఁ దెలియకుండునట్లు కొంచెముకొంచెముగా లోపల నాఁగుచును, నాగమాటలవినుటకు మరులుకొని మేనెల్ల దట్టము

గా గగురుపొడువఁగా, వెడఁగుచూపు భగవంతుం డగుబాలకృష్ణునియూకపటనిద్రను ఉపాసించెదము.

శ్లో॥ విచిత్రపత్రాఙ్కురశాలిబాలా
స్తనా న్తరం మానిమనో న్తరం వా।
అపాస్య బృన్దావనపాదపాస్య
ముపాస్య మన్యం న్న విలోకయామః॥ 22

టీ. విచిత్ర... స్తనా న్తరం వా-విచిత్ర=నానావిధములైన, పత్రాఙ్కుర = మకరికాపత్రవిశేషములచేత, శాలి=ఒప్పుచున్న, బాల = లేఁబ్రాయపు కన్నియలయొక్క, స్తన=చన్నులయొక్క, అ న్తరంవా = మధ్యప్రదేశమునుగాని, మాని...తరం వా-మాని= మానులయొక్క, మనః = మనస్సులయొక్క, అ న్తరం వా = మధ్యప్రదేశమును గాని, బృ న్దా... స్యమ్-బృ న్దావన=బృందావనమందలి, పాదప=వృక్షములయొక్క, ఆస్యం= ముఖప్రదేశమును గాని, అపాస్య=విడిచి-ఈ చెప్పఁబడిన మూఁడుస్థానములను విడిచిన యెడల, ఉపాస్యం=(కృష్ణుని కనుఁగొనుటకై మనకు) పొందగినదానిని-లేక, (కృష్ణుఁడు వసించుస్థానముగా మనకు) గొగవింపఁదగినదానిని, అన్యత్=మఱియొకదానిని, నవిలోకయామః=చూడము-ఈమూఁడుచోట్లనుదప్ప మఱొకచోటఁ గృష్ణునిఁ జూడఁజాల మని యర్థము. విచిత్రపత్రాంకురములచే మనోహరములును, లేఁబ్రాయమును చేమోహాకరములును అగుటచేబాలా స్తనములందును, నిరంతరధ్యానవిలసితము లగుటచే మానిమనంబులందును, అవతారప్రయుక్తమైన గోరక్షణవ్యాపారముచే బృందావనపాదపములంగును కృష్ణుఁడు గనఁబడుచున్నాఁడని యాశయము. ఏమియు నెఱుఁగని బాలల స్తనము లెక్కడ! అప్రాకృతవిషయములను దెలియు మానులమనము లెక్కడ! మిక్కిలి సామాన్య మగు నిట్టి స్థానమునందును మహోత్కృష్టమైన యట్టిస్థానమునందును సరిగాఁ గనఁబడునట్టి యీ లీలావైచిత్ర్యము నిరతిశయ మైన దని భావము. బాలా స్తనాంతరమునఁ గానఁబడుట సౌలభ్యమునకు సీమ; మానిమనోంతరమునఁ గానఁబడుట పరత్వమునకు కాష్ఠ.

చ. లలితవిచిత్రపత్రమహితశ్రీకుచపాళిఁ గళిందజావన
స్థలలవలీలతాగృహావిశ్రతర్ధికలుక్ మునిమానసాబ్జముల్
జలరుహపత్రనేత్రుని విశాలానివాసము లిందుఁ దక్క నే
నెలవున నైనఁ గన్గొనఁగ నేర్తుమె ధూర్తశిఖావతంసునిన్. 22

తా. మకరికాపత్రాదులచే సొగసైన లేఁబ్రాయపుఁగన్నెలపూపచన్నులనడుమను, మానులహృదయములనడుమను, బృందావనవృక్షములముంగలను దప్ప మఱియొకచోటఁ గృష్ణునిఁజూడలేము.

అవ. ఇట్లు హృదయంబునం బొడసూపిన శ్రీకృష్ణమూర్తిని కన్ను లారం గనుంగొనవలయు నని ప్రార్థించుచున్నాఁడు.

శ్లో॥ సార్ధం సమృద్ధై రమృతాయమానై
రాధ్మాయమానై ర్మురళీనినాదైః ।
మూర్ధాభిషిక్తం మధురాకృతీనాం
బాలం కదా నామ విలోకయిష్యే ॥ 23

టీ. ఆధ్మాయమానైః=తన చేనూఁదంబడుచున్నవియు, కొవృనన్, సమృద్ధైః=పరిపూర్ణము లైనవియు-సర్వగుణసంపన్నము లైనవి యనుట, కొవృనన్, అమృతాయమానైః=అమృతమువలె నాచరించుచున్నవియు-అత్యంతభోగ్యము లైనవి యనుట, అగు, మురళీనినాదైః సార్ధమ్=వేణుధ్వనులతోఁగూడ - మిక్కిలి శ్రావ్యముగా వేణువు ననేకవిధస్వరములచే నూఁదుచున్నవాఁడై యనుట, మధు॰ ఆకృతీనాం = సుందరమైన ఆకారము గలవారలలోపల, మూర్ధాభిషిక్తమ్=పట్టాభిషిక్తుఁడైన-అత్యంత శ్రేష్ఠుఁడైన యనుట, బాలం=బాలుని, కదానామ = ఎప్పుడు, విలోకయిష్యే = చూడఁగలనో-వీనులవిందు లైన వేణుధ్వనులు సేయుచు కన్నులవిం దైన యతిసుందరాకృతితో నా కెప్పుడు కనఁబడునో యనుట.

ఉ. చక్కనివారి నెల్ల నెకసక్కెము లాడెడుచక్కనయ్య యై
చొక్కుచుం దానమానలయసంశోభితగానరసామృతంబు న
ల్దిక్కులం బిక్కటిల్ల మురళిం బలికించెడిబాలు నెన్నఁడో
గ్రక్కునఁ గాంచి యెత్తికొని కన్నుల నొక్కుదుఁ దత్పదాబ్జముల్.

తా. రంజించుటవలయు సకలగుణంబులు నిండి యమృతమువలె అతిభోగ్యముగా నుండు నాదములు సెలంగ పిల్లఁగ్రోవి నూఁదుచు, చక్కనివారికెల్లఁ దలమిన్నయై యొప్పు చిన్ని బాలుని కృష్ణుని నే నెప్పుడు గాంతునో.

శ్లో॥ శిశిరీకురుతే కదాను నః, శిఖిపింఛాభరణ శ్శిశు ర్దృశోః ।
యుగళం విగళన్మధుద్రవస్మిత, ముద్రామృదునా ముఖేన్దునా॥ 24

టీ. శిఖి—రణః-శిఖిపింఛ = నెమిలిపురిని, ఆభరణః = భూషణముగాఁ గలవారిడైన, శిశుః=బాలుఁడు-చిన్నికృష్ణుఁడు, విగళ...దునా-విగళత్=మిక్కిలి కాఱుచున్నట్టి మధుద్రవ=తేనియయనుద్రవముగల - తేనియలుగాఱునట్లు తీయనైన యనుట, స్మిత = చిఱునగవుయొక్క, ముద్రా=ముద్రచేత-అచ్చొత్తినట్లు పీడపన్న చిఱునవ్వు చేత ననుట, మృదునా = కోమలమైన - మఱింత చల్లనైన యనుట, ముఖ ఇందునా=మోముచంద్రుని

రుని చేత, నః=మాయొక్క, దృశోః=నేత్రములయొక్క, యుగళం=దోయిని, కదాను= ఎప్పుడును, శిశిరీకురుతే=చల్లగాఁ జేయుచున్నాఁడు-కన్నులు చల్లగా కనఁబడుట యెప్పుడో యని యర్థము. స్మితము విగళన్మధుద్రవము గావుననే ముఖేందువును మృదువుఁ గావించినది. చంద్రుఁడు సహజముగా చల్లనివాఁ డయ్యు వెన్నెలగాయునపుడు మఱింత సుఖముగా చల్లఁదనము గూర్చునట్లు ముఖచంద్రుఁడును సహజశీతలుఁడయ్యుఁ జిఱునవ్వు నలువునపుడు మఱింతహాయిగా చలువ దొలుకు నని యాశయము. కేవల 'ముఖ'మునక కేవల 'స్మిత' మును జెప్పక 'ముఖేందు' వునను 'స్మితముద్ర'ను జెప్పుటచే, చంద్రునికి వెన్నెలవలె సుఖమునకు స్మితము 'ముద్ర' గా అనఁగా ఎడతెగని గుఱుతుగా, నున్న దను సారస్యము వ్యంజిత మగుచున్నది. ముఖేందువు మృదు వగుట యనఁగా అది మఱింతసుకుమార మైన చల్లఁదనము గలిగియుండుట యని భావము. దాని చేమఱింత సుఖప్రద మగుటయు నూహ్యము.

మ. తళుకుంగన్నులచూపుకోపు సుధఁ జిం్రదన్ మందహాసంబు వె
   న్నెలనిగ్గుల్ వెదచల్ల నెమ్మిఁ బురివిచ్చన్నెల్ చిన్నెలై మిఱుఱ ని
   ర్మలవక్త్రేందుకళావిలాసమునఁ జేరన్ వచ్చి కందోయి శీ
   తలముం జేయుఁగ నందనందనుని నాకెన్నం గాంచు టెం కెన్నఁడో!

తా. నెమిలిపురిని దల ముందుఁ జెరువుకొని, తేనె లొలుకు తీయని చిఱునవ్వుఁ గుఱుతువలె గిలికొనుటచే మఱింత చల్లఁదనంపుసొంపు గులుకు మొగముచందురునితో బాలుండగు చిన్నిగోపాలుఁడు నాకన్నుఁగవను జల్లఁజేయుట యెన్నఁడో.

శ్లో॥ కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన
   తారుణ్యసంవలితశైశవవైభవేన ।
   అపుష్ణతా భువన మద్భుతవిభ్రమేణ
   శ్రీకృష్ణచన్ద్ర శిశిరీకురు లోచనం మే ॥ 25

టీ. కారు...క్షణేన-కారుణ్య=కరుణచేత, కర్బుర=చిత్రవర్ణముగలదియైన-ఇచట కర్బురశబ్దము మేళనమాత్రపరముగాన కరుణతోఁ గూడుకొన్న, కటాక్ష = కడగంటి యొక్క, నిరీక్షణేన=చూపులుగలదియు, అద్భుతవిభ్రమేణ - అద్భుత=(మనుష్యులకును అందును బాలకులకును అతిమాత్రములైనవి గావున) ఆశ్చర్యకరములైనట్టి, విభ్రమేణ= (సౌందర్యశౌర్యాదులయొక్క) విలాసములు గలదియు, ఇట్టివిలాసములచేత, భువనమ్= జగత్తును, అపుష్ణతా = తడుపుచున్నదియు-లేక, నిండించుచున్నదియు - జగత్తునం దెల్ల యెడలను సౌందర్య శౌర్య ధైర్యాది విభ్రమములు నెఱపునదియు ననుట - 'అపుష్ణతా అను పాఠమున ఇట్టి విభ్రమములచే దుష్టశిక్షణ శిష్టరక్షణములు సేసి జగంబు నెల్ల

బ్రోచుచున్నదియు ననుట, అగు, తారు...వైభవేన-తారుణ్య=యౌవనముతోడ, సంవలిత=కూడుకొన్న, శైశవ=బాల్యముయొక్క, వైభవేన = సంపదచేత, శ్రీకృష్ణచంద్ర = శ్రీకృష్ణుఁడనెడి చంద్రుఁడా-చంద్రునివలెఁ జల్లనైన శ్రీకృష్ణా యనుట, మే=నాయొక్క లోచనం=నేత్రమును, శిశిరీకురు=చల్లగాఁ జేయుము. ఇచటఁ గృష్ణునికి బాల్యయౌవన సంధి చెప్పఁబడినది. 'శైశవవైభవేన' అనుటచే పరిపూర్ణబాల్యమును యౌవనలేశమును స్ఫురించెడిని. యౌవన మిప్పుడే స్పృశించినది; అద్భుతవిభ్రమములలో జగమెల్ల నిండినది అని భావము.

శా. కూడిం గూడనిప్రాయపున్సొగసు సొక్కుల్ నిక్కి కై పెక్కుఁగా
నీడుం జోడును లేనివీక్షణసుధావృష్టిన్ జగత్పుష్టికిం
దోడున్ నీ డగుగోకులాంబునిధిచంద్రుం గాంతిసాంద్రుం దమిం
జూడం జూడఁగ దృక్చకోరికలు గాంచున్ సంతతానందమున్. 25

తా. కరుణారసమొలుకు కడగంటిచూపులుగలిగి, లోకంబునంతయునద్భుతములైన నిజవిలాసములచేఁ బోషించుచు, యౌవనంబులోఁ గూడినబాల్యంబు పొలుపుచూప, ఏపారునో కృష్ణా! చంద్రునివలె నాకన్నులు చల్లఁగాజేయుచు నాకుం గనబడుమా.

శ్లో॥ కదా వా కాళిన్దీకువలయదళశ్యామలతరాః
కటాక్షా లక్ష్యన్తే కిమపి కరుణావీచినిచితాః ।
కదా వా కన్దర్పప్రతిభటజటాచన్ద్రశిశిరాః
కిమప్యన్తస్తోషం దదతి మురళీకేళినినదాః ॥

టీ. కాళిన్ది...తరాః-కాళిన్ది = యమునయందలి, కువలయ=నల్లగలువలయొక్క, దళ= రేకులవలె, శ్యామలతరాః = మిక్కిలినల్లనివియు, కిమపి = చెప్పనలవిగానట్లు, కరుణా...చితాః-కరుణా = కృపారసముయొక్క, వీచి = అలలచేత-ఇట అలలచే ఎడతెగనివరుస గ్రాహ్యము గాన పయిపయి నెడతెగక పొడముచున్న కరుణారసముచేత ననుట, నిచితాః = వ్యాప్తములైనవియు-కటాక్షములందు వ్యాపించుసౌకర్యముకొఱకు కరుణాశబ్దమునకు 'వీచి' కూర్పఁబడినది- మీఁదుమిక్కిలి కరుణచే ప్రేరితములైనవి యనుట, అగు, కటాక్షాః = కడగంటిచూపులు, కదావా = ఎప్పుడు, లక్ష్యన్తే= చూడఁబడునో, కన్ద...శిశిరాః-కన్దర్ప = మన్మథునికి, ప్రతిభట=శత్రువైన శివునియొక్క, జటా = జడలయందలి,చన్ద్ర=చంద్రునివలె, శిశిరాః=చల్లనివైన-చల్లఁదనముచే ఆహ్లాదకరములైనవి యగు, మురళీ...నినదాః-మురళీ = పిల్లఁగ్రోవియొక్క, కేళి=క్రీడార్థమైన, నినదాః= ధ్వనులు-విలాసార్థముగా చేయఁబడు వేణుధ్వనులు, కిమపి=చెప్పనలవికానట్లు, అన్తః తోషమ్ = లోపలిసంతోషమును- అంతఃకరణముయొక్క సంతుష్టిని, కదావా=ఎప్పుడు, దదతి=ఇచ్చునో. ఇట కేవల 'కువలయ' ము

లనక 'కాళిందీకువలయ'ము లనుటచే కటాక్షములు శ్యామలతరము లగుట యేర్పడి నది. అనఁగా కువలయములే నల్లనివి; అందును నల్లనైన కాళిందీనదియందు మొలచిన కువలయములు మఱింత నల్లనివి. అట్టివానిం బోలినకటాక్షములు 'శ్యామలతరాః' మిక్కిలి నల్లని వని యాశయము. ఇట్లే కేవల 'చంద్రు' నిం జెప్పక 'కన్దర్పప్రతిభట' జట' లయందలి చంద్రుని జెప్పుటచే మురళీనినదములయొక్క శిశిరత్వాతిశయము దెలి యుచున్నది. అనఁగా చంద్రుఁడే సహజముగా చల్లనివాఁడు. అందు గంగానదిజల ములు నిరంతరము నెలకొనియుండు శివునిజడలయందలి చంద్రుఁడో మఱియు చల్లని వాఁడు అట్టిచంద్రునిఁ బోలిన మురళీనినదముల చల్లఁదనము-అనఁగా ఆహ్లాదకరత్వము, మిక్కిలి యగుననిభావము. 'కేళినినదాః' అనుచో కేళిశబ్దము అనినదముల శిశిరత్వము నకును విలాసమును గూర్చుచున్నది.

ఉ. ఎన్నఁడొ యామునోత్పలసితేతరలోలదయార్ద్రదృగ్విలా
సోన్నతి నాపయిన్ నిగిడియుండుట శంభుజటాటవీతటా
సన్నసుధాంశుశీతలలసన్మురళీనినదామృతంబుచే
వెన్నుఁడు నాదువీనులకు విం దొనరింపఁ దలంచు టెన్నఁడో. 26

తా. యమునానదియందలి నల్లగలువరేకులవలె మిక్కిలినల్లనై, పయింబయి తరఁగలుగాఁ గరుణారసముచే నిగుడింపఁబడుచున్న కడగంటిచూడ్కులను ఎప్పుడు గాంతునో! శివుని జడయందలి చంద్రునివలెఁ జల్లగానున్న వేణువినోదధ్వనులు నామనంబునకు నెప్పుడు మిక్కిలి సంతోషముఁ గూర్చునో.

శ్లో॥ అధీర మాలోకిత మార్ద్రజల్పితం, గతంచ గమ్భీరవిలాసమన్థరమ్
అమన్ద మాలిఙ్గిత మాకులోన్మద, స్మితం చ తే నాథ వదన్తి గోపికాః॥

టీ. హే నాథ=ఓయేలికా, గోపికాః=గోపస్త్రీలు, తే=నీయొక్క, అధీరమ్=ధీరముకానిదైన - బెళుకైనయనుట, ఆలోకితం=చూచుటను; ఆర్ద్రజల్పితమ్-ఆర్ద్ర సరసమైన, జల్పితమ్=మాటాడుటను, గమ్భీ... రమ్-గమ్భీర=తెలియరాని - లేక గరువముతోఁగూడిన, విలాస=ఒయ్యారముచేత, మన్థరమ్=బరువైనట్టి - మిక్కిలి యొయ్యారము గలదైన అనుట, గతంచ=నడకను; అమన్దమ్=గాఢమైన- ఆలిఙ్గితమ్= కాఁగిలించుటను; ఆకులోన్మదస్మితం-ఆకుల=వ్యాప్తమైనదియు, ఉన్మద=మిక్కిలి మదముతోఁ గూడినదియు-లేక, మదము-మరులు గొలుపునది యనుట, అగు, స్మితం= నవ్వును-ఒలసి మన్మథావేశముఁ బుట్టించునవ్వు ననుట; వదన్తి=చెప్పుదురు. ఇట మొదట చూపును, పిదప వరుసగా మాటలును, నడకయు, కాఁగిలియుఁ జెప్పఁబడినవి. కాఁబట్టి, బెళుకుఁజూపులఁజూచి, చిఱునవ్వు దొలుకఁబలుకుచు, మురిపంపునడతో వచ్చి, బిగియారంగాఁగిలించుక్రమమును తదనుభవధన్యలగుగోపకన్యలు చెప్పిరని తెలియుచున్నది.

ఉ. అందము గుల్కు నీముఖసరోజము మాటలు తేనెసోనలం
జిందు మృదుస్మితంబు సుధఁ జిందుఁ గటాక్షములార మించుచున్
విందులు కౌఁగిలింత కనువింత యటంచును గోపకాంత లా
నందముతోడఁ బల్కుదురు నాథ భవన్మహిమానుభావముల్. 27

తా. ఓ ప్రభూ! గొల్లచెలువలు నీముఖము అతిచపలముగను, మాటలు సొంపైనవిగను, నవ్వు మిక్కిలి వెన్నెలలుగలదిగాను, కౌగిలింత మిక్కిలి నిబ్బరమైనదిగాను, చిఱునవ్వు తేనియతేటలు చిలికించునదిగాను జెప్పుదురు.

శ్లో॥ అస్తోకస్మితభర మాయతాయతాక్షం
నిశ్శేష స్తనమృదితం వ్రజాఙ్గనాభిః।
నిస్సీమ స్తబకితనీలకాన్తిధారం
దృశ్యాసం త్రిభువనసున్దరం మహస్తే॥ 28

టీ. అస్తోక...భరం-అస్తోక = అల్పముకాని-మిక్కిలిసొంపైన, స్మిత = చిఱునవ్వుయొక్క, భరం = భారముగలదియు-చిఱునవ్వు మిక్కిలియుఁ గలది యనుట, ఆయ...క్షమ్-ఆయత ఆయత = మిక్కిలివెడలుపులైన, అక్షం = కన్నులుగలదియు, వ్రజ అఙ్గనాభిః = గొల్లపడఁతులచేత, నిశ్శే...దితమ్-నిశ్శేషమ్ యథాతథా = మిగుల లేకుండ నల్లు-పరిపూర్ణముగా ననుట, స్తన = చన్నులచేత, లేక-నిశ్శేష స్తన = చన్నులంతటిచేతను-చన్నులకొలఁదిని అనుట, మృదితం = నలుపఁబడినదియు-నిశ్శేషశబ్దముచే బహుగోపికల కుచాశ్లేషము సూచితమగుచున్నది; 'మృదితమ్' అనుటచే వారికౌఁగిలిబిగియు స్తనములపీనత్వము ధ్వనించెనని; మఱియు, నిస్సీమ...ధారం-నిస్సీమం యథాతథా = మేరలేనట్టుగా-మితిమీఱినట్లుగా, స్తబకిత = గుత్తులు గలదిగాఁ జేయఁబడిన-గుత్తులవలె గుబురుకొన్నయనుట, నీల = నల్లని, కాన్తి = కాంతులయొక్క, ధారం = ధారలు గలదియు-మితిమీఱినట్టు దట్టముగా గుబురుకొన్న నల్లనికాంతిప్రసారములు గలది యనుట, త్రిభువనసున్దరమ్ = ముల్లోకములయందును మిక్కిలిసుందరమైనదియు, అగు, తే = నీయొక్క, మహః = తేజస్సు-తేజోమయమైన విగ్రహమనుట, దృశ్యాసం = చూతునుగాత, స్మితమో అస్తోకము, అక్షిణో ఆయతాయతము; స్తనమృదితత్వమో నిశ్శేషము; నీలకాన్తిధారయో నిస్సీమ స్తబకితము; ఏదిచూచినను మిక్కిలికొలఁదికి మీఱియున్నది; కావుననే నీమహస్సు త్రిభువనసుందరమైనదని భావము.

ఉ. మబ్బుజిగిన్ నగం దగునమంచితకోమలనీలదేహమున్
గుబ్బుమిటారిచన్గవలకొద్దిని వ్రేతలు కౌఁగిలింపఁగా

నుబ్బుచు మందహాసరుచి  యొప్పఁగ గొప్పగుకన్నుదోయిచే
నబ్బుర మైనచక్కనివయోభరయారపుఁదేజముఁ గాంచెదన్ మదిన్. 28

తా. అతిశయం బగుచిఱునవ్వును మిక్కిలివిశాలము లయిన కన్నులును గలిగి గొల్లయిల్లాండ్రు గిబ్బిగుబ్బలను గ్రుమ్మటచే ఎంతయు నలంగి, నెమ్మేను నిగనిగలాడు నల్లనికాంతులు నిగుడింపఁగా, ముల్లోకములందును మిక్కిలిసుందరమై తేజస్సు దొలుకు శ్రీదివ్యమంగళవిగ్రహమును జూచెదఁగాక.

శ్లో॥ మయి ప్రసాదం మధురైః కటాక్షై, ర్వంశీనినాదానుచరై ర్విధేహి।
త్వయి ప్రసన్నే కి మిహాపరై ర్న, స్త్వయ్యప్రసన్నే కిమి హాపరై ర్నః॥

టీ. వంశీ...చరైః—వంశీ=వేణువుయొక్క, నినాద=ధ్వనికి, అనుచరైః=అనుసరించునవియు-దానిస్వరములకు అనురూపముగా తిరుగునవి యనుటు, మధురైః=మనోహరములైనవియు, అగు, కటాక్షైః=కడగంటిచూపులచేత, మయి=నాయందు, ప్రసాదం=అనుగ్రహమును, విధేహి=చేయుము. త్వయి = నీవు-సృష్టిస్థితిలయకర్త వైననీవు, ప్రసన్నే సతి=ప్రసన్నుఁడవు అగుచుండఁగా, ఇహ = ఈలోకమునందు, అపరైః = ఇతరులతోడ, నః=మాకు, కిం=ఏమిప్రయోజనము? త్వయి=నీవు, అప్రసన్నే సతి=ప్రసన్నుండవు గాకుండఁగా, ఇహ=ఈలోకమందు, అపరైః=ఇతరులతోడ, కిం=ఏమిప్రయోజనము? నీవుప్రసన్నుండవైతివేని అంతటితో నేను కృతార్థుండనైతిని గాన ఈలోకమందు మఱియొకరిదయ నాకక్కఱలేదు. నీవు ప్రసన్నుండవుకావేని ఇందుమఱెవ్వరివలనను నేను కృతార్థుఁడఁ గా నేరను. కావున అప్పుడును మఱెవ్వరిదయయును నాకక్కఱలేదు. ఇట్లు నీవు ప్రసన్నుండవైననుగాని కాకపోయిననుగాని యింకెవరివలనను నాకుఁ బ్రయోజనము లేదు. ఏప్రయోజనమైనను మంచిదిగాని చెడ్డదిగాని నీవొక్కనివలననే కలుగవలయును. కావున నేను గోరెడియొకమంచిప్రయోజనమును నాకుఁ జేయుము. అది మఱేమియుఁ గాదు. పిల్లనగ్రోవి యూదునపుడు దాని స్వరములకు అనురూపముగా గిలువు నీసొగసుంగడగంటిచూపులను జూడఁగోరెద. అట్టిచూపులతో నన్ననుగ్రహింపుము అని తాత్పర్యము.

ఉ. నీవు ప్రసన్నదృష్టిఁ గరుణించిన నాగుణ మెట్టిదేనియుం
బావన మౌను నీకృపకుఁ బాత్రము గాక చరించువేళ నన్
గావఁగఁ జాల రెవ్వరును గావున వేణురవానుసారిలీ
లావహ మౌకటాక్షమున లాలనఁ జేయుము నందనందనా. 29

తాత్పర్యము సుగమము.

శ్లో॥ నిబద్ధమూర్ధాఞ్జలి రేష యాచే, నీరన్ధ్రదైన్యోన్నతముక్తకణ్ఠమ్।
దయామ్బుధే దేవ భవత్కటాక్ష, దాక్షిణ్యలేశేన సకృ న్నిషిఞ్చ॥

టీ. హే దయ అమ్బుధే = ఓ కృపాసముద్రుఁడా-మిక్కిలి కృపాతిశయము కలవాఁడా, హే దేవ = ఓ దేవా-సృష్టిస్థితిలయాదిక్రీడల సలుపువాఁడా యనుట, ఏషః = ఈ నేను, నిబ...జలిః-నిబద్ధ = కూర్పఁబడిన, ముగ్ధ = బేలతనముగల, అఞ్జలిః సన్ = కేలుమోడ్పుగలవాఁడ నగుచు, నిర...ణ్ఠమ్ -నిరంధ్ర = దట్టమైన, దైన్య = దీనత్వముచేత, ముక్త = విడువఁబడిన-బిగ్గఱయైన కణ్ఠమ్ యథా తథా = సత్తుక కలుగునట్లుగా - గొంతుబిగ్గఱగా నెత్తి వావిడిచియనుట, యాచే = యాచించుచున్నాను, యాచించుట దేనిని అనఁగాఁ జెప్పుచున్నాఁడు, భవత్ = నీయొక్క, కటాక్ష = కడగన్నులయొక్క, వానిచూపులయొక్క, దాక్షిణ్య = దానముయొక్క, లేశేన = కొంచెముచేత-కొంత నీకడగంటిచూపు నాపయి నిగుడ్చుటచేత ననుట, లేక-దాక్షిణ్య = మోమోటముయొక్క, లేశేన = కొంచెముచేత- నీకడగంటిచూపులయొక్క స్వల్పదాక్షిణ్యముచేత ననుట-నీకన్నోఁటచేత నని యర్థము, సకృత్ = ఒకమాఱు, నిషిఞ్చ = తడుపుము. నీవు ఇంచుక మోమోట ముంచి నీకడగంటితోఁ జూడుము. అదియె నాకుఁ గనకాభిషేకము అని భావము.

ఉ. వేసటఁ గేలు మోడ్చి నిను వేఁడెద నే నెలుఁగెత్తి యిత్తఱిన్
నా మొఱ యాలకింపు కరుణానిధి దీనశరణ్య సంతతో
ద్దామభవత్కృపారససుధామధురాబ్ధితరంగపాళిలో
నేమికొ అంత నాపయి నొకించుక సించిన నందనందనా! 30

తా. ఓదయానిధీ! కృష్ణస్వామీ! నేను నేర్చి నేరనియీబేలయంజలిని కూర్చి పేర్చినదీనత్వమున గొంతు బిగ్గఱగా నెత్తి ఒకటి యాచించుచున్నాను. అది మఱేమి నీకుఁ గష్టముగాదు. ఒక్కింత కృపారసముతో నీవు నన్ను నొకమాఱు కడగంటఁజూడుము. ఈయల్పమె నాకుఁ జాలు నేను జరితార్థుండ నయ్యెద.

శ్లో॥ పిఞ్ఛావతంసరచనోచితకేశపాశే
పీనస్తనీనయనపఙ్కజపూజనీయే
చన్ద్రారవిన్దవిజయోద్యతవక్త్రబిమ్బే
చాపల్యమేతి నయనం తవ శైశవే నః॥ 31

టీ. పిఞ్ఛా...పాశే-పిఞ్ఛ = నెమిలిపురియనెడి, అవతంస = భూషణముయొక్క, రచన = అలంకారక్రియచే - చెరువుటయు, ఉచిత = తగిన, కేశపాశే = సిగగలదియు, పీన...జనీయే-పీనస్తనీ = గబ్బిగుబ్బలాండ్రయొక్క, నయన = కన్నులనియెడి, పఙ్కజ = తామరలచేత-లేక తామరఱేకులవంటి కన్నులచేత, పూజనీయే = పూజింపందగినదియు వారికి మిక్కిలి మాటికిఁ జూడందగినట్టి సౌందర్యముగలదియనుట, చన్ద్రా...బిమ్బే-చన్ద్ర = చంద్రుని, అరవిన్ద = తామరలను, విజయ = జయించుటయందు, ఉద్యత = పూనియున్న వక్త్రబిమ్బే = ముఖమండలము గలదియు, అగు, తవ = నీయొక్క, శైశవే = బాల్యమందు,

నః=మాయొక్క, నయనం=నేత్రము, చాపల్యం=చపలత్వమును, ఏతి=పొందుచున్నది. 'పీన స్తని' అనుటచే పూర్ణయౌవనమును మన్మథపారవశ్యమును సూచితములు. వయసో కేవల 'శైశవ' ము. దాని సౌందర్యమహిమమో మంచి యౌవనవతులకుఁగూడ మరులుగొలుపుచున్నదని యాశయము. అరవిందములను వానిని అడంచుచంద్రునిని మొగముచే గెలువఁ జాలిన శైశవమును కేవలపంకజములచే పూజించుట విరసము. పీన స్తనుల నయిన పంకజములచేతనే పూజింపఁదగు నని సారస్యము.

మ. పొగరున్నిబ్బెపుగుబ్బ లుబ్బఁగఁ దమిం గ్రొంబోఁడ్లు గందోయిఁ ద
మ్మిగమిం బూజ లొనర్ప నెమ్మి పురిక్రొక్కమ్మించుల్ సిగన్ దట్టమై
నిగుడం జందురుఁ జౌక సేయుముఖకాంతిన్ వింత యై యొప్పునీ
సొగసుం బ్రాయముఁజూచి నా నయనముల్ సొంపొందఁగాఁ గోరెడిన్.

తా. నెమిలిపురిని జెరవుటకు అనువుగాముడిచినసిగ గలిగి,గబ్బిగుబ్బలాండ్రచేత మిక్కిలియు చూడఁదగి, చందురునిని దామరను గెలువజాలిన ముఖబింబముతోఁగూడి, మురువుఁ జూపుచున్న నీ బాల్యమును చూచుటకు మాకన్నులు ఆసపడుచున్నవి.

శ్లో॥ త్వచ్ఛైశవం త్రిభువనాద్భుత మిత్యవైమి
యచ్చాపలంచ మమ వాగవివాదగమ్యమ్ ।
తత్కిం కరోమి విరణన్మురళీవిలాస
ముగ్ధం ముఖాంబుజ ముదీక్షితు మీక్షణాభ్యామ్॥ 32

టీ. యత్=ఎందుచేత, త్వత్ శైశవం=నీ బాల్యమును, త్రిభువన అద్భుతమ్-త్రిభువనః=మూఁడులోకములకును,అద్భుతమ్=ఆశ్చర్యమైనది-ముల్లోకంబులయందుసాటి లేనిది అనుట, ఇతి=అని, అవైమి=ఎఱుఁగుదునో, మమ=నాయొక్క, చాపలం=ఆశయును - నీశైశవమును చూడఁగోరెడి ఆశయును అనుట, వాక్ అవివాదగమ్యమ్ - వాక్=వాక్కులకు, అవివాదగమ్యమ్=వివాదముచే పొందఁదగినదికానిది. వాక్కులయొక్క చర్చకు విషయముకానిదనుట-వాక్కులచే ఇట్టిదట్టిదని వర్ణింపరానిదని భావము, ఇతి=అనియు, అవైమి=ఎఱుఁగుదునో, తత్=అందుచేత-శైశవము త్రిభువనాద్భుతమనియు నాచాపలము వాగవివాదగమ్యమనియు నే నెఱిఁగియుండుట కారణముచేత ననుట, 'యత్' 'తత్' ఇచట హేతువాచకములు; విర...ముగ్ధమ్-విరణత్=మిక్కిలి మ్రోయుచున్న, మురళీ=వేణువుయొక్క-వేణుగానముయొక్క అనుట,విలాస=విభ్రమముచేత, ముగ్ధ=సుందరమైన, ముఖ అమ్బుజమ్ = మోముదామరను-తామరవంటి నీమొగమును, ఈక్షణాభ్యామ్=నాకన్నుదోయిచేత,ఉదీక్షితుమ్ = చూచుటకొఱకు, కిం=ఏమి, కరోమి=చేయుదును. నీశైశవమో మూఁడులోకములం దెచ్చటను సాటిలేని సౌందర్యము గలదిగాన ముల్లోకములకును ఆశ్చర్యమైనదిగా నున్నది. కావున అట్టి

దానిని ముల్లోకములందును చూచుట అరిది. దానిని చూడఁగోరు నాచాపల్యమో ఇట్టిదట్టి దని చెప్పుటయు అరిది నీశైశవమును చూచుట మిక్కిలి కష్టమని యెఱుఁగుదును. కాఁబట్టి చూచుట మానుకొనెదనంటినా నాచాపల్యమును ఓర్చుటకష్టమని ఎఱుఁగుదును. చూచు టయు అశక్యము; చూడకుండుటయు అశక్యము. ఈరెంటిని ఎఱుఁగ కుండినయెడల ఏచింతయు నుండదు; ఎఱిఁగియుండుటచేతనే నీ ముఖాంబుజమును చూచుటకు ఏమి చేయుదునో యని చింత కలుగుచున్నది. ఏమిచేయుటకును దోఁపకున్నది యని తాత్ప ర్యము. ఇచట శైశవమునే చూడఁగోరినాఁడు గాన శైశవలీలయైన విరణన్మురళీవిలాస ముతోఁ గూడిన ముఖమునే చెప్పినాఁ డని తెలియునది.

మ. పరమాశ్చర్యము నీదు శైశవము చెప్పన్ రాదు లోకంబునన్
వరుసన్ నాచపలత్వ మట్టిద యనిశ్యాచ్యంబు చెప్పింపుమా
మురళీనాదసుధామనోహరముఖాంభోజాత మీకన్నులం
బరిశీలింపఁగఁ గోరినాఁడ సులభంబా తారతమ్యజ్ఞతల్. 32

తా. నీబాల్యము ముల్లోకములకును ఆశ్చర్యమైనదని ఎఱుఁగుదును. నాచాప ల్యము ఇట్టిదని చెప్పరాదనియు ఎఱుఁగుదును. కాఁబట్టియే మురళీగానముచే మురువు గులుకుచున్న నీ ముఖారవిందమును జూచుట కేమి చేయుదునో యని చింతించు చున్నాఁడను.

శ్లో॥ పర్యాచితామృతరసాని పదార్థభఙ్గీ
వల్గూని వల్గితవిశాలవిలోచనాని।
బాల్యాధికాని మదవల్లవభావితాని
భావేలుఠన్తి సుదృశాం తవ జల్పితాని ॥ 33

టీ.పర్యా...సాని, పరి ఆచిత = అంతటనువ్యాప్తములైన, అమృతరసాని = సుధారసముగలవియు-మిక్కిలి యమృతమెలుపునట్టివియు అనుట;పదా...ల్గూని-పదా ర్థ=పదములయొక్కయు అర్థముయొక్కయు, భఙ్గీ=ప్రకారముల చేత, వల్గూని=మనో హరములైనవియు- మనోహరములైన పదములునుఅర్థములును గలవియు అనుట;వల్గి... చనాని-వల్గిత = మిక్కిలి కదల్పఁబడిన-ఇటునటు వేగముగా గిఱపంబడిన,విశాల=వెడఁ దలైన, విలోచనాని=కన్నులు గలవియు; మద...తాని-మద=యౌవనముచే మత్తిలిన, వల్లవ=గోపకుల చేత, భావితాని=అనుసంధింపఁబడినవి యు-యౌవనవంతు లగు గోపకులే, చెప్పఁగూడినవియు అనుట, కావునసే, బాల్య అధికాని-బాల్య=బాలత్వమునకు, అధి కాని=ఎక్కుడైనవియు, బాలురకుఁ జెప్ప నలవికానివి యని అనుట-కృష్ణుఁడు బాలుం డైనను వయసుకొండ్రగు గొల్లలవలెఁ బలుకుననుట, ఇట్టివి అగు, తవ=నీయొక్క, జల్పి తాని=పలుకులు, సుదృశాం = చక్కనికన్నులు గల చెలువలయొక్క లేక గొల్లచెలువల

యొక్క, భావే=మనస్సునందు, ఉత్తి=పొరలుచున్నవి-మీఁదు మిక్కిలి వర్తించుచున్నవి. జల్పితములు అమృతరసమొలుకు ననుటచే తీయనైనవియనియు, పదార్థముల పొందికలచే సొగసైనవనియు, వాలుగన్నులు గిలవుటచేఁగులుకుఁ జూపునవనియు, బాల్యాధికములును మదవల్లవ భావితములు ననుటచే శృంగారరసోద్దీపకములనియుఁ దెలియునది. కావుననే అవి భావమునందు 'ఉత్తి' పొరలుచున్న వనఁబడినవి.

ఉ. కమ్మని తేనియల్ గులుకఁగా వెల దేఱనిమానికమ్ములం
జిమ్ముచు వెళ్ళఁజూపు విలసిల్లఁగ వల్లవభావితమ్ములై
యిమ్ముగు బాల్యరీతి కెనయింపఁగ రానినిజోక్తి బాలికల్
నెమ్మది నెంచి యెంచి తమకై నెక్కొనఁ జేర్చినశౌరిఁ గాంచెదన్. 33

తా. మిక్కిలియమృతరస మొలికించుచు, పదార్థములు పొందికగాఁబచరించుచు, వాలుఁగన్నులు గిలవుచు, వయసుకాంద్రవలె నీవు పలుకుపలుకులు గొల్లచెలువల మనసులందు మిక్కిలి విలసిల్లుచున్నవి.

శ్లో॥ పునః ప్రసన్నేన ముఖేన్దుతేజసా
పురోఽవతీర్ణస్య కృపామహాంబుధేః ।
తదేవ లీలామురళీరవామృతం
సమాధివిఘ్నాయ కదాను మే భవేత్ ॥ 34

టీ. ప్రసన్నేన = మిక్కిలి తేటయైన, ముఖే...జసా - ముఖ ఇన్దు = ముఖచంద్రునియొక్క, తేజసా = కాంతితోడ-చందురునివంటినెమ్మొగము మిక్కిలి కాంతి దొలుకఁగా ననుట, పురః=ముందట, అవతీర్ణస్య=అవతరించినవాఁడైన-పొడసూపినవాఁడైన అనుట, కృపామహాంబుధేః-కృపా=దయారూపమైన, మహాత్ అమ్బుధేః=గొప్ప సముద్రమైన వానియొక్క - అత్యంతకరుణానిధియైన శ్రీకృష్ణునియొక్క, తత్=ఆ—మునుపుసాక్షాత్కరించినపుడు స్ఫురించిన,లీలా...మృతమ్-లీలా=విలాసప్రయుక్తమైన, మురళీ=పిల్లనగ్రోవియొక్క, రవ అమృతమ్ ఏవ=అమృతమువంటిధ్వనియే, సమాధివిఘ్నాయ-సమాధి=సాధ్యానమయొక్క, విఘ్నాయ=భంగముకొఱకు-నాధ్యానమును జెఱుపుటకనుట, పునః=మరల, కదాను=ఎప్పుడు; భవేత్=అగునో, శ్రీకృష్ణుండు నాకుఁగనఁబడునుగాక యని యెప్పుడు నాతని మూర్తిని హృదయమున ధ్యానించుచున్నాఁడను. ఆకృష్ణుఁడు నాప్రోల పొడసూపి తనమురళీధ్వనిచే నాధ్యానమును చెఱిపి నాకన్నుల కఱవు నెప్పుడు తీర్చునో యని భావము. 'కృపామహాంబుధి' యగుటయే 'పురోవతీర్ణుఁ' డగుటకు హేతువు. ఆకృప వెల్లివిరియుట చేతనే 'ముఖేందుతేజస్సు' 'పునః ప్రసన్న'మైనది. మురళీరవము అమృతప్రాయ మగుటచేతనే సమాధివిఘ్నమునకు సమ

ర్థమైన దని యాశయము. ఇదియె మురళీరవ తరళీకృతమునిమానసనళినమ్' అని చెప్పఁబడినది.

ఉ. అందెలు ఘల్లుఘల్లు రన † నాడుచు వేణువునందు గీత మా
నందముతోడఁ బాడుచును † నాఁటి తెఱంగునఁ గన్నుదోయికిన్
విందు ఘటిల్లఁ గట్టెదుట † నిల్చి ప్రసన్నముఖాంబుజంబుతో
నందకుమారుఁ డెన్నఁటికొ నన్ను గనుంగొను నాకునయాధిభంగమున్. 34

తా. చందురినివంటి మొగము మిక్కిలి కాంతులు దొలుకఁగా, దయారసము మిగులఁ దళుకొత్తఁగా, నాముంగల, కృష్ణుఁడు పాడనూపి యమృతమువంటి తన మురళిరవళిచే నాధ్యానమును ఎప్పుడు చెఱుచునో.

శ్లో॥ భావేన ముగ్ధచపలేన విలోకనేన
మన్మానసే కిమపి చాపల ముద్వహన్తమ్ ।
లోలేన లోచనరసాయన మీక్షణేన
లీలాకిశోర ముపగూహితు ముత్సుకోఽస్మి ॥ 35

టీ. భావేన=చేష్టచేతను, ముగ్ధచపలేన-ముగ్ధ=సుందరమైనదియు, చపల=బెళుకైనదియునగు, విలోకనేన=చూపుచేతను, మత్ మానసే=నామనస్సునందు, కిమపి=చెప్పనలవికాని, చాపలం=ఆశను, ఉద్వహన్తమ్=పురికొలుపుచున్నవాఁడును, లోచనరసాయనమ్=కన్నులకు రసాయనమువంటివాఁడును- కన్నులకు మిక్కిలి సుఖప్రదముగా నగపడువాఁడు ననుట, అగు, లీలాకిశోరమ్=లీలా-విలాసార్థమైన, కిశోరమ్=బాలుని-విలాసముకొఱకు బాలుడైనట్టి శ్రీకృష్ణుని, లోలేన=మిక్కిలి ఆసక్తిగల, ఈక్షణేన=చూపుచేత, ఉపగూహితుమ్ = కౌఁగిలించుటకు- చేతులతో అంటి కౌఁగిలించునంత భాగ్యాతిశయము లేకున్నను జూపులతోనైన కౌఁగిలించుటకు, ఉత్సుకః=తమకము గలవాఁడను, అస్మి=అగుచున్నాఁడను, ముగ్ధమగుభావముచేతను చపలమగు విలోకనముచేతను నామనస్సున చాపల్యము గలిగినది. 'లోచనరసాయన' మగుటచే నా ఈక్షణము లోలమైనది; కావుననే నేను ఈక్షణముచే కౌఁగిలించుటకు ఉత్సుకుఁడ నయితి నని యాశయము. మఱియు, 'కిశోరుఁ' డగుటచే కౌఁగిలింపఁగోరితి. అయినను నిజమైనకిశోరుఁడుగాక లీలాకిశోరుఁ డైన పరుఁడగుటచే చేతులతోఁగాక కన్నులతో మాత్రము కౌఁగిలింపఁగోరితి నని ధ్వనించెడిని. కన్నులతో కౌగిలించుట 'అభ్యామ్... విలోచనాభ్యామ్ పరిరబ్ధుమ్' అని యిందే మీఁదను 'నయనై రేవ నవోపగూహనాని' అని రెండుచోటను జెప్పఁబడెడిని.

ఉ. చక్కనిమోముతోఁ జెలిమి † సల్పెడుముద్దులకోడిగంబుతోఁ
జొక్కపునవ్వుతో బెళుకుఁజూపులతోఁ దమిగొల్పు బాలకు

గ్రక్కున నక్కుఁ జేర్చుకొని కన్నులపండువుగా మనంబులో
నక్కఱ దీరఁ గౌఁగిలించెద నహహా శమన్ వసుదేవభాగ్యమున్. 35

తా. ముగ్ధభావముల చేతను బెళుకుచూపుల చేతను నామనస్సును మిక్కిలి యాసగొలుపుచు, లీలార్థము బాలుఁడై కన్నుల పండువుచేయు చిన్నికృష్ణునిఁ జూడ నువ్విళులూరు నాకన్నులారఁ గౌఁగిలింపఁ దహతహపడుచున్నాఁడను.

శ్లో॥ అధీరబిమ్బాధరవిభ్రమేణ, హర్షార్ద్రవేణుస్వరసమ్పదా చ ।
అనేన కేనాపి మనోహరేణ, హా హన్త హా హన్త మనో ధునోతి॥

టీ. అధీర...మేణ-అధీర=చపలమైన-వేణు వూఁదునపుడు ఇటునటు చలించుచున్న, బిమ్బ అధర=దొండపండువంటి క్రింది పెదవియొక్క, విభ్రమేణ=విలాసముచేతను, హర్షా...పదాచ-హర్ష=ఉల్లాసముచేత, ఆర్ద్ర=తడిసిన-రసవంతములైన-సంతోషాతిశయముచే మిక్కిలి రసవంతముగా ఊఁదఁబడుచున్న, వేణు=పిల్లఁగ్రోవియొక్క, స్వర=సప్తస్వరములయొక్క, సమ్పదాచ=సమృద్ధిచేతను, మనోహరేణ=మనోజ్ఞమైనదియు, కేనాపి=ఇట్టిదట్టిదని చెప్పనలవి గానిదియు, అగు, అనేన=దీనిచేత-ఈ కృష్ణాఖ్యవస్తువుచేత, మనః=మనస్సు, ధునోతి=చలించుచున్నది. హాహన్త=అకటా! హాహన్త=అకటా! అధరము సహజముగా 'బింబ'మువంటిదై యెఱుపు చూపునది; అందును వేణుగానముచే 'అధీర'మై మెఱయుచున్నది; మఱియును 'విభ్రమ'ములు చూపుచున్నది; కాన నిరతిశయమనోహరమైనది. వేణుస్వరము సహజముగా శ్రావ్యమైనది; అందును హర్షముచే ఆర్ద్రమగుటచే మిక్కిలి రసోద్దీపకమైనది; మఱియు 'సమ్పదా'సమృద్ధముగా నుండుటచే రసపారవశ్యము గలిగించునది; కావున నిరతిశయమోహనమైనది. కాఁబట్టి సహజముగా మనోహరమైనవస్తువు ఇట్టి నిరతిశయములైన అధరవిభ్రమవేణుస్వరములచేత, 'కేనాపి మనోహరేణ' నిరతిశయమనోహరమై నామనస్సును 'ధునోతి' చలింపఁ జేయుచున్నదని భావము. కేవలము 'అధీర'మును 'వేణుస్వర'మును జెప్పక 'అధీరవిభ్రమ'మును 'వేణుస్వరసంపద'ను జెప్పుటచే మనోధూననముయొక్క ఔత్కట్యము తెలియుచున్నది. ఈఔత్కట్యమే 'హాహన్త హాహన్త' యని సువ్యక్తమైనది. ఇట్టియత్యంత మనోజ్ఞవస్తువునకై నామనస్సు నిలుపోపక మిక్కిలి తత్తఱపడుచున్నది. అక్కటా! నాకు నిలుపను శక్యము గాకున్నదని భావము.

మ. చలబింబాధరలీల క్రొమ్మెఱుఁగుగా శారీరకాంతిచ్ఛటల్
జలదానీకముగా రణన్మురళి గర్జారీతిగా నెంచి ని
చ్చలు నాట్యంబు మనోమయూర మొనరింపన్ మెచ్చు కందోయికిన్
ఫల మీమోహనరూపముం గనెడుసౌభాగ్యంబు చింతింపఁగన్.

తా. దొండపండువలె నెఱ్ఱనైన క్రిందిపెదవిని ఇటునటు త్రిప్పుటలుచేతను, ఉబ్బుచే మఱింతరస మొప్పాఁగునట్లు ఊఁదు వేణుస్వరము పెంపుసొంపుచేతను, ఈ కృష్ణాఖ్యవస్తువు ఇంతింతనరాని మనోజ్ఞమై నామనస్సును హరించి తత్తఱపెట్టుచున్నది. అకటకటా !

శ్లో॥ యావన్న మే నిఖిలమర్మదృఢాభిఘాత
నిస్సన్ధిబన్ధన ముదేతి నవోపతాపః ।
తావ ద్విభో ! భవతు తావకవక్త్రచన్ద్ర
చన్ద్రాతపద్విగుణితా మమ చిత్తధారా ॥

టీ. హే విభో = ఓకృష్ణా, నవ ఉపతాపః=క్రొత్తవేదన-మరణవేదనావిశేషము, నిఖిల...బన్ధనమ్ యథాతథా - నిఖిల = సమస్తములైన, మర్మ = సెలవులయందు, దృఢ=బిట్టుగా, అభిఘాత = కొట్టుటచేత, నిస్సన్ధిబన్ధనమ్-సంధిబంధములు లేకుండునట్లు-అవయవముల ఒండొంటితోడికూర్పు ప్రిదులునట్లుగా-అవయవములసంధులు వీడునట్టుగా ననుట, యావత్=ఎంతవఱకు, న ఉదేతి=పుట్టకుండునో తావత్=అంతవఱకు, మమ=నాయొక్క, చిత్తధారా=చిత్తపరంపర-ఎడతెగక నాచిత్తము విస్తరిల్లుట, తావక...గుణితా-తావక = నీయొక్క, వక్త్రచన్ద్ర = మొగమనెడి చంద్రునియొక్క, చన్ద్రాతప = వెన్నెలచేత, ద్విగుణితా = ఇనుమడిగాఁ జేయఁబడినది, భవతు = అగుఁగాక. చిత్తధార యనఁగా చిత్తవిస్తారము. ఇప్పుడు నాచిత్తము నీయందు ఎడతెగక విస్తరిల్లుచున్నది. అయినను నీవు నాకుఁ బ్రత్యక్షమై నీముఖచంద్రకాంతులు నాపయిని బొలయించి యాచిత్తధారను రెండింతలు చేయఁగోరుచున్నాను. అనఁగా నాచిత్తము సప్పుటికంటె రెండింతలెక్కువగా నీయందు విస్తరించునట్లు చేయఁగోరుచున్నాఁడను. ఇదియును నాకు ఉపతాపము రాకమునుపే నీవు చేయవలయును. ఏలన ఉపతాపము పుట్టినవెనుక మర్మములు పీడితములై యవయవములు ప్రిదిలి చిత్తము స్వస్థతఁ దప్పునుగాన అప్పుడు నీవు ప్రత్యక్షమైనను నాచిత్తధార వర్తింపఁజాలదు. కావున నట్టియుపతాపము కలుగకమునుపే నాకుఁ బొడసూపి నీముఖేందుదర్శనమువలన నాచిత్తధార యినుమడించునట్లు చేయుమా యని యర్థము. నాకు మరణవేదన రాక స్వస్థగానుండునపుడే నీవుప్రత్యక్షమై నాచిత్తముయొక్క ఆనందమును రెండింతలుగాఁ జేయుమని యాశయము.

మ. శతవర్షంబులమీఁద నొందుదురవస్థం జెంది లోఁ గుంది బా
ధితమై యింద్రియగోళముల్ మిగుల నంధీభూతముల్ గాకముం
దటి నుప్పొంగెడుఁగాతఁ దావకసుధాధారాళ వేణుస్వనో
న్నతలావణ్యరమానివాసముఖచంద్రజ్యోత్స్న నాముందటన్. 37

తా. శ్రీకృష్ణా! మర్మములన్నిటిని పీడించుచు అవయవములసంధి ప్రిదిలునట్లు చేయు మరణవేదన నాకుఁగలుగకమునుపే నీవు ప్రత్యక్షమై నీముఖచంద్రుని వెన్నెలను నాప యిం బొలయించి నాచిత్తమును ఆనందముచే ఇనుమడిగా విస్తరించునట్లు చేయుమా.

శ్లో॥ యావ న్న మే నరదశా దశమీ దృశోఽపి
రన్ధ్రాదుదేతి తిమిరీకృతసర్వభావా ।
లావణ్యకేళిభవనం తవ తావ దేతు
లక్ష్మ్యాః సముత్క్వణితవేణు ముఖేన్దుబిమ్బమ్ ॥ 38

టీ. దశమీ=పదియవదియు, అగు, నరదశా=మనుష్యులయవస్థ-మిక్కిలిముదిసిన యవస్థ యనుట, తిమి...భావాసతీ-తిమిరీకృత=చీఁకట్లుగాఁజేయఁబడిన-కనబడనివి గాఁ జేయఁబడిన, సర్వభావాసతీ=సమస్తపదార్థములుగలది అగుచు, మే=నాయొక్క, దృశః=నేత్రములయొక్క, రంధ్రాత్ అపి=రంధ్రమువలనఁగూడ,యావత్=ఎంతవఱకు, న ఉదేతి=పుట్టదో, తావత్=అంతవఱకు, లక్ష్మ్యాః=లక్ష్మియొక్క. లావణ్య...భవనమ్ లావణ్య=కాంతివిశేషమునకు, కేళిభవనమ్=క్రీడాగృహమైనదియు-మిక్కిలి తేట కాంతిం దొలుకునది యనుట, సముత్క్వణితవేణు-సముత్క్వణిత=మిక్కిలి ఉప్పతిల్లు చున్నధ్వనిగల, వేణు=పిల్లఁగ్రోవి గలిగినదియు, అగు, ముఖ ఇన్దుబిమ్బమ్-ముఖ=మొ గమనెడి, ఇన్దుబిమ్బమ్=చంద్రబింబము-చంద్రబింబమువంటి మొగము, ఏతు=పొందును గాక-నాపాలఁ బొడసూపునుగాక. పదియవదశ నయనరంధ్రములవలనఁ బుట్టు ననఁగా, నయనములు అంధము లగుటచే తెలియఁబడ దనుట, కావుననే అప్పుడు సర్వ పదార్థములు తిమిరీకృతము లగుచున్నవి. ఆటిదశయందు నీముఖేందుబింబమును జూడఁజాలను. కాన అంతకుమునుపే ప్రత్యక్షమై దానిని జూపుమా యని భావము. క్రిందిపద్యమే యిచటను ఊహ్యము.

తా. ఏపదార్థము కనఁబడకుండునట్లు కన్నులను చీఁకట్లు గ్రమ్ముచు మనుష్యు లకు పయిఁకొనుపదియవదశ యగు మిక్కుటపుముదిమి నాకు సంభవించి నాకన్నులు కనఁబడకమునుపే మిక్కిలియు కాంతిచే వన్నెగులుకుచు మురళీధ్వని మొరయు చున్న నీముఖచంద్రబింబమును నాపాలఁ జూపుమా!

శ్లో॥ ఆలోలలోచనవిలోకితకేళిధారా
నీరాజితాగ్రసరణేః కరుణామ్బురాశేః।
ఆర్ద్రాణి వేణునినదైః ప్రతినాదపూరై
రాకర్ణయామి మణినూపురశిఞ్జితాని ॥ 39

టీ. ఆలోల...సరణేః-ఆలోల=చంచలములైన, లోచన=కన్నులయొక్క,విలో కిత=చూపులయొక్క కేళి=విలాసప్రయుక్తమైన, ధారా=పంక్తులచేత,నీరాజిత=నీరా

లింపఁబడిన, అగ్రసరణేః=పురోభాగము గలవాఁడైన-బెళుకు కంటి చూపులచాలును ముంగల నిగుడ్పఁగా ఆచూపులకాంతిచే ఆముందటిప్రదేశము నివాళింపఁబడినట్లు ఉన్నదనుట-ఇట్టివాఁడైన, కరుణ అమ్బురాశేః = దయాసముద్రునియొక్క-కరుణానిధి యగు కృష్ణునియొక్క, ప్రతినాదపూరైః - ప్రతినాద=ప్రతిధ్వనులయొక్క,పూరైః= సమృద్ధిగలవియైన-చక్కఁగా ప్రతిశబ్దించుచున్నవైన, వేణునినదైః = పిల్లఁగ్రోవిధ్వనులచేత, ఆర్ద్రాణి=రసవంతము లైనవియగు-వేణుధ్వనులతోను. దానిప్రతిశబ్దములతోను గూడి మఱియు సరసములైనవియగు అనుట, మణి నూపురశిఞ్జితాని-మణి = రత్నమయములైన, నూపుర=కాలియందెలయొక్క, శిఞ్జితాని=ధ్వనులను, ఆకర్ణయామి = వినుచున్నాను. కరుణాంబురాశి గనుక సలీలముగా చల్లనిచూపులునిగుడ్చుచును, వేణువునూఁదుచును, కాలియందెలు గల్లుగల్లని మొరయ వచ్చుచున్నాఁడు. ఆచూపులకాంతిఅది వ్యాపించిన ముందటిప్రదేశమునకు నివాళిత్రిప్పినట్లున్నది. ఆచూపులు కేవల 'లోచన'ము లవికాక 'ఆలోల'ములైన'లోచన'ములని యనుటచే దానికాంతులును ఆలోలములై నివాళి త్రిప్పినట్లు ఒప్పుచున్నవని సారస్యము. కావుననే నివాళితోడిసామ్యమును సిద్ధము. విలోకనములు 'కేళీ' యనుటచే విలాసయుక్తములనియు, 'ధారా' యనుటచే కారుణ్యప్రయుక్తము లనియు సూచితము. నూపురశింజితములు వేణునినదములతోడనే కాక వానిప్రతిశబ్దములతోడను గూడుటచే ఆర్ద్రములైన వని తెలియునది.

మ. నను రక్షించుకృపాపయోధి యగుకృష్ణస్వామి లోలావలో
కనధారారుచి త్రోవ కారతు లొసంగం జూచుచున్ వీకమైఁ
జను దేరం బ్రతినాదపూరమురళీసంగీతతాళానుకం
జనమంజీరరవామృతంబు చెవి నింపంగ విందు నింపొందఁగన్. 39

తా. చంచలములైన తనకన్నుంగవచూపులను ముందఱ సలీలముగా నిగుడ్చుచు, చంచలంబగువాని కాంతి ఆముందటిప్రదేశమునకు నివాళి త్రిప్పినట్లు మీఱఁగా, వేణు వూఁదుచు కృష్ణుఁడు వచ్చుచున్నాఁడు. కావుననే యావేణుధ్వనులతోడను వానిప్రతిశబ్దములతోడను గూడి మిక్కిలి సరసములై యొప్పు వాని రత్నంపుటందియల శబ్దములను వినుచున్నాఁడను.

అవ. కవి శ్రీకృష్ణమూర్తిని ప్రత్యక్షముగా జూడఁగోరి యాదేవుఁడు తనకుఁ గనబడకుండుటకు ఏయేకారణములు చెప్పునో యని తానే యూహించి యాకారణములకుఁ దగినసమాధానములు చెప్పుచుఁ బ్రత్యక్ష మగునట్లు ప్రార్థించుచున్నాఁడు.

శ్లో॥ హే దేవ హే దయిత హే జగదేకబన్ధో
హే కృష్ణ హే చపల హే కరుణైకసిన్ధో।
హే నాథ హే రమణ హే నయనాభిరామ
హా హా కదాను భవితాసి పదం దృశోర్మే ॥ ౪ 40

టీ. హే దేవ=ఓ దేవా—కవి శ్రీకృష్ణుని ప్రత్యక్షమగునట్లు ప్రార్థింపఁగా ఆదేవుఁడు అప్రాకృతదివ్యమంగళవిగ్రహుఁడైన నేను ప్రాకృతుఁడవగు నీకుఁ గనఁబడుదునా యనఁగా అందులకుఁ గవి నీవు దేవుఁడవు—అనఁగా 'దీవ్యతే-ప్రకాశతే-క్రీడతే' అను వ్యుత్పత్తినిబట్టి క్రీడార్థముగాఁ గాని, సౌలభ్యముచేత నాశ్రితజనులకు ప్రకాశించుస్వభావముచేతఁగాని, నాకుఁ గనఁబడరాదాయని సమాధానపూర్వకముగాఁ బ్రార్థించినాఁడనుట. శ్రీకృష్ణుఁడు 'నేను ఆశ్రితులకు నాస్వరూపమును బ్రకాశమగునట్లు ప్రత్యక్షమగువాఁడనైనను నీవు నాకు ఆశ్రితుఁడవు గావు. కావున నీకుఁ గనఁబడను' అనునో యని హే దయిత=ఓ ప్రియుఁడా యనుచున్నాఁడు. అనఁగా 'సమేప్రియః' అన్నట్లు నిన్నెవరు ప్రియునిఁగా జూతురో, వారికి నీవు ప్రియుఁడవు. నాకు నీవు ప్రియుఁడవు. కాఁబట్టి నీవును నాకు ప్రియుఁడవై కనఁబడవలదా యనఁగా అందులకు కృష్ణుఁడు 'ప్రియులు అనేకులు ఉండినను అందఱియందును నాకుఁ బ్రీతి గలుగునా' యనఁగా హే జగత్+ఏక+బంధో=ఓ జగత్తులోనివారిందఱికిని ఒకేబంధువైనవాఁడా యనుచున్నాఁడు. ప్రియులు అప్రియులు అనుభేదము లేక అందఱికిని నీవు బంధుభావమును చూపువాఁడవుగాన నాయందును అట్టిభావమునుంచి కనఁబడుమా యనుచున్నాఁడనుట. శ్రీకృష్ణుఁడు 'నేను స్వతంత్రుఁడనుగనుక నీవుఁగనఁబడవలసిన విధికి లోఁబడగాను' అనునో యని, హే చపల=ఓ చంచలుఁడా, అనుచున్నాఁడు—స్వతంత్రుఁడవుగాన చంచలుఁడవును గావచ్చును గాన చాపల్యముచేతనైన నాకుఁ గనఁబడుమనుట. కృష్ణుఁడు 'నేను చపలుఁడను. కాఁబట్టియే నీకుఁ గనఁబడను' అనునోయని హే కరుణా+ఏక+సిన్ధో=ఓ దయయే ముఖ్యముగాఁగల సముద్రమైనవాఁడా—కేవలకరుణాత్మకమైన సముద్రమువంటివాఁడా యని యనుచున్నాఁడు. అనఁగా చాపల్యముకన్న కారుణ్యము నీకు ఎక్కువగనుక కరుణచేతనైన కనఁబడుమనుట. 'నేను కరుణాసముద్రుఁడను అయినను నీయందుఁ గరుణచూపుటకు నాకును నీకును ఏమి సంబంధము' అని కృష్ణుఁడు అనుగునో యని హే నాథ=ఓ స్వామీ, అనుచున్నాఁడు—అనఁగా నీవు స్వామివి. నేను నీసొమ్ము. నీసొమ్మును నీవు పాలించి కనఁబడుమనుట. 'నీవు నాసొమ్ము కాఁబట్టి నేను గోరినప్పుడు నీకుఁ గనఁబడుదునుగాని నీవు కోరినపుడు నేను గనఁబడవలసినది లేదు' అని కృష్ణుఁడు అనునో యని హే రమణ=ఓ రమించువాఁడా, యనుచున్నాఁడు, అనగా నీవు అందఱియందు నిరుపాధికముగా రమించుచుండువాఁడవు గాన నన్ను రమింపఁజేయుటకైనను అగపడుమా

యనుట. నేను రమించువాఁడ నైతి నేని నీ హృదయమునందు రమించెదనుగాని నీకన్నుల కెట్లగపడుదును అనునోయని తలఁచి, హేనయన + అభిరామ=ఓకన్నులకుమనోజ్ఞమైన వాఁడా, యనుచున్నాఁడు. కన్నులపండువు అయినవాఁడవుగాన కన్నుల కగపడు మనుట (శ్రీకృష్ణా ! ఇట్టి నీవు, మే=నాయొక్క, దృశోః=కన్నులరెంటికి, పదం= విషయము, హాహా=అకటకటా, కదాను=ఎప్పుడు, భవితాసి=అగుదువో - ఎప్పుడు నాకుఁ బ్రత్యక్ష మగుదువో యనుట.

శా. ఓదేవోత్తమ యోరమేశ దయితా ! యోలోకరక్షామణీ
యోదామోదర కృష్ణ చంచల హరీ ! యోనత కృపాంభోనిధీ
యోదీనావన నాథ యోగమణ ని ! న్నొప్పారు రమ్యాకృతిన్
మోదం బొప్పఁగఁ జూతు నెన్నఁటికి నా ! మోదంబు సంధిల్లఁగన్.

తా. మీఁద సుగమము.

శ్లో॥ అమూ న్యధన్యాని దినా న్తరాణి
హరే త్వదాలోకన మ న్తరేణ ।
అనాథబన్ధో కరుణైకసిన్ధో
హా హా న్త హా హా న్త కథం నయామి ॥ 41

టీ. కరుణా ఏకసిన్ధో=కరుణయే ముఖ్యముగాఁ గల సముద్రము అయినవాఁడా- శుద్ధకారుణ్యమయమైన సముద్రమువంటి వాఁడా-మహాకారుణ్యనిధీ యనుట, కావుననే, అనాథబన్ధో = దిక్కు లేనివారికి చుట్టమైనవాఁడా - నను బోఁటి దిక్కులేనివారిని చుట్టమువలె ఆదరించువాఁడా యనుట, హేహరే = (సౌలభ్యప్రియుక్తమైన నిరవధిక సౌందర్యముచే మనస్సును హరించువాఁడా-శ్రీకృష్ణా యనుట, త్వత్ ఆలోకనమ్=నీయొక్క దర్శనము, అ న్తరేణ=మాని-లేక యనుట, అధన్యాని = (నిన్ను దర్శింపకయే కడపఁబడినవిగాన) కృతార్థములుగాని వైన, అమూని=ఈ-ఈజరుపఁబడుచున్న, దినా న్తరాణి=దినములను, హాహా న్త హాహా న్త=అయ్యో అయ్యో, కథం=ఎట్లు-ఎంతవ్యర్థముగా అనుట, నయామి=కడపుచున్నాను. నీవు 'అనాథబంధుఁడవు, నేనును అనాథుఁడను కాఁబట్టి నీవు నాకును బంధుఁడవై ప్రత్యక్షము గావలయును. అయినను ఇంతకాలమున కును నీవు కనఁబడవైతివి. ఇది నీవు 'కరుణైకసింధుఁడవు గావున నీతప్పుగాదు. నాపాపమే యగునని కవినిర్వేదము సూచితమగుచున్నది. మఱియును నీదర్శనము లేమిచే వ్యర్థము లైనదినములు ఒకటిరెండు గావు. 'దినాన్తరాణి' అనేకదినములు అనుటచే నిర్వేదనముయొక్క ఔత్కట్యము వ్యంజితమగుచున్నది. కావుననే 'హాహాన్త హాహాన్త' అని యాక్రోశము, 'కథం నయామి' అనుటచే ఇఁక నట్టిదినములను జరుపుట మిక్కిలి దుస్సహమని నాయాశయము.

శా. నిన్నుం గానక నీకథల్ వినక నిన్నే మాయఁ జిత్తంబుతో
నెన్నం జాలక నిన్నుఁ బేర్కొనక నిన్నే వేళఁ బూజింప లే
కన్నా! యార్తనికేతనాంగణనిధీ! యయ్యయ్యో కృపావారిధీ!
ఎన్నేసి దినముల్ గ్రమించితి వృథా యేమందు నాదుర్దశన్. 41

తా. కృష్ణా! నీవు కరుణాసముద్రుండవు. కావున నే దీనజనబంధుఁడవు. నేనును దీనుఁడనైనను నీదర్శనములేక వ్యర్థముగా ఈదినములను అకటకటా! ఎట్లు గడపుదును ?

శ్లో. కిమివ శృణుమః కస్య బ్రూమః కథం కృత మాశయా
కథయత కథం ధన్యా మన్యామహే హృదయేశయమ్ ।
మధురమధుర స్మేరాకారే మనోనయనోత్సవే
కృపణకృపణా కృష్ణే తృష్ణా చిరం బత లమ్బతే ॥ 42

టీ. మధుర...కారే-మధురమధుర=మిక్కిలి సుందరమును, స్మేర=యౌవనము యొక్క వికాసముగలదియు-లేక-చిఱునవ్వుచేఁజెలువైనదియు, అగు, ఆకారే=ఆకృతి గలవాఁడును, కావుననే, మనో...త్సవే-మనో=మనస్సునకు, నయన=కన్నులకును, ఉత్సవే=పండువుఅయినవాఁడును-మనస్సునకును గన్నులకునుఆనందప్రదుఁడైనవాఁడనుట అగు, కృష్ణే=కృష్ణునియందు, కృపణకృపణా=మిక్కిలియు దీనమైన, తృష్ణా = ఆశ, చిరం=బహుకాలముగా, బత=అయ్యో-లేక 'ధన్యా!' అని పూర్వపాదమున చెప్పఁబడినధన్యులను ఇది పరామర్శించుచున్నది,లమ్బతే=వ్రేలుచున్నది-కృష్ణుని ఆశ్రయించి వర్తించుచున్న దనుట. ఆశ చిరకాలముగా మిక్కిలి దీనముగా కృష్ణుని ఆశ్రయించి యున్న దనుట-బహుకాలముగా కృష్ణుని చూచుటకు మిక్కిలి దీనత్వముతో ఉవ్విళు లూరుచున్నాఁడనని భావము. కావున ధన్యాః=ధన్యులారా, కిమివ=ఏమని, శృణుమః-విందుము. ఇట్టివాఁడని ఏమివిందు మనుట. కస్య=ఎవనికి, బ్రూమః=చెప్పుదుము. ఇట్టివాఁ డని ఎవరికిఁజెప్పుదు మనుట, కథం=ఎట్లు, ఆశయా=ఆశచేత, కృతం=తీఱినది-చాలినది-ఆశ చాలించుకొనుట ఎట్లు, హృదయేశయమ్=హృదయమందు నెలకొని యున్నట్టి కృష్ణుని, కథం=ఎట్లు, మన్యామహే=తలంతుము. కథయత=చెప్పుఁడు. ఆకారము 'మధురమధుర' మగుటచేతనే దానియందలితృష్ణయు 'కృపణకృపణా' యైనది – 'నయనోత్సవే' అనుటచేత ఆతృష్ణ, ఆకారదర్శనవిషయ మైనదని వ్యంజితము. కృష్ణుఁడే 'హృదయేశయుఁ' నాహృదయమందు నెలకొనియున్నాఁడు. నాహృదయమున గోచరించిన 'మధురమధురాకార' మును కన్నులారాఁ జూడవలయు నని చిరకాలముగా ఆశపడి యున్నానుగాని ఆయాశఁబనఁగూడినదికాదు. ఆయాకారమును జూడ

లేకపోయినను ఎవరైనను వర్ణింపఁగా వినియైనఁ దృప్తినొందెద మనఁగా ఇట్టిదని దాని ని ఎవరు వర్ణింపఁగా వినఁగలము? ఒకరుచెప్పఁగా వినుటయు లేకపోయినను మనస్సునఁగో చరించినయాకృతిని మేమైన ఒకరికి వర్ణించిచెప్పి తృప్తిపొందెదమనఁగా ఎవరికి ఏమని వర్ణించి చెప్పఁగలము? చెప్పుటయు లేకపోయినను మననమైన చేయుద మన గా దానిని సైతము ఎట్లు చేయఁగలము? ఇట్లు చూడకపోయినను విని గాని, చెప్పి గాని, తలంచి గాని యాశతీర్చుకొనుటకను శక్యముకాదయ్యె. కాఁబట్టి యాశను చాలించుకొనెదమన్న న ది చిరకాలముగా నుండునది కాఁబట్టి దానిని మానుట యెట్లు? కృష్ణునిగూర్చి శ్రవణమన నాదులు చేయుధన్యులు ఎవరేని యుండినయెడల వారు అధన్యులైనమాకు నేదైన నుపాయము చెప్పుదురు గాక యని యాశయము.

శా. ఏశాస్త్రంబుల విందు నేగురునితో కే నే మందు నెట్లోకో
యాశన్ ధన్యులు దెల్ప లేర కద ప్రత్యక్షంబుగా నద్దయా
రాశిన్ నేత్రమనోభిరాము స్మితవక్త్ర ప్రాభవున్ యాదవా
ధీశుం గోరి మదీయతృష్ణ యకటా కే దీనత్వముం జెందెడిన్. 42

తా. మిక్కిలిసుందరమై మందహాసము గలముఖముతోఁగూడిన యాకారము గల వాఁడై మనసునకును గన్నులకును వింపులొనర్చుకృష్ణుని జాడవల యునని బహుకాలము గా నతిదీనత్వముతో ఆశగొనియున్నవాఁడను. ధన్యులారా! ఏమివిందును? ఎవరికిఁజె ప్పుదును? ఆశ యెట్లు చాలించుకొనవచ్చును? హృదయమునందు నెలకొనియున్నకృష్ణుని ఎట్లు చింతింతును? మీరు చెప్పుఁడు.

శ్లో॥ అభ్యాం విలోచనాభ్యా, మమ్బుజదళలలితలోచనం బాలమ్ ।
ద్వాభ్యామపి పరిరబ్ధుం, దూరే మమ హన్త దైవసామగ్రీ ॥ 43

టీ. అభ్యామ్=ఈ,విలోచనాభ్యామ్=కన్నులు, ద్వాభ్యామపి=రెంటిచేతనుగూ డ, అమ్బు...చనమ్-అమ్బుజదళ=తామరరేకులవలె,లలిత=సుందరములైన, లోచనమ్= కన్నులుగలవాఁడగు, బాలమ్=బాలుఁడగు కృష్ణుని, పరిరబ్ధుం=కౌఁగిలించుటకు, దైవ సామగ్రీ=అదృష్టము, మమ=నాకు,దూరే=దూరమగుచున్నది. రెండుకన్నులార నేని కృ ష్ణుని గాఁగిలించుకొనెదనన్న దైవము తోడుపడకున్నదనుట. హన్త=అక్కటా- రెండు చేతులారనలెనె రెండుకన్నులారను గాఁగిలించుటను నువ్యక్తముగాఁ జెప్పుటకై 'ద్వా భ్యామపి'అని విశేషించిచెప్పినాఁడు. రెంటిచేతను అనుటవలన కౌఁగిలించుటయొక్క పూ ర్ణత్వము తెలియుచున్నది. కన్నులు రెంటిచేతను బిగియఁగౌఁగిలించుకొనఁగోరుట-అనఁ గా రెండుకన్నులారఁ జక్కఁగాఁ జూచుటవు దైవము దూర మగుచున్నదే యని సంతా పాతిశయము.

ఉ. ముద్దులు గుల్కు బాలుఁ డని ముచ్చటఁ గౌఁగిట గుచ్చియెత్తఁగా
నొద్దిక యై మెలంగెడుభుజోన్నతి కంబుకహోత్కుఁ డంచు నే
ప్రౌఢను వేడ్కఁ జూడఁ దలఁపోసినఁ జిక్కఁడు గన్నుదోయికిం
గొద్దికి మీఱె దైవ మనుకూలము గామికి నేమి సేయుదున్. 43

తా. తామరరేకులవలె సుందరములైనకన్నులు గలిగి చెన్నారుచిన్నబాలకృష్ణుని నాయీరెండుకన్నులారఁ గౌఁగిలించుకొనుటకు అదృష్టము అకటా! దూరమగుచున్నది.

శ్లో॥ అశ్రాన్తస్మిత మరుణారుణాధరోష్ఠం
హర్షార్ద్రద్విగుణమనోజ్ఞ వేణుగీతమ్ ।
విభ్రామ్యద్విపులవిలోచనార్ధముగ్ధం
వీక్షిష్యే తవ వదనామ్బుజం కదా ను ॥ 44

టీ. అశ్రాన్తస్మితమ్-అశ్రాన్త=ఎడతెగని, స్మితం=చిఱునవ్వుగలదియు, అరు...రోష్ఠమ్-అరుణారుణ=ఎఱ్ఱఁబాఱిన, అధరోష్ఠమ్=క్రిందపెదవి గలదియు, హర్షా...గీతమ్-హర్ష=సంతోషముచేత, ఆర్ద్ర=సరసమైనదియు, కావుననే, ద్విగుణ=రెండింతలు, మనోజ్ఞ=మనోహరమైనదియు, అగు, వేణుగీతమ్=మురళీగానము గలదియు - ఉబ్బుచే పిల్లనగ్రోవిని రెండింతలు మధురముగా ఊఁదునట్టిదియు అనుట, విభ్రా...ముగ్ధం విభ్రామ్యత్=(వేణుస్వరగతులకు అనుగుణముగా) మిక్కిలి చలించుచున్నవియు, విపుల=విశాలములైనవియు, అగు, విలోచన=కన్నులయొక్క, అర్ధ=సగముచేత అరమోడ్చి స్వరానుగుణముగా ఇటునటు త్రిప్పఁబడుచున్న కన్నులచేత ననుట, ముగ్ధమ్=మనోహరమైనదియు, అగు, తవ=నీయొక్క, వదన అమ్బుజమ్=మోముఁదామరను - తామరవంటి మొగమును, కదాను=ఎప్పుడు' వీక్షిష్యే=చూడఁగలనో-స్మితము 'అశ్రాన్త' మగుటయు, అధరోష్ఠము 'అరుణారుణ' మగుటయు, వేణుగీతము 'హర్షార్ద్రద్విగుణమనోజ్ఞ' మగుటయు, విపులవిలోచనములు 'విభ్రామ్య' మాణములును 'అర్ధ' ముకుళితములును అగుటయు తామరవలె సహజముగా చెలువైన మొగమునకు మఱియు నిరవధికమనోహరత్వముఁ గూర్చుచున్నది. విలోచనములు విపులము లగుటచేతనే వాని విభ్రమములును అర్ధముకుళనములును ముగ్ధము లగుచున్నవి-అనఁగా వెడఁదకన్నులయొక్క బెళుకుఁద్రిప్పులును అరమోడ్పులునే యత్యంతమనోహరములు: కావుననే 'విలోచన' ములకు 'విపుల' శబ్దముగూర్పఁబడినది. ఏతాదృశనిరతిశయసౌందర్యలక్షణలక్షితమైన వదనాబ్జ ముండుటచేతనే దానిని ఎప్పుడు చూతునో యని యువ్విళు లూరెద ననుట.

మ. మురళీగానసుధాధునీకలితసమ్మోదంబు నిండారఁగా
నరమోడ్పుంగనుదోయి బెళ్కుమరఁగా నాతామ్రబింబాధర

స్ఫురణన్ వెన్నెలతేటలేనగవులన్ పసొంపొంకునెమ్మోముఁదా
మర సేవింపఁగఁ గల్గునుత్సవము సంభావించు టెం తెన్నఁడో. 44

తా. ఎప్పుడును గిఱిగొనియుండు చిఱునవ్వు గలిగి, మిక్కిలియెఱ్ఱనైన క్రింది పెదవిచే నొప్పి, ఉబ్బుచే రెండింతలు ఇంపుగా నూఁదఁబడుచున్న పిల్లనగ్రోవితోఁ గూడి, యిటునటు తిరుగుచున్న వాలుఁగన్నులయొక్క మెఱుపుచే ముద్దులు గులుకుచున్న నీ మోముఁదామరను నే నెప్పుడు చూతునో కదా,

శ్లో॥ లీలాయతాభ్యాం రసశీతలాభ్యాం
నీలారుణాభ్యాం నయనాంబుజాభ్యామ్।
ఆలోకయే దద్భుతవిభ్రమాభ్యామ్
కాలః కదా కారుణికః కిశోరః॥ 45

టీ. కారుణికః=దయామయుఁడైన, కిశోరః=బాలుఁడగు శ్రీకృష్ణుఁడు, లీలాఆయతాభ్యామ్ - లీలా=విలాసములచేత, ఆయతాభ్యామ్=వెడలుపులైనట్టివియు - విలాసపుఁద్రిప్పులచేత మఱింత విరివియైనవియు ననుట, రస శీతలాభ్యామ్ - రస=శృంగారరసముచేత, శీతలాభ్యామ్=చల్లనైనవియు-శృంగారరసమును జల్లగానొలుకుటచేఁ జూచుటకు సుఖప్రదమైనవియు ననుట, నీల అరుణాభ్యామ్ - నీల=(నల్లగ్రుడ్డుకాంతులచే) నల్లనివియు, అరుణాభ్యామ్=(కడగన్నులయెఱుపుచే) ఎఱ్ఱనివియు అయినవియు, అద్భుత విభ్రమాభ్యామ్-అద్భుత=ఆశ్చర్యకరములైన, విభ్రమాభ్యామ్=విలాసములుగలవియు, అగు, నయన అంబుజాభ్యామ్=కన్నుఁదామరలచేత, మామ్=నన్ను, కదా=ఎప్పుడు, ఆలోకయేత్=చూచునో. 'కారుణికుఁ'డనుటచేఁగరుణాతిశయముచే నన్నెప్పుడు చూచునో యనుట. నయనాంబుజము లను లీలాయతములనుటచే బూర్ణదృష్టియు, రసశీతలము లనుటచేఁ జల్లఁదనమును, నీలారుణము లనుటచే అద్భుతవిభ్రమత్వమును దెలియునది.

ఉ. తిన్ననికల్వచెల్వు లొకకొదికు్కన నొక్కెడఁ గమ్మదమ్మిక్రొ
మ్మిన్నలఁ గుమ్మరించు నవకమేచకశోణత మించు మించులీ
ల న్నిరసించునిస్తులవిశాలనరసాయతశీతలంబు లౌఁ
గన్నుల నన్ను నెన్నఁటికిఁ గాంచునొ బాలకుఁ డాదరంబునన్. 45

తా. లీలచే మఱింతవెడలుపై వికసిల్లి శృంగారరసముచేఁజల్లనై, కనుగ్రుడ్డులునల్లనికాంతియు కొలుకులు ఎఱ్ఱఁదనమును దొలుకఁగా, నాశ్చర్యకరములగు చిన్నెలువన్నెలు నెఱపు కన్నుఁదామరలతోఁ గరుణానిధి యగు చిన్నిబాలకృష్ణుఁడు నన్నుఁజూచుట యెన్నఁడో కదా!

శ్లో॥ బహుళచికురభారం బద్ధపిఞ్ఛావతంసం
చపలచపలనేత్రం చారుబిమ్బాధరోష్ఠమ్ ।
మధురమృదులహాసం మన్థరోదారలీలం
మృగయతి నయనం మే ముగ్ధవేషం మురారేః ॥ 46

టీ. బహు... భారమ్-బహుళ=తఱుచైన, చికురభారమ్=కేశసమూహము గలదియు, బద్ధ...తంసమ్-బద్ధ=కూర్పఁబడిన - చెరవుకొనఁబడిన, పిఞ్ఛ=నెమిలిపురి యనెడు, అవతంసమ్=శిరోభూషణముగలదియు - 'బహుళచికురభారాబద్ధపిఞ్ఛావతంసమ్' అనుపాఠమున దట్టమైన కేశసమూహమందుఁ గూర్పఁబడిన నెమిలిపురియనెడు శిరోభూషణముగలదియు అని యర్థము, చప... నేత్రమ్-చపలచపల=మిక్కిలిచంచలములైన-బెళుకు లీను చున్న, నేత్రమ్=కన్నులుగలదియు, చారు...రోష్ఠమ్-చారు=సొగసైనదియు, బింబ=దొండపండువంటిదియు, అగు, అధరోష్ఠమ్=క్రింది పెదవిగ గలదియు, మధు...హాసమ్-మధుర=మనోజ్ఞమును, మృదుల=కోమలమును, అయిన, హాసమ్ = నవ్వుగలదియు సొగసైన చిఱునవ్వు గలది యనుట, మన...లీలమ్-మన్థర=బరువైనవియు - మిక్కిలియైనవియు అనుట, ఉదార=గొప్పవైనవియు, అగు, 'లీలమ్' విలాసములుగలదియు, ఇది యె 'విలాసభరాలసమ్' అని మొదటఁ జెప్పఁబడెడి, (మనరోదారలీలమ్=మందరపర్వతము యొక్క గొప్పలీలలుగలది, అనుపాఠము సరసముకాదు) అగు, మురారేః=శ్రీకృష్ణునియొక్క, ముగ్ధవేషమ్-ముగ్ధ=సుందరమైన, వేషమ్=వేషమును, మే=నాయొక్క, నయనమ్=నేత్రము, మృగయతి=వెదకుచున్నది - నేను గన్నులార చూడఁగోరుచున్నా ననుట. దట్టంపు నెఱికురులును, దానినడుమఁ జెరివిన నెమిలిపురియు, దానిక్రింద నున్న బెళుకు గన్నులును, దానికిఁ గ్రిందుఁగానున్న యెఱ్ఱని పెదవియు ఆపెదవియందలి శ్వేతనవ్వును వేషముయొక్క 'ముగ్ధ'త్వమునకు హేతువులు. మఱియు నాముగ్ధత్వమునకు హేతువుల గు సొబగులు పెక్కులు గలవుగాని అవన్నియును చెప్పుటకు శక్యముగామిచే వానినెల్ల 'మన్థరోదారలీలమ్' అని యొక్క మాటచే గని సంగ్రహించినాఁడని తెలియునది.

చ. లలితపుఁగెంపుసొంపుఁగళకలన్ విలసిల్లెడుమోవినవ్వుఁ దే
టలు నునుగొప్పకొప్పున బెరడం గగుపింఛము బెళ్కుఁజూపులున్
సలలితమందరాద్రిధృతికసంపదయుం జెలువారుశౌరిమం
జులతరవేషమున్ వెదకికచూడఁగ నాకనుదోయి గోరెడిన్. 46

తా. దట్టంపు నెఱికురులును, అందుఁ జెరివిన నెమిలిపురియును, బెళుకుఁజూపులును, సొగసైన దొండపండువంటి మోవియును, ఇంపైన శ్వేతనవ్వును, మఱియు లెక్కకు మిక్కిలియైన గొప్పచిన్నెలువన్నెలును గలిగి, మనోజ్ఞమై వెలుఁగుచున్న కృష్ణునివేషము కన్నులారఁ జూడ నువ్విళులూరు చున్నాఁడను.

శ్లో॥ బహుళజలదచ్ఛాయాచోరం విలాసభరాలసం
మదశిఖిశిఖాలీలోత్తంసం మనోజ్ఞముఖాంబుజమ్ ।
కమపి కరుణాపాఙ్గోదగ్రప్రసన్నజగజ్జడం
మధురిమపరీపాకోద్రేకం వయం మృగయామహే ॥ 47

టీ. బహుళ...చోరం-బహుళ=అధికమైన, జలద=మబ్బులయొక్క, ఛాయా=కాంతిని, చోరం=దొంగిలించునదియు - మబ్బువలె నల్లనిచాయగలదియు ననుట, విలాస...లసమ్-విలాస=విలాసముయొక్క, భర=బరువు చేత, అలసమ్=మందమైనదియును, 'భరాలసమ్' అనుట 'మన్థరమ్' అనుటతో సాటియైనది గాన మితిమీఱిన విలాసములుగలదియనుట, మద... త్తంసమ్-మదశిఖి=మత్తిల్లిన నెమిలియొక్క, శిఖా=పురియనెడి, లీలా=విలాసార్థమైన, ఉత్తంసమ్=శిరోభూషణముగలదియు, మనో...బుజమ్-మనోజ్ఞ=సుందరమైన, ముఖ అమ్బుజమ్=మోముదామరగలదియు, కరుణా...జడమ్-కరుణా=దయతోఁగూడిన, అపాఙ్గ = కడగన్నులచేత - కడగంటిచూపులచేత, ఉదగ్రమ్ యథాతథా=అత్యంతముగా, ప్రసన్న = తేటపడిన - కలఁకదేఱిన, జగత్=జగముయొక్క, జడమ్=జాడ్యము గలదియు - కడగంటిచూపు పొలయుటచేతనే జగత్తులోనివారి జాడ్యమెల్లఁ బోఁగొట్టి ప్రసన్నత గలిగించునది యనుట, అగు, కమపి = ఒకానొకటి - ఇట్టిదట్టిదనరాని. మధురిమ...ద్రేకమ్-మధురిమ=సౌందర్యముయొక్క, పరీపాక = పరిపాకముయొక్క - పెంపుసొంపుయొక్క యనుట, ఉద్రేకమ్=విజృంభణమును - ఉరవడిని - అత్యంతముగాఁ బరిపక్వమైనసౌందర్యము ననుట - ఒకానొకపరిపూర్ణ సౌందర్యాతిశయముననుట-అట్టిసౌందర్యాతిశయముగల శ్రీకృష్ణుని అని భావము, వయం=మేము, మృగయామహే = వెదకుచున్నారము, కృష్ణమూర్తికి సాక్షాద్వాచకములగు, 'కృష్ణమ్' 'విభుమ్' 'కిశోరమ్' ఇత్యాదులను జెప్పక 'మధురిమపరీపాకోద్రేకమ్' అనిగౌణవాచకమును జెప్పుటచే ఇదియే 'మృగయామహే' అనుక్రియకు కర్మమగును. మేము కృష్ణాఖ్యమైన వస్తువును వెదకుచున్నారము. అయినను ఆవస్తువును కృష్ణుఁ డనుటకంటె మీఁదుమిక్కిలి పరిపక్వమైన యొకానొక చక్కఁదనమే యనుట, మఱింత యొప్పు నని కవి హృదయము. కేవలసౌందర్య మనక దానియొక్క పరిపాకమును జెప్పుటచే అది పరిపూర్ణమైనదియు, ఆపరిపాకమునకు 'ఉద్రేకశబ్దమును గూర్చుటచే అది మనస్సునకుఁ బట్టఁగూడనంత నిరతిశయమనోహరమైన దనియు వ్యంజిత మగుచున్నది.

మ. తనకారుణ్యకటాక్షవీక్షణముచేఁ ద్రైలోక్యజాడ్యంబు లె
ల్ల నివర్తింప మనోహరాననముతో లావణ్యవేషంబుతో
ఘనధారాధరకాంతితో శిఖిశిఖాకర్ణావతంసంబుతో
ననువై యుండెడువాని నారయుచు నుద్యత్ప్రీతి సేవించెదన్. 47

తా. దట్టంపునెమ్మి పుల్బలచాయ గలిగి, చిన్నెలు వన్నెలు మిక్కిలియు నెఱపుచు, నెమలిపురిని తలయందుఁ దాల్చి, తామరవలె చెలువైన మొగమును గలిగి, కరుణతోఁ గూడినకడగంటిచూపుచే జగంబుల జాడ్యమునెల్లఁ బోఁగొట్టి ప్రసన్నత గలిగించుచు, నిట్టి దట్టి దనరానిదై, మీఁదుమిక్కిలి పరిపక్వమై, యొప్పుచున్న యొకసౌందర్యంపు రాశిని మేము వెదకుచున్నారము.

శ్లో॥ పరామృశ్యం దూరే పరిషది మునీనాం వ్రజవధూ
దృశాం దృశ్యం శశ్వ త్త్రిభువనమనోహారివపుషమ్ ।
అనామృశ్యం వాచా మనిదముదయానామపి కదా
దరీదృశ్యే దేవం దరదళితనీలోత్పలనిభమ్ ॥ 48

టీ. మునీనాం = మునులయొక్క, పరిషది = సభయందు - లేక సమూహము నందు - మునిజనులకు అనుట, దూరే = దూరమునందు, పరామృశ్యమ్ = అరయఁదగిన వాఁడును - మునులకు దీర్ఘముగా విచారముచేసి తెలియవలసినవాఁడనుట - అట్టివారికిని సులభముగా నగపడకుండువాఁ డని భావము - ఇది పరత్వసూచకము, ఇట్టిపరుఁ డైనను, వ్రజ...దృశామ్ - వ్రజవధూ = గొల్ల స్త్రీలయొక్క, దృశామ్ = కన్నులకుఁ దృశ్యమ్ = కనఁదగినవాఁడును-ఇది సౌలభ్యసూచకము, శశ్వత్ = ఎల్లప్పుడుగా త్రిభు...వపుషమ్ త్రిభువన = ముల్లోకములకును, మనోహారి = మనస్సును హరించునంత సుందరమైన, వపుషమ్ = దేహము గలవాఁడును - ముల్లోకములవారిని తన యపూర్వ సౌందర్యాదులచే ఆకర్షించి కృతార్థులను జేయుటకు అత్యంతసుందరశరీరుఁడై యవతరించినవాఁడు ననుట - ఇది సౌలభ్యప్రకాశకము, అనిదముదయానామ్ = అ ఇదమ్ ఉదయానామ్ - ఇది యిట్టిది ఇట్లు పుట్టినది అని చెప్పరానివైన - ఉపానిషత్తులైన యనుట, వాచా మపి = వాక్కులకుఁ గూడ - వేదాంతవాక్యములకు సైతము అనుట, అనామృశ్యమ్ = తెలిసికొనరానివాఁడును - ఇది పరత్వసూచకము, దర...నిభమ్ - దర = కొంచెముగా, దళిత = విరిసిన, నీల ఉత్పల = నల్లగలువలతో, నిభః = సాటియైనవాఁడును- నల్లగలువలవంటికాంతి గలవాఁ డనుట - ఇది సౌలభ్యప్రయుక్తమైన అవతారమునకుఁ బ్రకాశకము. అగు, దేవమ్ = దేవుఁడైన శ్రీకృష్ణుని, కదా = ఎప్పుడు, దరీదృశ్యే = చక్కఁగాఁ జూతును. మునిసమూహమునకు (దూరే) దూరముగా (పరామృశ్యః) విచారింప వలసినవాఁడు; వ్రజవధువులకు 'దృశామ్' చూపులకే-అనఁగా దాపుననే 'దృశ్య' కనఁబడుచుండువాఁడు. మొదటివాక్యమునందలి 'దూరే' అనుటకు ప్రతిగా రెండవవాక్యమున దాపున అనుటకుఁ బర్యాయముగా 'దృశామ్' అని చెప్పఁబడినది. ఇట్లు కానిచో ఇందు 'దృశామ్'అని చెప్ప నక్కఱలేదు; 'దృశ్యమ్' అను ఒకటియే చాలును. మునులకు దవ్వుగా విచారింపవలసినవాఁడు గోపికలకు దాపుననే కనఁబడుచున్నాఁడు. పరత్వసౌ

లభ్యముల పరాకాష్ఠలను దెలియునది. గొల్లచెలువలకు దృశ్యుఁడుగాన అట్టిమొఱవల కుఁ దగినరూపే కలిగియుండు ననరాదు, 'త్రిభువన మనోహారి వపుషమ్' ముల్లోకముల వారిని మోహింపఁజేయు రూపముగలవాఁడు అపౌరుషేయములగు వేదాంతములకే తెలియరానివాఁడైనను నల్లగలువలకాంతి గల రూపముతో తెలియుచున్నాఁడు. కావుననే ననులోఁటికిని మాటికి నెప్పుడు చూడఁగలుగునో యని కోరిక గలిగిన దని యాశయము.

మ. మనిలో నిత్యైన గోపికానన వనపద్మశ్రేణి కెల్లప్పుడున్
విదితం బై మునినాయకాగ్రసభ కన్వేషింపఁగా నేర మై
యెద మిత్రం బని వేదవాళి కను వై క యెంచం బఠింపన్ మొదల్
తుద లేనట్టి నవోత్పలాభ ముగవస్తున్ మోహనాకారమున్. 48

తా. మునులసమూహమునను దవ్వుగా విచారింపఁబడినవాఁడు: అపౌరుషేయము లైన వేదాంతములకును దెలియరానివాఁడు. ఇట్టివాఁ డయ్యు ముల్లోకములవారిమనస్సులను హరించునంత సుందరమైనదియు, ఇందుక విచ్చిననల్లగలువకాంతి గలదియు నగు మూర్తితో గొల్లయిల్లాండ్రకు కన్నుల కగపడుచునే యున్నాఁడు. ఇట్టిసులభుని నేను మాటికి నాకన్నులకఱవు దీఱ చూచుట యెన్నఁడో.

శ్లో॥ లీలాననామ్బుజ మధీర ముదీక్షమాణం
నర్మాణి వేణువివరేషు నివేశయన్తమ్।
డోలాయమాననయనం నయనాభిరామం
దేవం కదాను దయితం వ్యతిలోకయిష్యే॥ 49

టీ. లీలా...మ్బుజం=విలాసముతోఁ గూడిన, ఆనన అమ్బుజమ్=మోముదామర గలవాఁడును-లేక, లీలాయితామ్బుజమ్ = విలాసార్థమైనతామర గలవాఁడును, అధీరం యథాతథా=చంచలమగునట్లుగా, ఉదీక్షమాణం = చూచుచున్నవాఁడును-బెళుకుఁజూపులతో చూచుచున్నవాఁడనుట, వేణువివరేషు-వేణు=పిల్లఁగ్రోవియొక్క, వివరేషు=రంధ్రములందు, నర్మాణి=నర్మములను-గోపికలకొఱకైనసంకేతములను, నివేశయన్తమ్=ప్రవేశింపఁజేయువాఁడును-అనఁగా వేణురంధ్రమునందు ఊఁదెడు ధ్వనివిశేషములచేత గోపికలకు సంకేతములను దెలుపువాఁడనుట, డోలాయమాననయనమ్-డోలాయమాన=ఊఁగుచున్న-ఇటునటు తిరుగుచున్న యనుట, నయనమ్ = కన్నులు గలవాఁడును, నయన అభిరామమ్=కన్నులకు మనోజ్ఞుఁడైనవాఁడును, కావున నే దయితమ్=ప్రియుఁడైనవాఁడును, అగు, దేవం=దేవుఁడైన శ్రీకృష్ణుని, కదాను=ఎప్పుడు, వ్యతిలోకయిష్యే=చూడఁగలనో. స్వభావముచే ఈక్షణములు అధీరములైనవనియు, వేణుగానవశముచే నయనములు డోలాయమానములైనవనియుఁ దెలియునది. ఇట్టి లక్షణములు గలిగియుండుటచే నయనాభిరాముఁడు; కావుననే 'వ్యతిలోకయిష్యే' చూడఁగోరెద ననుట.

ఉ. ఏతఱిఁ జూచి మ్రొక్కఁగల ॥ నేతఱిఁ జూచు నతండు నన్ నవో
జాతమృదుస్మితాననుని ॥ జంచలలోచను వేణుగీతసం
కేతముచేత గోపికలఁ ॥ గేళికి నై జతగూర్చునేర్పరిన్
నూతనపంచసాయకమనోహరమూర్తిని గంటి కింపుగన్. 49

తా. విలాసముతోఁగూడిన ముఖారవిందము గలిగి, బెళుకువాలుఁజూడ్కులు నిగుడ్చుచు, పిల్లఁగ్రోవిరంధ్రములందు గోపికలకు సంకేతమును దెలుపునట్టి స్వరము లూఁదుచు, గానవశమునఁ గన్నుల నిటు నటుఁ ద్రిప్పుచుఁ గన్నులపండువై, మనస్సునకును బ్రియుఁడై యొప్పు దేవుని శ్రీకృష్ణుని ఎప్పుడుగాంతునో.

శ్లో॥ లగ్నం ముహు ర్మనసి లమ్పటసంప్రదాయి
లేఖావిలేఖనరసజ్ఞ మనోజ్ఞ వేషమ్ ।
లజ్జన్మృదుస్మితమధుస్నపితాధరాంశు
రాకేన్దులాలితముఖేన్దు ముకున్దబాల్యమ్ ॥ 50

టీ. లేఖా... వేషమ్-లేఖా=చిత్తరువులను, విలేఖన=వ్రాయుటయందు, రసజ్ఞ=రసికులైనవారికి-నేర్పరులైనవారికి, మనోజ్ఞ=మనోహరమైన, వేషఁ=వేషముగలదియు, లజ్జ...రాంశు-లజ్జత్=సిగ్గుపడుచున్నదియు- వెలికిరాక పెదవిమాటునఁ దోఁచుచున్నదియు - స్వల్పమైన దనుట, మృదు = కోమలమైనదియు, అగు, స్మిత=నవ్వుఅనెడి-లేఁత చిఱునవ్వు అనెడి యనుట, మధు = తేనియచేత, స్నపిత=తడుపఁబడిన, అధర=పెదవియొక్క, అంశు = కాంతులు గలదియు- తియ్యనికెమ్మోవి యెఱ్ఱనికాంతులతోఁగూడినది యనుట, రాకే...ఖేన్దు - రాకా ఇన్దు=రాకాచంద్రుని చేత - పూర్ణచంద్రుని చేత ననుట, లాలిత=బుజ్జగింపఁబడిన - పూర్ణచంద్రునితో సాటియైనట్టి అనుట, ముఖ ఇన్దు=మోముచందురుని గలదియు-రాకనాఁటిచందురునివంటి మొగము గలది యనుట, అమ్పటసంప్రదాయి - లమ్పట=విటునియొక్క. సంప్రదాయి=సంప్రదాయముగలదియు-ఆచారముగలదియనుట-గోపికలవెంట విటుండై తిరుగువాడుకలు గలది యనుట- 'స్రస్తనిరుద్ధనీవివిలసద్గోపీసహస్రావృతమ్...కిశోరాకృతిః'పీన స్తనీనయనపఙ్కజపూజనీయే ... తవ శైశవే' ఇత్యాదులచే బాల్యముననే గోపికలయొక్క విటవ్యాపారములు జరుపుటచే ఇచట బాల్యమునకు'లమ్పటసంప్రదాయి'అనువిశేషణము చెల్లినది;లేక,లమ్పట=ఆత్యాసక్తిగలవానియొక్క, సంప్రదాయి=ఆచారము గలదియు-వేశ్యాదులవెంబడిని అత్యాసక్తితో తిరుగువారివలెనాయునన్ను వెంటనే అత్యాసక్తితో తిరుగువాడుకగలదియనుట మృదుస్మిత మధురాధర ముఖచంద్రాదులచే మనోజ్ఞవేషమై నామనస్సునకు మోహాము గొలిపి యందే యెప్పుడును వర్తించుచుండునది యనిభావము, ఇట్టిదైన, ముకున్దబాల్యమ్ శ్రీకృష్ణునియొక్క శైశవము' మనసి=నామనస్సునందు, ముహుః=మాటికిని, లగ్నం=

తగులుబడినది. 'లేఖావిలేఖిని' అనుపాఠమున, లేఖా విలేఖిని - లేఖా=చిత్తరువులను-తాను వలచినవస్తువులరూపులను, విలేఖిని=వ్రాయునట్టిదైన, మనసి=మనస్సునందు, అని మనస్సునకె విశేషణము. మనస్సు తనయందు చిత్తరువులు వ్రాసికొనునట్టిది. కావున నా మనస్సున మనోజ్ఞవేషమైన ముకుందబాల్యము - అనఁగా బాలాకృతి - చిత్తరువువలె తగులుపడియున్న దని భావము. ఈపాఠము సరసము కాదు.

ఉ. సన్నపునవ్వు నివ్వటిలుచందురకావిమెఱుంగుమోవియుం
బున్నమచందమామయొఱపుఁ నగుమోమును ముద్దుగుల్కు లీ
ల న్నెల వైనమోహనవిలాసముఁ గాంచినగోపవేషమం
పన్నునిఁ జిన్నిప్రాయ మెదఁ బాయక వ్రాసినయట్టు లుండెడున్.

తా. లేఁతచిఱునవ్వును, దేనియలుగాఱు కెమ్మోవిమెఱుఁగులును, రాకాచంద్రుని వంటిముఖమునుగలిగి, చిత్తరువులువ్రాయు నేర్పరులమెఇంపయిన వేషముతోఁగూడియొప్పు కృష్ణునిబాలరూపము నామనస్సునందు చిత్తరువువలె నచ్చుపడి యున్నది.

శ్లో॥ అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మ్యా
సరసతరసరసిరుహసదృశదృశి దేవే।
వ్రజయువతిరతికలహవిజయినిజలీలా
మదముదితవదనశశిమధురిమణి లీయే॥ 51

టీ. అహిమ...దృశి-అహిమకర=సూర్యునియొక్క, కర = కిరణములయొక్క, నికర=సమూహముచేత, మృదు=మెత్తగా, మృదిత=నలుపఁబడినదియు-విరియింపఁబడినదియు - 'మృదుమృదిత' అనుటచే తెల్లవాఱుజాము సూర్యునికిరణములే గ్రాహ్యము; అప్పటికిరణములు మిక్కిలితీవ్రముగానుండవుగాన అట్టికిరణములు మృదువుగా సోఁకఁగా వికసించినది యనుట-కావుననే, లక్ష్మ్యా=కాంతిచేత-శోభచేత, సరసతర = మిక్కిలి మనోజ్ఞమైనదియు - తామరలు తెల్లవాఱుజామున వికసించునపుడు మిక్కిలిశోభ గలిగి యుండును గాన సరసతర మనఁబడియె, ఇట్టిదైన, సరసిరుహ = తామరలను, సదృశ = సమానములైన, దృశి=కన్నులుగలవాఁడును - వేకువజామున సూర్యునికిరణములు మృదువుగా సోఁకఁగావిరిసి మిక్కిలి జిగిదొలుకుచున్న తామరరేకులవంటి కన్నులుగలవాఁడనుట, వ్రజయువతి...మధురిమణి-వ్రజయువతి-గోపస్త్రీలతోడి, రతి=మన్మథకేళీప్రయుక్తమైన, కలహ=జగడములయందలి, విజయి=గెలుపునొందిన, నిజ=తనయొక్క, లీలా=విలాసముచేతనైన, మద=మదముచేత - 'విజయిజనిలీలా' అనుపాఠమున, విజయ = గెలుపుచేతనైన, జని=పుట్టుకగల, లీలా=మదముచేత - ఆజగడములందు జయించుటచేఁ గలిగిన విలాసంపుటుబ్బుచేత ననుట. ముదిత = సంతోషించిన - సంతోషంపు సొంపుచే మఱింత ప్రకాశించుచున్న యనుట, వదన = ముఖమనెడి, శశి = చంద్రుని

యొక్క - లేక, చంద్రునివంటి ముఖముయొక్క, మధురిమణి = సౌందర్యముగలవాఁడును - గోపస్త్రీలతో మన్మథయుద్ధము చేసి గెలుచుటచేఁ గలిగిన మదమువలని సొంపుచే మఱింత పెంపారుచున్న ముఖసౌందర్యముగలవాఁ డనుట, ఇట్టివాఁడగు, దేవే = దేవుఁడైన శ్రీకృష్ణునియందు, లీయే=లీనుఁడ నగుచున్నాను, ప్రభాతకమలముయొక్క వికాసలక్ష్మిని గన్నులయందును, గోపీరతికలహవిజయప్రయుక్తమైన జ్యోత్స్నాశ్రీని మొగమునందును, వర్ణించుట తల్లీనత్వమునకు హేతువులు.

చ. రతికలహమ్మునన్ సతులఁ గ్రాయిడిఁ జేసి జయించి మించును
ద్ధతి గనిపించు లేనగవుసన్మదము గుల్కెడు మోముఁదమ్మిచే
నతులవిభాతభానుకిరణప్రవికస్వరభాస్వరాంబుజా
యతనయనద్వయంబుఁ జెలఁగుసన్నామధురద్యుతి లీన మయ్యెదన్. 51

తా. ఉదయించుచున్న సూర్యునికిరణములు మృదువుగా సోఁకఁగా విరిసి ప్రక్కలికాంతిచే మెఱయుచున్న తామరఱేకులవంటి కన్నులును, గోపికలతోడి రతికలహములందు గెలుపుగొనుటచేఁ గలిగిన మదంపుసొంపున మఱింత ప్రకాశించుచున్న చంద్రునివంటి మొగమును, గల శ్రీకృష్ణదేవునియందు లీనుఁడ నగుచున్నాను.

శ్లో॥ కరకమలదళదళితలలితతరవంశీ
కలనినదగళదమృతఘనసరసి దేవే।
సహజరసభరభరితదరహసితవీథీ
సతతవహదధరమణిమధురిమణి లీయే॥ 52

టీ. కర...సరసి_కరకమల=చేయి అనెడు తామరయొక్కయు, దళ = ఱేకులచేత_తామరవంటి చేతియొక్క వ్రేళ్లచేతననుట, దళిత=భేదింపఁబడిన_స్వరభేదములు పొందింపఁబడిన, లలితతర=మిక్కిలి మనోజ్ఞమైన, వంశీ=వేణువుయొక్క, కల=అవ్యక్తమధురమైన, నినద = ధ్వనినుండి, విగళత్=జాఱుచున్న - స్రవించుచున్న, అమృత=అమృతమయమైన, ఘన=గొప్ప, సరసి=కొలను అయినవాఁడును - వేణుస్వరమనెడి యమృతము నిండియున్న గొప్పసరస్సు అగువాఁడనుట, అమృతనిధానమువలె అత్యంతభోగ్యముగా వేణువునూఁదువాఁడనుట, సహజ...మధురిమణి-సహజ=స్వాభావికమైన, రస=సారస్యముయొక్క, భర=అతిశయముచేత, భరిత=నిండిన, దరహసిత = చిఱునవ్వుయొక్క, వీథీ=వరుసలను, సతత = ఎప్పుడును, వహత్ = తాల్చుచున్న, అధరమణి = కెంపువంటి మోవియొక్క, మధురిమణి=సౌందర్యము గలవాఁడును, స్వాభావికముగా మిక్కిలి రసవంతమైన మందహాసపుముద్రను వీడనికెమ్మోవి గలవాఁడును, అగు, దివే = దేవుఁడైన శ్రీకృష్ణునియందు, లీయే=లీనుఁడనగుచున్నాను. పూర్వశ్లోకమునఁ గన్నులును దాని కాశ్రయమగు మొగమును వర్ణించినాఁడు. ఇందుఁ బిల్లఁగ్రోవిని దానికాశ్రయమైన మోవిని

వర్ణించినాఁడు. వంశి, తామరవంటి చేతివ్రేళ్లు తనపయిని మెలఁగుటచేతను, అధరము స్వభావసరసమైన చిఱునవ్వు తనపయిని వెలయుటచేతను, మిక్కిలిమనోజ్ఞములైనవి. కెంపువలె నెఱ్ఱనైన యధరమును, దానిపయిని సరసమైన చిఱునవ్వును, దానిపైని కొలఁది లేని యమృతమౌ మొలుపు వేణువును, దానిపయిని తామరవంటి చేతియొక్క తామరస దళ ములవంటి వ్రేళ్లును అని యధరము ఒప్పినట్టు లతుప్పు నుగుట తెలుపఁబడినది.

చ. లలితకరాంగుళీదళదళన్మురళీమధురస్వరామృతో
జ్జ్వలసరసిన్ మనోజ్ఞనవహాసజస్మితకంజళచంద్రచంద్రికా
వలనరుణాధరోష్ఠమధుగ్వాసితచారుముఖాంబుజంబున౦
దొలఁకక నాదుమానసమధుబ్రతమియ్యెడ లీన మయ్యెడిన్. 52

తా. తామరవంటి చేతియొక్క మెత్తనివ్రేళ్లచేఁ బిల్లనగ్రోవియందు కొలఁది లేని యమృతమువంటి స్వరము లూఁదుచు, సహజముగా సరసమైయుండు చిఱునవ్వు నెడఁబాయని యెఱ్ఱని మోవిగలిగి యొప్పు కృష్ణదేవునియందు లీనుఁడ నగుచున్నాను.

శ్లో॥ కుసుమశరశరసమరకుపితమదగోపీ
కుచకలశఘుసృణరసలసదురసి దేవే।
మదలులితమృదుహసితముషితశశిశోభా
ముహురధికముఖకమలమధురిమణి లీయే॥ 53

టీ. కుసుమ...దుసి-కుసుమశర=మన్మథునియొక్క, శర = బాణములచేనైన, సమర=యుద్ధమునందు, కుపిత = కోపము నొందినవారును, మద=మత్తలయినవారును, అగు, గోపీ = గోపికలయొక్క, కుచకలశ=కుండవంటి పాలిండ్లయందలి, ఘుసృణ = కుంకుమపూవుయొక్క, రస=ద్రవము చేత-పూఁతచేతనుం, లసత్ = ప్రకాశించుచున్న, ఉరసి=ఱొమ్ముగలవాఁడును-సురతకేళియందు గోపికలు చెలరేఁగి గుబ్బచన్నులను గ్రుమ్మగా నందలి కుంకుమపూఁతలు తనఱొమ్మునందుఅంటుకొన్నవాఁడనుట, మద...మధురిమణి-మద=సాదయుగల - పెంపుసొంపుచేత ననుట, లులిత=ఇటునటు కదల్పఁబడిన-లేక, సొగసైన, మృదుహసిత=చిఱునవ్వుచేత, ముషిత=అపహరింపఁబడిన, శశి=చంద్రునియొక్క, శోభా=కాంతి చేత, ముహుః=మాటికి, అధిక=ఎక్కుడైన, ముఖకమల=మోముఁదామరయొక్క, మధురిమణి=సౌందర్యముగలవాఁడును-చిఱునవ్వులొప్పు చందురునికాంతివంటి కాంతిగలిగినదియు అట్టికాంతిచే ముఖకమలముయొక్క శోభ మాటికిమిక్కిలియధికమైనదనియునవము, ఇట్టివాఁడైన, దేవే=దేవుఁడైనశ్రీకృష్ణునియందు, లీయే=లీనుఁడనగుచున్నాను-ఇచట మన్మథకేళిని 'సమర' మనుటచే, అది ఉత్కటమైనదని తెలియునది. అది 'సమర' ము గావున నే అందు గోపికలను 'కుపిత' లనఁడు. కుపితలగుటచేతను గోపికల శృంగారరసోజ్జృంభణమును, మదశబ్దముచే, వారియౌవనపరిపాకమును దెలియుచున్నది.

కుపిత మదశబ్దములు రెండింటిచేతను వారి కుచకలశఘట్టనము అతి గాఢమైనదని సూచిత మగుచున్నది.

ఉ. పువ్వుల రువ్వఁగా నలుకఁ ✽ బూనినవల్లవపల్లవాధరల్
గ్రొవ్వున అవ్వ మీఱఁ జను ✽ గుత్తుల నొత్తినకుంకుమం బెదన్
నివ్వటిలన్ శశాంకుజిగి ✽ నీటుల తేటలఁ గొల్లలాడు లే
నవ్వులగోము మోమునఁ గ ✽ నం దగునందకుమారుఁ జెందెదన్. 53

తా. మన్మథక్రీడలందు గోపికలు రసావేశమునఁ జెలరేఁగి పైమఱచి నిబ్బరముగా గుబ్బచన్నులు ఱొమ్మున గ్రుమ్మఁగా నందలి కుంకుమపూఁతలు అంటుకొన్న ఱొమ్ము గలిగి, చంద్రుని వెన్నెల తేటలవలె మిటారించునవ్వు పెంపుచే మఱింత మురువు గులుకు మోముఁ దామరచే నొప్పి యున్న దేవుఁ డగు శ్రీకృష్ణునియందు లీనుఁడ నగుచున్నాఁడను.

శ్లో॥ ఆనమ్రా మసితభ్రువో రుపచితా మక్షీణపక్ష్మాంకురే
ష్వాలోలా మనురాగిణో ర్నయనయో రార్ద్రాం మృదౌ జల్పితే।
ఆతామ్రా మధరామృతే మదకలా మమ్లానవంశీరవే
ష్వాశాస్తే మమ లోచనం వ్రజశిశోర్మూర్తిం జగన్మోహినీమ్॥ 54

టీ. అసితభ్రువోః... అసిత=నల్లనైన, భ్రువోః=కనుబొమలయందు, ఆనమ్రామ్=కొంచెము వక్రమైనదియు-కొంతవంపుగల కనుబొమలు గలది యనుట, అక్షీణ...కురేషు-అక్షీణ=తక్కువకాని-దట్టమైన, పక్ష్మ=ఱెప్పలయొక్క, అఙ్కురేషు = మొలకలయందు-వెండ్రుకల మొలకలయం దనుట, ఉపచితామ్=వృద్ధిఁ బొందినదియు-దట్టముగాఁ బెరిఁగి క్రిక్కిఱిసియున్న ఱెప్పలవెండ్రుకలు గలది యనుట, అనురాగిణోః=అనురక్తి గల ఆశ్రితులయందు దయతోఁగూడిన, నయనయోః=కన్నుదోయియందు, ఆలోలామ్=చంచలమైనదియు-చంచలములైన నేత్రములు గలదియనుట-బెళుకుఁగన్నులుగలది యని యర్థము, మృదౌ=మృదువయిన, జల్పితే=మాటయందు, ఆర్ద్రాం=సరసమైనదియు-సరసముగా మాటాడునదియనుట, అధరఅమృతే=అమృతమువంటి మోవియందు, ఆతామ్రామ్=అంతట ఎఱ్ఱనైనదియు-మిక్కిలియెఱ్ఱనైన పెదవి గలది యనుట, అమ్లా...రవేషు-అమ్లాన=కనుగందని - దిట్టమైన యనుట, వంశీ=పిల్లఁగ్రోవియొక్క, రవేషు=ధ్వనులయందు, మదకలామ్—మద=మదముచేత - సంతోషాదులచేతనైన సొంపు పెంపుచేత ననుట, కలామ్=అవ్యక్తమధురమైనదియు - సొంపుచే అవ్యక్తమధురముగా వేణుగానము సేయునది యనుట, జగత్ మోహినీమ్ - జగత్=లోకములకు, మోహినీమ్=మోహసంపాదకమైనదియు, అగు, వ్రజశిశోః=గొల్లచిన్నవానియొక్క, మూర్తిమ్=ఆకారమును - దివ్యమంగళవిగ్రహమును, మమ=నాయొక్క, లోచనమ్=నేత్రము, ఆశాస్తే=కోరుచున్నది.

ఉ. కాంచుట యెన్నఁ డీక్షణసుఖంబుగఁ దొంగలిఱెప్పలున్ బనా
యించినవింటివంటిబొమ లింపగుమాటలు కెంపుమోవిఁ బొం
దించినపిల్లఁగ్రోవిఁ బలికించుహళాహళియున్ దయోన్నతిన్
మించిన బెళ్కుఁజూపుఁ గలమిక్కిలిచక్కనిముద్దుబాలకున్. 54

తా. వంపుగలకనుబొమలును, దట్టములగు ఱెప్పవెండ్రుకలును, కరుణారస మొలుకు బెళుకుఁగన్నులును, సరసంపుఁబలుకులును, ఎఱ్ఱనై యమృతమువలె చవిగులుకు మోవియు, సొంపుగా మఱింతసుఖముగా నూదఁబడుపిల్లఁగ్రోవిరవళియుఁగల గొల్లపిల్లవాని దివ్యమంగళవిగ్రహమును నాకన్నులు చూడఁగోరుచున్నవి.

శ్లో॥ తత్కైశోరం తచ్చ వక్త్రారవిన్దం
తత్కారుణ్యం తేచ లీలాకటాక్షాః।
తత్సౌన్దర్యం సాచ మన్దస్మితశ్రీః
సత్యం సత్యం దుర్లభం దైవతేషు॥ 55

టీ. తత్=ఆ-నామనంబునఁదోఁచినట్టి-ఇట్లే తచ్ఛబ్దమునకు మీఁదనెల్ల గ్రహించునది, కైశోరమ్=బాల్యమును, తత్=ఆ, వక్త్రారవిన్దంచ=మోముదామరయును, తత్=ఆ, కారుణ్యం=దయయు, తే=ఆ, లీలాకటాక్షాశ్చ-లీలా=విలాసప్రయుక్తము లైన, కటాక్షాశ్చ=కడగంటిచూపులును, తత్=ఆ, సౌన్దర్యం=చక్కఁదనమును, సా=ఆ, మన్ద...శ్రీశ్చ-మన్దస్మిత=చిఱునవ్వుయొక్క, శ్రీశ్చ=సంపత్తియు, దైవతేషు=దేవతలయందును, దుర్లభమ్=దొరకరానిది. సత్యం=ఇది యథార్థము-సత్యం=యథార్థము.

శా. ఆకారుణ్యకటాక్షవీక్షణము లాయందంపు లేఁబ్రాయ మా
యాకారద్యుతి యావరస్మితముతీ రామోము చక్కందనం
బా కెంజాయపదంబు లానడలయొయ్యారంబు లేవేల్పులం
దేకాలంబున లేదు లే దనుమ నే నెందేనిఁ జాటించెదన్. 55

తా. నాహృదయమందు గోచరించినకృష్ణుని యాబాల్యమును, తామరవంటి యామొగమును, ఆదయయు, విలాసముతోఁగూడినయాకడగంటిచూపులును, ఆచక్కందనమును, ఆచిఱునవ్వుసొగసును దేవతలయందును గానఁబడవు. ఇది ముమ్మాటికిసత్యము.

శ్లో॥ విశ్వోపప్లవశమనైకబద్ధదీక్షం
విశ్వాసస్తబకితచేతసాంజనానామ్।
పశ్యామః ప్రతినవకాన్తికన్దళార్ద్రం
పశ్యామః పథి పథి శైశవం మురారేః॥ 56

టీ. విశ్వా...చేతసాం-విశ్వాస = విశ్వాసముచేత-వీఁడే పరమపురుషుఁడు రక్షకుఁడును అనుభక్తిపూర్వకమైనవిశ్వాసముచేతననుట, స్తబకిత = గుత్తులుగలదిగాఁజేయఁబడిన-మిక్కిలియుపిశ్వాసముగలయనుట, చేతసాం=మనస్సుగలవారైన, జనానామ్=జనులయొక్క, విశ్వో...దీక్షమ్-విశ్వ=సమస్తమైన, ఉపప్లవ= ఉపద్రవములయొక్క, శమన=శాంతియందు,ఏక=ముఖ్యముగా, బద్ధ=కట్టఁబడిన (కయికొనఁబడిన), దీక్షమ్=నియతిగలదియును, ప్రతి...శార్ద్రమ్—ప్రతినవ=ప్రతిక్షణమును నూతనముగాఁ గనఁబడుచున్న, కాన్తి=కాంతులయొక్క, కన్దళ=మొలకలచేత, ఆర్ద్రం=సరసమైనదియు, అగు, మురారేః=శ్రీకృష్ణునియొక్క, శైశవం=బాల్యమును, పథిపథి=ప్రతిమార్గమందును, మాటికి ననుట, పశ్యామః=చూచుచున్నాము, పశ్యామః=చూచుచున్నాము.

మ. నుతధారాధరకాంతికందళము కన్నుల్ చల్లఁ జేయన్ సమ
గ్రతరాతంకపరంపరాశమనదీక్షన్ దేహముల్ వ్రజకా
యతఁ గాంచన్ నెఱనమ్మినట్టివ్రజ కన్యానంద మా దేవకీ
సుతునోయ్యారపుబాలలీలఁ గనవచ్చున్ నాదుదృగ్వీథులన్. 56

తా. తనయందు పరదైవమనియు రక్షకుఁడనియు భక్తివిశ్వాసములు గలవారియొక్క సమస్తకష్టములను దీర్చుటయే వ్రతముగాఁ గలిగి, ప్రతిక్షణమును గ్రొత్తయగు జిగిమొలకలు దళుకొత్తుచుండ వెలుంగుచున్న బాలుఁడైయవతరించిన చిన్నికృష్ణునిబాల్యమును మాటికి కనుఁగొనుచున్నారము.

శ్లో॥ *వక్రాళి శ్చన్ద్రికభూషణా మరకతస్తమ్భాభిరామం వపు
ర్వక్త్రం చిత్రవిముగ్ధహాసమధురం బాలే విలోలే దృశౌ
వాచ శ్శైశవశీతలాః మదగజశ్లాఘ్యా విలాసస్థితి
ర్మన్దంమన్ద మయే క ఏష మధురావీథీ మితో గాహతే॥ 57

టీ. అయే బాలే = ఓచిన్నదానా, వక్రాళిః = సిగ, చన్ద్రికభూషణా-చన్ద్రిక=నెమిలిపురి యనెడి, భూషణా=ఆభరణము గలది, వపుః=శరీరము, మర...రామమ్-మరకత = ఇంద్రనీలమణిమయమైన, స్తమ్భ=కంబమువలె, అభిరామం=సుందరమైనది. వక్త్రం=మొగము, చిత్ర...మధురం-చిత్ర=విచిత్రమును, విముగ్ధ=మిక్కిలి సుందరమును, అగు, హాస=నగవుచేత, మధురమ్=మనోహరమైనది, దృశౌ=కన్నులు, విలోలే=మిక్కిలిచంచలములైనవి, బెళుకు లీనునవి యనుట, వాచః=పలుకులు, శైశవశీతలాః-శైశవ=బాల్యముచేత, శీతలాః=చల్లనైనవి.పసితనంపుముద్దులు గులుకుటచే సుఖప్రదములైన వనుట, విలాసస్థితిః-విలాస=గమనవిలాసముయొక్క, స్థితిః=విధము, మద...శ్లాఘ్యా

* ఈశ్లోకము ఒకదివ్యస్త్రీ మఱొక్కతెతోఁ జెప్పునది. ఇది కొన్నిప్రతులందుఁగానిపింపదు.

-మదగజ=మదపుటేనుఁగువలె, శ్లాఘ్యా = కొనియాడఁదగినది - ఇట్టిగుణములు గలవాఁడై, మన్దం మన్దమ్=మెల్లమెల్లగా, ఇతః = ఇటనుండి, మథురావీథిం=మథురాపట్టణము యొక్క-వీథిని, ఏషః=వీఁడు, కః=ఎవఁడు, గాహతే=ప్రవేశించుచున్నాఁడు - ప్రవేశించుచున్నవీఁ డెవఁ డనుట.

ఉ. మౌళితటిన్ ఘటించిననెమ్మంచితపింఛము మందహాసమున్
లోలవిశాలలోచనముగ్గలుం జెలువప్పును ముద్దుమాటలున్
నీలపుడాలు సేలుమెయినిగ్గులుఁ గల్గినవాఁ డెవ్వఁడో
వ్రాలెను వీనిఁ జూడు మధురాపురవీథులఁ బాటలాధరా. 57

తా. తలయందు నెమిలిపురిని జెక్కి, నీలపుకంబమువలె నిగనిగలాడు నల్లనిమేను గలిగి, వింతయైన సొగసునవ్వు మొగంబున నివ్వటిల్ల, బెళుకుఁగన్నులతో, పసితనపు ముద్దుఁబలుకులు పలుకుచు, మదపుటేనుంగువలె మురిపంపునడకతో నిచటనుండిమథురాపురవీథిని మెల్లమెల్లఁగాఁ బ్రవేశించుచున్నవీఁ డెవఁడు?.

శ్లో॥ పాదౌ పాదవినిర్జితామ్బుజవనౌ పద్మాలయాలఙ్కృతౌ
పాణీ వేణువినోదనప్రణయినౌ పర్యాప్తశిల్పశ్రియా
బాహూ దోహదభాజనం మృగదృశాం మాధుర్యధారా గిరో
వక్త్రం వాగ్విభవాతిలఙ్ఘితమహో బాలం కిమేత న్మహః॥ 58

టీ. పాద...వనౌ-పాద = అంశముచేత, వినిర్జిత=జయింపఁబడిన, అమ్బుజవనౌ=తామరతంపరలుగల-తనయందలి ఒక్కంతభాగముచేతనే పెక్కుతామరలను ఓడించినవి అయినవనుట, పాదౌ=పాదములు, పద్మాల...కృతౌ-పద్మాలయా=లక్ష్మీదేవిచేతఅలఙ్కృతౌ=అలంకరింపఁబడినవి - లక్ష్మిచేత-బ్రకాశించుచున్నవి - ఆశ్రితులకు లక్ష్మీప్రదములైనవనుట, వేణు...ప్రణయినౌ—వేణు=పిల్లఁగ్రోవియొక్క, వినోదన = వాయించుటయందు, ప్రణయినౌ=ప్రీతిగలవైన, పాణీ=చేతులు, పర్యా...శ్రియా-పర్యాప్త=పరిపూర్ణమైన, శిల్ప=పనితనముయొక్క, శ్రియా=సంపదగలవి - శిల్పపుసొంపు లన్నియు పరిపూర్ణముగాఁ గలవియనుట-ఇంతకంటె నెక్కుడుసొగసైనవి కలుగవనుట, బాహూ=బుజములు, మృగదృశామ్=(లేడివంటికన్నులుగల) స్త్రీలకు, దోహదభాజనమ్ - దోహద=దోయదక్రియకు - అకాలమునందు వృక్షలతాదులను బుష్పింపఁజేయు దోహదవ్యాపారమునకు, భాజనమ్=స్థానము -అనగా దోహదక్రియ అకాలమునందును వృక్షాదుల నెట్లు పుష్పింపఁజేయునో, ఆట్లే కృష్ణునిభుజములును గౌఁగిలించినమాత్రమున బాలికలనైనను ప్రౌఢలనుగావించునట్టివి అని యాశయము. గిరః=మాటలు, మాధుర్యధారాః-మాధుర్య=తియ్యదనముయొక్క, ధారాః=ప్రవాహముగలవి - ఎడతెగనితేనియ లొలుకునవి అనుట. వక్త్రం=మొగము, వాక్...లఙ్ఘితమ్ - వాక్ విభవ = మాటలపెంపుయొక్క, అతిలఙ్ఘితమ్ = అతిక్రమణము గలది-మాటలపెంపుసొంపును అతిక్రమించినవి, 'వాగ్విభ

యాతిలజ్ఘితమ్ అనుపాఠమున,! వాక్ = వాక్కు యొక్క, విషయ = గోచరత్వముయొక్క, అతిలజ్ఘితమ్ అతిక్రమణముగలది - వాక్కునకు విషయముకానిది అనుట - మాటలచేత వర్ణింపరాని దనుట, ఏతత్ = ఈ - ఈపూర్వోక్తలక్షణములుగల, మహః = తేజస్సు, బాలః కిమ్ = బాలుఁడా ఏమి, అహో = ఆశ్చర్యము - ఈరూపమును ఒకతేజస్సు అని మొదట గ్రహించితిని - సావధానముగాఁ జూడఁగా అత్యంతసుందరములైన కరములు, చరణములు, మాటలు ముఖమును గానిపించుట చూడఁగా బాలుఁడా ఏమి యని తోఁచుచున్నది అని యాశయము. బాలుని మొదట కేవలము తేజస్సుగా గ్రహించుటచే నిరవధికకాంతిసముజ్జ్వలత్వమువలన కన్నులు మిఱుమిట్లుగొనుట స్ఫురించెడిని. ఇది తేజఃపుంజమే. అయిన నిది కరచరణాదులు గలిగి బాలునిరూపునఁ దోఁచుచున్నదే ఏమివింత యని ఆశ్చర్యము. ఇట్టి తేజస్సు బాలురకుఁ గలుగుట యరిది. ఇట్టియనన్యసామాన్యతేజస్సుగల యొకబాలుఁడు ఉండఁడని యాశయము. పాదములు తమయందలి అంశముచేతనే తామరతంపరలను గెలిచినవి. ఇఁక దాము పూర్ణముగా నెదిరించినయెడల తామరలు నిలుచునా యని వానియపూర్వసౌందర్యాతిశయము ధ్వనితము.

చ. చెలువల కెల్ల దోహదము సేయుకరంబులు లచ్చి కాకరం
బులు జితపద్మముల్ చరణముల్ మురళీరచనాచమత్క్రియా
కలితము కేలుఁదమ్మి ముఖకాంతులు వింతలు తేనె లూరుమా
టలు గలయట్టిశైశవవిగ్రహంబన తేజ మి దేమి చిత్రమో. 58

తా. తామరతంపరనెల్లఁ గెలువఁజాలు పాదములు లక్ష్మికి ఆటపట్టులు. మురళి నూఁదుచున్న చేతులు శిల్పంపుసొంపంతయుఁగూర్చి తీర్చినట్టిది. బుజములో బాలికలనేని ప్రౌఢలను గావించునంతమనోహరము లైనవి. మాటలు తేనెలొలుకుచున్నవి. మొంగము ఇట్టిదట్టిదని వర్ణింపఁదరముకాదు. మొదటఁ జూచినపుడు కేవలము ఒకతేజస్సుగానుండె నుగాని యిట్టియవయవసంపత్తిబట్టి బాలుఁడా ఏమి యని తోఁచుచున్నది. ఔరా! ఇట్టితేజస్సు గల యొకబాలుఁడుకూడ నుండునా!

శ్లో॥ బర్హం నామ విభూషణం బహుమతం వేషాయ శేషై రలం
వక్త్రం ద్విత్రవిశేషకాన్తిలహరీవిన్యాసధన్యాధరమ్।
శీలై రల్పధియా మగమ్యవిభవైః శృఙ్గారభఙ్గీమయం
చిత్రం చిత్ర మహోవిచిత్ర మహహో చిత్రంవిచిత్రం మహః॥ 59

టీ. బర్హం = నెమిలిపురి, నామ = అనెడు, విభూషణం = ఆభరణము, బహుమతం = మిక్కిలి యంగీకరింపఁబడినది. వేషాయ = అలంకారముకొఱకు, శేషైః = ఇతరభూషణము లచేత, అలం = చాలు - వేషమునకు నెమిలిపురియొకటే చాలును. తక్కినసొమ్ములు అక్క

ఉలేదనుట, వక్త్రం=మొగము, ద్విత్రి...ధరమ్ - ద్విత్ర=రెండుమూఁడైన, విశేష=తిలకములయొక్క, కాన్తి=కాంతులయొక్క, లహరీ=ప్రవాహముయొక్క, విన్యాస=ఉనికిచేత-వ్యాప్తిచేత, ధన్య = సంపన్నమైన-ఇట్టికాంతిసంపత్తిగల, అధరమ్ పెదవిగలది, అల్పధియామ్=స్వల్పబుద్ధిగలవారికి, అగమ్యవిభవైః-అగమ్య-పొందరాని-తెలియరాని, విభవైః=వైభవముగల-పెంపుసొంపుగల, శీలైః=స్వభావములచేత, శృఙ్గార...మయమ్ - శృఙ్గార=సింగారములయొక్క, భఙ్గీ = విధములచేత, మయమ్=ప్రచురమైనది-మిక్కిలియుసింగారంపువగలుగులుకునదియనుట. ఇట్టిదగు, మహః=తేజస్సు, చిత్రం=ఆశ్చర్యము, చిత్రం=ఆశ్చర్యము, ఆహో=ఆశ్చర్యము. విచిత్రమ్=ఆశ్చర్యముగలది, అహహో=ఆశ్చర్యము, చిత్రం=ఆశ్చర్యము, విచిత్రం=ఆశ్చర్యమైనది-ఇంతింతనిచెప్ప రాని ఆశ్చర్యమైనదనుట. ఇందును బాలుఁడనక 'మహః' తేజస్సు అనుటచే నిరవధిక కాంతివిభవము తెలియునది. ఇదియొక తేజోమయమైనవస్తువు; బాలరూపముగలది. తేజస్స్వరూపమైన యీవస్తువునకు విశేషించిసొమ్ములేల? శిరస్సునకునెమిలిపురియొకటియు, మొగమునకు రెండుమూఁడుబొట్లును మోవియునే అలంకారమునకుఁ జాలును; ఇది నిలువెల్ల ఇంతింతనరాని శృంగారములపుంజ మగుటచే శృంగారపువగలే తక్కిన యవయవములకు సొమ్ములు. వస్తువో కేవల తేజస్సు రూపమునందే బాలునివలెఁగనఁబడుచున్నది. అందును ఇట్టి సొమ్ములే చాలియున్నవి. కనుక ఇది వింతలలో వింత అని భావము.

ఉ. సొమ్ములు మేని కందమని చూడక పింఛమె పూని మోముపైఁ
గమ్మనిబొట్లు దొంతరలు గా విలసిల్లఁగఁ గావిమోవిచె
ల్వమ్ము రసోత్తరంగవిభ వమ్ము నగమ్యము నై తనర్పఁ జి
త్ర మ్మొకపాటివారికిఁ ద రంబె నుతింప నొయారితేజమున్. 59

తా. శిరస్సున కెల్ల నెమిలిపురి యొకటియే అలంకారమునకుఁ జాలినదై, రెండుమూఁడు తిలకములకాంతిఁ దళుకొత్తుచున్న మొగమున కెల్ల మోవి యొక్కటియే వన్నె దెచ్చుటకుఁ జాలినదై, నిలువెల్ల ఇట్టిదట్టిదని సామాన్యబుద్ధులకుఁ దెలియరాని శృంగారముల రాశియై, యొప్పుకృష్ణాఖ్యతేజస్సు చూడంజూడ మఱిమఱి విచిత్రముగా నున్నది. ఔరా! ఇట్టిదియుం గలదా!.

శ్లో॥ అఙ్గే సమగ్రయతి కామపి కేళిలక్ష్మీ
మన్యాసు దిక్ష్వపి విలోచనమేవ సాక్షి ।
హాహన్త హన్త మథ దూర మహో కి మేత
దాసీ త్కిశోరమయ మమ్బ జగ త్త్రియం మే॥ 60

టీ. అగ్రే=ముందట, కామపి=చెప్పనలవికాని, కేళిలక్ష్మీం-కేళి=క్రీడయొక్క. లక్ష్మీం=సంపదను - -విహారంపుసొంపును, సమగ్రయతి=పూర్ణముగాఁ జేయునది - ఎదుటనే మిక్కిలియుఁ గ్రీడించుచున్నదనుట, అన్యాసు=తక్కిన, దిక్షు అపి=దిక్కుల యందును, కామపి కేళిలక్ష్మీం సమగ్రయతి=చెప్పనలవికాని విహారసంపదను నించుచున్నది-అనఁగా మిక్కిలియుఁ గ్రీడించుచున్నది. ఇందులకు విలోచనమేవ=నాకన్నే, సాక్షీ=ప్రమాణము, హాహన్త=అకటకటా, హన్త=మూర-మూరెఁడుదగ్గఱనున్నది, అథ =పిదప; దూరం=దూరమునుఅయినది-ముంగలనే క్రీడించుచుండుటచే మూరెఁడు దాపున నున్నట్లును, దిక్కులయందును గ్రీడించుచుండుటచే దవ్వులనును గనఁబడుచున్నదైన, ఏతత్=ఇది, కిం=ఏమి? అహో=ఆశ్చర్యము. అమ్బ=తల్లీ. జగత్ త్రయం=మూఁడులోకములును, కిశోరమయమ్=బాలునిమయముగా, మే - నాకు, ఆసీత్=అయెను - ముంగల మూరెఁడుదాపునను గనఁబడుచున్నది, దవ్వుల దిక్కులకడలను గనఁబడుచున్నది. కాఁబట్టి ముల్లోకములును నిండియున్నది. మఱియు నీతేజస్సు బాలరూపమున వ్యాపించియుండుటచే ముల్లోకములును బాలమయముగా నున్నవి. ఇది యేమియని యాశ్చర్యము.

శా. చూడం జూడ మనోహరాకృతి గడుం దేజోద్యంబుగా బాలకుం
డాడున్ ముందటఁ గౌఁగిలింతు నని డాయం జిక్కఁ డారీతినే
క్రీడించున్ దిశలందు నిందులకు నక్షిద్వంద్వమే సాక్షి యీ
జాడన్ ముజ్జగ మంబ బాలమయ మాశ్చర్యంబు నాకెంతయున్.

తా. ముంగల మూరెఁడుదాపునను, దవ్వుల దిక్కులయందును ఇంతింతనరాని యింపుసొంపుగా ఈ వస్తువు ఆడుచున్నది. ఇందులకు నాకన్నులే సాక్షి. ఈ వస్తువేమి? ఇట్లు దగ్గఱను దూరమునను అంతటను బాలరూపమైన యీ వస్తువు ఆడుచుండుటచే ముల్లోకములును నాకు బాలమయ మయ్యెను.

శ్లో॥ చికురం బహుళం విరళం భ్రమరం
మృదులం వచనం విపులం నయనమ్
అధరం మధురం వదనం లలితం
చపలం చరితం చ కదానుభవే॥ † 61

టీ. శ్రీకృష్ణునియొక్క, బహుళం=దట్టమైన, చికురమ్=కురులును, విరళం=పలుచనైన, భ్రమరం=ముంగురులును, మృదులం=కోమలమైన, వచనం=వాక్యమును, విపులం=విశాలమైన, నయనమ్=నేత్రమును, మధురం=మనోజ్ఞమైన, అధరం=పెదవిని, లలితం=సుందరమైన, వదనం=ముఖమును, చపలం=చంచలమైన, చరితం=చరిత్రమును, కదా=ఎప్పుడు, అనుభవే=అనుభవింతును-చూతుననుట. చరితము బాల్యప్రయుక్తమైన చంచలత్వము కలిగి యున్నదనియు కావుననే మనోజ్ఞమనియు నిట నూహ్యము.

ఉ. వెన్నెల గోపకాంతలను వేడుకఁ గోరెడుచాపలంబుతోఁ
గన్నుల బెళ్కుతో నగుమొగంబున వ్రాలుచలాలకాళితోఁ
దిన్ననిపల్కుతో ముడిచి దిద్దినగొప్పశిరోజపాళితో
నెన్నఁడు నాదుమ్రోలఁ జరియించునొ వెన్నుఁడు కావిమోవితోన్.

తా. కృష్ణుని దట్టఁపునెఱిశిరులను, పలుచనిముంగురులను, మెత్తనిపలుకులను, వాలుఁగన్నులను, సొగసైనమోవిని, చెలువైనమొగమును, చంచలమైన నడవడిని నేనెప్పుడు చూతునో!

శ్లో॥ పరిపాలయ నః కృపాలయే, త్యసకృ జ్జల్పిత మాత్మబాన్ధవః।
మురళీమృదులస్వనాన్తరే, విభు రాకర్ణయితా కదాను నః॥ 62

టీ. హేకృప ఆలయ=దయకు ఇల్లయినవాఁడా-దయానిధీ యనుట, నః=మమ్ము పరిపాలయ=కావుము, ఇతి=అని, అసకృత్=మాటిమాటికిని, నః=మాయొక్క, జల్పితం చెప్పుటను, ఆత్మబాన్ధవః=నాకుబంధువు-అయిన, విభుః=విభుఁడగుశ్రీకృష్ణుఁడు, మురళీ ...స్వనాంతరే—మురళీ=పిల్లఁగ్రోవియొక్క, మృదుల=కోమలమైన. స్వన=ధ్వనియొక్క, అన్తరే=మధ్యమున, కదాను=ఎప్పుడు, ఆకర్ణయితా=వినఁగలఁడో ? కృష్ణుఁ=ఆత్మబాంధవుఁడు. కావుననే ఆవిభుని నన్నుఁగాచునట్లు మొఱయిడుచున్నాను. ఆదేవుఁడు వేణుగానరతుఁ డగుటచే వేణుగానపారవశ్యమునఁగాని వేణుధ్వనియందుఁ గాని నా మొఱ వానికి వినఁబడదు. అయినను నేను 'అసకృత్' మాటిమాటికి విడువక మొఱయిడుదు నేని వేణువు గట్టిగా నూఁదునప్పుడు లేకున్నను మృదువుగా నూదునప్పుడైనను నా మొఱ నావిభుఁడు వినవచ్చును. అట్లువినుట యెన్నఁడో యని భావము. లేక 'స్వనాన్తరే' అనుటకు ధ్వనులనడుమ అని యర్థము గ్రహించినయెడల ఆధ్వనులనడిమియవకాశములందు ఎప్పుడు నా మొఱను వినునో అనియు గ్రాహ్యము.

చ. నిరుపమవేణుగానమహనీయసుఖానుభవైకమగ్నతం
గరఁగి పరాకుఁ గైకొనినకంజదళాక్షుఁడు దప్తచిత్తుఁడై
నిరతము నన్నుఁ గావు నవనీతహరా యని మాటిమాటికిన్
మొఱ యిడునట్టి నావచనముల్ దయతో నెపు డాలకించునో. 62

తా. ఆత్మబంధుఁడైనవిభుఁడు శ్రీకృష్ణుఁడు కావుకావు మని పలుమాఱు నేను పెట్టుచున్న మొఱను మురళిని మెల్లగా నూఁదు నవసరములందుఁగాని ఆధ్వనుల నిలుపు నట్టినడుమఁగాని యెప్పుడు వినునో కదా!

శ్లో॥ కదాను కస్యాన్ను విపద్దశాయాం
కైశోరగన్ధిః కరుణామ్బుధి ర్నః।

విలోచనాభ్యాం విపులాయతాభ్యాం
వ్యాలోకయిష్యన్విషయీకరోతి ॥ 63

టీ. కదాను=ఎప్పుడు, కస్యాం=ఏ, విపద్దశాయామ్ = ఆపత్సమయందు, కైశోరగన్ధిః-కైశోర = బాల్యముయొక్క, గన్ధిః = గంధముగలవాఁడు - ఒకించుంత బాల్యముగలవాఁడు, అగు, కరుణా అమ్బుధిః=దయాసముద్రుఁడు-శ్రీకృష్ణుఁడు, విపుల ఆయతాభ్యామ్-విపుల=వెడల్పులును, ఆయతాభ్యామ్-నిడుదలును, అయిన, విలోచనాభ్యామ్=నేత్రములచేత, వ్యాలోకయిష్యన్=మిక్కిలిచూడఁగలవాఁడై, నః=మమ్ము, విషయీకరోతి=(తనచూపులకు) విషయముగాఁ జేయునో- ఎప్పుడు తనకన్నులార మమ్ముఁజూచునో యనుట, మేము పట్టిసమయములందు ఎంతపిలిచినను కృష్ణుఁడు వచ్చుట అరుదు. మాకు 'విపద్దశ' కలిగినేని, వాఁడు 'కరుణాంబుధి' గావున కరుణాప్రేరితుఁడై మమ్ముఁ జూడవచ్చునని భావము. 'కైశోరగన్ధి' అనుటచే శ్రీకృష్ణుఁడు దర్శన మొసంగునప్పుడు ఒకించుంతబాల్యముతోఁగూడినవాఁడై యుండవలయు నని కవియభిప్రాయము. కృష్ణునిబాలవేషమునందు వ్యామోహ మెక్కుడుగావున బాల్యమువీడి వీడని వయస్సును అప్పుడు మఱింత వికసింపఁజేసినకన్నులును జూడవలయునని కవిహృదయము.

చ. ఒకవలవంతఁ జింతిలుచు నుండఁజూచిన నన్ను శిశుత్వగంధమా
త్రకలితయౌవనంబు తనర్పం గరుణావరుణాలయుండు వా
యక శతపత్రపత్రవిపులారుణలోచనలీలఁ జూచుమా
ర్కి కీఁ దగు వీఁ డటంచుఁ బరిగ్రకించుట లెన్నఁడు గల్గునేర్చునో. 63

తా. ఏవిపత్తు కలుగునప్పుడు కరుణానిధి యైనకృష్ణుఁడు ఒకించుంత బాల్యము వీడనిప్రాయము గలవాఁడై నిడువాలుఁగన్నులార మమ్ముఁ జూడ వచ్చునో.

శ్లో॥ మధుర మధరబిమ్బే మఞ్జులం మన్దహాసే
శిశిర మమృతవాదే శీతలం దృష్టిపాతే ।
విపుల మరుణనేత్రే విశ్రుతం వేణునాదే
మరకతమణినీలం బాల మాలోకయే ను॥ + / 64

టీ. అధరబిమ్బే=దొండపండువంటి పెదవియందు- మధురం=తియ్యనైనవాఁడును-తియ్యనై దొండపండువలె ఎఱ్ఱనగు మోవిగలవాఁడనుట, మన్దహాసే=చిఱునవ్వునందు మఞ్జులమ్=మనోజ్ఞమైనవాఁడును-సొగసైనచిఱునగవు గలవాఁ డనుట, అమృతవాదే= అమృతమువలె మాటాడుటయందు, శిశిరం=చల్లనయినవాఁడును-చల్లగా నమృత మొలుకునట్లు మాటాడువాఁ డనుట. దృష్టిపాతే-దృష్టి=చూపుయొక్క, పాతే=పాటునందు-చూపు ప్రసరించుటయందు-శీతలం=చల్లనైనవాఁడును-చల్లనిచూపులఁ జూచువాఁడనుట,

అరుణనేత్రే-అరుణ=ఎఱ్ఱనైన, నేత్రే=కన్నులయందు, విపులం=వెడలుపైనవాఁడును-వెడలుపైన మెట్టికన్నులుగలవాఁడనుట, వేణునాదే=పిల్లఁగ్రోవియొక్క-ధ్వనియందు, విశ్రుతం=మిక్కిలి వినఁబడినవాఁడును-లేక ప్రసిద్ధుఁడైనవాఁడును-అందఱును మిక్కిలి వినునట్టి వేణుధ్వనిగలవాఁడనుట, మరకతనీలం-మరకతమణి=ఇంద్రనీలరత్నమువలె, నీలం=నల్లనైనవాఁడును, అగు, బాలం=బాలుని-శ్రీకృష్ణుని, ఆలోకయామి=చూతునాయేమి.

ఉ. చల్లనిబెళ్కుఁజూపు సుధఁ జల్లెడుమాటలుఁ దియ్యమోవియున్
సల్లలితారుణద్యుతివిశాలవిలోచనముల్ మృదుస్మితో
త్ఫుల్లముఖాంబుజంబుఁ బరిపూరితవేణువినోదనాదమున్
నల్లనిమేనిక్రొమ్మెఱుఁగుసొగసున్ విలసిల్లినబాలుఁ గాంచెదన్. 64

తా. తియ్యనై దొండపండువలె ఎఱ్ఱనగు కెమ్మోవియును, సొగసైన చిఱునగవును చల్లనై యమృత మొలుకు పలుకులును, చల్లనిచూపులును, ఎఱ్ఱనైన వెడఁదకన్నులును, వీనులకు విందులు సేయు వేణుధ్వనియుఁ గలిగి, యింద్రనీలమణివలె నల్లనై విలసిల్లు చిన్నిబాలుని కృష్ణుని జూతునాయేమి !

శ్లో॥ మాధుర్యాదపి మధురం, మన్మథ తాతస్య కిమపి కైశోరమ్ ।
చాపల్యాదపి చపలం, చేతో మమ హరతి హన్త కిం కుర్మః॥ 65

టీ. మాధుర్యాత్ అపి=సౌందర్యముకంటెను-చక్కఁదనము అని లోకులచే సంకేతింపఁబడిన గుణవిశేషముకంటెను అనుట, మధురమ్=సుందరమైనది-లోకమునందలి సౌందర్యముకన్నను మించినసౌందర్యము గలది-లోకాతీతమై వర్ణింపనలవికాని సౌందర్యముగలది యనుట, చాపల్యాత్ అపి=చపలత్వముకంటెను-లోకమునందు చపలత్వము అనఁబడు గుణవిశేషముకంటెను, చపలమ్=చంచలమైనది-లోకము లెఱింగినచపలత్వముకంటెను మించినచపలత్వము గలది యనుట-ఇంతింతనరాని చాపల్యముగలదనుట, కావున నే, కిమపి=ఇట్టిదట్టిదని చెప్పనలవికానిదియు, అగు, మన్మథతాతస్య-మన్మథ=ప్రద్యుమ్నుఁడుగా పుట్టినమన్మథునికి, తాతస్య=తండ్రియైన శ్రీకృష్ణునియొక్క, కైశోరమ్=బాల్యము, మమ=నాయొక్క, చేతః=చిత్తమును, హరతి=హరించుచున్నది. కిం=ఏమి, కుర్మః=చేయుదుము, హన్త=అకటా, మాధుర్యమునకంటె మధురమైనది కావున నా మనస్సును హరించుచున్నది. కాబట్టి, దానిని మాపఁగోరితినా చాపల్యమునకంటె చపలమైనది గావున నాకుఁ జిక్కదయ్యె, కాబట్టి, 'హన్త' అక్కటా ఏమిసేయుదు నని సంతాపాతిశయము. మఱియు సౌందర్యమునకు నుపమానభూతుఁడగు మన్మథునిఁ గన్నతండ్రి యగుటచే నిరవధికసౌందర్యనిధి యగుట వ్యంజితము.

ఉ. గబ్బిమెఱుంగుఁబోండ్లు తటక్కాపడి లోలతఁ జూచునంతలో
నిబ్బరమైనతత్తఱము నెక్కొన నందముకన్న నందమై
యబ్బురమైనబాల్యమున నద్దిర యంగజుఁ గన్నతండ్రి యా
గుబ్బున నామదిం గలుగు గుట్టుఁ గలంచె నిఁకేమి సేయుదున్. 65

తా. అందముకన్న నందమైనచిన్నికృష్ణుని బాల్యము నామనస్సును హరించుచున్నది. అయినను అది చపలములైనవానిలో నెల్ల మిక్కిలి చపలమైనది. కావున నకటా నే నేమి చేయుదును ?

శ్లో. వక్షఃస్థలే చ విపులం నయనోత్పలే చ
మన్దస్మితే చ మృదులం మదజల్పితే చ।
బిమ్బాధరే చ మధురం మురళీరవే చ
బాలం విలాసనిధి మాకలయే కదా ను॥ 66

టీ. వక్షఃస్థలేచ=ఱొమ్మయొక్క ప్రదేశమునందును, నయనఉత్పలేచ=కలువవంటి కన్నులయందును, విపులమ్=విశాలమైనవాఁడును-విశాలమైన వక్షమును కన్నులును గలవాఁడు అనుట, మన్దస్మితేచ=చిఱునవ్వునందును, మదజల్పితేచ-మద=మద ప్రయుక్తమైన, జల్పితేచ=మాటయందును, మృదులం=కోమలమైనవాఁడును-కోమలమైన చిఱునవ్వును, కోమలములైన మురువుమాటలును గలవాఁడనుట, బిమ్బఅధరేచ=దొండపండువంటి మోవియందును, మురళీరవేచ=పిల్లఁగ్రోవిధ్వనియందును, మధురం = ఇంపయినవాఁడునుమనోజ్ఞమైనమోవియు పిల్లఁగ్రోవిరవళియుఁ గలవాఁడనుట, విలాసనిధిం-విలాస=విలాసములకు, నిధిం = నిక్షేపమైనవాఁడును - సకలమైన విలాసములను బచరించువాఁ డనుట, అగు, బాలం=బాలుఁడైనకృష్ణుని, కదా=ఎప్పుడు, ఆకలయేను=పట్టుకొందునో-చూతునో యనుట, విశాలమైన ఱొమ్మును గన్నులును, మృదువైనచిఱునవ్వును మురువుమాటలును, సొంపయినమోవియు పిల్లఁగ్రోవిరవళియుఁ గలిగి యుండుటచేతనే విలాసనిధి యైనాఁడు. కావుననే 'ఆకలయే' చూడఁగోరెద నని భావము.

మ. భళిరా కన్నులబెళ్కు ఱొమ్ముజిగి చెప్పన్ రాదు వేణుధ్వనుల్
దరమా యెంచఁగఁ గావిమోవిరుచి వింతల్ దేటలేనవ్వుని
గ్గులు మజ్జారె సుధామనోహరమృదూక్తుల్ మాయురే యిట్టియొ
ప్పులకుప్పం దిలకించుభాగ్యమహిమంబుల్ మాకు నింకెన్నఁడో!

తా. విశాలములైన వక్షమును గన్నులును, మృదువులైన చిఱునవ్వును మురువు పలుకులును, మనోజ్ఞమైన దొండపండువంటిమోవియు వేణుధ్వనియుఁ గలిగి యొప్పుల కుప్పయైన చిన్నిబాలుని కృష్ణునిఁ జూచుట యెన్నఁడో.

శ్లో॥ ఆర్ద్రావలోకిత దయాపరిణద్ధనేత్ర
మావిష్కృతస్మితసుధామధురాధరోష్ఠం ।
ఆద్యం పుమాంస మవతంసితబర్హిబర్హ
మాలోకయన్తి కృతినః కృతపుణ్యపుఞ్జాః ॥ 67

టీ. ఆర్ద్ర=సరసములైన, అవలోకిత=చూపులుగలదైన, దయా=దయతో, పరిణద్ద=కూర్పఁబడిన, లేక, దయా=దయచేత, పరిణద్ధ=విశాలములైన, 'నేత్రం=కన్నులుగల వాఁడును - కరుణావలోకముచే మిక్కిలి వికసిల్లినకన్నుదమ్ములు గలవాఁడనుట, ఆవిష్కృత...రోష్ఠమ్-ఆవిష్కృత = వెలిపుచ్చఁబడిన - పెదవిమాటునుండి వెలికి తొలఁకినట్టి, స్మిత=నవ్వుఅనెడి, సుధాఅమృతముచేత, మధుర=సొంపైన; అధరోష్ఠం=మోవిగల వాఁడును_అమృతమువలె అతిభోగ్యమైన చిఱునవ్వు వెలికి పిక్కటిల్లుటచే అత్యంతమనోజ్ఞముగానుండు మోవిగలవాఁడనుట, అవత...ర్హమ్_అవతంసిత=శిరోభూషణముగాఁ జేయఁబడిన, బర్హి=నెమిలియొక్క, బర్హమ్=పురిగలవాఁడును, ఆద్యం=ఆదిపురుషుఁడైన వాఁడును_జగత్కారణుఁడైన పురాణపురుషుఁడనుట, అను, పుమాంసం=పురుషుని-కృష్ణాకృతితో పురుషరూపమున అవతరించినవానిని, కృత... పుఞ్జాః - కృత = చేయఁబడిన, పుణ్య=పుణ్యముయొక్క, పుఞ్జాః=సమూహముగలవారు, అగు, కృతినః=విద్వాంసులు, ఆలోకయన్తి=చూచుచున్నారు. 'ఆద్యం పుమాంసమ్' ఆదిపురుషుఁడుగనుకవానినిఅందఱును జూడలేరు: 'కృతినః' విద్వాంసులే చూతురు, అందును వానిని, దయతోడిచూపులుగల వాలుఁగన్నులును, సొంపైనచిఱునవ్వుఁ గల కెమ్మోవియుఁ గలవానినిగా కేవల విద్వాంసులుగాక 'కృతపుణ్యా' కొంతపుణ్యముగూడఁ జేసిన విద్వాంసులే చూడనేర్తురు. అట్టిచూపులును మోవియును ఆయాదిపురుషునికిఁ శ్రీరామాద్యనేకావతారములందుఁ గలవు. కాన అట్టిచూపులును మోవియునే కాక 'అవతం...ర్హమ్' తలయందు నెమిలిపురియుఁ జెరువుకొన్న శ్రీకృష్ణావతారమూర్తిని 'కృతినః' కేవలవిద్వాంసులుకాని, 'కృతపుణ్యా' కొంతపుణ్యముచేసిన విద్వాంసులుకాని చూడలేరు; 'కృతపుణ్యపుఞ్జాః' విశేషించి పుణ్యముసేసిన విద్వాంసులే చూడనేర్తురని యాశయము.

ఉ. అందముఁ జిందుమోము దరహాససుధామధురాధరోష్ఠ మ
స్పందదయావలోకనవిశాలవిలోచనముల్ శిరంబునం
బొందుగ నెమ్మిపింఛమును బూనినయాద్యుని దేవదేవునిన్
నందకుమారుఁ గాంతురుసనాతనపుణ్యమునన్ బుధోత్తముల్. 67

తా. దయతోడి చల్లనిచూడ్కులచే మిక్కిలివిఱివియైనకన్నులును, అమృతమువంటి చిఱునవ్వు తొలఁకుటచే మిక్కిలి యింపొనరించువాతెఱయును, తలయందుఁజెరివిన

నిమిలిపించియమును గలిగి చెలువారెడి యాదిపురుషుని విశేషించి పుణ్యముచేసిన విద్వాంసులే చూతురు.

అవ. ఇట్లు చూడఁగోరి పరిపరివిధములఁ బ్రార్థింపఁగా శ్రీకృష్ణుండు కరుణించి సాక్షాత్కరింపఁగాఁ గవి యామూర్తిని దర్శించి వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ మారః స్వయం ను మధురద్యుతిమణ్డలం ను
మాధుర్యమేవ ను మనోనయనామృతం ను ।
వాణీమృజా ను మమజీవితవల్లభో ను
బాలోఽయ మభ్యుదయతే మమ లోచనాయ ॥ 68

టీ. మమ=నాయొక్క, లోచనాయ=నేత్రములకొఱకు, బాలః=బాలుఁడు అభ్యుదయతే = ఆవిర్భవించుచున్నాఁడు - పొడసూపుచున్నాఁడు. అయం = వీఁడు-ఈబాలుఁడు, మారః=మన్మథుఁడు; స్వయంను=తానేనా-మన్మథుఁడు తానే వీఁడగునా యనుట—ఇది సౌందర్యాతిశయసూచకము. మధురద్యుతిమణ్డలం ను—మధురద్యుతి = చంద్రునియొక్క. మణ్డలంను=బింబమా యేమి! దీనిచే ఆహ్లాదకరమగు కాంతివైభవము తెలియునగు. మాధుర్యమేవ ను=సౌందర్యమేనా యేమి, సౌందర్యముతానే వీఁడగునాయేమి యనుట-దీనిచే 'రూపం కిమప్యనిర్వాచ్యం తనోర్మాధుర్యముచ్యతే' అన్నట్లు పూర్వోక్తములైన సౌందర్యమును శోభావిశేషమును బెరసి యిట్టిదట్టి దని చెప్పనలవికాని నిరతిశయసౌందర్యముగా నగుట తెలియునది. లేక 'శీతలీక్రియతే తాపో యేన తన్మధురంస్మృతమ్' అన్నట్లు తాపమును చల్లార్చునట్టిది మధుర మనఁబడునుగాన చూడఁజూడఁగాఁ దాపత్రయమును బోఁగొట్టి సుఖము కలిగించునట్టి మాధుర్యము గ్రాహ్యము. కావున నే, మనో...తంను-మనః = మనస్సుయొక్కయు, నయన = కన్నులయొక్కయు, అమృతం ను=అమృతమా ఏమి-దీనిచే నయనోత్సవత్వమునుహృదయాహ్లాదకత్వమును దెలియునది. వాణీమృజాను-వాణీ = వాక్కుయొక్క, మృజాను = పరిశుద్ధియాయేమి - దీనిచే నిర్దోషములైన ముద్దుఁబలుకులయొప్పిదము తెలియునది. మమ = నాయొక్క, జీవితవల్లభో ను=ప్రాణనాథుఁడా యేమి? దీనిచే అత్యంత ప్రియత్వము తెలియునది. ఇట్టి చక్కఁదనమును, ఇట్టిజిగియు, ఇట్టిచల్లఁదనమును, ఇట్టి పలుకులును గలవాఁడు 'జీవితవల్లభుఁ'డే యగు నని యాశయము.

ఉ. మారుఁడో కాక యంబుధికుమారుఁడో మానసలోచనామృతా
కారమొ మాధురీగుణవికారమొ మంజులవాక్చమత్క్రియో

సారమొ నాదుజీవమణి ♦ సారమొ లేక మ దేమి చిత్రమో
మీఱెడుబాలభావమున ♦ మెచ్చులు గుల్కెడు నాదుచూడ్కికిన్.

తా. నాకన్నులకుఁ గనబడుచున్న యీ బాలుఁడు మన్మథుఁడా? లేక చంద్రమండలమా? సౌందర్యపురాశియా? నామనస్సుయొక్క యానందమా? నాకన్నుల పండువా? పలుకుల యచ్చందనమా? నా ప్రాణవల్లభుఁడా?

శ్లో॥ బాలోయ మాలోల విలోచనేన, వక్త్రేణచిత్రీకృతదిఙ్ముఖేన
వేషేణ ఘోషోచితభూషణేన, ముగ్ధేన దుగ్ధే నయనోత్సుకం నః॥69

టీ. అయం=ఈ ఈసాక్షాత్కరించినట్టి, బాలః=బాలుఁడు, ఆలోలవిలోచనేన-ఆలోల=చంచలములైన, విలోచనేన=కన్నులుగలదియు, చిత్రీ... ఖేన-చిత్రీకృత=చిత్తరువులుగాఁ జేయఁబడిన-చిత్తరువులు గలవిగాఁ జేయఁబడిన, దిక్ ముఖేన=దిక్కుల మొగములుగలదియు-దిశలముందటిప్రదేశములు గలదియు -దిక్కులయందు అనేకములుగాఁ దాను ప్రతిఫలింపఁగా అవి ఆప్రతిబింబములచే చిత్తరువులు గలవిగాఁ గానంబడిన వనుట, ఇట్టిదైన, వక్త్రేణ=ముఖముచేతను, ఘోషో... ణేన-ఘోష=గొల్లపల్లెకు, ఉచిత=తగినట్టి,భూషణేన=సొమ్ములుగలదియు, ముగ్ధేన=సుందరమైనదియు, అగువేషేణ=వేషముచేతను-ఇదియే 'ముగ్ధవేషఁ మురారేః' అనఁబడినది; నః=మాయొక్క-నయన ఉత్సుకమ్-నయన=కన్నులయొక్క, ఉత్సుకం=అత్యంతాభిలాషను-చూచుచుండ వలయునను పేరాసను,'నయనోత్సవమ్'-అనుపాఠమున, నయన ఉత్సవమ్=కన్నులయొక్క పండువును,దుగ్ధే=పిదుకుచున్నాఁడు-తనంత గలిగించుచున్నాఁడు. మొగమునకు సహజములైన బెళుకుఁగన్నులును వేషమునకుసామాన్యములైన గొల్లసొమ్ములునే యలంకారమునకుఁజాలును. ఇంతమాత్రమైన యలంకారసంపత్తిచేతనే ఆమొగమును ఆవేషమునుఅత్యంతమోహనములై మఱిమఱి చూడవలయునని 'ఉత్సుక' ఔత్సుక్యము కలిగించుచున్నవి.

ఉ. ఎల్లెడఁ జిత్రరూపము వ ♦ హించిన చక్కని మోముఁదమ్మితో
గొల్లవిలాసవేషమున ♦ కుం దగుసొమ్ములతోడఁ బల్వురో
జొల్ల సదక్షిశీతలన ♦ మున్నతితో విలసిల్లు బాలకుం
డల్లము పల్లవింప నయ ♦ నోత్సవ మారఁ జరించు చున్నఁడో. 69

తా. బెళుకుఁగన్నులు గలదై దిక్కులయందుఁ బ్రతిబింబించుచున్న మొగంబుచేతను, గొల్లవారికిఁ దగినసొమ్ములు దాల్చి సొంపుగులుకు వేషముచేతను, ఈకనఁబడుచున్న బాలుఁడు మాకుఁ గన్నులపండువు సేయుచున్నాఁడు.

శ్లో॥ ఆన్దోళితాగ్రభుజ మాకులనేత్రలీల
మార్ద్రస్మితార్ద్రవదనామ్బుజచన్ద్రబిమ్బమ్।

శిఞ్జానభూషణశతం శిఖిపిఞ్ఛమౌళిం
శీతం విలోచనరసాయన మభ్యుపైతి॥ 70

టీ. ఆన్దో...జమ్-ఆన్దోళిత=కొంతకదల్పఁబడిన, అగ్ర=మొనలుగల, భుజం=బుజములుగలదియు-మూఁపులు గొంత గదల్చుచున్నది యనుట, మూఁపులు కదలుట మొదలగునవి 'అభ్యుపైతి' అను ఆగమనమువలన కలిగినవిగాఁ దెలియునది. ఆమ...లీలమ్-ఆమల=వ్యాకులములైన-ఇటునటు కదలిన, నేత్ర=కన్నులయొక్క, లీలమ్=విలాసములు గలదియు-కన్ను లిటునటు త్రిప్పఁగా ఒప్పులొలుకునది యనుట, ఆర్ద్ర...బిమ్బమ్-ఆర్ద్ర=సరసమైన, స్మిత=చిఱునవ్వుచేత, ఆర్ద్ర=సరసమైన, వదన అమ్బుజ చన్ద్రబిమ్బమ్=చంద్రబింబమువంటి ముఖకమలముఁ గలదియు, శిఞ్జా...శతమ్-శిఞ్జాన=మొరయుచున్న, భూషణశతం=ఆభరణములవందలు గలదియు-అనేకములైన ఆభరణములుగలది యనుట, శిఖి...మౌళిమ్-శిఖిపిఞ్ఛ=నెమిలిపురి, మౌళిం=శిరస్సునందుఁ గలదియు, శీతం=చల్లనైనదియు-చూచువారల కన్నులకు సుఖప్రదమైనదియు, అగు, విలోచనరసాయనమ్. విలోచన=కన్నులకు, రసాయనమ్=భోగ్యవస్తువు-అనఁగా శ్రీకృష్ణుఁడు, అభ్యుపైతి=(నాకు) ఎదురుగా వచ్చుచున్నాఁడు. మూఁపులు గదల్చుట, సొమ్ములు గల్లుగల్లని మ్రోయుట, ఆగమనవ్యాపారముచే ప్రయుక్తములు ఇటునటు తిరుగు బెళుకుఁ గన్నుల చిన్నెలు చిఱునవ్వుగులుకుచంద్రునివంటి మొగమును, నెమిలిపురి, మొదలైనవి విలోచనరసాయన మగుటకు హేతువులు; విలోచనములకు నిరవధిక సుఖము నిచ్చుటచేఁ గృష్ణుఁ డనుటకన్న విలోచనరసాయన మనుటయే మఱింత యొప్పిదమని కవిహృదయము.

ఉ. అందెలు మువ్వలున్ మొరయ హస్తము లూఁపఁగఁ గంకణధ్వను
ల్సందడిఁ జేయ నాననవిలాసము చందురు గేణి సేయ నా
నందవిశాలలోలనయనమ్ములతో శిఖిపింఛమౌళితో
నందముఁ జెందు లోచనరసాయన మల్లదె వచ్చెఁ జల్లఁగన్. 70

తా. మూఁపులుకొంతగదల, ఒప్పులొలుక కన్నుల నిటునటుత్రిప్పుచు చందురునివంటి మోముఁదామరయందుచిఱునవ్వు సొంపుగులుక, సొమ్ములు పెక్కు గల్లుగల్లని మొరయ, తలయందు నెమిలిపురి మెఱయ, చల్లనై నా కన్నులవిందగు కృష్ణుఁడు నన్నెదురుకొని వచ్చుచున్నాఁడు.

శ్లో॥ పశుపాలబాలపరిషద్విభూషణం
శిశురేష శీతలవిలోలలోచనః।
మృదులస్మితార్ద్రవదనేన్దునమ్పదా
మదయన్మదీయహృదయం విగాహతే॥ 71

టీ: పశు...భూషణమ్ - పశుపాలబాల=గొల్లబాలురయొక్క, పరిషత్=సభకు, విభూషణమ్=అలంకారభూతుఁడైనవాఁడును, శీతల...లోచనః - శీతల=చల్లనై, విలోల=చంచలములగు, లోచనః=కన్నులుగలవాఁడును, అగు ఏషః=ఈకనఁబడుచున్న, శిశుః=బాలుఁడు, మృదుల...సమ్పదా-మృదుల=కోమలమైన, స్మిత=చిఱునవ్వుచేత, ఆర్ద్ర=సరసమైన, వదన ఇన్దు=ముఖచంద్రునియొక్క, సమ్పదా=సమృద్ధిచేత-చిఱునవ్వుదోఁడు చందురునివంటి మొగముయొక్క సొంపు పెంపుచేత ననుట, మదీయ హృదయమ్=నాయొక్కహృదయమును, మదయన్=మదింపఁజేయుచు, విగాహతే = చొచ్చుచున్నాఁడు.

చ. వికవిక నవ్వుచుం నుదుటఁ జ్రేలుకురుల్ నునుపాలబుగ్గలుం
జికిలిమెఱుంగుఁజూపు రహిఁ జెందగ నాననశీతలద్యుతిం
బ్రకటితగోపశాబకసభానవభూషణమై చెలంగుబా
లకుఁడు మదీయమానసతలంబున నిల్చెను సొంపు నించుచున్. 71

తా. గొల్లపిల్లకాండ్రకూటువకు నలంకారమువలె వెలుఁగుచుఁ, జల్లనిబెళుకుఁగన్నులఁజూచు నీచిన్నిబాలుఁడు చిఱునవ్వుచే ముకువుచూపుమొగముచందురునిచే నా హృదయమును మదించునట్లు ప్రవేశించుచున్నాఁడు.

శ్లో॥ తదిద ముపనతం తమాలనీలం, తరళవిలోచన తారకాభిరామమ్।
ముదితముదితవక్త్రచన్ద్రబిమ్బం, ముఖరితవేణువిలాసజీవితమ్॥ 72

టీ. తమాలనీలమ్- తమాల=జీఁకటిమ్రానువలె, నీలం=నల్లనైనదియు, తరళ...రామమ్ - తరళ=చంచలములైన, విలోచన=కన్నులయొక్క, తారక=గ్రుడ్లచేత, అభిరామమ్=మనోహరమైనదియు, ముదిత...బిమ్బమ్-ముదితముదిత=మిక్కిలి సంతోషించినట్టి. సంతోషంపుసొంపుచే మిక్కిలి ప్రకాశించుచున్నట్టియనుట, వక్త్రచన్ద్రబిమ్బమ్=చంద్రబింబమువంటిమొగము గలదియును. అగు, తత్=ఆ-ప్రసిద్ధమైన, ఇదం=ఈ-ఈకనఁబడుచున్న, ముఖరి...జీవితమ్-ముఖరిత=మ్రోయింపఁబడిన, వేణు=పిల్లంగ్రోవియొక్క, విలాస=స్వరవిశేషముల యొప్పిదములకు, జీవితమ్=ప్రాణము-ప్రాణభూతంబైన కృష్ణాఖ్యవస్తువు, మే=నాకు, =ఉపనతం=ఎదురైనది.

ఉ. నీలఘనాభ మయ్యు నతినిర్మలవేణునినాదజీవమై
లోలతటిల్లతాలలితలోచనతారకమై ప్రసన్నతో
ద్వేలముఖేందుమండలనవీనవిలాసకలాకలాపమై
బాలునిలీల వచ్చి కనుపట్టె మహాద్భుతతేజ మియ్యెడన్. 72

తా. చీఁకటిగ్రమ్మినవలె నల్లనికాంతి గలిగి తెలుపు లేనుకన్నుగ్రుడ్లచే మిక్కిలి చెలువై, సొంపుపెంపునఁ బ్రకాశించుచున్న చంద్రబింబమువంటి మొగంబు గలిగి, వేణుధ్వనుల విలాసంబులకుఁ బ్రాణమైన కృష్ణుఁడు నా కనుఁడయ్యె.

శ్లో॥ చాపల్యసీమ చపలానుభవైకసీమ
చాతుర్యసీమ చతురాననశిల్పసీమ।
సౌరభ్యసీమ సకలాద్భుతకేళిసీమ
సౌభాగ్యసీమ తదిదం వ్రజభాగ్యసీమ॥ 73

టీ: తత్=ఆ-ప్రసిద్ధమైన, ఇదం=ఇది-ఈకనఁబడు చున్న కృష్ణాఖ్యవస్తువు, చాపల్యసీమ-చాపల్య=చపలత్వమునకు-చపలత్వప్రయుక్తములైన వ్యాపారములకు, సీమ=పొలిమేరయైనది, చపలా...సీమ-చపలా=లక్ష్మీదేవియొక్క అనుభవ=భోగమునకు ఏక=ముఖ్యమైన, సీమ=స్థానమైనది, చాతుర్యసీమ-చాతుర్య=నేర్పునకు, సీమ=పొలిమేరయైనది, చతురా...సీమ-చతురానన=బ్రహ్మయొక్క, శిల్ప=శిల్పమునకు-పనితనమునకు, సీమ=పొలిమేరయైనది, సౌరభ్యసీమ-సౌరభ్య=పరిమళమునకు, సీమ=ముఖ్యస్థానమైనది. సక...సీమ-సకల=సమస్తములైన, అద్భుత = ఆశ్చర్యములయొక్క ఆశ్చర్యకరములైన యొప్పిదములయొక్క, కేళి=క్రీడకు - ప్రవర్తనమునకు, సీమ=ముఖ్యస్థానమైనది, ఆశ్చర్యకరములైన సౌందర్యవిశేషములన్నియు ఇందే నిరతిశయమై వర్తించుచున్నవనుట-ఇందలిసౌందర్యాదులకంటెను ఆశ్చర్యకరములైనవి మఱెందునుగలుగవని భావము. సౌభాగ్యసీమ - సౌభాగ్య=సౌందర్యమునకు, లేక, విభవసమృద్ధికి, సీమ = పొలిమేరయైనది - ఇంతకన్నను సౌభాగ్యముగలది మఱెందును కలుగదనుట, వ్రజ...సీమ - వ్రజ=గొల్లపల్లెయొక్క - గొల్లపల్లియందలివారలయొక్క, భాగ్య=అదృష్టఫలమునకు, సీమ = స్థానమైనది-వారలభాగ్యముయొక్క పూర్ణపరిపాకమే యిది-యనుట-చాపల్యచాతుర్యసౌరభ్యసౌభాగ్యాదులెల్లను గలిగియున్నది గావుననే వ్రజభాగ్యసీమ యైనదని నిగమము.

గ. కలిమి నెలంత వేడుకలకుం గందువ పంట విలోలవృత్తికిన్
నెలవు శుభాళి కాస్పదము నేర్పులప్రోవజశిల్పకల్పనా
ఫల మతిచిత్రలీలలకుఁ బాళెము తావుల కెల్లఁ దావు గో
కులజనభాగ్యసీమ యిదిగో కనుఁగొంటిని గంటి కింపుగన్. 73

తా. చపలత్వమునకును, లక్ష్మియొక్క విలాసములకు, నేర్పులకు, బ్రహ్మయొక్క-శిల్పంపు విన్నాణములకును, పరిమళములకును, ఆశ్చర్యకరములైన యొప్పులకును, విభవంపుపెంపులకును ఎల్లయై ఆటపట్టయి కావుననే, గొల్లవారల భాగ్యములయొక్క పూర్ణఫలమై యొప్పు ఆకృష్ణాఖ్యవస్తువు ఇదిగో.

శ్లో॥ మాధుర్యేణ ద్విగుణశిశిరం వక్త్రచన్ద్రం వహన్తీ
వంశీవీథీవిగళదమృతస్రోతసా సేచయన్తీ।
మద్వాణీనాం విహరణపదం మత్తసౌభాగ్యభాజాం
మత్పుణ్యానాం పరిణతి రహో నేత్రయో స్సన్నిధత్తే॥ 74

టీ. మాధుర్యేణ='శీతలీక్రియతే తాపో యేన తన్మధురం స్మృతమ్' అన్నట్లు తాపమును జల్లార్చునట్టి గుణవిశేషముచేత, ద్విగుణశిశిరం=రెండింతలు చల్లనిదైన - మునుపే తనంతట చల్లనిది; మఱి మాధుర్యముతోఁ గూడుటచే మఱింత చల్లనిదయ్యెననుట, చూచుటకు మిక్కిలి సుఖప్రదమైనది యనుట, వక్త్రచన్ద్రం=మోముచందురుని - చందురునివంటి మొగమును, వహన్తీ=తాల్చుచున్నదియు, వంశీ...స్రోతసా-వంశీ=పిల్లఁగ్రోవియొక్క, వీథీ=మార్గమునుండి, విగళత్=స్రవించుచున్న, అమృత=అమృతముయొక్క, స్రోతసా=ప్రవాహముచేత-అమృతమువలె అత్యంతభోగ్యమై ప్రవాహమువలె ఎడతెగక నిగుడుచున్న ధ్వనిచేత ననుట, సేచయన్తీ=తడియఁజేయుచున్నదియు-మీఁద 'విలాస మురళీ నినదామృతేన సిఞ్చ న్నదఞ్చిత మిదం మమ కర్ణయుగ్మమ్' అనుటచే వీనులను దడుపుచున్నది యనుట-వినువారలకు ఆపిల్లఁగ్రోవిరవళి యనెడి యమృతప్రవాహముచే అత్యంతానందమును గూర్చుచున్నదియనుట, మత్ వాణీనాం=నాయొక్క వాక్కులకు. విహరణపదమ్=విహరించుస్థానమైనదియు-విహారస్థానమనుటచే విహారప్రయుక్తమైన సుఖమును స్వేచ్ఛయు వ్యంజితము లగుచున్నవి గాన నేనుసుఖముగా విచ్చలవిడిగాను జేయునట్టివర్ణనములకు విషయమైనదియు ననుట, అగు, మత్త...భాజామ్-మత్త=మదించిన, సౌభాగ్య=విభవసంపత్తిని-పెంపును, భాజామ్=పొందినవి యైన-మిక్కిలి యధికమై విఱ్ఱవీగుచున్నవైన యనుట-మితిమీఱి అతిశయించుచున్నవైన యనిభావము, మత్ + పుణ్యానామ్=నా సుకృతములయొక్క, పరిణతిః=పరిపాకము-నిరతిశయములైన నాపుణ్యములయొక్క పరిపూర్ణఫలస్వరూపమైన కృష్ణాఖ్యతత్త్వము, నేత్రయోః=నా రెండుకన్నులకు, సన్నిధత్తే=సన్నిధానము చేయుచున్నది- నా కన్నులకుఁ బొడసూపుచున్నదనుట. ఇచట పరిణతికర్త. 'విహరణపదమ్' అనుచోఁ పదశబ్దము నిత్యనపుంసకాంతము గావున స్త్రీలింగమగు 'పరిణతి' శబ్దమునకు విశేషణ మయ్యు దోషము లేదు.

శా. లావణ్యాంబుధిచంద్రబింబముఖలీలం దాల్చి వంశీనినా
దావిర్భూతసుధాప్రవాహమున నోలాడం బ్రవర్తిల్లు నా
దైవాకారము నావచోవిహరణస్థానంబు నాపుణ్యస
ద్భావం బారఁ బ్రసన్న మయ్యెను యశోదాపుత్రరూపంబునన్.

తా. చక్కఁదనముచే మఱింతచల్లఁదనము గూర్చుచున్న మోముచందురునిగలిగి, పిల్లఁగ్రోవినుండి యమృతంపువెల్లువవలె నొలుకుచున్న మధురస్వరములచే వీనులవిందులు సేయుచు, నాపాగడ్తలకు సొంపయినవిషయమై, పెంపుసొంపారియున్న నాపుణ్యములయొక్క ఫలమై, యున్న కృష్ణుఁడు నాకన్నుఁగవకుఁ బొడతెంచుచున్నాఁడు.

అవ. ప్రత్యక్షమైన శ్రీకృష్ణునికి నమస్కరించుచున్నాఁడు.

శ్లో॥ తేజసేఽస్తు నమో ధేనుపాలినే లోకపాలినే ।
రాధాపయోధరోత్సఙ్గశాయినే శేషశాయినే ॥ 75

టీ. ధేనుపాలినే-ధేను=గోవులను, పాలినే=కాచునట్టిదియు, లోకపాలినే=లోకములను కాచునట్టిదియు, రాధా...శాయినే-రాధా = రాధయొక్క, పయోధర=చన్నులయొక్క, ఉత్సఙ్గ=మీఁద, శాయినే=పవ్వళించునట్టిదియు, శేషశాయినే=ఆదిశేషునిపై పవ్వళించునట్టిదియు, అగు, తేజసే=శ్రీకృష్ణాఖ్యమైన తేజస్సుకొఱకు, నమః=నమస్కారము, అస్తు=అగుఁగాక. సౌలభ్యవశమున ధేనుపాలియు రాధాపయోధరోత్సంగశాయియు అయినాఁడు, పరత్వవశమున లోకపాలియు శేషశాయియు అయినాఁడు. గోవులను గాచువాఁడు జగములను గాచుటయు, ఒక గొల్లపడఁతి చన్నులపైఁ బవ్వళించువాఁడు జగములనెల్లఁ దాల్చు శేషునిపైఁ బవ్వళించుటయుఁ జెప్పి పరత్వసౌలభ్యముల కాష్ఠల మేళనమును ఆశ్చర్యముగాఁ దెలిపినాఁడు. ఇట 'తేజసే' అని కేవల తేజముగాఁ జెప్పుటచే నిరవధిక తేజోమయత్వమును దెలియునది.

ఉ. పాయనిభక్తి ముక్కఁద న ꠰ పారకృపారసధేనుపాఖ్యసం
ధాయికి లోకరక్షణ వి ꠰ ధాయికి భాసురరాధికాకుచ
స్థాయికిఁ బన్నగాధిపవి ꠰ శాలఫణామణి సౌధవీథికా
శాయికి గోపికానయన ꠰ సారససార ఫలప్రదాయికిన్. 75

తా. గోవులను జగములను గాచుచు రాధ చన్నులమీఁదను ఆదిశేషునిమీఁదను బవ్వళించు తేజస్స్వరూప మగు కృష్ణాఖ్యబ్రహ్మమునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ధేనుపాలదయితాస్తనస్థలీ,ధన్యకుఙ్కుమసనాథకాన్తయే ।
వేణుగీతగతిమూలవేధసే, తేజసే త దిద మోం నమో నమః ॥

టీ. ధేను...కాన్తయే-ధేనుపాల=గొల్లవారియొక్క, దయితా=ప్రియురాండ్రగు స్త్రీలయొక్క, స్తనస్థలీ=కుచప్రదేశములచేత-కుచములందు అలందఁబడుటచేత ననుట, ధన్య=కృతార్థమైన, కుఙ్కుమ=కుంకుమముతోడ, సనాథ=కూడుకొన్న, కాన్తయే=కాంతిగలదియు-స్త్రీలు కౌఁగిలించుకొనునప్పుడు వారి కుచములందలి కుంకుమము అంటుకొనఁగా దాని యెఱ్ఱనికాంతితోఁగూడిన తన మేనినీలకాంతి గలవాఁడనుట, వేణు...వేధసే—

వేణు=పిల్లఁగ్రోవియొక్క, గీత=గానముయొక్క, గతి=స్వరవిశేషములకు, మూలవేధసే=మూలబ్రహ్మమైనదియు, అగు, తేజసే=శ్రీకృష్ణరూపమైనతేజస్సుకొఱకు, తత్=ఆ, ఇదం=ఈ, ఓం నమోనమః='ఓం' అని ప్రణవపూర్వకములైన నమస్కారములు. ఇందును 'తేజసే' అని నిరతిశయ తేజోమహత్త్వము తెలియునది. ఈ తేజస్సు వేణుగానమునకు మూలబ్రహ్మమైనది గనుక ఇది సృజించు నతిమనోహర స్వరవైచిత్ర్యములకుఁ జొక్కి గొల్లపడఁతులు కౌఁగిలించుచున్నా రని భావము. కేవలము గొల్లపడఁతులను జెప్పక 'ధేనుపాలదయితా' అని గొల్లవారలయొక్క చెలువ లనుటచేఁ బురుషులను సైతము నిరాకరించి తన్నుఁ గూడ వచ్చునంతమోహము కలిగించునట్టి మనోజ్ఞ వేణుగానము గలవాఁ డగుట వ్యంజితము.

మ. పసిగాపుంజిగురాకుఁబోండ్లమెఱుఁగుంగ్రొబాలిండ్లకాశ్మీరపు
ద్రసనముల్ జొబ్బిల నుబ్బి నిర్భరపరీరంభస్థితిం దేల్చ ను
ల్లసితం బై మురళీనినాదగతిమూలబ్రహ్మ మై కంటి కిం
పొసఁగం జాలెడుమూర్తికిన్ మొగుడుఁగేలోంకారపూర్వంబుగన్.

తా. వేణుగానమునకు మూలబ్రహ్మముగావున విచిత్రమధురస్వరములసృజించుచు దానిచేఁజొక్కివచ్చినవ్రేతలు బిగ్గఁగౌఁగిలించుకొనఁగా అపుడు అంటుకొన్న వారికుచకుంకుమపుఁగాంతితోఁగూడిన దేహచ్ఛాయ గలిగి వెలుఁగుచున్న కృష్ణరూపమైన తేజస్సునకు నమస్కారములు మాటికిఁ జేసెద.

శ్లో॥ మృదుక్వణన్నూపురమన్థరేణ, బాలేన పాదాంబుజపల్లవేన।
అనుక్వణన్మఞ్జులవేణుగీత, మాయాతి మే జీవిత మాత్తకేళి॥ 77

టీ. ఆత్తకేళి—ఆత్త=పొందఁబడిన, కేళి=విహారములు గలదియైన, మే=నాయొక్క, జీవితం=ప్రాణము-నాప్రాణమైన శ్రీకృష్ణాఖ్యతేజము, మృదు...మన్థరేణ-మృదు=మెత్తగా-ఇంపుగాననుట, క్వణత్ = మ్రోయుచున్న, నూపుర=అందియలచేత, మన్థరేణ=బరువైనదియు-అందియలను దాల్చుటచే మందమనోజ్ఞసంచారము గలదియనుట, బాలేన=చిన్నదైనదియు-లేఁతదియనుట, అగు, పాదా...ల్లవేన=పాద=పాదములయొక్క అమ్బుజపల్లవేన=చిగుళ్ళవంటియడుగుఁదామరచేత - చిగుళ్ళవలెను దామరలవలెను మృదువై యెఱ్ఱనైనయడుగుల నిడుచు అనుట, అను...గీతంయథాతథా-అనుక్వణత్ =(అందియలను) అనుసరించి మొరయుచున్న, మఞ్జుల=మనోహరమైన, వేణుగీతమ్=వేణుధ్వనిగలుగునట్లుగా-గల్లుగల్లను అందియలరవళికి అనుగుణముగా వేణుస్వరము లూఁదుచుననుట, ఆయాతి=వచ్చుచున్నది. తేజస్స్వరూపమై పొడసూపినవస్తువు ఇప్పు డాతేజోవిశేషముతోఁగూడ 'ఆత్తకేళి' కేళీవిభ్రమములు గలదై నాకు 'జీవితమ్' ప్రాణమువలె అత్యంతప్రియతమమై ధారకమై వచ్చుచున్నది యనుట. అట్లు వచ్చునప్పుడు చిగుళ్ళవలె లేఁత

యైన యడుఁగుఁదమ్ములును, అందలి యందియల 'మృదుక్వణన'మును దానికి అనుసారిగా ఊఁదంబడు వేణువుయొక్క 'మంజుగీత'మును ఆ రాకయొక్క యింపుసొంపును బయిఁబయి పెంచుచున్నది. కావుననే అది 'ఆర్తకేళి' యై నాకు 'జీవిత' మైనదని యాశయము.

ఉ. చల్లనివేణుగీతి కనుసారిగఁ దాళగతుల్ సెలంగ గల్
గల్లు రటంచు నందియలు గజ్జెలు నొక్కటఁ బిక్కటిల్లఁగాఁ
బల్లవకోమలాంఘ్రులను బాలకుఁ డాడుచుఁ బాడుచుండ నా
వేల్లితవృత్తి వచ్చెఁ గనువిందుగ జీవము వచ్చుకైవడిన్. 77

తా. అందియలు గల్లుగల్లని మృదువుగా మొరయుచున్న లేఁతయడుఁగుఁదమ్ముల నిడుచు, అందియలమ్రోఁతకు సరిగా వేణువును మధురముగా నూఁదుచు, నిట్లు క్రీడావిలాసములు నెఱపుచు, నాకుఁ బ్రాణమువలె నత్యంతప్రియుఁడైన శ్రీకృష్ణుఁడు వచ్చుచున్నాఁడు.

శ్లో॥ సోఽయం విలాసమురళీనినదామృతేన
సిఞ్చన్నుదఞ్చిత మిదం మమ కర్ణయుగ్మమ్ ।
ఆయాతి మే నయనబన్ధు రనన్యబన్ధు
రానన్దకన్దళిత కేళికటాక్షలక్షః॥ 78

టీ. ఆనన్ద...లక్షః—ఆనన్ద=ఆనందముచేత, కన్దళిత=పొటమరించిన - పుట్టిన, కేళి=లీలా ప్రయుక్తమైన, కటాక్ష = కడగంటిచూపులయొక్క, లక్షః=లక్షలుగలవాఁడును—ఆనందముచే సొగసుగాఁ గడగంటఁ జూచువాఁ డనుట, మే=నాకు, నయనబన్ధుః—నయన = కన్నులకు, బన్ధుః = చుట్టమైనవాఁడును, అనన్యబన్ధుః - అనన్య=ఒకరికిఁ గాక - అందఱికిని యనుట, బన్ధుః=చుట్టమైనవాఁడును - సర్వబంధుఁడనుట, అగు సః=ఆ-ప్రసిద్ధుఁడైన, అయం = వీఁడు-శ్రీకృష్ణుఁడనుట, విలాస...మృతేన—విలాస = లీలార్థమైన, మురళీ=పిల్లఁగ్రోవియొక్క, నినద=ధ్వనియనెడి, అమృతేన=అమృతముచేత, ఉదఞ్చితమ్=(వినుటకు) ఒగ్గియున్న, మమ=నాయొక్క, ఇదం = ఈ, కర్ణ=చెవులయొక్క, యుగ్మం=జంటను, సిఞ్చన్=తడుపుచున్నవాఁడై, ఆయాతి = వచ్చుచున్నాఁడు. 'అనన్యబన్ధు' వగుటచే 'ఆయాతి' వచ్చుచున్నాఁడు - ఆనందముచేఁ గడగంట సొగసుఁజూపులు నిగుడ్చుటచే 'నయనబన్ధు' వైనాఁడు. 'విలాసమురళీనినదామృత'ముచే చెవుల కింపుగఁ జేయుచున్నాఁడని యర్థము. అనఁగా వలపుఁజూపులచే కన్నులపండువును అమృతమువంటి పిల్లఁగ్రోవిరవళిచే వీనులవిందును జేయుచు బంధువువలెఁ బ్రేమతో వచ్చుచున్నాఁ డని యాశయము.

ఉ. మాలిమిఁ జేసి గోపికలమానముఁ గాచినవాఁడు వీఁడె కాఁ
బోలును నేఁడు వేణురవముం జెవి నింపుచు నాదుకంటికిన్

మే లలరం బ్రమోదరసస్యనిర్భర కేళికటాక్షలక్షుండై
బాలుండనన్యబంధుండెడఁ బాయక యుల్లలరింప వచ్చెఁగా. 78

తా. ఆనందంపు సొంపుచేఁ గడగంటిచూపులు సొగసుగా నిగుడ్చుచు నాకుఁ గన్నులపండువై అమృతమువంటి పిల్లఁగ్రోవిరవళిచే వీనులకు విందులు గూర్చుచుసర్వబంధుఁడగు నా శ్రీకృష్ణుఁ డిదె వచ్చుచున్నాఁడు.

శ్లో॥ దూరా ద్విలోకయతి వారణఖేలగామీ
ధారాకటాక్షభరితేన విలోచనేన ।
ఆరా దుపైతి హృదయఙ్గమ వేణునాద
వేణీదుఘేన దశనావరణేన దేవః॥ 79

టీ. దేవః=దేవుఁడగు శ్రీకృష్ణుఁడు, ధారా...భరితేన - ధారా=ఎడతెగనిదైన, కటాక్ష=కడగన్నులచేత-కడగంటిచూపులచేత, భరితేన=నిండింపఁబడిన, విలోచనేన=కన్నుచేత - కన్దోయిచేత, దూరాత్=దూరమునుండి, విలోకయతి=చూచుచున్నాఁడు, వారణ...గామీ - వారణ=ఏనుఁగువలె, ఖేల=విలాసముతోఁ గూడునటుగా, గామీ=గమనము గలవాఁడై, హృద...దుఘేన-హృదయఙ్గమ=మనోజ్ఞమైన, వేణునాద=మురళీధ్వనియనెడి, వేణీ=ప్రవాహము, దుఘేన=పిదుకుచున్నదైన, దశనావరణేన = వాతెఱతో-అధరోష్ఠముతో. వాతెఱతో ఎడతెగక పిల్లఁగ్రోవి నూఁదుచు ననుట, ఆరాత్=సమీపమునుండి-సమీపముగా, ఉపైతి=చేరవచ్చుచున్నాఁడు. దూరమునుండియే ఆ వ్వారిగాఁ గడగఁటిచూడ్కులు నిగుడ్చుచును వాతెఱమెఱయఁ జెవుల కింపుగా వేణువు నూఁదుచును ఏనుఁగునడతో దగ్గఱకు వచ్చుచున్నాఁ డని యర్థము. దూరమున ధారాకటాక్షములతోఁ గూడిన విలోచనములును, దాపున వేణునాదప్రవాహముతోఁ గూడిన దశనావరణమును శోభాజనకము లని తెలియునది.

మ. ఘనమత్తేభవిలాసయానము సెలంగంగన్ దవ్వులం జూచి చ
ల్లనిధారాళకటాక్షవీక్షణసముల్లాసంబుతోఁ జెంగటం
జనువేళం దశనచ్ఛదంబు వెలయన్ శ్రీనాస్వామి సమ్మోదమో
హనవంశీసనదప్రవాహముఖలీకేళావాప్తి దెల్పుం దయన్. 79

తా. దూరమునుండి ఎడతెగనికడగంటిచూడ్కులచాలు నిగుడ్చుచు, ఇంపుగా నెడతెగక వేణుధ్వనులు పరఁగించుచును, దేవుండగు శ్రీకృష్ణుండు మదపుటేనుంగునడక వంటినడకతో దగ్గఱకు వచ్చుచున్నాఁడు.

శ్లో॥ త్రిభువనసరసాభ్యాం దీప్తభూషాపదాభ్యామ్
దృశిదృశి శిశిరాభ్యాం దివ్యలీలాకులాభ్యామ్ ।

అశరణశరణాభ్యా మద్భుతాభ్యాం పదాభ్యామ్
మయ మయ మనుకూజద్వేణు రాయాతి దేవః॥ 80

టీ. త్రిభు...సాభ్యాం - త్రిభువన=ముల్లోకములకును, సరసాభ్యామ్=మనోహరములైనవియు, దీ ప్త...దాభ్యామ్-దీప్త=ప్రకాశించుచున్న, భూషా=భూషణములకు, పదాభ్యామ్=స్థానములైనవియు, 'దృప్తభూషాపరాభ్యామ్' అనుపాఠమున, దృప్త=మిట్టిపీఁగినట్టి-అతిశయించిన, భూషా=భూషణములనెడు, అపరాభ్యామ్=తక్కువైనవిగలవియు-సొమ్ములను మించినవనుట, దృశిదృశి=ప్రతిదర్శనమందును-చూడఁగాఁ జూడఁగానసుట, శిశిరాభ్యామ్=చల్లనైనవియు-ఆహ్లాదకరములైనవి యనుట, దివ్య...లాభ్యామ్-దివ్య=మనోజ్ఞములైన, లీలా=విలాసములచేత, అమలాభ్యామ్=వ్యాప్తములైనవియు, అశర...ణాభ్యామ్-అశరణ=గతిలేనివారికి, శరణాభ్యామ్=గతియైనవియు - రక్షకములైనవి యనుట, కావుననే, అద్భుతాభ్యామ్=ఆశ్చర్యకరములైనవియు, అగు పదాభ్యామ్=అడుగులచేత, అయంఅయం=ఈ ఈ-వీఁడె, వీఁడె, దేవః=దేవుఁడైన, శ్రీకృష్ణుఁడు-ఇదె ఇదె శ్రీకృష్ణుఁడనుట, అనుకూజత్ వేణుః-అనుకూజత్=అనుసరించి మొరయుచున్న-అడుగుల విన్యాసమునకు అనుసరించి మ్రోయుచున్న, వేణుస్సన్=పిల్లఁగ్రోవి గలవాఁడై-అడుగులకు అనుగుణముగా వేణువు నూఁదుచుననుట, ఆయాతి=వచ్చుచున్నాఁడు, 'అయమయమ్' అనుటచే మిక్కిలియుఁ బొడతెంచుచు మఱిమఱి సమీపించి వచ్చుట తెలియునది.

శా. క్రీడాభూషణధారులై యశరణశ్రేయశ్శరణ్యంబులై
చూడం జూడఁగఁ జల్లనై సొగసునై చోద్యంబులై దేవతా
చూడారత్నములైనపాదముల రాకసొం పొంది వేణుధ్వనుల్
జాడల్ దెల్పఁగ వీఁడె వీఁడె యను నాకస్వామిన్ విలోకించెదన్.80

తా. ముల్లోకములకును మనోజ్ఞములై, మొరయుచున్న యందియలు మొదలగుసొమ్ములుదాల్చి, మేలైనవలువలుపచరించుచుఁ, జూడఁజూడఁగాఁగంటికిఁజల్లనై, అగతులకు రక్షకములై, కావుననే అత్యాశ్చర్యములైన యడుగులతో దేవుండగు శ్రీకృష్ణుఁడు అడుగులకు సరిగా పిల్లఁగ్రోవి నూఁదుచు నిదె వచ్చుచున్నాఁడు.

శ్లో॥ సోఽయం మునీన్ద్రజనమానసతాపహారీ
సోఽయం మదవ్రజవధూవసనాపహారీ।
సోఽయం తృతీయభువనేశ్వరదర్పహారీ
సోఽయం మదీయహృదయామ్బురుహాపహారీ॥ 81

టీ. యః=ఎవ్వఁడు ముని...హారీ-మునీన్ద్ర=మునిశ్రేష్ఠులయొక్క, జన=సమూహముయొక్క, మానస=మనస్సుయొక్క, తాప=తాపమును - తుంచుటయును, హారీ=అప

హరించువాఁడో-పోఁగొట్టువాఁడో, సః=వాఁడు, అయం=ఇతఁడే, యః=ఎవఁడు; మద...హారీ - మద=మత్తతగల-యౌవనమత్తలైన యనుట, వ్రజవధూ=గోపస్త్రీలయొక్క, వసన=వస్త్రములను, అపహారీ=అపహరించువాఁడో, సః=వాఁడు, అయం=ఇతఁడే, యః=ఎవఁడు, తృతీయ...హారీ-తృతీయభువన ఈశ్వర=ఇంద్రునియొక్క, దర్ప=గర్వమును, హారీ=అపహరించువాఁడో, సః=వాఁడు, అయం=ఇతఁడే, యః=ఎవఁడు, మదీయ...హారీ-మదీయ=నాయొక్క,హృదయ అమ్బురుహ=మనస్సుఅనెడు తామరను, అపహారీ=అపహరించువాఁడో,సః=వాఁడు, అయం=ఇతఁడే,కేవల'ముని' లయొక్క-అనక 'మునీంద్రజను' లయొక్కమానసముల హరించువాఁ డనుటచే పరత్వాతిశయమును కేవల 'వ్రజవధు' వులయొక్క, అనక'మదవ్రజవధు'వుల వసనములను హరించినాఁడనుట చేశృంగారరససంకీర్ణమైన సౌలభ్యాతిశయమును 'తృతీయభువనేశ్వరు' ని దర్పముహరించినాఁడనుటచే లోకేశ్వరేశ్వరత్వమును ధ్వనితములు, పరమముగ్ధలగు వ్రజవధువులవసనముల నెట్లో యట్లె పరతత్త్వవేత్తలగు మునీంద్రులమనస్సులను లోకోత్తరప్రభుత్వము గల యింద్రునిగర్వమును సులభముగాహరింపఁజాలినాఁ డనియు ధ్వనితము. అనఁగా మునీంద్రుల మనస్సులు గాని దేవేంద్రుని గర్వముగాని గొల్లలవలువలవలెనే యలక్ష్యప్రాయములని భావము. కావుననే నాహృదయారవిందమును హరించు టెంత యని యాశయము.

ఉ. చిక్కఁ నాఁడు గోపికల ఽ చేలము లెత్తినదొంగ, శైలముల్
చెక్కలు సేయువానిమద ఽ జృంభము నాఁచినదొంగ, భక్తిచే
నెక్కొనుమౌనికోటి మది ఽ నిల్చినతాపముఁ బాపుదొంగ, నా
చొక్కపుఁజిత్తసారసముఁ ఽ జూఱలుగాఁ గొనుదొంగ, నేఁటికిన్. 81

తా. ఎవఁడు మునివరులమనంబులం బొడమినతాపముల హరింపఁ జాలు పరతత్త్వమో, ఎవఁడు మత్తిల్లిన గొల్లమిటారుల పుట్టములను దొంగిలించు సౌలభ్యలీలానిధియో, యెవ్వఁడు ముల్లోకములరాజైనయింద్రుని గర్వమడఁచు మహామహిముఁడో, కావుననే యెవ్వఁడు నాహృదయకమలమును జూఱగొన్నవాఁడో, యా పురుషుఁడే యీపొడ తెంచుచున్నవాఁ డగును.

శ్లో॥ సర్వజ్ఞత్వే చ మౌగ్ధ్యే చ, సార్వభౌమ మిదం మమ
నిర్విశ న్నయనం తేజో, నిర్వాణపద మశ్నుతే॥ 82

టీ. సర్వజ్ఞత్వే చ=సర్వజ్ఞత్వమందును, మౌగ్ధ్యేచ=బేలతనమందును-లేక సౌందర్యమందును, సార్వభౌమం=చక్రవర్తియైనట్టి-సర్వోత్కృష్టమైనట్టి యనుట, ఇదం=ఈ-ఈముంగలఁ గనఁబడుచున్న, తేజః=కృష్ణరూపమైన తేజస్సును, మమ=నాయొక్క, నయనం=కన్ను, నిర్విశన్=అనుభవించుచు-తనివారఁ జూచుచు ననుట, నిర్వాణపదం=మోక్షపదవిని-అఖండమోక్షానందము ననుట, అశ్నుతే=అనుభవించుచున్నది - ఇంతకన్న

సర్వజ్ఞమైనదిగాని సౌందర్యము గలదిగాని మఱొక్కటి జగమునలేదు. కావుననే దీనిని కన్నులారఁజూచినంతనే మోక్షసామ్రాజ్యము గలిగినంతపరమానందము గలుగుచున్నదని యాశయము.

మ. వినుసర్వజ్ఞతయందు మాధుర్యమున నుత్కర్షైక సార్వభౌమంబు నాఁ
జనునీతేజముఁ జూచి నానయనముల్ సారూప్యముం జెందె వీఁ
డని యాలోకముఁ జేయఁగా భ్రమరకీటన్యాయముం గాంచి కా
దన జ్ఞానేంద్రియరూఢి కన్నులకు నేత్రాలా కల్గు నూహింపఁగన్. 82

తా. సర్వజ్ఞత్వమందును సౌందర్యమునందు సకలజగంబుల నెందును సాటిలేనిదై కృష్ణరూపమున వెలింగెడి యీతేజస్సును జూచినంతనే నాకన్నులపరిమితానందమును బొందుచున్నవి.

శ్లో॥ కృష్ణాన మేత త్పునరుక్తశోభ
ముష్ణేతరాంశో రుదయం ముఖేన్దోః ।
తృష్ణామ్బురాశిం ద్విగుణీకరోతి
కృష్ణాహ్వయం కిఞ్చన జీవితం మే॥ 83

టీ. కృష్ణ ఆహ్వయం=కృష్ణుఁడను పేరు గలదియు, కించన=ఇట్టిదట్టిదని చెప్పనలవికానిదియు, అగు, మే=నాయొక్క, ఏతత్ = ఈ-ముందటఁ గనఁబడుచున్న, జీవితమ్ = ప్రాణమైనదియు - అత్యంతాధారమైనది యనుట - అది లేనియెడల ప్రాణములేనట్లె క్షణమాత్రము నుండలేను గనుక అది నాప్రాణమే యని హృదయము, ఇట్టి వస్తువు, ముఖ ఇన్దోః=తనయొక్క మొగముచందురునివలన,ఉష్ణఇతర అంశోః=చంద్రునియొక్క, ఉదయం=తోఁచికను-అవిర్భావమును, పునరుక్తశోభమ్=పునరుక్త=రెండింతలైన, శోభం=కాంతి గలదిగా, కృష్ణాన=చేయుచున్నదై-చంద్రునికంటె ద్విగుణితమైనకాంతివిశేషము గలదైయనుట, తృష్ణ అమ్బురాశిం=నా ఆశ యనెడిసముద్రమును, ద్విగుణీకరోతి=రెండింతలుగాఁ జేయుచున్నది, చంద్రుఁడు సముద్రమును బొంగఁజేయునట్లు దీనిముఖచంద్రుఁడును, నాయాశాసముద్రమును బొంగఁజేయుచున్నాఁడు. అందును చంద్రునికంటె ఈముఖచంద్రుఁడు రెండింతలు కాంతిగలవాఁడగాన ఆశాసముద్రమును 'ద్విగుణీకరోతి' రెండింతలు సేయుచున్నాఁడని యర్థము. కృష్ణుని జూడవలయు నని యువ్విళ్లూరుచుండిన నాపేరాస తదీయముఖ చంద్రునిఁజూడఁగానే మఱిమఱి రెండంతలు పెరిఁగినది గాని తనివి తీరినది గాదని యాశయము.

---

*ఇట్టి మాధుర్యమునే కాళిదాసు 'నేత్రనిర్వేశనీయమ్' 'అయే లబ్ధం నేత్రనిర్వాణమ్' అనియు వర్ణించినాఁడు.

మ. కమలోల్లాసకమై నిరంతరకళల్ క్రొగన్నట్టి శీతాంశుబిం
బముకంటెన్ ద్విగుణాభిరూప్యమున రక్తస్యంబైన నెమ్మోము౯ బు
న్నమజాబిల్లి వెలుంగుతో వెలయుకృష్ణాభిఖ్య మానాదుజీ
వము దృష్ణాబ్ధితరంగలన్ ద్విగుణమై వర్ధిల్లఁ జేసెన్ మదిన్. 83

తా. ఇట్టి దట్టి దని వర్ణింప నలవి కానిదై నాకుఁ బ్రాణతుల్యమై కనఁబడు చున్న యీకృష్ణాఖ్యతత్త్వము, చంద్రునికంటె నినుమడి కాంతివిశేషము గలిగి మిక్కిలి యాహ్లాదమును గలిగించు తన మొగముచేత, చూడ నువ్విళ్లూరుచున్న నా పేరాసను మఱింత పెరుఁగఁజేసినదే కాని తీర్చినది కాదయ్యె.

శ్లో॥ త దేత దాతామ్రవిలోచనశ్రీ
సమ్భావితాశేషవినమ్రవర్గమ్ ।
ముహు ర్మురారే ర్మధురాధరోష్ఠమ్
ముఖామ్బుజం చుమ్బతి మానసం మే 84

టీ. ఆతామ్ర...వర్గమ్—ఆతామ్ర=అంతటనెఱ్ఱనైన, విలోచన=నేత్రములయొక్క శ్రీ=కాంతిచేత, సమ్భావిత=బహూకరింపఁబడిన, అశేష=సమస్తమైన, వినమ్ర=ఆశ్రితులయొక్క, వర్గం=సమూహముగలదియు, మధు...రోష్ఠమ్—మధుర=మనోజ్ఞమైన, అధరోష్ఠం=అధరముగలదియు, అగు, తత్=ఆ–ప్రసిద్ధమైన, ఏతత్=ఈ–ఇపుడు కనఁబడు చున్న, మురారేః=శ్రీకృష్ణునియొక్క, ముఖ + అమ్బుజమ్=మోముఁదామరను, మే=నా యొక్క, మానసం=మనస్సు, ముహుః=మాటికి, చుమ్బతి=చుంబించుచున్నది–చింతించు చున్నది–మనస్సునకు 'చుంబతి' అనుచుంబనవ్యాపారముగలుగదుగాన చుంబించునటువలె ముఖమును అత్యంతభోగ్యముగా ఆస్వాదించుచున్నదని యాశయము. అది ఆముఖమును అంబుజమువంటిదిగాన చుంబించుచున్నది. కేవలము అంబుజమువంటిదేకాక 'ఆతామ్ర' మైన విలోచనములును 'మధుర' మైన అధరోష్ఠమును గలిగియుండుటచే 'ముహుః' మాటికి చుంబించుచున్నదని భావము. వినమ్రవర్గమందు విలోచనముల 'శ్రీ' కాంతిపాల సెనని చెప్పుటచే కటాక్షములు ప్రసరించెననియు, అవి అవినమ్రవర్గమును 'సంభావిత' బహూకరించు ననుటచే కరుణారసప్రేరితములైనవనియు వ్యంజితములు. వినమ్రవర్గ మును 'అశేష'మును సంభావించుటచే కరుణాబాహుళ్యము ధ్వనితము.

చ. కలశపయోధిశీకరనికాయముచే నునుఁగెంపు మీఱుక
న్నుల నతపాళికిం బ్రియముగ్రనూల్కొనఁ జేయుచుఁ దత్సుధాకణం
బులు మధురాధరోష్ఠమునఁగ్రబూనినయాదిమ దేవుమోముఁ గా
వలె నేఢి గాక యున్న యెడఁగ్రబల్మ్రఱు నామది యూనఁ గోరునే. 84

తా. కరుణాతిశయముచే ఎఱ్ఱనికడగంటికాంతులు పొలయునట్లు ఆశ్రితసమూహమునంతయుఁ గటాక్షించుచున్న కన్నుఁగవయు, చెలువైన క్రిందిపెదవియుఁ గలిగి, యత్యంతమనోజ్ఞముగాఁ గనఁబడుచున్న యీకృష్ణుని ముఖారవిందము యొక్క సొంపును నామనస్సు మాటిమాటికి ననుభవించుచున్నది.

శ్లో॥ కరౌ శరదుదఞ్చితామ్బుజవిలాసశిక్షాగురూ
పదౌ విబుధపాదపప్రథమపల్లవోల్లఙ్ఘినౌ।
దృశౌ దళితదుర్మదత్రిభువనోపమానశ్రియా
విలోకయ విలోచనామృత మహో! మహచ్ఛైశవమ్॥ 85

టీ. కరౌ=హస్తములు, శర...గురూ-శరత్=శరత్కాలమునందు, ఉదఞ్చిత=లేచిన-పుట్టిన, అమ్బుజ=తామరలయొక్క, విలాస=ఒప్పిదములకు, శిక్షాగురూ=శిక్షాగురువులైనవి-ఉపదేశించునట్టియాచార్యులైనవి – తామరలకు సొబగులు గఱపునట్టివనుట-తామరల నతిశయించిన విలాసములు గలవని భావము. పదౌ=పదములు, విబుధ...ల్లఙ్ఘినౌ-విబుధపాదప=దేవతా వృక్షములయొక్క – కల్ప వృక్షములయొక్క, ప్రథమ=నూతనమైన-తొలుతటివైన, పల్లవ=చిగుళ్లను, ఉల్లఙ్ఘినౌ=అతిక్రమింపఁజాలినవి – కల్పవృక్షముల తొలిచిగుళ్లను మీఱునట్టి మెత్తఁదనమును ఎఱ్ఱఁదనమును గలవి యనుట. దృశౌ=కన్నులు, దళిత...శ్రియా – దళిత=చీల్పఁబడిన – పోఁగొట్టఁబడినయనుట, దుర్మద=గర్వాతిశయముగల, త్రిభువన=ముల్లోకములందలి, ఉపమాన=ఉపమానభూతములైనపదార్థములయొక్క, శ్రియా=కాంతులుగలవి-తమకు ఉపమానములుగాఁ జెప్పఁబడు తామరలు కలువలు మొదలగుముల్లోకములందునుగలవస్తువులయొక్క శోభాగర్వమును హరించినవనుట. ఇట్టి యత్యంతమనోజ్ఞములైన కరయుగమును పదయుగమును నయనయుగమును గలిగినదగుటచే. అహో=ఆశ్చర్యము, విలోచన+అమృతమ్-విలోచన=కన్నులకు, అమృతమ్=అమృతమైనది – అమృతమువలె అత్యంతభోగ్యమైనది, అగు, మహత్+శైశవమ్-మహత్=(శ్రీకృష్ణమూర్తియొక్క) గొప్పదైన, శైశవమ్=బాల్యమును, విలోకయ=చూడుము. 'మనోనయనామృతంను' అన్నట్లు, ఇట 'విలోచనామృతమ్' అనఁబడినది. లేక, హే విలోచన=ఓ నేత్రమా! అమృతమహః=అమృతమువలె తేజస్సుగలిగిన మహచ్ఛైశవమని యర్థాంతరము. ఇది సరసముగాఁ గానిపింపదు. 'అమ్బ చిరం బత లమ్బతే' 'ముహురమ్బ చిత్రమ్' ఇత్యాదులందు అంబాశబ్దసంబోధనము కానిపించుటచే ఇచట 'విలోకయ' అను క్రియకు 'అంబ' అనుసంబుద్ధి అధ్యాహార్యము. కరములకు 'శరదుదంచిత'ములైనఅంబుజములను జెప్పుటచే విలాసాతిశయమును, పదములకు కల్పవృక్షముల 'ప్రథమ' పల్లవములను జెప్పుటచే సౌకుమార్యాతిశయమును, దృక్కులకుఁ ద్రిభువనములందలి ఉపమాన 'శ్రీ'లదళనమును జెప్పుటచే జగదేకమనోహరత్వమును వ్యంజితములు. ఇట్టివి

గలది కావున నే శైశవము విలోచనామృత మనియు 'అహో' యని యాశ్చర్యకర మనియుఁ జెప్పఁబడినది.

ఉ. పాదము లంటినూ విబుధపాదపనూతనపల్లవావళిం
గా దనుఁ గన్నుదోయి సకలకాంతివిశేషము ముజ్జగంబునన్
లే దను శారదాబ్జనవలీలలఁ గెల్వ గేరు లోచనా
హ్లాద మయారె శైశవవిలాసము గంటిమి నందనూతికిన్. 85

తా. శరదృతువునం బొడముసట్టి తామరల చెలువములను మించునట్టి చేతులును, కల్పవృక్షములతొలుచిగుళ్లను మీఱునట్టియడుగులును, ముల్లోకములందును గల యుపమాన వస్తువుల యొప్పిదముల నెల్ల నతిశయించునట్టి కన్నులును గలిగి, కన్నులపండువై విం తలు గొలుపుచున్న శ్రీకృష్ణుని బాల్యమును జూతుము.

శ్లో॥ ఆచిన్వాన మహన్యహన్యహని సాకారాన్ విహారక్రమా
నారున్ధాన మరున్ధతీహృదయ మప్యార్ద్రస్మితాస్యశ్రియా ।
ఆతన్వాన మనన్యజన్మనయనశ్లాఘ్యా మనర్ఘ్యాం దశా-
మామన్దం వ్రజసున్దరీస్తనతటీసామ్రాజ్య ముజ్జృమ్భతే॥ 86

టీ. అహని అహని అహని=ప్రతిదినమును, స + ఆకారాన్=ఆకారముతోఁ గూడినవైన, విహారక్రమాన్=క్రీడాపద్ధతులను, ఆచిన్వానం=సంపాదించుచున్నదియు - అప్రాకృతస్వరూపమైనవస్తువైనను సౌలభ్యవశమున సకలజనమోహనమైన ఆయ్యాయాకారములనొంది ఆయాక్రీడలను సలుపుచున్నదియనుట, ఆర్ద్ర...శ్రియా-ఆర్ద్ర=సరసమైన, స్మిత=చిఱునవ్వుగల, ఆస్య=నెమ్మొగముయొక్క, శ్రియా=సంపదచేత-చిఱునవ్వుదొలఁకు నెమ్మొగంపుసొంపుచేత ననుట, అరున్ధతీ హృదయమపి-అరున్ధతీ=పతివ్రతాశిరోమణియు వసిష్ఠునిభార్యయునైన) అరుంధతియొక్క, హృదయమపి=హృదయమును గూడ, ఆరున్ధానమ్=కొంచెము అభిముఖముగాఁ జేసికొనుచున్నదియు-అరుంధతినిగూడ కొంత తన్ను వలచునట్లు చేయునది యనుట-ఇఁకఁ దక్కినవారిని వలపించుట చెప్ప నేలయని యాశయము; అనన్య...శ్లాఘ్యామ్-అనన్యజన్మ=మన్మథునియొక్క, నయన=కన్నులను, శ్లాఘ్యామ్=కొనియాడఁ దగినదియు-మన్మథునంతటి సౌందర్యశాలియుఁ జూచి మెచ్చుకొనఁదగినట్టిదియు, కావున నే, అనర్ఘ్యాం=వెలలేనిదియు-సాటిలేనిదియనుట, అగు, దశామ్=అవస్థను-స్థితిని-అత్యంతసౌందర్యము నెఱపునట్టిదశ ననుట, ఆతన్వానమ్=సాగించుచున్నదియు-మన్మథునికంటెను అత్యంతమోహాకరమైన సౌందర్యవిలాసములు పయింబయి నెఱపుచున్నది యనుట, అగు, వ్రజ...సామ్రాజ్యమ్-వ్రజసున్దరీ=గొల్లచెలువలయొక్క, స్తనతటీ=కుచప్రదేశములయొక్క, సామ్రాజ్యమ్=సర్వాధిపత్యము-ఇటసామ్రాజ్యశబ్దముచే సర్వోత్కృష్టవైభవమును భోగమును సూచితములు గావున-కుచముల

యొక్క మహావైభవమును భోగమును ఆయినదనుట—వచనములకు మితిలేని యుబ్బును సుఖాతిశయమును గలిగించునది యనుట-ఇట్టి కృష్ణాఖ్యవస్తువు, ఆమన్దం=ఒక్కింత మంద మగునట్లుగా, ఉజ్జృమ్భతే=విజృంభించుచున్నది-కేవల 'స్తన'ములయొక్క అనక 'స్తనతటుల'యొక్క సామ్రాజ్యమనుటచే ఆలింగనముయొక్క గాఢత్వము వ్యంజితము. వస్తువో గోప స్త్రీ స్తనతటమునకు 'సామ్రాజ్య' నిరతిశయభోగవిభవమునుగూర్చునది_అట్టి వస్తువు ప్రౌఢమున శాకరూపముతో చిన్నెలు వన్నెలు చూపుచు అరుంధతినిగూడ వలపించునట్టిముద్దునగుమొగము గలిగియున్నది. కనుక మన్మథునికి మెచ్చందగినట్టి మోహనాకృతిం గలిగియున్నది. కావుననే వ్రజసుందరీ స్తనతటులకు సామాన్యసుఖప్రద మైనది కాక 'సామ్రాజ్య'మే యైయున్నదని యర్థము. అనఁగా ప్రౌఢప్రౌఢునకు వింతలు గులుకు రూపును, వన్నెలుగులుకు లీలలును, చిఱునవ్వు దొలఁకు మొగమును, మన్మథుని కంటె మించినమోహనత్వమును, జూచి గొల్లచెలువలు చన్నుగుబ్బ లుప్పొంగ బిగ్గఁ గౌఁగిలించికొని నిర్భరానందరసమగ్నలగుదు రని భావము.

మ. నలినాస్త్రుండును జొక్కి కన్గొనుచు నాశ్వనందింప నెమ్మోముఁగ్రొం
దళుకున్నవ్వు లరుంధతీహృదయ మైశ్వనం బోవ నీ కాఁగ విం
తలుగాఁ బ్రౌఢాకారరూప మై మెలఁగువిశ్వన్మాణంబులం దేలి ని
శ్చలనంద వ్రజసుందరీ స్తనతటీసామ్రాజ్య ముప్పొంగెడిన్. 86

తా. అప్రాకృతస్వరూపమైన వస్తువు అయినను ప్రతిదినమును వింతలు గులుకు ఆకారములను దాల్చి చిన్నెలు వన్నెలు నెఱపుచు, అరుంధతిఁగూడ సోకింతమోహము గొలుపునట్టి చిఱునవ్వుతోడి మొగము సొంపుతో, మన్మథుఁడు చూచి మెచ్చుకొనునట్టి మోహనదశ గలిగి, గోప స్త్రీలుచొక్కి చన్నుగుబ్బలుబిగ్గనొత్తికౌఁగిలించుకొని యానంద విభవ మనుభవించు కృష్ణాఖ్యవస్తువు నాయెడ నల్లఁబ్రకాశించుచున్నది.

శ్లో॥ సముచ్ఛ్వసితయౌవనం తరళశైశవాలఙ్కృతం
మదచ్ఛురితలోచనం-మదనముగ్ధహాసామృతమ్ ।
ప్రతిక్షణవిలోభనం ప్రణయపీతవంశీముఖం
జగత్త్రయవిమోహనం జయతి మామకం జీవితమ్॥ 87

టీ. సము...యౌవనమ్-సముచ్ఛ్వసిత=లెస్సగా వికసించిన-చక్కఁగాఁ బొడచూపిన, యౌవనమ్=ఎలప్రాయము గలదియు,తర...ఙ్కృతమ్-తరళ=చంచలమైన-చపలస్వభావముగల, శైశవ=బాల్యముచేత, అలఙ్కృతమ్=అలంకరింపఁబడినదియు-ఇచట బాల్యయౌవనసంధి చెప్పఁబడినది_బాల్యము కొంత వీడకయు యౌవనముచక్కఁగా స్ఫురించుచునుండు వయస్సుగలది యనుట-బాల్యముయొక్కచపలత్వప్రయుక్తమునైన

లీలావిశేషములును యౌవనముయొక్క శృంగారరసప్రయుక్తములైన వైభవములును రెండునుగలిగి యత్యంతమనోజ్ఞ మగుటచే కవి యిట్టివయస్సంధినే కోరినాఁడని తెలియునది. మఱియును, మద...లోచనం-మద = మన్మథమదముచేత-యౌవనప్రయుక్తమైన మరులుచేత, ఘురిత=పూయఁబడిన,లోచనమ్=కన్నులుగలదియు-మన్మథవికారముతోడి చూడ్కులు నిగుడ్చుకన్నులు గలదియనుట-లేక, మద = యౌవనమదముచేత-యౌవనంపుసొంపుచే నివ్వటిల్లు నిక్కుచేత, ఘురిత=పూయఁబడిన - ఆవరింపఁబడిన లోచనములు గలదియనుట-యౌవనంపునిక్కుచే సొగసైన మురువుఁజూడ్కులు నిగుడ్చునదియనుట, మద..,మృతమ్-మదన=మన్మథునిచేత, ముగ్ధ=సుందరమైన, హాస + అమృతమ్=అమృతమువంటినవ్వు గలదియు-మన్మథవికారముచేత అమృతమువలె నత్యంతభోగ్యముగాఁ దళుకొత్తుచున్న నవ్వు గలదియనుట, ప్రతి...భనమ్-ప్రతిక్షణ - క్షణక్షణమును, విలోభనమ్=మిక్కిలి యాసఁగొలుపునదియు-క్షణక్షణమును వింతవింతగా క్రొత్తక్రొత్తచెలువులు పచరించుచుండుటచే మిక్కిలి యాసగొలుపుచున్నది యనుట, ప్రణ...ముఖమ్-ప్రణయ=ప్రేమచేత, పీత=త్రావఁబడిన-ఊఁదుటకై పెదవిని బెట్టుకొనఁబడినయనుట, వంశీ=పిల్లఁగ్రోవియొక్క,ముఖం=వాయిగలఁదియు,జగత్...మోహనమ్-జగత్ + త్రయ=లోకములమూఁటిని, విమోహనమ్=మిక్కిలి మోహింపఁజేయునదియు, అగు-మామకం=నాదియైన,జీవితమ్=ప్రాణము-నాప్రాణపదమైన శ్రీకృష్ణాఖ్యవస్తువు,జయతి =సర్వోత్కర్షముతో వర్తించుచున్నది. సముచ్ఛ్వసితమైన యౌవనముగలది గనుకనే మదచ్ఛురితమైనలోచనములును మదనముగ్ధమైనహాసమునుగలదై ప్రతిక్షణమును విలోభనమైనది. మఱియు వంశీముఖమును నోటహారువుగాఁబెట్టుకొని యూఁదునట్టిరవళిమురువుచే జగత్త్రియమునకును విమోహనమైనది. ఇట్టి యత్యంతమనోజ్ఞలక్షణలక్షితమైనదగుటచే నాకు జీవనమేయైనదని భావము. హాసము మన్మథప్రేరితమగుటచేఅమృతప్రాయమైనదిగనుక 'హాసామృతమ్' అనఁబడియె నని తెలియునది. యౌవనముయొక్క మదచ్ఛురితలోచనత్వాదుల చేతను శైశవముయొక్క తరళత్వముచేతను అత్యంతరమణీయత్వము నొందినదగుటచే ఆ రెంటియొక్క మేళనమును గవి యిట ననుసంధించినాఁడు. ముందు 'ఆమన్దం సముజ్జృమ్భతే' అన్నవస్తువు ఇపుడు 'జయతి' అన్నాఁడు.

మ. తలఁ పంతంతకు నీటుదేఱఁ దళుకొంగ్రదన్ జాఱె బాల్యంబు వె
న్నెల నేలం దెలినవ్వు క్రొందళుకు లీఁగ్రనెన్ నేత్రముల్ మోవికిం
గలవంశీముఖచుంబనం బమరె లోకంబుల్ విలోకించి యు
వ్విళు లూరెన్ మది నాదుజీవితము తీవిం బర్వెఁ గృష్ణాకృతిన్. 87

తా. చక్కఁగాఁ బొడముచున్నప్రాయమును చపలస్వభావము గల బాల్యమును గలదై, యౌవనపుసొంపుచే మత్తుగొన్న చూడ్కులు గలకన్నులును, మరులుచే అమృత

మువలె నతిభోగ్యముగా నెఱయునవ్వునుగలిగి, ప్రతిక్షణమును బేరాసగొలుపుచు, పిల్లన గ్రోవినిబట్టియూఁదునట్టిహరువుచే ముల్లోకంబులవారిని మోహింపఁజేయుచుఁ, గావున నే నాపఁ బ్రాణపదమై యొప్పు శ్రీకృష్ణాఖ్యవస్తువు సర్వోత్కృష్టమై వర్తించుచున్నది.

శ్లో॥ చిత్రం తదేత చ్చరణారవిన్దం, చిత్రం తదేత న్నయనారవిన్దమ్ ।
చిత్రం తదేత ద్వదనారవిన్దం, చిత్రం తదేత త్పున రమ్బ చిత్రమ్॥

టీ. తత్=ఆ-ప్రసిద్ధమైన, ఏతత్=ఈ-కనఁబడుచున్న, చరణ+అరవిన్దమ్=(కృష్ణునియొక్క-) అడుగుఁదామర, చిత్రం=ఆశ్చర్యమైనది, తత్, అనుటచే తనకు పూర్వము ధ్యానవిషయమై సుప్రసిద్ధమైయుండున దనియు 'ఏతత్' అనుటచే ఇప్పుడు ప్రత్యక్షము.గా కనఁబడుచున్న దనియునర్థము. ఇట్లే మీఁదనెల్ల గ్రహించునది, తత్+ఏతత్=ప్రసిద్ధమై యీకనఁబడుచున్నట్టి, నయన+అరవిన్దం=కన్నుఁదామర - తామరవంటి కన్ను లనుట, చిత్రం=ఆశ్చర్యమైనది, తత్+ఏతత్=ప్రసిద్ధమై యీకనఁబడుచున్న-వదనఅరవిన్దమ్=మోముదామర-తామరవంటిమొగము, చిత్రం=ఆశ్చర్యమైనది. హే అమ్బ=ఓతల్లీ, తత్=ఆ-పూర్వము హృదయవిషయమై యుండిన, ఏతత్ = ఇది-ఇట్టి పాదారవిందాద్యవయవములతోఁగూడి కనఁబడుచున్న యీకృష్ణాఖ్యవస్తువు, చిత్రం=ఆశ్చర్యమైనది, పునః=మఱియు, చిత్రమ్ = ఆశ్చర్యమైనది-మిక్కిలి ఆశ్చర్యమైన దనుట, 'పున రేవ చిత్రమ్' అనుపాఠమున, పునః=మఱియు, చిత్రమేవ = ఆశ్చర్యమైనదియే యని యర్థము. అనుపమకాంతివిలాసయుక్తము లగుటచే చిత్రములైయున్న చరణనయనవదనములు దాల్చియున్నది గావున ఇది చిత్రాతిచిత్రమైనదని ఆశయము.

ఉ. లోకములోన మోములు విశాలోచనములో పదములో సహస్రసం
ఖ్యాకము లంచు నెంచు శ్రుతు లాపురుషోత్తము నిర్విధంబుగా
నీకనుఁదమ్మిదోయి చెలువీముఖసారస మీపదాబ్జముల్
చేకొనఁ జిత్ర మంచు నుతి సేయఁగఁ బల్కుట నంబ శక్యమే! 88

తా. కాంతియొప్పిదములచే చిత్రములై తామరలం బోలెడిచరణములును నేత్రములును ముఖమును గలిగి, యీకృష్ణాఖ్యవస్తువు చిత్రాతిచిత్రమై యున్నది.

శ్లో॥ అఖిలభువనైకభూషణ, మధిభూషితజలధిదుహితృకుచకుమ్భమ్ ।
వ్రజయువతీహారావలి, మరకతనాయకమహామణిం వన్దే ॥ 89

టీ. అఖి...షణమ్-అఖిల=సమస్తమైన, భువన=లోకములకు, ఏక=ముఖ్యమైన, భూషణమ్=ఆభరణమైనదియు, జగములకెల్ల ముఖ్యాలంకారమైనదియు, అధి...కుమ్భమ్-అధిభూషిత=అలంకరింపఁబడిన, జలధిదుహితృ=సముద్రునికూఁతురైనలక్ష్మియొక్క, కుచకుమ్భమ్=కలశములవంటి స్తనములు గలదియు-లక్ష్మీదేవిచనుములకు అలంకారమైనది

యనుట, అగు, వ్రజ...మణిమ్-వ్రజయువతీ=గోప స్త్రీలయొక్క, లేక, గోపస్త్రీ లనెడి, హారావలి=ముత్తెపుసరులయొక్క, మరకత=మరకతమయమైన, నాయకమహామణిమ్=పెద్దదియైన నాయకరత్నమును గూర్చి యనుట, 'వ్రజయువతి హారవల్లీమరకత' అనుపాఠమున, వ్రజయువతీ=గోప స్త్రీలయొక్క, హారవల్లీ=తీగవంటిహారమునకు,మరకత నాయక మణి యని యర్థము. 'తరుణీ స్తనఏవ దీప్యతే మణిహారావళి రామణీయకమ్'అని హారావళీ శబ్దప్రయోగము. లోకోత్తరదేవతారత్న మైన లక్ష్మియొక్క వచములవను కేవలమర్త్య స్త్రీలును అంమను గడుముగలును అగు గోప స్త్రీల హారములవను నలంకార మైనాడని పరత్వసౌలభ్యముల సంకరము తెలియునది. ఇట్టి కృష్ణునిగూర్చి, వన్దే = నమస్కరించుచున్నాను.

చ. జలనిధికన్యకాఘనకుచస్థలిపచ్చలతాళి గోపికా
విలసితహారనీలమణి కై విశ్వజగద్వలయప్రకాశకో
జ్జ్వలమహనీయరత్న మనివారితకాళియభోగిభోగమం
డలగిరివజ్ర మై వెలయునందతనూజు భజింతు నామదిన్ 89

తా. సమస్తలోకములవను అలంకారమై, లక్ష్మీదేవివచకలశములవు భూషణమై, గోప స్త్రీలహారములనడిమి పెద్దయింద్రనీలపునాయకమణియైయొప్పుకృష్ణునికి మ్రొక్కెద.

శ్లో॥ కాన్తాకచగ్రహణవిగ్రహబద్ధలక్ష్మీః, ఖణ్డాఙ్గరాగరసరఞ్జితమఞ్జులశ్రీః।
గణ్డస్థలీముకురమణ్డలఖేలమాన,ఘర్మాఙ్కురం కిమపి ఖేలతి కృష్ణ తేజః॥

టీ. కాన్తా...శ్రీ-కాన్తా=ప్రియురాలియొక్క, కచ=వురులయొక్క, గ్రహణ=పట్టుకొనుటచేతనైన, విగ్రహ=జగడమందు, బద్ధ = కట్టబడిన-బిగ్గ గౌగిలించి యిట్టట్టు కదలనీక పట్టుకొనఁబడినయనుట, లక్ష్మీ=లక్ష్మీదేవియొక్క,ఖణ్డ=తునియలైన-చిట్లిన, అఙ్గరాగరస=మైపూఁతద్రవ్యముచేత, రఞ్జిత=వన్నె పూయఁబడిన – లేక అలంకరింపఁబడిన, మఞ్జుల=మనోజ్ఞమైన, శ్రీ=కాంతిగలదియు, వురులను పట్టుకొనుట అను జగడమును లక్ష్మీదేవితోఁ బెట్టుకొని అందులకై పట్టునీయక పెనఁగులాడుచున్న యాలక్ష్మిని ఇట్టట్టు పెనఁగులాడవుండునట్లు బిగియఁ గౌఁగిలించి పట్టుకొనఁగా అబిగికౌగిలివలన ఆదేవి మేనియందలిపూఁతి చిట్లి చెమటచేఁ దడిసి శ్రీకృష్ణుని మేనియందు అంటుకొనఁగా దానిచే నతనిపొలుపు మఱింత మనోజ్ఞమైనదని యర్థము, గణ్డ...వురమ్-గండస్థలీముకురమణ్డల– అద్దమువంటిచెక్కిళ్ళగుండ్రనిప్రదేశములందు – ఘుమఁశబ్దముచే నిద్దమై నిగనిగలాడుటయు, మండలశబ్దముచేఁగుబ్బుగలిగి గుండ్రనై యుండుటయు స్ఫురితము. అట్టి చెక్కిళ్ళప్రదేశములందు,ఖేలమాన=చిందులుద్రొక్కుచున్న, ఘర్మ=చెమటయొక్క అంకురమ్= మొలకలుగలదియు, వురులు పట్టుకొనెడి కలహమందలి పెనఁగువచేత చిఱుచెమ

టబొట్లు గ్రమ్మినచెక్కుటద్దములు గలది యనుట, కిమపి=చెప్పనలవిగానిదియు, అగు, కృష్ణతేజః=కృష్ణరూపమైన తేజస్సు, ఖేలతి=క్రీడించుచున్నది. 'అఙ్గరాగరస' అనుచో రసశబ్దముచే అంగరాగము ద్రవమగుటయు తత్స్థానమున లక్ష్మీదేవికిఁ గలిగినచెమటయు వ్యంజితములు, 'ఘర్మాఙ్కుర' మని కృష్ణునికిఁజెమటగలుగుటను జెప్పుటచేవారిరువుర కౌ కలహము కొంత ఉత్కటమైనదగుట వ్యంజితము. 'శుమ్భతి కృష్ణతేజః' అను పాఠమున 'శుంభతి' అనఁగా ప్రకాశించుచున్న దని యర్థము.

మ. కలుకన్నిద్దపుఁజెక్కుటద్దములపై గ్రఘర్మాంకురం బూరఁ గా
కలహాభోగపయోధరాంతరలసత్కాశ్మీరసంబంధగం
ధిలవక్షస్స్థలుఁడై గృహీతఘనవేణీబంధుఁడై నెయ్యపుం
జెలియాం జుంబనకేళిఁ దేల్చుహరి నాచిత్తంబునం జెందెడున్. 90

తా. లక్ష్మీదేవితో కేశగ్రహణమనుకలహంబుఁ బూని యామె నిట్టట్టు పెనఁగనీక గట్టిగాఁ గౌఁగిలించుకొనఁగా నాబిగికౌఁగిలిచే నామెమేనియందలిపూఁత చిల్లి తనదేహమునం దంటుకొనఁగా మఱింతపాలుపు అతిశయిల్లినదై, ఆకలహమునందలి అలఁతచే చిఱుచెమటబొట్లు నిద్దమైనచెక్కుటద్దములందు నిగనిగలాడఁగా, ఇట్టిదట్టిదని వర్ణింపనలవికానిదండు కృష్ణుం డనుతేజము నాకన్నులయెదుటఁ బ్రకాశించుచున్నది.

శ్లో॥ మధురం మధురం వపు రస్య విభో
ర్మధురం మధురం వదనం మధురమ్
మధుగన్ధి మృదుస్మిత మేత దహో
మధురం మధురం మధురం మధురమ్॥ 91

టీ. అస్య=ఈ-ముందటనగపడుచున్న, విభోః=విభుండైనశ్రీకృష్ణమూర్తియొక్క, వపుః=శరీరము, మధురం మధురమ్=మిక్కిలిసుందరమైనది, మధుగన్ధి-మధు=మకరందమువలె, గన్ధి=పరిమళము గలదియు, మృదుస్మితమ్-మృదు=కోమలమైన, స్మితమ్=చిఱునవ్వుగలదియు, కావుననే, మధురమ్ = సుందరమైన, (అస్యవిభోః = ఈకృష్ణమూర్తి యొక్క) వదనమ్=ముఖమును, మధురంమధురమ్=మిక్కిలిసుందరమైనది, ఏతత్=ఇది, ముందట కనఁబడుచున్నయీకృష్ణాఖ్యతేజము, మధురం మధురం మధురం మధురం=మిక్కిలి సుందరమైనది, అహో=ఆశ్చర్యము.

శా. చూడం జూడఁగ మేనఁ దా నినుమడింపఁజున్ మాధురీసంపదల్
సూడంజూడఁగ మోముగోము మదిమెప్పించుల్ గుల్కు ముమ్మాటికిం
జూడం జూడ మరందబిందువుల మింపఁజున్ మందహాసంబు నీ
జూడం బల్మఱు మాధురిం జెలఁగునాస్వామిన్ విలోకించెదన్. 91

తా. చూడంజూడ మిక్కిలిసుందరమైన మేనును, తేనియనెత్తావి గలిగి చిఱునవ్వుగులుకుచు చూడంజూడ సొగసైన మొగమును గలిగియున్న యీ కృష్ణరూప మగు తేజస్సు ఔరా! జూడంజూడ మిక్కిలిసుందరమైయున్నది.

శ్లో॥ శృఙ్గారరససర్వస్వం, శిఖిపిఞ్ఛవిభూషణమ్ ।
అఙ్గీకృతనరాకార, మాశ్రయే భువనాశ్రయమ్ ॥ 92

టీ. శృఙ్గా...స్వమ్-శృఙ్గారరస=శృంగారరసముయొక్క, సర్వస్వమ్ = సారాంశమైనవాఁడును, శిఖి...షణం-శిఖిపిఞ్ఛ=నెమిలిపురి, విభూషణం = అలంకారముగాఁ గలవాఁడును, అఙ్గీ...కారం-అఙ్గీకృత=కయికొనఁబడిన, నర + ఆకారమ్=మనుష్యరూపముగలవాఁడును-మనుష్యరూపమును గైకొన్నవాఁడనుట, భువన + ఆశ్రయమ్-భువన=లోకములకు, ఆశ్రయమ్=ఆధారుఁడైన శ్రీకృష్ణుని, ఆశ్రయే=సేవించుచున్నాను.

ఉ. చక్కనివాని ముద్దు వెదచల్లెడువాని దయారసంబుచే
నెక్కొనువాని మాళిశటి పింఛమువాని లోకముల్
మ్రొక్కఁగ నేలువాని నతిమోహనమానుషవేషధారియై
యక్కఱ లేనివాని జగదాశ్రయు నెవ్వాని నాశ్రయించెదన్. 92

తా. శృంగారరసంపుసారమై నెమిలిపురిని అలంకారముగా ధరించి లీలామానుషవిగ్రహము దాలిచి లోకంబుల కెల్ల నాధారభూతుండై వెలుంగుశ్రీకృష్ణమూర్తి నాశ్రయించెద.

శ్లో॥ నాద్యాపి పశ్యతి కదాచన దర్శనేన
చిత్తేన చోపనిషదా సుదృశాం సహస్రమ్ ।
స త్వం చిరం నయనయో రనయోః పదవ్యాం
స్వామి న్కయాను కృపయా మమ సన్నిధత్సే ॥ 93

టీ. సుదృశాం=విద్వాంసులయొక్క, సహస్రం=వేయి-విద్వాంసులసమూహమనుట, అద్యాపి=ఈదినమందైనను, కదాచన=మఱియేకాలమందైనను,(యం=ఎవ్వనిని), దర్శనేన=దృష్టిచేతను-ప్రత్యక్షముగాననుట, చిత్తేన=మనస్సుచేతను-ధ్యానమునందనుట, ఉపనిషదా=ఉపనిషత్తుచేతను-వేదాంతశాస్త్రమూలముగాననుట, నపశ్యతి = చూడదో, సః=అట్టివాఁడవైన, త్వం=నీవు-విద్వాంసులకేని ప్రత్యక్షముగాఁ గాని, ధ్యానమునఁ గాని, పరోక్షమగు వేదాంతశాస్త్రమూలముగాఁ గాని కానరానట్టివాఁడ వగు నీ వనుట, హేస్వామిన్=ఓస్వామీ, కయాను=ఇంతింతనరాని, కృపయా=దయచేత, మమ = నాయొక్క విద్వాంసుఁడనుగాక కేవలసామాన్యుఁడనగు నాయొక్క, అనయోః=ఈ-ప్రకృతిసంబంధములైన యనుట, నయనయోః=కన్నులయొక్క, పదవ్యాం=మార్గమునందు,

చిరం=బహుకాలమునకు, సన్నిధత్సే=సన్నిధానము చేయుచున్నావు. నిన్ను 'దర్శనేన' ప్రత్యక్షముగాఁ జూచుట యుత్తమము. 'చిత్తేన' మనస్సుచేఁ జూచుట మధ్యమపక్షము. 'ఉపనిషదా' వేదాంతమూలమునఁ జూచుట అధమపక్షము. ఈపక్షములందు దేనిచేతఁగాని యిప్పుడైనను మఱియొకప్పుడైనను విద్వాంసులుకూడ నిన్నుం గనుగొన్నవారు కారు. నేనో విద్వాంసుఁడనుగాను. అట్టినాకు ఉత్తమపక్ష మగు ప్రత్యక్షమూలమున నే కనుపట్టితివి. నాభాగ్య మేమందు నని భావము. విద్వాంసులకు వేదాంతమూలమునను గనుపట్టనివాఁడు ననుబోఁటివారికి ప్రత్యక్షముగా నే కనుపట్టుట 'కయానుకృపయా' నిరవధికకృపావిశేషమే యగు నని యాశయము.

ఉ. కొందఱు యోగదృష్టి నొకకొందఱు వేదవిచారవాసనం
గందురు నిన్ను నెప్పుడొ యొకానొకవేళ నభిజ్ఞులైనవా
రందఱు నిట్టిసీవు కరుణాంబుధి ప్రాకృతదృష్టిఁ జెందునా
ముందట నిల్చి యేన్నఁడు ప్రసాద మొనర్తువు నందనందనా. 93

తా. విద్వాంసులు పెక్కండ్రు నిన్నిపుడును మఱెప్పుడునుఁ గన్నారఁగాఁగాని, మనస్సుచేతఁగాని వేదాంతశాస్త్రమూలమునఁగాని కనుఁగొన్నవారుగారు, అట్టినీవు ననుబోఁటివాని యీప్రాకృతపుఁగన్నులకు ఇంతింతనరానికరుణచేఁ జిరకాలమునకు సాక్షాత్కరించితివి, నాభాగ్య మేమందును?

శ్లో॥ కేయం కాన్తిః కేశవ త్వన్ముఖేన్దోః
కోఽయం వేషః కోఽపి వాచామభూమిః ।
సేయం సోఽయం స్వాదుతా మఞ్జులశ్రీః
భూయో భూయో భూయశ స్త్వాం నమామి ॥ 94

టీ. హేకేశవ=ఓకృష్ణా, త్వ...న్దోః—త్వత్=నీయొక్క, ముఖ+ఇన్దోః=ముఖచంద్రునియొక్క - చంద్రునివంటి మొగముయొక్క, ఇయం = ఈ-కనఁబడుచున్నట్టి, కాన్తిః=కాంతి, కా=ఏది-ఎట్టిదియనవచ్చుననుటఁ కోఽపి=ఇంతింతనరానిదియు, వాచామ్+అభూమిః=వాక్కులకు విషయముకానిదియువర్ణింపనలవికానిదియు, అగు, అయం=ఈ-కనఁబడుచున్న, వేషః=(శిఖిపింఛాద్యలంకృతమైయున్న)అలంకారము, కః=ఏది-ఎట్టిదియనవచ్చును. ఏమనవచ్చునో చెప్పుచున్నాఁడు. సా=ప్రసిద్ధమైనదగు, ఇయం=ఇది-ఈముఖచంద్రకాంతియు, సః=ప్రసిద్ధమైన, అయం=ఇది-ఈవేషమును,స్వాదుతా=లావణ్యమును, మఞ్జులశ్రీః-మఞ్జుల=మనోజ్ఞమైన,శ్రీః=లక్ష్మియు-సౌందర్యలక్ష్మియు,అగును అని శేషము, నీముఖచంద్రకాంతిని లావణ్యమనియు, నీవేషమును సౌందర్యలక్ష్మి యనియును జెప్పవచ్చును; కాని కేవలముగా కాంతియనియు వేషమనియుఁ జెప్పరాదనుట,

ఇట్టివిగలవాఁడవు గనుకనే, త్వాం=నిన్ను, భూయఃభూయః=మాటిమాటికి భూయశః=అధికముగా, నమామి=(మ్రొక్కుచున్నాను. నీ ముఖకాంతియును వేషమును లోకోత్తరములై అత్యంతవిలక్షణములుగాఁ గానిపించుటచే వానిని కాంతియనియు వేషమనియుఁ జెప్పక లావణ్యమనియు సౌందర్యలక్ష్మియనియు నే చెప్పఁదగు నని యర్థము. కావున నిన్ను 'భూయశః' మఱిమఱి యధికముగా మ్రొక్కుచున్నా ననుట. 'కాపి వాచామభూమిః, సేయం సేయం' అనుపాఠమున, సా=ప్రసిద్ధమగు, ఇయం=ఈ, స్వాదుతా=లావణ్యమును, సా=ప్రసిద్ధమైన, ఇయం=ఈ, మఞ్జులశ్రీః=సౌందర్యలక్ష్మియు, కాపి=ఇంతింతనరానిదియు వాచామభూమిః=వాక్కులకు అగమ్యమైనదియు నని యర్థము.

ఉ. ఎక్కడిగోపరూప మది యెక్కడిముద్దుమొగంబుసోయగం
బెక్కడ నీకళావిభవ మెక్కడ నే మని యెన్నవచ్చు న
మ్మక్క యగోచరంబు భవదాకృతి పద్మభవాదిమూర్తికిన్
మ్రొక్కెద సారెసారెకు 'నమో హరయే' యని నందనందనా! 94

తా. కృష్ణా ! నీముఖచంద్రునికాంతియు, ఇట్టిదట్టిదని వాక్కులచే వర్ణింప నలవికాని నీవేషమును అత్యంతవిలక్షణములుగా నుండుటచే వానిని ఏమని పేర్కొనవచ్చును? ఆయీకాంతిని లావణ్య మనియు, ఆయీవేషమును సౌందర్యసంపత్తి యనియు నే చెప్పఁదగును. ఇట్టికాంతియు వేషమును గల నిన్నుఁ గూర్చి మాటిమాటికి మిక్కిలి నమస్కరించు చున్నాఁడను.

శ్లో॥ వదనేన్దువినిర్జిత శ్శశీ, దశధా దేవ పదం ప్రపద్య తే ।
అధికాం శ్రియ మశ్నుతేతరాం, తవ కారుణ్యవిజృమ్భితం కియత్.

టీ. హేదేవ=ఓకృష్ణా! శశీ = చంద్రుఁడు, (తే=నీయొక్క, వద...ర్జితఃసన్ - వదన+ఇన్దు=ముఖచంద్రునిచేత, వినిర్జితస్సన్=గెలువఁబడినవాఁడై, దశధా=పదివిధములుగా-పదిముఖములుగా ననుట, పదం=నీపాదయుగమును, ప్రపద్య=పొంది, అధికాం=మిక్కిలియైన, శ్రియం=కాంతిని-శోభాసంపత్తిని, అశ్నుతేతరామ్=పొందుచున్నాఁడు. ఒక గుణవిశేషమునందు ఒకనికి ఓడిపోయినవాఁడు ఆ గెలిచినవానికి పాదాక్రాంతుఁడై వానివలన నాగుణవిశేషమును జక్కఁగాఁ గలిగించుకొనవలయునుగదా. అట్లేచంద్రుఁడు కాంతియందు నీముఖచంద్రునికి ఓడిపోయినవాఁడై గెలిచిన నీయొక్క పాదయుగమును పదినఖములరూపముగా ఆశ్రయించి యాకాంతివిశేషమును మిక్కిలి పొందినాఁ డని యర్థము. కాఁబట్టి, తవ=నీయొక్క, కారుణ్య విజృమ్భితమ్=కరుణయొక్క-ఉప్పొంగుట-దయాతిశయము, కియత్=ఎంత-ఎంతని చెప్పవచ్చు ననుట. పాదముల నాశ్రయించినంతనే అధికకాంతిని గలిగించితివిగాన నీ కారుణ్యమునకు మితి లేదని భావము.

ఉ. ఆననకాంతితోడ నెదుర్కొని శశాంకుఁడు నిల్వ లేక నీ
మానితపాదపద్మములకమ్మాటునఁ జేరి నఖాంకురాకృతిం
బూని భజించినంతనె సుకమున్నతి శ్రీ లొనగూర్చె శౌర! నీ
దీనదయాపరత్వము నుతింపఁగ శక్యమె నందనందనా ! 95

తా. శ్రీకృష్ణా! చంద్రుఁడు నీముఖచంద్రునికాంతికి నోడి పదివిధములుగా నీపాదయుగమును నఖరూపమున నాశ్రయించినంతనే యధికకాంతి నొందినవాఁ డయ్యె. ఇట్టినీదయ యెంతనవచ్చును!

శ్లో॥ త త్త్వన్ముఖం కథమి వాబ్జసమానకక్షం
వాఙ్మాధురీబహుళపర్వకళాసమృద్ధమ్ ।
త త్కిం బ్రువే కి మపరం భువనైక కాన్తం
యస్య త్వదాననసమా సుషమా సదా స్యాత్ ॥ 96

టీ. వాఙ్మా...సమృద్ధమ్—వాక్ + మాధురీ=వాక్కులయొక్కతీయందనమను, బహుళ=అత్యంతమైన, పర్వ=ఉత్సవముగల-మిక్కిలి నేత్రోత్సవము గలిగించు, కళా=కళలచేత-శేఖలచేత, సమృద్ధం=నిండినదైన, తత్=ప్రసిద్ధమైన, త్వత్ ముఖమ్=నీయొక్క మొగము, అబ్జ...కక్షం అబ్జ=చంద్రునితోడ, సమాన=సమమైన, కక్షం=కోటిగలది-చంద్రునితోడిసామ్యమును జెప్పఁదగినది, కథమివ=ఎట్లుగా-చంద్రునినిదీనిని సామ్యమునందు ఒక్కటిగా చేయరాదనుట-నీముఖము బహుళపర్వకళాసమృద్ధమైనది - అనఁగా అత్యంత నేత్రోత్సవముగలిగించుసౌందర్యశేఖలచేనిండారినది. చంద్రుఁడో బహుళపర్వకళాసమృద్ధుఁడు గాఁడు—అనఁగా, బహుళపర్వ = బహుళపక్షమునందలి పర్వదినములగు అష్టమి అమావాస్యలయందు, కళా=కళలచేత, సమృద్ధం=నిండినవాఁడు, కాఁడు-అనఁగాఁగళలు తగ్గియుండుననుట, బహుళపర్వకళాసమృద్ధమైన నీముఖమును బహుళపర్వకళాసమృద్ధుఁడుకాని చంద్రునితో సామ్యమునకుఁ దేరాదని శ్లేషమహిమచే ముఖము చంద్రుని అతిశయించినదగుట తెలుపఁబడినది. తత్=కాఁబట్టి, చంద్రుఁడు నీమొగమునకుఁ దక్కువయే యైనవాఁడుగావున, కిం=ఏమి, బ్రువే=చెప్పుదును, యస్య=దేనికిఁ, త్వ...సమా—త్వత్=నీయొక్క, ఆనన=మొగముతోడ, సమా=సమానమైన-నీముఖకాంతితోడ సమానమైన, సుషమా=ఉత్కృష్టకాంతి, సదా=ఎప్పుడును, స్యాత్=అగునో, అట్టి, భువ...కాన్తమ్-భువన=లోకములందు, ఏక=ముఖ్యమైన, కాన్తం=మనోజ్ఞమైనది, అపరం=మఱియొకటి, కిం=ఏది? నీముఖమువలెనే సర్వకాలములందును జగదేకమనోహరముగా నుండు వస్తువు మఱొకటి లేదనుట. నీముఖముతో సమానముగా ఎన్నఁబడుచంద్రునికో ఎల్లప్పుడును కాంతి గలుగదు. నీ ముఖమువలెనే ఎప్పుడును అత్యంతకాంతి గలిగియుండు వస్తువు మఱి శ్రేష్ఠమైదియుఁ గానరాదు. కాన ఏమి చెప్పుదు నని యాశయము.

చ. సరసిజ మంటిమా తగదు సాటికి శారదపూర్ణిమాసుధా
కరరుచి యంటిమా సమము గా దిఁక వేఱె జగంబునన్ మనో
హర మగువస్తు వొండొకటి యారసి చూడ నొకానొకప్పుఁడుం
బురుడు ఘటిల్లునే భువన మోహన! నీముఖకాంతకాంతికిన్. 96

తా. బహుళపర్వకళాసమృద్ధుఁడు కాని చంద్రునితో బహుళపర్వకళాసమృద్ధమైన నీముఖమును సామ్యమున నొకటిగాఁ జేయరాదు. మఱి నీమొగమువలె ఎల్లప్పుడును ఉత్కృష్టకాంతి గలదై జగదేకమనోజ్ఞముగా నుండునది మఱివస్తువును గానరాదు. ఏమని చెప్పుదును!

శ్లో॥ శుశ్రూషసే యది వచః శ్రుణు మామకీనం
పూర్వై రపూర్వకవిభి ర్న కటాక్షితం యత్ ।
నీరాజనక్రమధురం భవదాననేన్దోః
నిర్వ్యాజ మర్హతి చిరాయ శశిప్రదీపః ॥ 97

టీ. శుశ్రూషసేయది=వినుటకు ఇచ్ఛగించితివేని, పూర్వైః=తొల్లిటివారయిన, అపూర్వకవిభిః-అపూర్వ=సాటిలేని-అద్భుత చమత్కార ప్రబంధములు చెప్పుటచే ఎనలేనివారగు, కవిభిః=కవులచేత, యత్=ఏది, న కటాక్షితం=గమనింపఁబడలేదో-చెప్పఁబడలేదో, మామకీనం=నాసంబంధియైన, (తత్=అ) వచః=వాక్యమును, శ్రుణు=వినుము-మహాకవితాచమత్కారులగు పూర్వకవులుగూడ చెప్పనియొకమాట చెప్పెదను వినుమనుట, శశిప్రదీపః-శశి=చంద్రుఁ డనెడి, ప్రదీపః=దీపము, భవత్ + ఆనన + ఇన్దోః=నీయొక్క ముఖచంద్రునియొక్క, నీరా...ధురమ్-నీరాజన=నివాళియొక్క, క్రమ=విధియొక్క, ధురం=భారమును-నీముఖచంద్రునికి నివాళిగా నుండవలయుటను, నిర్వ్యాజం=నిరుపాధికముగా, అర్హతి=తగుచున్నది-అట్లు ఉండుటకు అర్హమగుచున్నది. లోకోత్తర సౌందర్యాదులుగలవస్తువులకుఁగలుగు దృష్టిదోషమును వానికి సజాతీయములై సౌందర్యాదులందువానికంటెఁ దక్కువయగు వస్తువులచేఁ బరిహరించుట లోకసిద్ధము. ఇట్లు శ్రీకృష్ణునియొక్క ముఖచంద్రునికిఁ గలుగు దృష్టిదోషమును దత్సజాతీయమై దానికంటె దక్కువశోభ గలిగియుండు చంద్రునిచేతనే పరిహరింపఁ దగు నని యాశయము. మఱియు దీపాదుల నారతి యెత్తుటచేతను దృష్టిదోషము పరిహృత మగుచున్నది గాన ఆచంద్రునే దీపముగా రూపించి కృష్ణముఖచంద్రునికి నివాళియొనర్పఁదగు నని చెప్పఁబడియె. మఱియు శశి నివాళియగుట 'ధురం అర్హతి' అనుటచే ఆవశ్యక మనియు, 'నిర్వ్యాజమ్' అనుటచే నెపము నెదురుచూడక తనంతటనే జరుగఁదగు ననియు సూచితము లగుచున్నవి. పూర్వశ్లోకమునందుఁ జంద్రుఁడు నఖము లనెడి నెపముచే ఆశ్రయించినాఁడు

గాని తనంతఁ గలరూపున ఆశ్రయింపలేదు. ఇందు నెట్టినెపములు లేక చంద్రుఁడు తనం తనే కలరూపున నీరాజనము కావలయు నని 'నిర్వ్యాజ' శబ్దసారస్యము. శ్రీకృష్ణుని ముఖచంద్రుఁడు చంద్రుని అతిశయించినవాఁ డని ఫలితార్థము.

చ. తొలుతటివ్యాసముఖ్యకవిశ్రేష్ఠుల్యులు పల్కనిసాహసంబు నేఁ
బలికెద వింటివేని విను ♀ పంకజలోచన నీదుమోముతోఁ
గలువలరేని సాటి యనఁ ♀ గాఁ దగ దారతి పళ్లెరంబులో
పల నిడి దివ్వెగా నతనిఁ ♀ బట్టి నివాళి యొనర్పఁగాఁ దగున్. 97

తా. కృష్ణా! కవితాచమత్కృతియం దపూర్వులైన తొల్లిటి వ్యాస వాల్మీకాది మహాకవులును బలుకని యొకమాట నేను సాహసించి చెప్పెద. దానిని విన నిచ్ఛగించితి వేని వినుము. చంద్రుని ఆరతిపళ్లెరంబున దీపముగాఁ నుంచుకొని నీముఖచంద్రునికి నివాళి యొనర్పఁదగును.

శ్లో॥ అఖణ్డనిర్వాణరసప్రవాహై, ర్విఖణ్డితాశేషరసాన్తరాణి ।
అయన్త్రితోద్వాన్తసుధార్ణవాని, జయన్తి శీతాని తవ స్మితాని॥

టీ. అఖ...వాహైః-అఖణ్డ = అవిచ్ఛిన్నమైన, నిర్వాణ=నిరతిశయసుఖమనెడి, రస=రసముయొక్క, ప్రవాహైః=ప్రవాహములచేత-ప్రవాహమువలె నెడతెగక యనుభవింపఁబడుచున్న నిరతిశయసుఖమును గూర్చుటచేత ననుట, విఖ..రాణి-విఖణ్డిత=మిక్కిలి కొట్టఁబడిన, అశేష=సమస్తమైన, రస+అన్తరాణి=ఇతరరసములు గలదియు-తక్కినరసముల నెల్ల నడంచి నిర్వాణరసమునే యనుభవింపఁ జేయుచున్నవి యనుట, అయ...వాని-అయన్త్రిత=అడ్డగింపఁబడనిదై-విచ్చలవిడిగా ననుట, ఉద్వాన్త=క్రక్కఁబడుచున్న-వెలిపుచ్చఁబడుచున్న, సుధార్ణవాని=అమృతసముద్రము గలవియు-నిరవధికమై యమృతమును విచ్చలవిడిగా నొలుకుచున్నవి యనుట - అమృతమువలె నత్యంతభోగ్యములైనవి యని భావము, శీతాని=చల్లనివియు-చూచుటవు సుఖప్రద మైనవియు, అగు, తవ=నీయొక్క, స్మితాని=చిఱునగవులు, జయంతి=సర్వోత్కృష్టము లై వర్తించుచున్నవి. నిర్వాణరసముయొక్క ప్రవాహములచే నితరరసములను ముంచివైచినవి గాన విఖండితాశేషరసాంతరములైనవి; సుధార్ణవములను నిగుడ్చుటచే శీతములైనవి. మఱియుఁ గేవల 'నిర్వాణరస'మునుగాక నిర్వాణరసప్రవాహములనును, గేవల 'సుధ'నుగాక సుధార్ణవమును,అఖండముగాను అయంత్రితముగాను నెఱపునట్టివిగాపున నే 'జయన్తి' సర్వోత్కృష్టము లై నవని యాశయము.

మ. కలితానందమహానుభావమున వేడ్కం జెంది యంతంతకుం
దెలియం బొంగుసుధాతరంగితపయోధిన్ లీలఁ గన్పించుచున్

దళితాశేషరసాంతరంబు లగు లేఁకనవ్వుల్ మిటారింప గో
కులకాంతాజనభోగభాగ్యమహిమాంకూరంబు సెల్వొందెడిన్.

తా. నిరతిశయసుఖరసప్రవాహములను ఎడతెగక కూర్చుచు నితరరసముల న డంచి, విచ్చలవిడిగా నింతింతని కొలఁదియిడరాని యమృతము లొలుకుచుఁ జల్లనై యుల్లసిల్లు నీ చిఱునగవులు పెంపు సొంపారుచున్నవి.

శ్లో॥ కామం సన్తు సహస్రశః కతిపయే సారస్యధౌరేయకాః
కామం వా కమనీయతాపరిమళస్వారాజ్యబద్ధవ్రతాః ।
నైవైతైర్వివదామహే న చ వయం దేవ ప్రియం బ్రూమహే
యత్సత్యం రమణీయతాపరిణతిస్త్వయ్యేవ పారంగతా॥ 99

టీ. సారస్యధౌరేయకాః-సారస్య = రసజ్ఞతను-ధౌరేయకాః=వహించినవారు-రసికశిరోమణులనుట, సహస్రశః=వేలకొలఁదిని, కతిపయే=కొందఱుగాని, కామంసంతు=ఉండిన నుండనీ. కమనీ...వ్రతాః వా-కమనీయతా=సౌందర్యముయొక్క, పరిమళ=ఆధిక్యమనియెడి, లేక 'పరిణతి' అనుపాఠమున పరిపాక మనియెడి, స్వారాజ్య=స్వర్గరాజ్యమందు-నిరతిశయమైన పదవియం దనుట, బద్ధ=కూర్పఁబడిన-దృఢముగాఁ గైకొనఁబడిన, వ్రతాః=నియమము గలవారు-ఇట సౌందర్యపరిపాకమును స్వర్గరాజ్యమనుటచే నిరతిశయపదవీవైభవము గాను, అందు 'బద్ధవ్రతాః' అనుటచే నియతముగా దానిని వహించి యుండుటను దెలియునది గాన నిరతిశయసౌందర్యపరిపాకవైభవమును నియతముగాఁ దాల్చి యున్నట్టివా రనుట-మిక్కిలి సౌందర్యవంతు లనుట, సహస్రశః కతిపయే వా=వేలకొలఁదివి గాని కొందఱు గాని, కామం సంతు వా=ఉండినను నుండనీ, హే దేవ=ఓకృష్ణా, వయం=మేము, ఏతైః=వీరితో, నవివదామహే=వివాదమును జేయము, ప్రియం=ప్రియమును, నచబ్రూమహే=చెప్పను జెప్పము. యత్సత్యం=సత్యముగా, రమణీయతా పరిణతిః-రమణీయతా=మనోజ్ఞత్వముయొక్క, పరిణతిః = పరిపాకము, త్వయి ఏవ=నీయందే, పారంగతా=పారమును బొందినది-పరిపూర్ణమైనది. సౌందర్యాదుల నిర్ణయించుటయందు నాకంటె మిక్కిలి రసజ్ఞులైనవారు పెక్కండ్రో కొందఱో ఉండిన నుండనీ. నీవలె మిక్కిలి సౌందర్యము గలవారును బెక్కండ్రో కొందఱో ఉండిన నుండనీ, నాకొక్కటి సత్యమని తోఁచినది. అది యేదన-సర్వోత్కృష్టమైనసౌందర్యాతిశయము నీయందే యున్నది గాని యితరు లెవ్వరియందును లేదు. దీనినిగుఱించి ఆరసజ్ఞులు ఒప్పకుండినను వారితో నాకు వివాదమాడ నక్కఱలేదు. ఆసుందరులకుఁగోపము వచ్చినను వారికిఁబ్రియము పలుక నక్కఱ లేదు. ఇది మిక్కిలి సత్యమైనది గనుక ఎవరిని లక్ష్యపెట్టక సాహసించి చెప్పెదు మని యాశయము.

ఉ. లోకములోపలన్ రసికలోక మనేకము గల్గుఁ గాక య
స్తోకమనోహరావయవశోభితు లుందురు గాక వారితో
నేకలహింపనేల మొగసమిచ్చక మేటికి సత్య మాడెదన్
నీకమనీయతామహిమ నీకె తగున్ మఱి కాన మెయ్యెడన్. 99

తా. మిక్కిలి రసజ్ఞులైనవారు గాని మిక్కిలి సుందరు లైనవారు గాని పెక్కండ్రో కొందఱో యుండిన నుందురు గాక. పరిపక్వమైన సౌందర్యము నీవు ఒకనికే కల దనుట సత్యము. దీనినిగుఱించి యాఁకేపకులతో వివాద పడ నక్కఱ లేదు. ఆ సుందరులకుఁ గోపము రాకుండునట్లు ఇచ్చకము లాడవలసినదియు లేదు.

శ్లో॥ మన్దారమూలే మదనాభిరామం, బిమ్బాధరాపూరితవేణునాదమ్।
గోగోపగోపీజనమధ్యసంస్థం, గోపం భజే గోకులపూర్ణచన్ద్రమ్ ॥ +

టీ. మన్దారమూలే-మన్దార = కల్పవృక్షముయొక్క, మూలే = మొదటియందు, మదన + అభిరామం=మన్మథునివలె సుందరుఁ డైనవాఁడును, బిం... నాదం-బింబ + అధర=దొండపండువంటి పెదవిచేత, ఆపూరిత=లెస్సగా పూరింపఁబడిన, వేణునాదం= వేణుధ్వని గలవాఁడును, గో... సంస్థమ్-గో=గోవులయొక్కయు, గోప = గొల్లవారల యొక్కయు, గోపీ=గొల్లస్త్రీలయొక్కయు, మధ్య=నడుమ, సంస్థమ్=కూర్చున్నవాఁడును, గో...-ద్రమ్-గోకుల=వ్రేపల్లెను, పూర్ణచన్ద్రమ్ = నిండుచంద్రుఁ డైనవాఁడు పూర్ణచంద్రునివలె వ్రేపల్లెలోనివారి కెల్ల ఆహ్లాదము కలుగఁజేయువాఁడును, అగు, గోపం= గొల్లవానిని-మాయాగోపాలుఁ డగు శ్రీకృష్ణుని, భజే=భజించుచున్నాను. ఆపూరితవేణు నాదుఁడును గోపుఁడు నగుటచే గోవులును, అపూరితవేణునాదుఁడును గోకులపూర్ణచంద్రుఁడును గోపుఁడు నగుటచే గోపాలకులును, మదనాభిరాముఁడును, ఆపూరితవేణునాదుఁడును, గోకులపూర్ణచంద్రుఁడును, గోపుఁడు నగుటచే గోపికలును, బరివేష్టించి రనియుఁ, కావుననే గోగోపగోపీజనమధ్యసంస్థుఁ డైనాఁ డనియును దెలియునది. సంస్థితుఁడై మందారమూలము నాశ్రయించినాఁ డని యూహ్యము.

ఉ. గోపిక లోపికల్ సడలి కొల్వఁగ గోవులు గోపు లాడఁగాఁ
గ్రేఁపులు మేపు లాపి పరికింపఁగఁ గెంజిగురాకుమోవిపై
మోపినవేణు వగ్గలము మ్రోయఁగఁ గల్పవనిన్ వసించు నా
గోపకుమారమన్మథుని గోకులవార్ధిశశిన్ భజించెదన్. 100

తా. కల్పవృక్షమూలమున గోవులయు గోపాలకులయు గోపికలయు నడుమనుండి కెమ్మోవిచేఁ బిల్లఁగ్రోవిని మ్రోయించుచు మన్మథునివలెఁ జక్కనివాఁడై వ్రేపల్లెకుఁ బూర్ణచంద్రునివలె ఆహ్లాదమును గలిగించుమాయాగోపాలుని శ్రీకృష్ణుని భజియించెదను.

శ్లో॥ గళద్వ్రీడా లోలా మదనవనితా గోపవనితా
మధుస్ఫీతం గీతం కిమపి మధురా చాపలధురా।
సముజ్జృమ్భా గుమ్భా మధురిమకిరాం మాదృశగిరాం
త్వయి స్థానే జాతే దధతి చపలం జన్మ చ ఫలమ్॥ 101

టీ. త్వయి=నీవు అనెడి, స్థానే = స్థానము-విషయ మనుట, జాతేసతి = కలిగి యుండఁగా=నీవు విషయమై యుండఁగా ననుట-నిన్ను గుఱించుటచేత నని భావము, గళత్ వ్రీడాః-గళత్ = (కామవశముచే) జాఱుచున్న, వ్రీడాః = లజ్జగలవారును, కావుననే, లోలాః=(నీయందు) ఆసక్తిగలవారును అయిన, గోపవనితాః=గోపస్త్రీలు, మదన వనితాః=మన్మథునియిల్లాండ్రు-అనఁగా రతీదేవితో సాటియైనవారు, జాతాః= అయిరి-అని శేషము-నిన్ను గుఱించి వలపుగొనుటచేఁ గేవలము గొల్లపడఁతులు కూడ రతి దేవివంటివారైరని యర్థము. గీతం=గానము-నిన్ను సంబంధించి వేణుగానము, కిమపి= ఇట్టటు అనరానియట్లు, మధుస్ఫీతం-మధు = తేనియచేత, స్ఫీతం = మిక్కిలియైనది. (జాతం=అయినది,) చాపలధురా-చాపల = (నిన్ను సంబంధించిన) చపలత్వముయొక్క ధురా=భారము-అతిశయమనుట, కిమపి=చెప్పనలవిగానట్లు, మధురా = మనోహరమై నది. (జాతా = అయినది), మాదృశగిరాం-మాదృశ = (కేవలవరమైన) మనబోఁటుల యొక్క, గిరాం=నిన్ను గుఱించిన; వాక్యములయొక్క, గుమ్భాః=కూర్పులు, మధురిమ కిరాం-మధురిమ=తీయఁదనమును, కిరాం=చల్లునట్టి వాల్మీకాదికవులవాక్యములయొక్క, సముజ్జృమ్భాః=విజృంభణముగలవి-అట్టి అతిశయముగలవి యనుట, (జాతాః=అయినవి) నీరసములైన మమబోఁటివారి పలుకులుగూడ నీవిషయమునఁ బ్రవర్తింపగాఁ అత్యంత మధురములై విజృంభించినవనుట,చపలమ్=అస్థిరమైన,జన్మచ=జన్మమును,ఫలమ్=ఫలము ను, దధతి=వహించుచున్నది-చరితార్థమైనది. వ్యర్థమైన యీ నాజన్మముకూడ నీవిషయ మునఁ బ్రవర్తింపఁగాఁ గృతార్థ మగుచున్నది. 'వనితా' శబ్దమునకు 'గోప' యనియు, 'ధురా' శబ్దమునకు 'చాపల' యనియు, 'గిరాం' శబ్దమునకు 'మాదృశ' అనియు, 'జన్మ' శబ్దమునకు, 'చపలం' అనియుఁ గూర్చుటవలనను; 'గీత' శబ్దమునకు విశేషణము లేక సామాన్యముగాఁ జెప్పుటవలనను; వీని కన్నిటికిని తక్కువపాటు చెప్పఁబడినది. ఇట్టివి కూడ నీవిషయమునఁ బ్రవర్తింపఁగా మిక్కిలి గొప్పవలైన వని యర్థము.

ఉ. నాన దొలంగి తత్తఱమునన్ మరు లెత్తినగోపకామినుల్
తేనియ గుల్కుపాటలును దివ్యునినూటలు నీకతంబునం
బూని ఫలంబుఁ జెందుక్రియ మోదముతోడను సన్నుతింపఁగా
నానుడువుల్ ఫలించె జనసంబుఁ గృతార్థతఁ జెందె నెంతయున్.

తా. కేవలముగ్ధలైన గోపస్త్రీలు సిగ్గువిడిచి నీయందు ఆసక్తురాండ్రగుటచే రతీదేవితో సాటియైరి. కేవలమైన వేణుగీతము నీ వూదుటచేఁ దేనియ లొలికినది. పసమాలినదైన చపలత్వము మిక్కిలి నీయందుఁ జూపట్టి అత్యంతమనోహరత్వము నొందినది. సీటు లేని మహుబోఁటుల మాటపొందికలును నిన్ను గుణించుటచేఁ దీయఁదనము పెంపు సొంపారినవి. నిరర్థకమైన నాజన్మమును నిన్ను స్మరించుటచే మిక్కిలి కృతార్థమైనది.

శ్లో॥ భువనం భవనం విలాసినీ శ్రీ, స్తనయ స్తామరసాసనః స్మరశ్చ।
పరిచారపరమ్పరా సురేన్ద్రా, స్తదపి త్వచ్చరితం విభో విచిత్రమ్॥

టీ. హేవిభో=ఓప్రభూ-కృష్ణా, భువనమ్=లోకము, భవనమ్ = నీగృహము, శ్రీః=లక్ష్మీదేవి, విలాసినీ=భార్య, తామరసాసనః=బ్రహ్మయును, తనయః=కొడుకు, స్మరశ్చ=మన్మథుఁడును-కొడుకు, సురేన్ద్రాః=దేవతల కధిపతులైన యింద్రాదులు, పరిచారపరమ్పరా=పరిచారకులయొక్క-సమూహము, తదపి=అట్లయినను, త్వత్ చరితం=నీయొక్క-నడవడి, విచిత్రమ్=మిక్కిలి యాశ్చర్యము-ఇట్లు లోకోత్కృష్టమైన గృహదారపుత్రభృత్యాదిసంపత్తి గలిగియు వ్రేపల్లెయందు జారచోరకృత్యము లాచరించు నీనడవడి అత్యాశ్చర్యముగా నున్న దని భావము.

మ. లలనారత్నము శ్రీవధూటి జగమెల్లం గేళికాసౌధ మా.
జలజాతాసనశంబరారులు సుతుల్ శక్రాదిదిక్పాలవ
ర్యులు భృత్యుల్ వివరింప నీమహిమ లోకహో యిట్టిదైయుండగో
కులవాటంబున జారచోరకృతి లోకుల్ నవ్వఁ గాంక్షింతురే. 102

తా. ఓకృష్ణా! నీకు జగము వాసగృహము,నెయ్యంపు టిల్లాలు లక్ష్మి,బ్రహ్మయు మన్మథుఁడును కొడుకులు, ఇంద్రాదులు పరిచారకులు. ఇట్టి సంపత్తి గల ప్రభుండవయ్యు నీజారచోరలీలలు చూడ మిక్కిలి యాశ్చర్యముగా నున్నవి.

శ్లో॥ దేవస్త్రిలోకీసౌభాగ్య, కస్తూరీతిలకాఙ్కురః ।
జీయా ద్వ్రజాఙ్గనానఙ్గ, కేళీలలితవిభ్రమః॥ 103

టీ. త్రిలో...కురః-త్రిలోకీ = మూఁడులోకములయొక్క, స్త్రీలింగసారస్యముచేత మల్లోకములనెడి స్త్రీయొక్క, సౌభాగ్య=మాంగల్యమునకు,లేక-మాంగల్యప్రయుక్తమైన-లేక-సౌందర్యమునకు, కస్తూరీతిలక=కస్తురిబొట్టుయొక్క, అఙ్కురః = మొలకయైనవాఁడును-ఒక స్త్రీకి కస్తురిబొట్టు ఎట్లు మాంగల్యసూచకమును సౌందర్యప్రయోజకమును అగునో, అట్లే ముల్లోకములకును మాంగల్యసూచకుఁడును సౌందర్యప్రయోజకుఁడును అగువాఁ డని యర్థము. వ్రజా...భ్రమః-వ్రజాఙ్గనా = గోపస్త్రీలయొక్క, అనఙ్గకేళీ=మన్మథక్రీడలయందు, లలిత=సరసములైన, విభ్రమః = విలాసములు గలవాఁడును, అగు, దేవః=శ్రీకృష్ణమూర్తి, జీయాత్ = సర్వోత్కృష్టుఁడై వర్తించుఁగాక-త్రిలోకీకి

సౌభాగ్యకస్తూరితిలక మైనట్టి సౌందర్యవిభ్రమము గలదేవుఁడు కేవల గోపస్త్రీలతోడి రతిక్రీడలప ననువైన విభ్రమములు గలిగినవాఁడనుట సౌలభ్యాతిశయము. నల్లనివాఁ డగుటచే 'కస్తూరితిలక' మనియు, వ్రజాంగనలతోడి అనంగకేళికలను జరుపువాఁటి బాలుఁ డగుట చే 'తిలకాంపరుఁ' డనియు రూపణములు దెలియునది.

మ. కులుకుంజెక్కులఁ బిక్కటిల్లు పులకాంకురంబు తోరంబుగాఁ
దళుకుంగస్తురిబొట్టు నెన్నొసలిపైఁ ద్రైలోక్యభాగ్యాకృతిం
జెలఁగన్ గోపనితంబినీరతికళాశృంగారభావోన్నతుల్
దొలఁకం గన్నులపండు వైనవిభుఁ గాంతున్ భాగ్యసంసిద్ధికిన్. 103

తా. స్త్రీకి చిన్నికస్తురిబొట్టుంబోలె ముల్లోకంబులకును తన నల్లని చిన్నిరూపాకారము మాంగల్యమును సౌందర్యమును గూర్పఁగా గొల్లచెలువలతోడి రతిక్రీడలకుఁ దగినవిలాసములు నెఱపుచున్నదేవుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తించుఁగాక.

శ్లో॥ ప్రేమదం చ మే కామదం చ మే, వేదనం చ మే వైభవం చ మే।
జీవనం చ మే జీవితం చ మే, దైవతం చ మే దేవ నాపరమ్ ॥ 104

టీ. హే॥దేవ=ఓకృష్ణా, మే=నాకు, ప్రేమదంచ = ప్రేమంబు నిచ్చునదియును, మే=నాకు, కామదంచ=కోరికల నిచ్చునదియు, మే=నాకు, వేదనంచ=జ్ఞానమైనదియు, మే=నాకు, వైభవంచ=ఐశ్వర్యమైనదియు, మే=నాకు, జీవనంచ=ప్రాణమైనదియు, మే=నాకు, జీవితంచ=బ్రతుకైనదియు-నాప్రాణమునకు ధారకమైనదియు, మే=నాకు, దైవతంచ=దైవమైనదియును, అపరమ్ = (నీవుతప్ప)వేఱొకటి, న=లేదు. ప్రేమదమునకంటె కామదము ఎక్కువయనియు, దానికంటెను వేదన మతిశయించినదియు నిట్లే తక్కినవానియందును ఉత్తరోత్తరాతిశయము తెలియునది. మఱియు 'ప్రేమద' మనుట మాతాపితృత్వమును, 'కామద' మనుటచే సుఖప్రదత్వమును, 'వేదన' మనుటచే జ్ఞానప్రదమగు నాచార్యత్వమును 'వైభవ' మనుటచే సంపత్ప్రదమగు ప్రభుత్వమును, 'జీవనజీవిత' శబ్దములచే ధారకత్వమును సూచితములు. ఇవన్నియు దైవతశబ్దమందు సంకలితములు గావునను అంతకన్న నతిశయించినది లేదు గావునను దానినే కొత్తగా కవి యిచట నునిచినాఁ డని తెలియునది - నాకు సర్వమును అనఁగా ధారకపోషక భోక్తలు ముగ్గురును నీవే యని భావము.

ఉ. కోరిక లిచ్చినన్ ననరుకగూర్చిన జీవనజీవితమ్ము లే
దారి నొనర్చినం దెలివిఁ దార్చినఁ దల్లియుఁ దండ్రియుంబలెన్
నేరము లోర్చినం దిరుగనేర్పుగఁ దీర్చినఁ గల్మిఁ జేర్చినన్
భారము నీవె కాని మఱి పంకజనాభ! యెఱుంగ నన్యులన్. 104

తా. ప్రేమc జూపుటయును, కోరిక లిచ్చుటయును, తెలివి గలిగించుటయును, సంపద లొసంగుటయును, ప్రాణములు నిలcబెట్టుటయును, జీవితయాత్ర జరుపుటయును, దైవమని మ్రొక్కి శరణుcజొచ్చుటయును, శ్రీకృష్ణా! నీవు తప్ప నాకు మఱెవ్వరు లేరు.

శ్లో॥ మాధుర్యేణ విజృమ్భన్తాం, వాచో న స్తవ వైభవే
చాపల్యేన వివర్ధన్తాం, చిన్తా న స్తవ శైశవే॥ 105

టీ. నః=మాయొక్క, వాచః=వాక్యములు, తవ=నీయొక్క, వైభవే=(గోవర్ధనోద్ధరణాది లీలలయొక్క) అతిశయమునందు, అట్టివైభవమును వర్ణించుటయం దనుట, మాధుర్యేణ=తీయదనముచే, విజృమ్భన్తామ్=మిక్కిలి అతిశయించునుగాక - మిక్కిలి తీపారుచుండునుగాక యనుట. నః=మాయొక్క, చిన్తాః=చింతారూపములైన మనోవ్యాపారములు, తవ=నీయొక్క, శైశవే=బాల్యమందు, చాపల్యేన=అత్యంతాసక్తిచేత, వివర్ధన్తామ్=మిక్కిలి వర్ధిల్లునుగాక-పయింబయి ఆసక్తము లగుచుండునుగాక యనుట, వాక్కు తీపారుపలుకుల నీ లీలావైభవములను వర్ణించునట్లును, మనస్సును మిక్కిలి యాసక్తితో నీబాల్యమును జింతించుచుండునట్లును అనుగ్రహింపుమా యనిభావము.

ఉ. ఏను భవత్కథామణుల కెన్నెడుపట్ల మదీయసూక్తి సం
తానము మాధురీగుణవితానముc జెంది పొసంగుcగాత నా
మానసవృత్తి నీదుసుకుమారకిశోరవయోవిహారము
లూని నుతించుపట్ల నతిలోలతc గాంచి మెలంగుc గావుతన్.105

తా. నీయొక్క గోవర్ధనోద్ధరణాదిలీలల పెంపుసొంపును వర్ణించునపుడు నావాక్కులు మఱిమఱి తీపారుచుండునుగాత. నీబాల్యమును జింతించునపుడు నామనస్సు నయcబయింబయి ఆసక్తిగలుగుచుండును గాక.

శ్లో॥ యాని త్వచ్చరితామృతాని రసనాలేహ్యాని ధన్యాత్మనాం
యే వా శైశవచాపలవ్యతికరా రాధాపరాధోన్ముఖాః।
యా వా భావితవేణుగీతగతయో లీలాముఖామ్భోరుహే
ధారావాహితయా వహన్తు హృదయే తాన్యేవ తా న్యేవ మే॥

టీ. ధన్యఆత్మనాం=కృతార్థములైనమనస్సులు గలవారియొక్క,రసనాలేహ్యాని-రసనా=జిహ్వాలకు, లేహ్యాని=నాకcదగిన భోగ్యములైన, త్వత్...తాని-త్వత్=నీయొక్క-చరిత అమృతాని=చరిత్రమనెడి అమృతములు, యాని=ఏవియో-చరిత్రములనుఅమృతముగా రూపించుటచే నవి ధన్యాత్ముల రసనలకు లేహ్యములైనవిగా వర్ణించినాcడు; మఱియు ధన్యాత్ము లనుటచే రసజ్ఞులైన సహృదయు లనియు వారిరసనలకు లేహ్యము లనుటచే నట్టివారినోటc గీర్తింపcగా నమృతమువలె నత్యంతభోగ్యములైనవని

యును (గాహ్యము, రాధా...న్ముఖాః-రాధా=రాధవలని, అపరాధ=తప్పునందు-రాధ యెడల తప్పుగానడచుకొనుటయందనుట, ఉన్ముఖాః=అభిముఖములైనవి,అగు,శైశవ... వ్యతికరాః-శైశవ=బాల్యమునందలి, చాపల=చాపలత్వముయొక్క,వ్యతికరాః=సందర్భములు-కార్యములు-లేక-శైశవ=బాల్యముయొక్కయు.చాపల=చపలత్వముయొక్కయు వ్యతికరాః=మేళనములు, ఆరెంటియొక్క మేళనముచేఁ గలిగిన కార్యములు, యేవాః=ఏవియో-బాల్యమునం దశ్యకొంతలయం మెఁజాపల్యము మాపుటచే రాధకు నపరాధముసేయు లీల లేనివియో యనుట, లీలా...రుహే-లీలా=విలాసముతోఁగూడిన, ముఖాంభోరుహే=తామరవంటి మొగమునందు, భావి...గతయః-భావిత=మూసుకొన్న, వేణు=పిల్లఁగ్రోవియొక్క, గీత=గానముయొక్క, గతయః=స్వరభేదములు,యావా = ఏవియో, తానిఏవ=అవియే, తానిఏవ=అవియే, మే=నాయొక్క,హృదయే=హృదయమునందు ధారావాహితయా=ధారగా (ప్రవహించుభావముతోడ-ఎడతెగక, వహన్తు=ప్రవహించునుగాక-పయింబయి నిగుడుచుండునుగాక యనుట, ఇచట చరితామృతములు, కేవలురరసనలకుఁగాక ధన్యాత్ములరసనలకు లేహ్యములనుటచేతను,వ్యతికరము కేవలచాపలముచేతఁగాక శైశవచాపలముచేతఁ (బయుక్తము లనుటచేతను, వేణుగీతగతులు కేవలమైనవిగాక లీలాముఖాంభోరుహమందలివి అనుటచేతను అత్యంత మనోజ్ఞత్వము ధ్వనితము.

మ. అలరున్ధన్యుల కేళథామృతము జిహ్వాన్ లేహ్య మేబాల్యచా
పలముల్ రాధకు నెయ్యపుంగినుక నాపాదించు నేయందముల్
వెలయున్ మోమున వేణుగానకలనన్ వేమాఱు నాదివ్యచ
ర్యలె నామానసవీథి వేఁడెదను ధారాళంబుగా నిల్వఁగన్. 106

తా. కృతార్థులైనవారల నాలుకలకు లేహ్యములవలెనుండు చరితామృతములును బాల్యచాపలముచే రాధకుఁ గినుక పుట్టించునట్టి సికలికిచెయ్యులును, తామరవంటి నీనెమ్మొగమునం దుండి వెడలు వేణుగానస్వరవిశేషము లే నాహృదయమందు ఎడతెగక విలసిల్లు చుండును గాక.

శ్లో॥ భక్తి స్త్వయి స్థిరతరా భగవన్ యది స్యా
ద్దైవేన నః ఫలితదివ్యకిశోరవేషే ।
ముక్తిః స్వయం ముకుళితాఞ్జలి సేవ తేఽస్మాన్
ధర్మార్థకామగతయః సమయప్రతీక్షాః ॥ 107

టీ. హేభగవన్=షడ్గుణైశ్వర్య సంపన్నుఁడ వైన యోకృష్ణా! దైవేన=దైవముచేత-అదృష్టవిశేషముచేత, నః=మాకు, ఫలి...వేషే-ఫలిత=ఫలించిన, దివ్య=అసాధారణమైన, కిశోరవేషే=బాలవేషము గలవాఁడవైన-నీవో భగవంతుండవు, కావున మాకు

అగోచరుఁడవు; అయినను మా యదృష్టమువలన సౌలభ్యముచే బాలగోపాలవేషమున గోచరుఁడ వైనవాఁడవని భావము, ఇట్టివాఁడవైన, త్వయి=నీయందు. భక్తిః=భక్తి, స్థిరతరా=మిక్కిలి దృఢమైనది, యదిస్యాత్=అగుచేని, ముక్తిః=మోక్షము, స్వయం=తానే, ముకుళిత అఞ్జలి యథాతథా=మోడ్చిన చేమోడ్పు గలుగునట్లుగా, అస్మాన్=మమ్ము-ఇట్టి నీయందు భక్తిసేయు మమ్ము, సేవతే=కొలుచుచున్నది-ముక్తిని ఇతరులెల్ల తామై భయభక్తులతోఁ గొలుతురు-అట్టిముక్తి నీయెడ భక్తిసేయుముముబోంట్లనుతానై చేతులుమోడ్చికొని కొలుచుచుండు ననుట-ముక్తి అత్యంతసులభముగా తనంతటనే మాకు సిద్ధించుచున్నదనిభావము. ఇఁకఁదక్కిన మూఁడుపురుషార్థముల సిద్ధియెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు. ధర్మ అర్థ కామ గతయః=ధర్మము, అర్థము, కామము అను నీ సిద్ధులు, సమయప్రతీక్షాః-సమయ=మాయవసరములను, ప్రతీక్షాః=ఎదురుచూచునవి-మేము కోరినంతనే అడ్డిలేక తమంత సిద్ధించునవి అనుట-నీయందు భక్తి దృఢముగా నుండినయెడలఁ జతుర్విధపురుషార్థములును మా అఱచేతిలోని వని భావము.

ఉ. గోపకుమారవేషమునఁ గూడిననీయెడ భక్తిదైవసం
ప్రాపిత మై మదిన్ దృఢత రంబుగ నిల్చిన ముక్తికన్య నా
దాపునఁ గేలు మోడ్చి నత తంబును గొల్వఁగ వేళఁ జూచు మ
మ్మేపునఁ బిల్చి పిఁడ్కొలుప నేచినధర్మము నర్థకామముల్. 107

తా. భగవంతుండవగు కృష్ణా! మాభాగ్యవిశేషమున గోపాలబాలవేషమున నవతరించిన నీ యందత్యంతభక్తి మాకుఁ గలిగెనేని ముక్తి చేతులుమోడ్చుకొని తానైవచ్చి మమ్ముఁ గొలుచుచుండును. ఇఁకఁ దక్కిన పురుషార్థములో మేమెప్పుడుగోరిననప్పుడేసిద్ధించుటకై యెదురు చూచుచుండును.

శ్లో॥ జయజయజయ దేవ దేవదేవ, త్రిభువనమఙ్గళదివ్యనామధేయ।
జయజయజయబాలకృష్ణదేవ, శ్రవణమనోనయనామృతావతార॥౫

టీ. దేవ=దేవా, దేవదేవ-దేవ=దేవతలకు, దేవ=దేవుఁడైనవాఁడా, త్రిభు...ధేయ-త్రిభువన=ముల్లోకములకును, మఙ్గళ=శుభప్రదమైనదియు, దివ్య=అనితరసాధారణమైనదియు, అగు, నామధేయ=నామములు గలవాఁడా, జయజయజయ=సర్వోత్కర్షముతో వర్తింపుము, శ్రవణ...తార-శ్రవణ=చెవులకును, మనః=మనస్సునకును, నయన=కన్నులకును, అమృత=అమృతమైన-అమృతమువలె అత్యంతభోగ్యమైన, అవతార=అవతరించుటగలవాఁడా-వేణుగానముచేఁజెవులకును, 'చింతాన స్తవశైశవే' అన్నట్లు శైశవచాపలములచేత మనస్సునకును, శిఖిపింఛాద్యలంకృతమైన వేషముచేతఁ గన్నులకును, అత్యంతభోగ్యుఁడైనవాఁడని తెలియునది. బాలకృష్ణదేవ=బాలకృష్ణాకారమునఁ బొడమిన దేవా! జయ జయ జయ=సర్వోత్కర్షముతో వర్తింపుము.

చ. జయజయ దేవ కృష్ణ రిపుసైన్యమహోద్ధతిభేదకృద్ధనం
జయజయకారణా భువనసన్నుతశోభననామధేయ సం
జయజయబోధసాధక వచఃశ్రుతినేత్రమనోమనోహరా
జయజయ విశ్వజన్మలయశాసన గాఢతమోనిరాసనా! 108

తా. ముల్లోకంబులకును మంగళకరములైనదివ్యనామములుగలిగి, దేవతలకు దేవుఁడవై, చెవులకును మనంబునకును నయనములకు అమృతమువలె నత్యంతభోగ్యముగా నవతరించిన బాలకృష్ణస్వామీ! సర్వోత్కృష్టుఁడవై వర్తింపుమా.

శ్లో॥ తుభ్యం నిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటావిర్భవ
ద్భూయశ్చాపలభూషితేషు సుకృతాం భావేషు నిర్భాసతే।
శ్రీమద్గోపలమణ్డనాయ మహతే వాచాం విదూరాయ తే
మాధుర్యైకరసార్ణవాయ మహసే కస్మైచిదస్మై నమః॥ 109

టీ. నిర్భర...భూషితేషు-నిర్భర=అత్యంతమైన, హర్ష=సంతోషముయొక్క, వర్ష=వర్షముచేత, వివశ=పరవశమైన, ఆవేశ=రసావేశముచేత, స్ఫుట=స్పష్టముగా, ఆవిర్భవత్=పుట్టుచున్న, భూయః=అధికమైన, చాపల=పేరాసచేత, భూషితేషు=అలంకరింపఁబడినవైన, సుకృతాం=ధన్యులయొక్క, భావేషు=హృదయములందు-ధ్యానమునందు నిన్నుఁగాంచి యింతింతనరాని హర్షముచేతవివశులై యాహర్షావేశముచేత స్పష్టముగా నీయందుఁగల తమహృదయచాపల్యమును బ్రకటించుచున్న ధన్యాత్ములమనోగతులయం దనుట, నిర్భాసతే=మిక్కిలి ప్రకాశించుచున్నదియును - వారిభావములు తనయందలి అత్యంతచాపల్యముచేత భూషితములైనవిగాన అందు అత్యంతము ప్రకాశించుచున్నవి యనుట, పరవశులై యానందరసావేశము నొందినవారగుటచేతనే తమచాపల్యమును మిక్కిలి ప్రకటించువారైరనుట, శ్రీమ...నాయ-శ్రీమత్=సంపద్యుక్తమైన, గోపల=వ్రేపల్లెకు, మణ్డనాయ=అలంకారమైనదియును, మహతే=గొప్పదియు, వాచాం=వాక్కులకు, విదూరాయతే=దూరమగుచుండునదియు, మాధు...వాయ. మాధుర్య=చక్కఁదనమనెడి, ఏక=ముఖ్యమైన, రస=రసముయొక్క అర్ణవాయ=సముద్రమైనదియు-కేవలము నిరవధికమాధుర్యమయమైనదియును, కస్మైచిత్=ఇట్టిదట్టి దని చెప్పనలవిగానిదియు, అస్మై=ఈ-కనఁబడుచున్నదియు నగు, మహసే=తేజోరూపమైన, తుభ్యం=నీకు, నమః=నమస్కారము.

శా. ఆనందంబున బాహ్యముల్ మఱచి యాత్మారామలీలారతిన్
ధ్యానుల్ గొల్వఁగ ముంగలన్ నిలిచి వాక్చాగోచరం బైయశో

దానందాంగణరత్నమై పసనుదిమాశ్రధారార్ణవం బైనయే
దే నత్యుజ్జ్వల మట్టి తేజమున కెంగ్తే మ్రొక్కువన్ మ్రొక్కెదన్.

తా. ధ్యానమునం దానందపారవశ్యమునఁ జొక్కి మిక్కుటమైన తమచాపల్యమును స్ఫుటముగాఁ దెలుపుచున్న ధన్యుల హృదయములందు ప్రకాశించుచున్నదియు, వ్రేపల్లె కలంకారమైనదియు, గొప్పదియు, వాచామగోచరమైనదియు, కేవలనిరవధిక సౌందర్యమయ మైనదియు, ఇట్టి దట్టి దని చెప్పరానిదియునైనతేజస్సు అగునీకు నమస్కారము.

శ్లో॥ ఈశానదేవచరణాభరణేన నీవీ
దామోదరస్థిరయశః స్తబకోద్గమేన ।
లీలాశుకేన రచితం తవ దేవ కృష్ణ
కర్ణామృతం వహతు కల్పశతాన్తరేఽపి ॥ 110

టీ. దేవ=దేవా, కృష్ణ=శ్రీకృష్ణా, ఈశాన...ణేన-ఈశానదేవ = దేవుండగుశివుని యొక్క, చరణ=అడుగులే, ఆభరణేన = భూషణములుగాఁ గలదియు, నీవీ...ద్గమేన-నీవీ=మూలధనమైన, దామోదర=కృష్ణునియొక్క, స్థిర=నిశ్చలమైన, యశః=కీర్తియనెడు, స్తబక=పూగుత్తికొఱకై, ఉద్గమేన=ఎగురుటగలదియు, అగు, లీలాశుకేన=లీలాశుకుఁడను విలాసార్హమైన చిలుకచేత, రచితం=(కవిపరముగా) నిర్మింపఁబడినదియు – (శుకపరముగా) కావింపఁబడినదియు, అనఁగా శబ్దింపఁబడినదియు, అగు, కర్ణామృతం=కర్ణామృత గ్రంథ మనెడి చెవులకు అమృతప్రాయమైన శబ్దము, కల్పశతాన్తరేపి = వందలకొలంది కల్పములయందుఁగూడ, వహతు=అవిచ్ఛిన్నమై విలసిల్లుచుండుఁ గాక.

మ. ఫలవాంఛన్ హరికీర్తిగుచ్ఛరతియున్ ఫాలాక్షుసంసేవయున్
గలలీలాశుకవాక్యముల్ దెనుఁగునం గర్ణామృతఖ్యాతిగా
నలరం జెప్పితి వెల్లపూడిమణిపెద్దామాత్యవెంగన్న నే
నలరుందోయిటిమాడ్కిఁ గైకొనుము కృష్ణా కల్పసంస్థాయిగాన్.

తా. శివుని పాదారవిందములయందు భక్తి గలిగి పూగుత్తికై మొనరులీలాశుకమువలె నీకీర్తియందు అత్యంతాసక్తిగలిగియుండు లీలాశుకుఁ డనుకవి కర్ణామృతముగా రచించినయీకర్ణామృతగ్రంథము పెక్కుకల్పము లుండునుగాక.

మాలిని. తనుజితజలవాహా దారితశ్వేతవాహా !
జననకృతతమోహా శాంతదుర్దాంతమోహా !
యనఘగుణసమూహా యార్తరక్షస్పృహా !
వినతవినయగేహా వేంకటాహార్యగేహా ! 111

మ. ఇది కృష్ణాశ్రయయోగిపుంగవకృపాసంవీక్షా త్తసారస్వతా
భ్యుదయశ్రీవిభవప్రసిద్ధచిదచిద్బోధక్షమాశాంతి స
త్వ్యాదయాభూషణ వెల్లపూషిమణిపెద్దామాత్యవెంగాగ్రణీ
గదితాశ్వాసము పొల్చుఁ బ్రాథమిక మై శ్రీకర్ణామృతశ్రీకృతిన్.

శ్రీ కృ ష్ణ క ర్ణా మృ త ము
ప్ర థ మా శ్వా స ము

---

## కొన్ని ప్రతులలోఁ గానిపించునధికపాఠము

శ్లో॥ ధన్యానాం సరసానులాపసరణీసౌభాగ్య మభ్యస్యతాం
కర్ణానాం వివరేషు కామపి సుధావృష్టిం దుహానం ముహుః।
వశ్యానాం సుదృశాం మనోనయనయో ర్మగ్నస్య దేవస్య నః
కర్ణానాం వచసాం విజృమ్భిత మహో శ్రీకృష్ణకర్ణామృతమ్ ॥

టీ. సరసా...సౌభాగ్యమ్-సరస=రసవంతములైన, అనులాప=పలుకులయొక్క, సరణీ=మార్గముయొక్క-రసవంతమైన పలుకులపొందికయొక్క, సౌభాగ్య=మనోజ్ఞత్వమును-పెంపుసొంపును, అభ్యస్యతాం=అభ్యసించుచున్నవారైన, ధన్యానాం=కృతార్థుల యొక్క-సహృదయులయొక్క యనుట, కర్ణానాం=చెవులయొక్క, వివరేషు = రంధ్రములయందు, కామపి=కొలఁదియిడరాని, సుధావృష్టిం=అమృతవర్షమును, ముహుః=మాటికి, దుహానం = పిదుకుచున్నదియగు, శ్రీకృష్ణకర్ణామృతమ్ = శ్రీకృష్ణకర్ణామృతమనెడి యీగ్రంథము, వశ్యానాం = జితేంద్రియులైన-వశురాండ్రైన, సుదృశామ్ = విద్వాంసులయొక్క - స్త్రీలయొక్క, మనోనయనయోః = మనస్సునందును కన్నులందును, మగ్నస్య=మునిఁగినవాఁడైన-లీనుఁడైన యనుట, దేవస్య=దేవునియొక్క, నః=మా, కర్ణానాం = చెవులయు, వచసాం = వాక్కులయు, విజృమ్భితమ్=చెలరేఁగుట-శ్రీకృష్ణుఁడు మాకర్ణములందును వాక్కులందును విజృంభించుటయే యీకర్ణామృతమయ్యెననుట-విద్వాంసులకును గోపస్త్రీలకును మనోనయనముల కానందప్రదమైన పరత్వసౌలభ్యసంగతి గలిగినవాఁడు గావున మాకర్ణములకును వాక్కులకును ఆనందప్రదుఁడైనాఁడు. ఇట్టి మాకర్ణములయు వాక్కులయు కృష్ణవిషయమైన విజృంభణమే కర్ణామృత మయ్యెనని భావము. అహో = ఆశ్చర్యము. ధన్యులకర్ణములందు సుధావృష్టి గురియునదిగాన కర్ణామృత మనఁబడినది యని యభిసంధి.

తా. సరసములైన మాటపొందికల పెంపును అలవాటు చేసికొనుచున్న సహృదయుల కర్ణములకు నమృతవర్షమువలె నత్యంతభోగ్యమై, కావుననె కర్ణామృతమనఁబడిన యీకర్ణామృతము విద్వాంసులకును స్త్రీలకును నానందప్రద మగు మూర్తి విశేషము గలవాఁడైన శ్రీకృష్ణుఁడు మాకర్ణములను వాక్కులను విజృంభింపఁజేయఁగా నైన విజృంభణమే యగును.

శ్లో॥ అనుగ్రహద్విగుణవిశాలలోచనై
రనుస్వనద్విగుణగళద్రవామృతైః ।
యతో యతః ప్రసరతి మే విలోచనం
తత స్తతః స్ఫురతు తవైవ వైభవమ్ ॥

టీ. యతః యతః = ఎక్కడెక్కడ, మే=నాయొక్క, విలోచనమ్ = కన్ను, ప్రసరతి=నిగుడునో, తతః తతః = అక్కడడక్కడ, అను...లోచనైః - అనుగ్రహ = దయచేత, ద్విగుణ=ఇనుమడిగా, విశాల = వెడల్పైన, లోచనైః = కన్నులచేతను, అనుస్వన...మృతైః-అనుస్వన = అందెలు మొదలైనవానిని అనుసరించి మ్రోయుశబ్దములచేత, ద్విగుణ=రెండింతలుగా, గళత్=స్రవించుచున్న, రవ+అమృతైః=వేణుధ్వని యనెడి యమృతములచేతను-అమృతమువంటి వేణుధ్వనులచేతను, తవ = నీయొక్క, వైభవమేవ=వైభవమే, స్ఫురతు=ప్రకాశించుఁగాక.

తా. నాకు ఎక్కడెక్కడఁ జూచినను దయచే ఇనుమడిగా విరివిచెందిన నీకన్నులచేతను, అందియలకడియముల మ్రోఁతచే నినుమడిగా నమృతమువలె నొలుకుచున్న వేణుధ్వనులచేతను, నీవైభవమే నాకుఁ దోఁచుచుండుఁగాక.





శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీ కృష్ణ కర్ణామృతము.

## ద్వి తీ యా శ్వా స ము



శ్లో॥ అభినవనవనీతస్నిగ్ధ మాపీతదుగ్ధం
దధికణపరిదిగ్ధం ముగ్ధ మఙ్గం మురారేః।
దిశతు భువనకృఛ్రచ్ఛేది తాపిఞ్ఛగుచ్ఛ
చ్ఛవి నవశిఖిపిఞ్ఛాలాఞ్ఛితం వాఞ్ఛితం నః॥ 1

టీ. అభి...స్నిగ్ధం-అభినవ = మిక్కిలి క్రొత్తదైన-అప్పుడు చిలికి యెత్తఁబడిన నవనీత=వెన్నవలె, స్నిగ్ధం = మిసిమిజిడ్డుగలదియు, ఆపీతదుగ్ధం-ఆపీత = త్రాగఁబడిన, దుగ్ధం=పాలుగలదియు-పాలుత్రావినదియుననుట, దధి...దిగ్ధం-దధి = పెరుఁగుయొక్క, కణ=బిందువులచేత, పరిదిగ్ధం=అంతట పూయఁబడినదియు, ముగ్ధం=సుందరమైనదియు, భువ...చ్ఛేది-భువన=లోకములయొక్క, కృఛ్ర=సంకటములను, ఛేది=త్రుంచునదియు, తాపి...ఛవి-తాపిఞ్ఛ=కానుగుచెట్టుయొక్క, గుచ్ఛ=పూగుత్తులయొక్క, ఛవి=కాంతి వంటికాంతి గలదియు,నవ...ఞ్ఛితమ్-నవ=క్రొత్తదైన, శిఖిపిఞ్ఛా=నెమిలిపురిచేత, లాఞ్ఛితం = గురుతిడఁబడినదియు, తనకృష్ణావతారమునను విశేషలక్షణముగా నెమిలిపురిని దాల్చినది యనుట, అగు, మురారేః=శ్రీకృష్ణునియొక్క, అఙ్గం=దేహము, నః=మాయొక్క, వాఞ్ఛితం- అభీష్టమును,దిశతు=ఇచ్చుఁగాక, ఇట గొల్లలయిండ్లలో వెన్న పాలు పెరుఁగు త్రాగునప్పటిలీలావైలక్షణ్యమును కవి యనుసంధించినాఁడు; కావుననే వెన్న దిని యాజిడ్డు తగిలి మఱింత మిసిమిదేఱుటచే 'నవనీతస్నిగ్ధ' మనియు పాలుత్రావినసొంపు పెంపారుటచే 'ఆపీతదుగ్ధ'మనియు, పెరుఁగుతుంపరలు పైని వ్యాపించియుండుటచే 'దధికణపరిదిగ్ధ' మనియు అంగమును వర్ణించినాఁడు. ఆయంగ మితరమగునవతారముల నుండి వ్యావర్తించుటకై 'శిఖిపిఞ్ఛాలాఞ్ఛిత' మన్నాఁడు.

శా. తాపింఛచ్ఛవి యై వినీలనవనీతస్నిగ్ధ మై ముగ్ధ మై
యాపీతామితదుగ్ధ మై దధికణైకాదిగ్ధ మై లోకకృ

ఛాపచ్ఛేదకమై విశాలశిఖిపింఛాలాంఛితంబైన శ్రీ
గోపాలప్రభుమూర్తి వాంఛిత మొసంగుఁగాక మాకు నశ్రాంతమున్.

తా. పచ్చివెన్నజిడ్డు దేఱుచు, పాలు సొంపారఁ ద్రాగి, పెరుఁగుతుంపరలు పయి నలమి, కానుగుచెట్లకాంతివంటినల్లనికాంతి గలిగి, క్రొత్తనెమిలిపురిని దాల్చి, జగంబుల సంకటంబులను మాలించునట్టి శ్రీకృష్ణునిశరీరము మాకోర్కుల నొడఁగూర్చుఁగాత.

శ్లో॥ యాం దృష్ట్వా యమునాం పిపాసు రనిశం వ్యూహో గవాం గాహతే
విద్యుత్వా నితి నీలకణ్ఠనివహో యాం ద్రష్టు ముత్కణ్ఠతే।
ఉత్తంసాయ తమాలపల్లవ మితి ఛిన్దన్తి యాం గోపికాః
కాన్తిః కాళియశాసనస్య వపుషః సా పావనీ పాతు నః॥ 2

టీ. పిపాసుః=పానము సేయఁగోరుచున్న, గవాం=గోవులయొక్క, వ్యూహః=సమూహము, యాం=దేనిని-ఏకాంతిని, యమునాం=యమునానదినిగా, దృష్ట్వా=చూచి, అనిశం=ఎప్పుడును, గాహతే=ప్రవేశించుచున్నదియో, నీలకణ్ఠనివహః-నీలకణ్ఠ = నెమిళులయొక్క, నివహః=సమూహము, యాం=దేనిని-ఏకాంతిని, విద్యుత్వాన్ ఇతి=మేఘము అని, ద్రష్టుం=చూచుటకు, ఉత్కణ్ఠతే=తమకపడుచున్నదో, గోపికాః = గోపస్త్రీలు, యాం=ఏకాంతిని, తమాలపల్లవమ్-తమాల=నల్లకానుగుచెట్టుయొక్క, పల్లవమ్ఇతి = చిగురునుగా, దృష్ట్వా=చూచి, ఉత్తంసాయ = శిరోభూషణముకొఱకు, ఛిన్దన్తి=గిల్లుచున్నారో, కాళి...సనస్య-కాళియ=కాళీయుని, శాసనస్య=శిక్షించినవాఁడైన శ్రీకృష్ణుని యొక్క, వపుషః=శరీరముయొక్క, సా=ఆ-ప్రసిద్ధమైన, పావనీ=పవిత్రమునైన, కాన్తిః=కాంతి, నః=మమ్ము, పాతు=పరిపాలించునుగాక-యమునానదియు, మేఘమును, కానుగుచిగురును నల్లనివిగాన నల్లనిదైన శ్రీకృష్ణునికాంతిని గోవులు మొదలైనవి యమునానది మొదలైనవిగా భ్రమించినవని తెలియునది. మఱియు గోవులకు నదీగాహనమందును, నీలకంఠములకు మేఘదర్శనమందును, స్త్రీలకు పల్లవచ్ఛేదనమందునుగలయౌత్సుక్యమునకు అనుగుణముగానుకృష్ణునికాంతిని వరుసగా యమునానది మొదలైనవిగారూపించినాఁడు.

చ. అనిశము యామునాంబు విది యానెద మంచును గోగణంబు లె
ల్లను జొర, బర్హిపంక్తులు వలాహక మంచును వేడ్కతోడఁ గ
న్గొనఁగ, దమాలపల్లవము కొప్పున కౌనని గోపకామినుల్
చినుమఁగ నొప్పుకృష్ణునివిశేషతనుద్యుతి నన్నుఁ బ్రోచుతన్. 2

తా. ఏకాంతినిఁజూచి, దప్పిగొన్నగోవులు యమునానది యని చొచ్చునో; నెమిళులు మబ్బని తమకపడునో; గోపికలు కానుగుచిగు రని కోయుదురో, ఆపవిత్రమైనకృష్ణునికాంతి నన్ను రక్షించుఁగాక.

అవ. గోపీవస్త్రాపహరణలీలను వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ *దేవః పాయాత్పయసి విమలే యామునే మజ్జతీనాం
యాచస్తీనా మనునయపదై ర్వఞ్చితాన్యంశుకాని ।
లజ్జాలోలై రలసవిలసై రున్మిషత్పఞ్చబాణై
ర్గోపస్త్రీణాం నయనకుసుమై రర్చితః కేశవో నః ॥ 3

టీ. విమలే=నిర్మలమైనదియు, యామునే=యమునానదిని సంబంధించినదియు, అగు, పయసి=నీటియందు, మజ్జతీనాం=మునుఁగుచున్నవారును-స్నానముచేయుచున్న వారనుట, వఞ్చితాని=వంచింపఁబడిన-అపహరింపఁబడిన, అంశుకాని=వస్త్రములను, అనునయపదైః=లాలించు మాటలచేత, యాచస్తీనాం=వేఁడుచున్నవారును-యమునా నదీజలముల స్నానము సేయుచుండఁగా కృష్ణుఁడు తమవలువలను అపహరింపఁగా దానిని ఇమ్మని బతిమాలుచున్నవారు ననుట, అగు, గోపస్త్రీణాం=గొల్లచెలువలయొక్క, లజ్జాలోలైః-లజ్జా=సిగ్గుచేత, లోలైః=చంచలములైనవియు, ఉన్మి...బాణైః=ఉన్మిషత్=ఆవిర్భవించుచున్న, పఞ్చబాణైః=మన్మథుఁడు గలవియు - మరులుపొడముచున్నవియు, కానున నే, అలసవిలసైః-అలస=మందములును, విలసైః=ప్రకాశించునవియు అయినవియు - లజ్జచేత చలించుచున్నవియు మన్మథవికారముచేత మందమైనవియు ననుట-అనఁగా గోపికలు వివస్త్రలైయుండి సిగ్గుచేత కృష్ణుని నిలుకడగా చూడనేరక కన్నుల నిటునటు త్రిప్పుచుండిరనియు, మోహావేశముచే నతనియందు చూపులు నెల కొల్పుటచేఁగన్నులను మందముగాఁ(అలసములుగా) జేసిరనియు లజ్జాకామములవలని లోలత్వాలసత్వములు తెలియునది; ఇట్టివైన, నయనకుసుమైః-నయన=నేత్రములనియెడి, కుసుమైః=పువ్వులచేత-నేత్రముల నల్లనిచూడ్కులనెడి నల్లగలువలచేతననుట, అర్చితః=పూజింపఁబడినవాఁడగు, దేవః=దేవుఁడైన, కేశవః=శ్రీకృష్ణమూర్తి, నః=మమ్ము, పాయాత్=రక్షించుఁగాక - పంచబాణుఁడు బాగుగా పొడమియుండినయెడల కృష్ణుని యందు నయనములు స్థిరముగా నుండును; అట్లుగాక 'ఉన్మిషత్' అని పొడముచుండుటను చెప్పుటచే 'అలస'ము లని అనఁగా కొంత స్థిరముగా నుండెనని చెప్పఁబడియె.

మ. యమునావేణికయందు గోపికలు నీరాడన్ స్వకీయాంశుకౌ
ఘములన్ దాఁచఁగ సిగ్గుచే మృదులవాక్యప్రౌఢితో వేఁడుకన్

*ఈశ్లోకమున కర్థము-'కదమ్బవృక్షమూరూఢంగోపీవస్త్రాపహారిణమ్।కృష్ణంధ్యాత్వార్ధరాత్రేతు జపేన్మన్త్రం సహస్రకమ్। దశరాత్రజపా దేవ మాకర్షేన్నాగకన్యకాం। కన్యకాస్త్రీదశాదీనాం కింపున ర్మర్త్యయోషితః' అని గోపాలకృష్ణమంత్రరాజమందలి వస్త్రాకర్షణప్రయోగధ్యాన మని సనత్కుమార సంహితయందుఁ జెప్పంబడి యున్నది.

సముదంచన్మదనాలసోల్లసనసిరీ ౯ క్షాసిలసీరేజమా
ల్యములన్ వారలు పూజసేయఁ దగునయ్యబ్జాక్షు సేవించెదన్.

తా. గోపికలు యమునానది తేటనీటిలో జలకములాడుచుండునపుడు వారివలువలను గృష్ణుఁ డపహరింపఁగా ఆ స్త్రీలు వలువ లిమ్మని వేఁడుచును గన్నులను లజ్జచే ఇటునటు త్రిప్పుచును మన్మథవికారము పొడముచుండుటచే మందముగాను కృష్ణునిపై నిగుడ్పఁగా ఆ మాడ్కులను నల్లగలువలచేతఁ బూజితుండైన శ్రీకృష్ణదేవుండు మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ మాత ర్నాతః పర మనుచితం య త్ఖలానాం పురస్తా
దస్తాశఙ్కం జఠరపిఠరీపూర్తయే న ర్తితాఽసి।
తత్ క్షన్తవ్యం సహజసరళే వత్సలే వాణి! కుర్యాం
ప్రాయశ్చిత్తం గుణగణనయా గోపవేషస్య విష్ణోః॥ 4

టీ. సహజసరళే-సహజ=స్వాభావికముగా, సరళే=మృదువైనదానా-స్వాభావికముగా ఆశ్రితులయెడ ఆభిముఖ్యముగలిగియుండుదానా యనుట, వత్సలే=వాత్సల్యముగలదానా-భక్తులదోషములను గణింపక భోగ్యముగాఁగొనుదానా, మాతః=తల్లీ, హేవాణి=ఓసరస్వతీ, జఠ... ర్తయే-జఠర=ఉదరమనెడి, పిఠరీ=పఁటియొక్క, పూర్తయే=నిండుటకొఱకు, ఖలానాం=దుర్జనులయొక్క, పురస్తాత్=ముందట, అస్తాశఙ్కం=సందేహములేనట్టు, నర్తితా=నర్తనము చేయింపఁబడినదానవు, అసి ఇతి=అయితివనునది, యత్=ఏదియో, అతః=ఇంతకంటెను-నిన్ను పొట్టనింపుకొనుటకై దుష్టులయొద్ద ఆడించుటకంటెను అనుట - పొట్టపోసికొనుటకై నిన్ను దుష్టులను వర్ణించుటయందు ఉపయోగించుటకన్నను అని భావము. అనుచితమ్=తగనిది, పరం=మఱియొకటి, న అస్తి=లేదు. తత్=అది-దుష్టవర్ణనములందు నిన్ను వినియోగించుట, క్షన్తవ్యం=క్షమింపఁదగినది. గోపవేషస్య=గొల్లవేషముగల, విష్ణోః=శ్రీవిష్ణుదేవునియొక్క-శ్రీకృష్ణునియొక్క యనుట, గుణగణనయా-గుణ=కళ్యాణగుణములయొక్క, గణనయా=గణించుటచేత-కీర్తించుటచేత, ప్రాయశ్చిత్తం=నిష్కృతిని, కుర్యామ్=చేసెదను-నిన్ను దుష్టులయందు వినియోగించిన పాతకమునకుఁ బ్రాయశ్చిత్తముగాఁ గృష్ణమూర్తి కళ్యాణగుణవర్ణనమందు వినియోగించెద - నీకల్యాణగుణములను వర్ణించి పాతకమును బాపికొనెద నని భావము, 'జఠరపిఠరీపూర్తయే' అనుటచే అత్యంతనీచత్వమును అనుచితత్వమును ధ్వనించుచున్నవి. ఇంతటిదోషమును 'సహజసరళ'త్వమును 'వత్సల'త్వమును గలిగియుండు నీవు క్షమింపఁదగు నని యర్థము.

చ. ఉదరము నింపఁ గోరి ఖలు ౯ లుండెడుతావులు సేరి వారిక
ట్టెడుట నశంక నిన్ను నటి ౯ యింపఁగఁ జేసినపాతకంబులన్

సదయత నోర్వఁగా వలెఁ బ్రసన్నమతిన్ ననుఁ గన్నతల్లి శా
రద యదువంశనాయకనిశ్రప్రస్తుతి నిష్కృతి సేనొనర్చెదన్. 4

తా. తల్లీ! సరస్వతీ! ఈనాపాట్లనింపుటకొఱకు నిన్ను దుష్టులనువర్ణించుటయందు విచ్చలవిడిగా వినియోగించితిని. ఇంతకంటె అనుచితమైనది మఱొకటి గలుగదు. నీవు స్వభావసిద్ధముగా మృదుత్వమును వాత్సల్యమును గలదానవుగనుక ఈదోషమును క్షమింపవలయును. శ్రీకృష్ణమూర్తి కల్యాణగుణములను వర్ణించి యీపాతకమునకు ప్రాయశ్చిత్తము చేసికొనెద.

అవ. వేణుగానవైఖరిని వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ అఙ్గుళ్యగ్రై రరుణకిరణై ర్ముక్తసంరుద్ధరన్ధ్రం
వారం వారం వదనమరుతా వేణు మాపూరయన్తమ్ ।
వ్యత్యస్తాఙ్ఘ్రిం వికచకమలచ్ఛాయవిస్తారినేత్రం
వన్దే బృన్దావనసుచరితం నన్దగోపాలసూనుమ్॥ 5

టీ. అరుణకిరణైః—అరుణ=ఎఱ్ఱనైన, కిరణైః=కాంతులుగల, అఙ్గుళీ+అగ్రైః=వ్రేళికొనలచేత, ముక్త...రన్ధ్రం యథాతథా—ముక్త=విడువఁబడినవియు, సంరుద్ధ=కప్పఁబడినవియు, అగు, రన్ధ్రం యథాతథా=రంధ్రములు గలుగునట్లుగా, వేణు=పిల్లఁగ్రోవిని, వారంవారమ్=మాటిమాటికి, వదనమరుతా—వదన=ముఖముయొక్క, మరుతా=గాలిచేత, ఆపూరయన్తం=నిండింపఁ జేయుచున్నవాఁడును, వ్యత్యస్తాఙ్ఘ్రిం—వ్యత్యస్త=మార్పఁబడిన, అఙ్ఘ్రిం=పాదములు గలవాఁడును—కుడిపాదము ఎడమప్రక్కను ఎడమపాదము కుడిప్రక్కను ఉంచుకొన్నవాఁడనుట, విక...నేత్రమ్—వికచ=వికసించిన, కమల=తెల్లదామరలరేకులయొక్క,ఛాయా=కాంతివంటికాంతిని,విస్తారి=విస్తరింపఁజేయుచున్న, నేత్రమ్=కన్నులు గలవాఁడును, బృన్దావ...రితమ్—బృన్దావన=బృందావనమందు, సుచరితం=శోభనమైనసంచారము గలవాఁడును, అగు, నన్దగోపాలసూనుమ్=నందగోపాలునియొక్క కొడుకైన శ్రీకృష్ణమూర్తినిగూర్చి, వన్దే=నమస్కరించుచున్నాను.

మ. అరుణశ్రీ వ్రేళులకొత్తునంగుళుల నొయ్యం గప్పుచున్ విప్పుచున్
మురళీరంధ్రము లాస్యమారుతమునం బూరించు చొయ్యారమై
చరణద్వంద్వము మార్పడన్ నిలుచుకంజాతాయతాలోకభా
సురబృందావనమందిరాంతరచరత్కృష్ణుం గృష్ణుఁ గీర్తించెదన్. 5

తా. ఎఱ్ఱనికాంతులు నిగుడ్చుమునివ్రేళ్ళచేపిల్లఁగ్రోవిరంధ్రములు గప్పుచును విప్పుచును మాటిమాటికి ముఖవాయువుచే దానిని పూరించుచు పాదములు మార్పడఁబెట్టుకొని

నిలిచి, విరిదమ్ముల కాంతులను వెల్లిగొలుపుచున్న కన్నుదోయితో బృందావనమందు సంచరించుచుండు నందగోపాలకుమారునిగూర్చి నమస్కరించుచున్నాను.

అవ. జిహ్వను శ్రీకృష్ణకీర్తనముకొఱకు సంబోధించుచున్నాఁడు.

శ్లో॥ మన్దం మన్దం మధురనినదై ర్వేణు మాపూరయన్తం
బృన్దం బృన్దావనభువి గవాం చారయన్తం చరన్తమ్ ।
ఛన్దోభాగే శతమఖముఖధ్వంసినాం దానవానాం
హన్తారం తం కథయ రసనే గోపకన్యాభుజఙ్గమ్ ॥ 6

టీ. మధురనినదైః_మధుర=మనోహరములైన, నినదైః = ధ్వనులచేత, మన్దం మన్దం=మెల్లమెల్లన, వేణుం=పిల్లఁగ్రోవిని, ఆపూరయన్తం=నిండించుచున్నవాఁడును, బృన్దావనభువి=బృందావనభూమియందు, గవామ్=గోవులయొక్క, బృన్దమ్=సమూహమును చారయన్తం=సంచరింపఁ జేయుచున్నవాఁడును, ఛన్దోభాగే=వేదైకదేశమైన వేదాంతమందు, చరన్తమ్=సంచరించుచున్నవాఁడును, శత...ధ్వంసినాం_శతమఖముఖ=దేవేంద్రుఁడు మొదలైనవారిని, ధ్వంసినాం=అడఁచుచున్న, దానవానాం = రాక్షసులకు, హన్తారం=నాశముసేయువాఁడును, తం=ప్రసిద్ధుఁడునైన, గోపకన్యాభుజఙ్గమ్ _ గోపకన్యా=గొల్లచెలువల, భుజఙ్గమ్=విటుఁడైనకృష్ణుని, హేరసనే=ఓనాలుకా, కథయ = కీర్తింపుము. వేణువునూఁదుచు గోవులనుమేపుచు బృందావనమునఁ దిరుగు గొల్లపడుచులవిటకాఁడైన నలభుఁడే వేదాంతప్రతిపాద్యుఁడై రాక్షసులకు హంత యగుపరుఁడు గాన వానియేతాదృశపరత్వసౌలభ్యవైచిత్ర్యములను వర్ణింపుమా యని భావము.

శా. బృందారణ్యతరుప్రదేశముల గోబృందంబులన్ మేపుచున్
మందం బౌ మధురధ్వనిన్ మురళిఁ బ్రల్మ్రోయన్ వినోదించుచున్
ఛందోవీథిఁ జరించుచున్ విమతరక్షఃస్తోమవిధ్వంసనా
నందుం డైనవ్రజాంగనావిభు రసజ్ఞా! ప్రస్తుతిం బ్రకీర్తింపుమా. 6

తా. మనోజ్ఞస్వరములచే మెల్లమెల్లన వేణువునూఁదుచు, బృందావనంబున గోగణంబులను మేపుచును, వేదాంతవీథులఁ జరియించుచు, నెల్లరాక్షసుల నడంచుచుఁ, బ్రసిద్ధుఁడైన గొల్లమిటారులవిటకానిని ఓనాలుకా! వర్ణింపుమా.

అవ. స్వప్నమందుఁ బొడ తెంచిన శ్రీకృష్ణమూర్తిని వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ వేణీమూలే విరచితఘనశ్యామపిఞ్ఛావచూడో
విద్యుల్లేఖావలయిత ఇవ స్నిగ్ధపీతామ్బరేణ ।

మా మాలిఙ్గ న్మరకతమణి స్తమ్భగమ్భీర బాహుః
స్వప్నే దృష్ట స్తరుణతులసీభూషణో నీలమేఘః ॥* 7

టీ. వేణీమాలే - వేణీ = కేశబంధవిశేషముయొక్క, మాలే = మొదటను, విరచిత...చూడః-విరచిత = చెరుపబడినదియు, ఘన=మబ్బువలె - లేక-మిక్కిలిగా, శ్యామ=నల్లనిదియు, అగు, పిఞ్ఛ=నెమిలిపురి, అవచూడః = శిరోభూషణముగాఁ గల వాఁడును, స్నిగ్ధ...రేణ-స్నిగ్ధ=నిద్దమైన-నిగనిగలాడు, పీతామ్బరేణ = పీతాంబరము చేత - పచ్చనిబంగారువలువచేత, విద్యు...లయిత ఇవ-విద్యుత్ = మెఱపులయొక్క, లేఖా=పంక్తులచేత, వలయితః ఇవ=చుట్టుకొనఁబడినవానివలె నున్నవాఁడును, మర...బాహుః-మరకతమణి=ఇంద్రనీలమణిసంబంధమైన, స్తమ్భ = స్తంభమువలె, గమ్భీర = దిట్టమైన, బాహుః = భుజములు గలవాఁడును, తరు...భూషణః - తరుణ = లేత యగు, తులసీ=తులసీమాలిక, భూషణః = అలంకారముగాఁ గలవాఁడును, అగు, నీల మేఘః=కారుమబ్బువంటి వర్ణము గలవాఁడు, మాం=లక్ష్మిని, ఆలిఙ్గన్=కౌఁగిలించువాఁ డగుచు, స్వప్నే=స్వప్నమందు, దృష్టః=చూడఁబడెను, ఇచట 'నీలమేఘః' అనుటచే నీలమేఘసదృశచ్ఛాయగల శ్రీకృష్ణవిగ్రహము గ్రాహ్యము. అట్టి నల్లనివిగ్రహమును జుట్టుకొన్న నిగనిగని పీతాంబరము నీలమేఘమును జుట్టుకొన్న విద్యుల్లేఖవలె నుండె నని యాశయము.

చ. అలరుమెఱుంగురంగు గలఁగహాటక శాటిక మాళిపాళి భా
సిలునవపింఛకంబు తులసీదళదామముఁ గల్గినట్టిమే
ఘలలితమూర్తి మాణిక్యపుఁగంబముఁబోనిభుజద్వయంబుచే
నలమి రమావధూటిఁ జెలువందఁ గలం గనిపించె నింపుగన్. 7

తా. జడమొదట నల్లనినెమిలిపురిని జెరివి, నిగనిగలాడుపీతాంబరము మెఱుఁగుల బంతివలె మబ్బులవంటినల్లనితనమేన మెఱయఁగా, ఇంద్రనీలమణిస్తంభమువంటిబాహువు లొప్ప, లేఁతతులసీమాలికను దాల్చి, లక్ష్మీదేవిని కౌఁగిలించుకొని, శ్రీకృష్ణమూర్తి నాకుఁ గలలోఁ గానంబడియెను.

అవ. శ్రీకృష్ణుఁడు వలువ లపహరించినయొకానొకముగ్ధయొక్క మాగ్ధ్యమును వర్ణించుచున్నాఁడు.

---

*ఈశ్లోకముసర్గముఁ 'వామాఙ్కస్థితయా వామపాణిపద్మసపద్మయా।పద్మావతార యాశ్లిష్టం రుక్మిణ్యా కనకాభయా॥ హరిం తాపిఞ్ఛసచ్ఛాయ మాసీనం కాఞ్చనామ్బుజే। ఆశ్లిష్య సంప్రియాం దేవ్యా ఫలోద్యద్వామపాణినా। సౌవర్ణవేత్ర విలసద్దక్షపాణితలం స్మరేత్। పీతామ్బరధరం దివ్యభూషామాలావిభూషణమ్' అని గోపాలకృష్ణషోడశాక్షర మంత్రధ్యానముగా సనత్కుమారసంహితయందుఁ జెప్పఁబడినది.

శ్లో॥ *కృష్ణే హృత్వా సిచయనిచయం కూలకక్షాధిరూఢే,
ముగ్ధా కాచి న్ముహు రనునయైః కిన్వితి వ్యాహరన్తీ ।
సభ్రూభఙ్గం సదరహసితం సత్రపం సానురాగం
ఛాయాశౌరేః కరతలగతా న్యమ్బరా ణ్యాచకర్ష ॥ 8

టీ. సిచయనిచయమ్-సిచయ=వస్త్రములయొక్క, నిచయం=సమూహమును, హృత్వా=హరించి, కృష్ణే=శ్రీకృష్ణుఁడు, కూల...రూఢే-కూల=యమునాతటమందలి, కకం జ=పాదపమందు, అధిరూఢేసతి=ఎక్కినవాఁ డగుచుండఁగా, కాచిత్=ఒకానొక, ముగ్ధా=ముగ్ధరాలు, ముహుః=మాటికిని, అనునయైః=ఊఁటడింపుపలుకుల చేత, కిన్ను=ఇతి=ఏమియని-ఏమిప్రయోజనమని,వ్యాహరన్తీ = చెప్పుచున్నదై,సభ్రూభంజ=బొమముడితోఁ గూడినట్లును, సదరహాసితం=చిఱునవ్వుతోఁగూడినట్లును, సత్రపం=సిగ్గుతోడఁ గూడినట్లును, సానురాగమ్=అనురాగముతోఁగూడినట్లును, ఛాయాశౌరేః=ఛాయారూపమున నుండు శ్రీకృష్ణునియొక్క-శ్రీకృష్ణునిఛాయారూపముయొక్క, కర...తాని-కరతల=అఱచేతిని, గత=పొందినవైన, అమ్బరాణి=వస్త్రములను, ఆచకర్ష=లాగెను. ఎంత యూఱడింపుమాటలతో వేఁడుకొన్నను పలుకులు ఇయ్యనందున అట్టిమాటల చేఁబనియేమి యని బలాత్కారమునకుఁ జొచ్చినదనియు ముగ్ధ గావున కృష్ణుని నీడయొక్క చేతియంబరములను లాగినదనియుఁ దెలియునది. కోపముచే భ్రూభంగమును నిరర్థకప్రయత్న మగుటచే దరహసితమును, వస్త్రమును ఏమఱుట చేఁద్రపయును, గామముచే అనురాగమును దెలియునది. కోపము యొక్క ఆతురత్వముచే నీడ యనియుఁ దలంపక లాగినదనుట.

ఉ. కోకలు ముచ్చిలించి తటకకుంజగృహంబున నిల్వ సిగ్గునన్
భ్రూకుటియున్ దరస్మితనికరూఢియుఁ బ్రేమముఁ గోప గట్టకన్
రాక యి దేమిరా తగదుకరా యని ముగ్ధవధూటి నీటిలోఁ
జేకొనఁ బూనె నీడ యగుకచిన్నముకుందునిచేతిచేలముల్. 8

తా. శ్రీకృష్ణుఁడు జేల యైనయొకానొకపడఁతియొక్క పలువలను దొంగిలి యమునానదిగట్టునందలి పొదరింటి నెక్కఁగా నాముగుద యెంతసమాధానపుఁబలుకులతో వేఁడినను పలుకల నియ్యనందున మాటికి బతిమాలికొనుటలో పనయేమియని బొమముడి

---

* ఈ శ్లోకమునర్థము 'కదమ్బవృక్ష మారూఢం గోపీవస్త్రాపహారిణమ్। కృష్ణం ధ్యాత్వార్ధరాత్రేతు జపేన్మన్త్రం సహస్రకమ్ । దశరాత్రజపాదేవ మాకర్షేన్నాగకన్యకాః। కన్యకాస్త్రీదశాదీనాం కింపున ర్మర్త్యయోషితః' అని గోపాలకృష్ణమన్త్రరాజముని సనత్కుమారసంహిత.

పాటును చిలుకవ్వను సిగ్గును ప్రేమయు ముప్పిరిగొనఁగా, శ్రీకృష్ణుని నిపయొక్క చేతియందలి వస్త్రములను లాగెను.

అవ. జన్మాంతరమందైనను వేణువుగా నేని పుట్టఁగలనా యని యువిదలులూరుచున్నాఁడు.

శ్లో॥ అపి జనుషి పరస్మి న్నాత్తపుణ్యో భవేయం
తటభువి యమునాయా స్తాదృశో వంశనాళః ।
అనుభవతి య ఏష శ్రీమదాభీరసూనో
రధరమణిసమీపన్యాసధన్యా మవస్థామ్ ॥ 9

టీ. శ్రీమత్ + ఆభీరసూనోః-శ్రీమత్=సంపత్కరుఁడైన, ఆభీరసూనోః-ఆభీర=గొల్లవాఁడైన నందునియొక్క, సూనోః = కుమారుఁడైన శ్రీకృష్ణునియొక్క, అధర...ధన్యామ్-అధరమణి=కెంపుగతనమువంటి పెదవియొక్క, సమీప=దగ్గఱ, న్యాస = ఉంచుటచేత, కెంపువలె మెఱయు పెదవులదాపున ఉంపఁబడుటచేత, ధన్యామ్ = కృతార్థమైనదగు, అవస్థామ్=దశను, యః ఏషః=ఏ ఇది-ఏ యీపిల్లఁగ్రోవి యనుట, అనుభవతి = అనుభవించుచున్నదో కృష్ణుని పెదవిదాపున నుండు భాగ్యాతిశయమును ఏయీ వేణువు అనుభవించుచున్నదో, తాదృశః = అటువంటిదైన-అట్టిభాగ్యమును అనుభవించునదైన, వంశనాళః=పిల్లఁగ్రోవితూఁడుగా, యమునాయాః = యమునయొక్క, తటభువి=గట్టునందలి ప్రదేశమున, పరస్మిన్=మఱియొక్క, జనుషి = జన్మమందు, ఆత్తపుణ్యఃసన్-ఆత్త=పొందఁబడిన, పుణ్యఃసన్ = పుణ్యము గలవాఁడ నగుచు, అపి భవేయమ్=అగుదునా? ఇచట-అపిశబ్దము ఆశంసార్థకము. ఈజన్మమునందు కృష్ణుని అంటి అనుభవించుపుణ్యమునకు నోఁచకపోయితిని. అచేతనమైన యీవేణువో కృష్ణునియొక్క పెదవికడ నుండు భాగ్యవిశేషమునకు నోఁచినంతపుణ్యము గలదయ్యె. కాఁబట్టి పుణ్యము చేసికొని నేను మఱియొకజన్మమందైనను శ్రీకృష్ణుఁడు సంచరించు యమునానదీతీరమునందు ఇటువంటికృతార్థమైన వేణువుగా నేని పుట్టి యిది యనుభవించు భాగ్యాతిశయమును నేనును అనుభవింపఁ గలుగుదునా యని యర్థము.

ఉ. నందతనూజుమోవిరతనంబుసమీపముఁ జేరి ధన్యతం
బొందెఁ గళిందజాతటమునఁ బొంత వసించినవంశనాళ మా
యందముఁ గాంతునొక్క జనననాంతర మందియు శేషసత్క్రియా
బృందము వెంటనంటి ఫలసంయుక్తంగఁ గోర్కులపంట పండఁగన్.

తా. యమునాతీరమందుఁ బుట్టినయీవంశనాళము కృష్ణునికెమ్మోవిపొంతం జేరి కృతార్థత్వము నొందెను. నేనును అట్టిపుణ్యము చేసికొని మఱియొకజన్మమందైనను ఆయమునానదీతీరమున నొకవేణువుగాఁ బుట్టి యట్టికృతార్థత్వమును బొందుదునా !

అవ. మనస్సును సంబోధించి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అయి పరిచిను చేతః ప్రాతరమ్భోజనేత్రం
కబరకలితచఞ్చత్పిఞ్ఛదామాభిరామమ్ ।
వలభిదుపలనీలం వల్లవీభాగధేయం
నిఖిలనిగమవల్లీమూలకన్దం ముకున్దమ్ ॥ 10

టీ. అయిచేతః=ఓమనసా, ప్రాత...నేత్రమ్-ప్రాతఃఅంభోజ=ప్రాతఃకాలమందలితామరవంటి, నేత్రం=కన్నులు గలవాఁడును, కబర...రామమ్-కబర = సిగయందు, కలిత=చుట్టఁబడి, చంచత్=ఒప్పుచున్న, పిఞ్ఛదామ = నెమిలిపురి దండచేత, అభిరామమ్=మనోజ్ఞుఁ డైనవాఁడును, వల...నీలమ్ - వలభిత్ + ఉపల = ఇంద్రనీలమణివలె, నీలం=నల్లనైనవాఁడును, వల్లవీభాగధేయమ్-వల్లవీ = గోపస్త్రీలయొక్క, భాగధేయం= భాగ్యస్వరూపుఁ డైనవాఁడును, నిఖిల...కన్దమ్-నిఖిల=సమస్తమైన, నిగమ=వేదములని యెడి, వల్లీ=తీవెలయొక్క, మూల=మొదలు అగు, కన్దమ్=గడ్డయైనవాఁడును, వేదములకు మూలభూతుఁ డైనవాఁడనుట, అగు, ముకున్దమ్=శ్రీకృష్ణునిఁగూర్చి, పరిచిను=పరిచయము చేయుము-చింతింపు మనుట, కన్నులు కేవల మంభోజములవంటివి గాక తెల్లవాఱు పూఁట మఱింతనిటు గులుకు అంభోజములవంటివి. సిగయో నెమిలిపురిసరిచే మఱింత సొగసు గులుకుచున్నది. మేన్మేనో యింద్రనీలమణివలె నిగనిగని నల్లని కాంతులు గలది. ఇట్టి వానిని చింతించుట యత్యంతభోగ్యముగా నుండును గాన చింతింపుమా. ఇట్టియొప్పిదము లన్నియుఁ దాల్చియు గొల్లపిల్లలపు సాంప్రగూర్చు కేవలుఁ డైనవాఁడే కదా యనవలదు. వేదముల కెల్ల మూలభూతుఁ డైన పరమపురుషుఁడు గూడ యగునుజుమీ-కావున వానిని చింతించుట వాని నేత్రాదిసౌందర్యమునుబట్టి యత్యంతభోగ్యమును వానిపరమ పురుషత్వమునుబట్టి ఆముష్మికసామ్రాజ్యప్రదమును అగు నని భావము.

మ. లలితాంభోరుహనేత్రు గోపరమణీలావణ్యపాత్రున్ సము
జ్జ్వలపౌరందరనీలగాత్రుఁ గబరాంచత్పింఛలీలున్ విని
శ్చలవేదాంతలతాలవాలు మురళీసంగీతలోలున్ దయా
నిలయున్ సమ్మతి మీఱఁ గోరి మనమా నిత్యంబు సేవింపుమా!

తా. ఓ మనసా! తెల్లవాఱునప్పటితమ్మి రేకులవంటి కన్నులు గలిగి, సిగయందుఁ జెరివిన నెమిలిపురిచే సొగసు గులుకుచు, ఇంద్రనీలమణివంటి నల్లనికాంతి గలిగి, గోపస్త్రీలభాగ్యమై, సమస్తవేదములకును మూలమై యొప్పు శ్రీకృష్ణుని మచ్చిక చేసికొనుమా.

అవ. వేణువును సంబోధించి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అయి మురళి ముకున్దస్మేరవక్త్రారవిన్ద
శ్వసనమధురసజ్ఞే! త్వాం ప్రణమ్యాద్య యాచే।
అధరమణిసమీపం ప్రాప్తవత్యాం భవత్యాం
కథయ రహసి కర్ణే మద్దశాం నన్దసూనోః॥ 11

టీ. ముకున...రసజ్ఞే-ముకున్ద=శ్రీకృష్ణమూర్తియొక్క, స్మేర=నవ్వుతోఁ గూడిన, వక్త్ర+అరవిన్ద=మోముదామరయొక్క-తామరవంటి మొగముయొక్క, శ్వసన=ఊర్పుఅనెడి, మధు=తేనియయొక్క, రసజ్ఞే=రసమును దెలిసినదైన, అయిమురళి=ఓ వేణునాళమా! త్వాం=నిన్నుఁగూర్చి, అద్య=ఇప్పుడు,ప్రణమ్య=నమస్కరించి,యాచే=(ఒకటి) యాచించుచున్నాను. అది యేమనఁగా:— అధరమణిసమీపం- అధరమణి=మణివంటిపెదవియొక్క, సమీపం=దగ్గఱను, భవత్యాం=నీవు, ప్రాప్తవత్యాంసత్యాం=పొందినదానవు అగుచుండఁగా-అధరముపొంత నున్నప్పు డనుట, నన్దసూనోః=శ్రీకృష్ణమూర్తియొక్క,కర్ణే=చెవియందు, రహసి=ఏకాంతమున,మత్ దశాం=నాయవస్థను, కథయ=చెప్పుమా; ఊఁదునప్పుడు కృష్ణుఁడు ముఖవాయువుచేఁ బూరించుటచే మురళి అతని శ్వసనమధువుయొక్క రసము నెఱింగినదిగాఁ జెప్పఁబడియె. నేనెంత చెప్పుకొన్నను నాదుర్దశ కృష్ణునికిఁ దెలియుటలేదు. నీవు అతనిశ్వసనమధువు ననుభవించెడి కృతార్థమవు. కాఁబట్టి కృష్ణుఁడు నిన్ను పెదవిని మోపునపుడు ఆ పెదవికి దాపున నున్న చెవిలో నాదుర్దశను జెప్పుమనుచున్నాఁడు.

చ. హరియధరాంతికస్థలవిగ్రహరాగముననస్ స్మితపూర్ణ వక్త్రతా
మరసనమీరసీధురసమాధురిఁ జెందిననిన్ను వేఁడెద
న్మురళిరో నందసూను మది క్రమ్మఁగాఁ జెవిదండ నుండి యె
వ్వారు వినకుండ నాదు వలవంత సమస్తముఁ దెల్పు మ్రొక్కెదన్.

తా. ఓ మురళీ! నీవు కృష్ణునినగుమొగమందలియూర్పుల తేనియను ఆనుచుంటికృతార్థమవు. కాఁబట్టి నీకు మ్రొక్కి యొకటి యాచించుచున్నాను. అది యేమికాదు. నీవు కృష్ణునికెమ్మోవిపొంత నున్నప్పుడు దాపుననున్న యతనిచెవిలో నాదుర్దశను రహస్యముగాఁ జెప్పుమా.

శ్లో॥ *సజలజలదనీలం వల్లవీకేళిలోలం
శ్రితసురతరుమూలం విద్యుదుల్లాసిచేలమ్।
సురరిపుకులకాలం సన్మనోబిమ్బలీలం
నతసురమునిజాలం నౌమి గోపాలబాలమ్॥ 12

* ఈశ్లోకమందలియర్థము, సనత్కుమారసంహితయందు, 'ధ్యాయే త్కల్పద్రుమాధస్తా న్మణిపీఠాసనం శుభమ్।కృష్ణం పీతామ్బరధరమ్ శఙ్ఖచక్రకరామ్బుజం। పిఞ్ఛ

టీ. సజ...నీలం_సజల=జలముతోఁ గూడిన, జలద=మేఘమువలె,నీలం=నల్లనైన వాఁడును, వల్ల...లోలమ్-వల్లవీ=గోప స్త్రీలతోడి, కేళి=సురతసల్లాపాదులందు, లోలమ్=ఆసక్తుఁడైనవాఁడును, శ్రిత...మూలమ్-శ్రిత=ఆశ్రయింపఁబడిన,సురతరు=కల్పవృక్షముయొక్క,మూలం=మొదలు గలవాఁడును-కల్పవృక్షమూలమును ఆశ్రయించినవాఁడనుట, విద్యు...చేలం-విద్యుత్=మెఱుపువలె, ఉల్లాసి = ప్రకాశించుచున్న, చేలం=వస్త్రము గలవాఁడును, మెఱుపువలె తళుతళు క్కని మెఱయు పీతాంబరము గలవాఁడనుట, సుర...కాలమ్-సురరిపు = రాక్షసులయొక్క, కుల = వంశములకు, కాలమ్=యముఁడైనవాఁడును - రాక్షసులను వంశములనే నాశము సేయువాఁ డనుట, సన్మ...లీలం_సత్ = సజ్జనులయొక్క, మనః=మనస్సులందు, బిమ్బ=బింబరూపముగా నుండు, లీలమ్=విలాసము గలవాఁడును-సత్పురుషులహృదయములందు ప్రతిఫలించువాఁడనుట, నత...జాలమ్_నత=నమస్కరించిన, సుర=దేవతలయొక్కయు, ముని=ఋషుల యొక్కయు, జాలమ్=సమూహము గలవాఁడును, అగు, గోపాలబాలమ్=గొల్లపిల్లవాఁడైన శ్రీకృష్ణుని, నౌమి=నమస్కరించుచున్నాను.

మ. సజలాంభోధరజాలనీలు విలసత్సౌదామినీచేలునిన్
  వ్రజభామానవకేళిలోలుని సుపర్వద్వేషకృత్కాలునిన్
  ద్విజరాణ్మానసబింబలీలుని శ్రితాశ్వద్థ్యద్రుమూవాలుని
  న్భజియింతున్ మది గోపబాలు నతనాకనాదేవతాజాలునిన్. 12

తా. నీటితోఁగూడినమబ్బువలె నల్లనై, గొల్లచెలువలుతోడి సురతసల్లాపాదులం దగిలి, మెఱుపువలె మెఱయుచున్న వలువ గట్టి, కల్పవృక్షమునూల నిలిచి, రాక్షసుల నిర్మూలము సేయుచును, సజ్జనులహృదయములఁ బ్రతిఫలించుచును, దేవతలునుమునులును గొలువఁగాఁ జెలువొందు గొల్లపిల్లవానిని చిన్నికృష్ణుని నుతించుచున్నాను.

శ్లో॥ అధరబిమ్బవిడమ్బితవిద్రుమమ్, మధురవేణునినాదవినోదినమ్ ।
  కమలకోమలకమ్రముఖామ్బుజం,కమపి గోపకుమారముపాస్మహే ॥

టీ. అధరబిమ్బ=దొండపండువంటిపెదవిచేత, విడమ్బిత=అనుకరింపఁబడిన, విద్రుమమ్=పగడముగలవాఁడును_పగడమును అనుకరించునట్టి దొండపండువంటియొప్పని పెదవి గలవాఁడనుట, మధుర...నోదినమ్-మధుర=ఇంపైన, వేణు=పిల్లఁగ్రోవియొక్క, నినాద=ధ్వనిచేత, వినోదినమ్ = క్రీడించుచున్నవాఁడును-ఊఁదుచున్నవాఁ డనుట,

మానసం సుధామయైశ్చ రైరావణకరాప్రతైః-శక్రేణ శాస్త్రదర్శనేన సన్నుతం తపసాత్మనా। స్తూయమానం సురగణైః పుష్పవృష్టికరైరివి॥ సేవ్యమానంచ మునిభి స్సిద్ధసాధ్యైర్మహోరగైః అని గోపాలకృష్ణద్వాదశాక్షరీమంత్రధ్యాన మని చెప్పంబడి యున్నది.

కమల...బుజం-కమల=తామరవలె, కోమల=మృదువైనదియు, కమ్ర=సుందరమైనదియు, అగు, ముఖ+అంబుజమ్=మోముందామరగలవాఁడును, కమపి=ఇట్టట్టనిచెప్పనలవిగానివాఁడును, అగు, గోపకుమారకమ్=గొల్లచిన్నవానిని-శ్రీకృష్ణుని, ఉపాస్మహే=ఉపాసించుచున్నాము. పగడమువంటిమోవియు దానిపై మోపినపిల్లనగ్రోవి తీయఁదరవళియు, ఈరెంటిచే సొగసు గులుకుతామరపంటిమొగమును గలుగుటచే అత్యంతసుందరుఁడైనాఁడని యాశయము.

మ. మురళీనాదమధూళికాకలితసమ్మోహ్యాదున్ సుధాసారమే
దురబింబాధరధూతవిద్రుమవినోదున్ రాధికాంఘ్రిద్వయీ
వరలాక్షాలసమానఘాలతలు శ్రీవత్సాంకవక్షఃస్థలున్
సరసీజాతమనోహరాననుఁ మదిం జక్రాయుధుం గొల్చెదన్. 13

తా. పగడమును దొండపండును బోలినమోవి గలవాఁడును, పిల్లఁగ్రోవితీయనిరవళిచే ఉబుసుపుచ్చుచున్నవాఁడును, తామరవలె మృదువై సొగసైనమొగముగలవాఁడును, ఇట్టట్టని చెప్ప నలవిగానివాఁడును, అగు గొల్లపిల్లవానిని శ్రీకృష్ణుని ఉపాసించుచున్నాను.

అవ. వేణుగానవైఖరిని వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ అధరే వినివేశ్య వంశనాళం, వివరా ణ్యస్య సలీల మఙ్గులీభిః ।
ముహురన్తరయన్ముహుర్వివృణ్వ, న్మధురంగాయతిమాధవో వనాన్తే॥

టీ. మాధవః=శ్రీకృష్ణుఁడు, అధరే=మోవియందు, వంశనాళమ్=పిల్లఁగ్రోవిని, నివేశ్య=ఉంచి, అస్య=ఈపిల్లఁగ్రోవియొక్క, వివరాణి=రంధ్రములను, సలీలం=విలాసముతోఁ గూడునట్లుగా, ముహుః=పలుమాఱు, అఙ్గులీభిః=వ్రేళ్ళచేత, అన్తరయన్=కప్పుచును, ముహుః=పలుమాఱు, వివృణ్వన్=విప్పుచును, వనాన్తే-వన+అన్తే=రమ్యమైనబృందావనమందు-ఇట అన్తశబ్దము రమ్యవాచకము, మధురమ్=ఇంపుగా, గాయతి=గానము సేయుచున్నాఁడు.

ఉ. నెమ్మది యామునాంతరవనిన్ వసియించుచుఁ గావిమోవి నం
దమ్ముగ వంశిఁ గీల్కొలిపి తద్వివరమ్ముల నంగుళీతతిం
గ్రమ్ముచుఁ జిమ్ముచున్ శ్రుతిసుఖమ్ముగ గానముఁ దానమానముల్
గుమ్మని మ్రోయఁజేయు రసికుం గనుఁగొంటిరె కంటె కింపుగన్.

తా. మోవియందు పిల్లఁగ్రోవిఁ జొనిపి, దానిసందులను వ్రేళ్ళచేత మాటికిఁగప్పుచును మాటికి విప్పుచును రమణీయమైనబృందావనమున కృష్ణుఁడు మధురముగా గానము చేసెను.

అవ. వెన్న దొంగిలివచ్చినప్పుడు యశోదపట్టుకొనఁగాఁ గృష్ణుఁడు సేయు చిన్నెలను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ *వదనే నవనీతగన్ధవాహం, వచనే తస్కరచాతురీధురీణమ్ ।
నయనే కుహనాశ్రుమాశ్రయేథాః, చరణే కోమలతాణ్డవం కుమారమ్॥

టీ. వదనే=ముఖమునందు, నవ...వాహమ్-నవనీత=వెన్నయొక్క, గన్ధ=పరిమళమును, వాహం=వహించుచున్నవాఁడును, వచనే=వాక్యమందు, తస్క...ధురీణమ్-తస్కర=దొంగయొక్క, చాతురీ=విజ్ఞానముయొక్క, ధురీణమ్=భారము గలవాఁడును-లెక్కలేని దొంగవిజ్ఞానముల నెఱపుమాటలు గలవాఁడనుట, నయనే=కన్నులయందు, కుహనా + అశ్రుమ్=అబద్ధమైనకన్నీరుగలవాఁడును-కన్నులయందు నీరు రాకపోయినను వచ్చినట్లు తోఁచింపుటకై కన్నులు నులుపుకొనుచు తుడుచుకొనుచున్నవాఁడనుట, చరణే=పాదమందు-అడుగులయందు, కోమలతాణ్డవం - కోమల = మృదువైన, తాణ్డవమ్ - నృత్యము గలవాఁడును, అగు, కుమారం=బాలుఁడైనకృష్ణుని, ఆశ్రయేథాః=ఆశ్రయింపుమా-శ్రీకృష్ణుఁడు వెన్నతిని రాఁగా యశోదపట్టుకొని నోరువాసన చూడఁగా వెన్నవాసనగొట్టెననియు, ఏల దొంగిలి తింటివని యదలింపఁగా తినలేదని లేనిపోనివి పెక్కు తక్కరిమాటలు పలుకుచు, కంట నీరురాకుండియువచ్చినట్లుకన్నులు నులుముకొనుచు, బెదరుచే అడుగుల అల్లల్ల త్రొక్కినాఁడనియు ఆశయము.

ఉ. కమ్మనివెన్నవాసన ముఖమ్మున ఘుమ్మని పోదుముట్ట వా
క్యమ్ములఁ జౌర్యనైపుణులు కగన్పడఁ గన్నుఁగవన్ మృషాశ్రువు
ల్గ్రమ్మఁగఁ గోమలాంఘ్రియుగళమ్మునఁ దాండవకేళి యొప్పఁగాఁ
గ్రుమ్మరుగోపబాలకు ముకుందుని నామది నాశ్రయించెదన్. 15

తా. నోటియందు వెన్నవాసనలు పొలయ, మాటలందు దొంగతనపుఁజదురులు మీఱ, కన్నుఁగవయందు కల్లకన్నీరుగాఱ, అడుగుదామర లిటునటునిడుచు నాడునట్టి చిన్నికృష్ణుని ఆశ్రయించెద.

అవ. దావాగ్నిని మ్రింగుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అమునాఖిలగోపగోపనార్థం, యమునారోధసి నన్దనన్దనేన ।
దమునా వనసమ్భవః పపే నః, కిము నాసౌ శరణార్థినాంశరణ్యః॥

* ఈశ్లోకమందలియర్థము, 'హర్తం నవనీతాదిచౌర్యేణ వ్రజయోషితామ్। గోపబాలైర్వృతం కృష్ణం ధ్యాయన్మన్త్రమిమం జపేత్' అని సనత్కుమారసంహితయందు గోపాలకృష్ణైకాదశాక్షరీమంత్రధ్యానముగాఁ జెప్పఁబడి యున్నది.

టీ. అమునా=ఈ యగపడుచున్న, నన్దనస్తేన=నందునికొడుకైన శ్రీకృష్ణుని చేత, యమునారోధసి=యమునాతటమందు, అఖిలగోపగోపనార్థం-అఖిల=సమస్తమైన, గోప=గొల్లవారలయొక్క, గోపనార్థం=రక్షణముకొఱకు, వనసమ్భవః = వనమందు బుట్టిన, దమునాః=అగ్ని, పపే=పానము సేయఁబడియెను. 'అముం నాకిల గోపగోపనార్థమ్' అను పాఠమున, గోపగోపనార్థము, అగ్ని, 'పపేకిల' పానము సేయఁబడి యెనఁగదా యనియర్థము. ఇట కిలశబ్దము లోకవార్తయందు వర్తించుచున్నది. అసౌ= ఇతఁడు-ఈకృష్ణమూర్తి, శరణ+ అర్థినామ్=శరణుఁగోరునట్టివారైన,నః=మాకు,శరణ్యః= రక్షకుఁడు, నకిము=కాఁడా యేమి- అగునే యనుట-దావాగ్ని మ్రింగి గొల్లవారినెల్లఁ గాపాడినవాఁడని లోకులు చెప్పెదరు. ఇట్టి కరుణాళుఁడు శరణుఁజొచ్చినమమ్ముఁ గాపాడకపోవునా యనుట.

శ్రీప్రాసము త్రేభము

యమునాతీరవనాంతసంజనితదావాగ్నిస్ఫూర్చిర్శిఖా
యము నానాజనభీకరం బగుచు డాయన్ వ్రేలు వే కాచు నె
య్యము నాయం బసి దాని నోనెనఁట నిత్యంబున్ హరిన్ గుప్తసం
యము నారాధన సేయు నాకిపు డభీష్టావాప్తి గాకుండునే. 16

తా. కృష్ణుఁడు యమునాతీరమందు మున్ను పుట్టిన దావాగ్నిని మ్రింగి గొల్లవారినందఱిని గాపాడె నని విందుము. అట్టివానిని శరణుసొరఁగా మమ్ముఁ గాపాడకపోవునా? పోవఁడు.

శ్లో॥ జగదాదరణీయజారభావం, జలజాపత్యవచోవిచారగమ్యమ్ ।
తనుతాం తనుతాం శివేతరాణాం, సురనాథోపలసున్దరం మహో నః॥

టీ.-జగ...భావమ్_జగత్=లోకముచేత, ఆదరణీయ=అంగీకరింపఁదగిన, జారభావమ్=జారత్వముగలదియు, జల...గమ్యమ్=జలజ+అపత్య=తామరపువిడ్డయైనవాఁడగు బ్రహ్మయొక్క, వచః=వాక్యములయొక్క-బ్రహ్మముఖమునుండివచ్చిన వేదాంతవాక్యములయొక్క, విచార=విచారముచేత, గమ్యమ్=తెలియఁదగినదియు, సుర...దరం- సురనాథ+ఉపల = ఇంద్రనీలమణివలె, సున్దరమ్ = అందమైనదియు, అగు, మహః= తేజము, నః=మాయొక్క, శివ ఇతరాణామ్=అశుభములయొక్క, తనుతామ్=కృశత్వమును, తనుతామ్=కొనసాగించుఁగాక-అశుభములు కృశించి నశించునట్లు చేయుఁగాక యనుట, జారుఁడైనవాఁడు అశుభములను మాలించునా యనవలదు-జారుఁడైనను వేదాంతవేద్యుఁ డగుపరుఁ డని భావము.

చ. సరసిజసంభవప్రముఖసర్వసుపర్వవచోవిచారగో
చర మగుదివ్యతేజ మనురాగంబు జగంబులు మెచ్చ జారుఁడై

మరకతనూత్నరత్నసుషమం జెలువందఁ గుమారమూర్తియై
పరఁగి దయార్ద్రదృష్టి నశుభంబు లడంచి శుభంబు లీవుతన్. 17

తా. జగంబులను నంగీకరింపఁదగు జారత్వంబుఁ గలదియు వేదాంతవేద్యమైన పరబ్రహ్మమై యింద్రనీలమణివలెఁ జెలువారుచున్న శ్రీకృష్ణాఖ్యతేజము మాయాశుభముల నెల్లఁ దొలఁగించుఁగాక.

శ్లో॥ యా శేఖరే శ్రుతిగిరాం హృది యోగభాజాం
పాదాంబుజే చ సులభా వ్రజసుందరీణామ్ ।
సా కాపి సర్వజగతా మభిరామసీమా
కామాయ నో భవతు గోపకిశోరమూర్తిః ॥ 18

టీ. యా=ఏది-ఏకృష్ణునిమూర్తి, శ్రుతిగిరాం=వేదవాక్యములయొక్క, శేఖరే=శిరస్సునందు-వేదాంతమునందనుట, యోగభాజాం=యోగమును బొందినవారియొక్క-బ్రహ్మనిష్ఠులయొక్క, హృది=హృదయమునందును, వ్రజసుందరీణాం=గోపస్త్రీలయొక్క పాదాంబుజేచ=పాదకమలమునందును, సులభా=సుఖముగా లభింపఁదగినదియో, సర్వజగతామ్=ఎల్లలోకములయొక్క, అభిరామసీమా-అభిరామ=మనోజ్ఞత్వమునయొక్క, సీమా=పాలిమేరయైనదియు-లోకమునందలిసౌందర్యములకెల్ల నెల్లయైనదియనుట, కాపి=ఇట్టిదట్టిదని చెప్పవలనుకానిదియు అగు, సా=ఆ-ప్రసిద్ధమైనట్టి, గోప...మూర్తిః-గోపకిశోర=గొల్లబాలునియొక్క, మూర్తిః=విగ్రహము, నః=మాయొక్క, కామాయ=కోరికకొఱకు-కోరిక లీడేర్చుకొఱకు, భవతు=అగుఁగాక, వేదముల శిరస్సున నుండు పరుఁడు గోపికలపాదములందును ఉన్నాఁడని సౌలభ్యవిశేషము నెఱుఁగునది. వేదశిరస్సును యోగిమనస్సును గోపీపదములును వరుసగాఁ జెప్పుటచేఁ శిరస్సునుండి హృదయమునకును హృదయమునుండి పాదములకును దిగి వాఁడనుసారస్యము ధ్వనితము-వేదాంతములు ప్రతిపాదించు పరబ్రహ్మమును-యోగులు హృదయారవిందమున ధ్యానించు పరమాత్మయును నే గోపికలకడ ఊడిగములు సేయుచున్న యీకృష్ణుఁడని భావము.

ఉ. ఎల్లజగంబులున్ రహి వహించు శుభాస్పదసీమ యోగిహృ
త్ఫుల్లసరోజపాళిఁ బదకముల్ దులకింపఁ బ్రియావధూటికా
హల్లకసీమలం బొలుచునద్భుతగోపకిశోరమూర్తి యీ
వల్లవకామినీచరణవారిజసేవకు లెస్సఁ జిక్కెఁగా. 18

తా. వేదాంతములందు బ్రతిపాద్యమై, యోగిజనులు హృదయములందు ధ్యానించు వస్తువై, గోపస్త్రీలకడ అనువర్తించుచుండునదియునై లోకంబులందలిచక్కఁదనంబున కెల్ల నెల్లయై యున్న చిన్నికృష్ణునిమూర్తి మాకోరికల నొడఁగూర్చుఁగాత

శ్లో॥ అత్యన్తబాల మతసీకుసుమప్రకాశం
దిగ్వాససం కనకభూషణభూషితాఙ్గమ్ ।
విస్రస్తకేశ మరుణాధర మాయతాక్షం
కృష్ణం నమామి మనసా వసుదేవసూనుమ్ ॥ + 19

టీ. అత్యన్తబాలమ్=మిక్కిలి బాలుఁడైనవాఁడును, అత...కాశమ్_అతసీకుసుమ=నల్ల అగిసె పువ్వులయొక్క, ప్రకాశమ్ = ప్రకాశమువంటిప్రకాశము గలవాఁడును, దిక్ + వాససమ్=దిక్కులే వస్త్రములుగాఁగలవాఁడును-దిసమొలవాఁడనుట, కనక...ాఙ్గమ్_కనకభూషణ = బంగారుమయమైన సొమ్ములచేత, భూషిత = అలంకరింపఁబడిన, అఙ్గమ్=అవయవములు గలవాఁడును, విస్రస్తకేశమ్_విస్రస్త = జాఱిన - ముడివేయఁబడని కేశం=వెండ్రుకలుగలవాఁడును-అత్యంతబాల్యముగలవాఁడుగాన ముడికందనివెండ్రుకలు గలవాఁడనుట, అరుణ + అధరమ్=ఎఱ్ఱనిపెదవిగలవాఁడును, ఆయత + అక్షమ్=విశాలములైన కన్నులుగలవాఁడును, కృష్ణం=నల్లనివాఁడును, అగు, వసుదేవసూనుమ్=వసుదేవుని కుమారుఁడగు కృష్ణునిఁగూర్చి, మనసా=మనస్సుచేత, నమామి=నమస్కరించుచున్నాను.

ఉ. కోమలసుందరాకృతియు ♦ గొప్పకనుంగవ కెంపుమోవియు
న్మోమున వ్రేలుముంగురులు ♦ నూత్నవిభూషణభూషితాంగము
న్దామదిగంబరాకృతియుఁ ♦ దాల్చినవెన్నునిఁ జిన్నిబాలునిన్
శ్రీ మెఱయన్ భజింతు నతసీసుమభాసుని నందసూనునిన్. 19

తా. మిక్కిలి బాల్యము కలిగి, నల్లగిసెపూవులకాంతిచే వెలుఁగుచు, దిగంబరుఁడై, బంగరుసొమ్ములు మేనందాల్చి, ముడికందని కురులతోను, ఎఱ్ఱనిపెదవితోను, విశాలమైనకన్నులతోను, చెన్నారుచున్న చిన్నికృష్ణునికి మనస్సునందు మ్రొక్కుచున్నాను.

శ్లో॥ *హస్తాఙ్ఘ్రినిక్వణితకఙ్కణకిఙ్కిణీకం
మధ్యేనితమ్బ మవలమ్బితహేమసూత్రమ్ ।
ముక్తాకలాపముకుళీకృతకాకపక్షం
వన్దామహే వ్రజచరం వసుదేవభాగ్యమ్ ॥ 20

టీ. హస్తా...ణీకమ్ హస్తఅఙ్ఘ్రి=కాలుచేతులందు, నిక్వణిత=మ్రోయింపఁబడుచున్న, కఙ్కణ=కడియములయొక్క-అందియలయొక్క, కిఙ్కిణీకం=చిఱుగంటలుగలవాఁడును, మధ్యే నితమ్బమ్=పిఱుఁదు నడుమ, అవ...సూత్రమ్_అవలమ్బిత = వ్రేలఁ

* ఈశ్లోకము నరము ‘పఞ్చహాయన మీశానం ధావమానం వ్రజాఙ్గణే ! కిఙ్కిణీనూపురగ్రీవా కర్ణభూషోజ్జ్వలం స్మరేత్’ అని శ్రీకృష్ణాష్టాక్షరీధ్యానముగా సనత్కుమారసంహితయందు చెప్పఁబడియున్నది.

బడిన, హేమసూత్రమ్=బంగరు మొలనూలుగలవాఁడును, ముక్తా... పక్షమ్-ముక్తాకలాప=ముత్తెపురావిరేక చేత, మండలీకృత=మోడ్పఁబడిన, కాకపక్షమ్=చిప్పకూఁకటికలవాఁడును, చిప్పకూఁకటిని రావిరేకచే మోడ్చినవాఁడనుట, వ్రజచరం-వ్రజ = వ్రేపల్లెయందు, చరం=సంచరించువాఁడును, అగు, వసుదేవభాగ్యమ్=వసుదేవునియొక్క భాగ్యమును, వసుదేవుని భాగ్యస్వరూపుండైన శ్రీకృష్ణుఁగూర్చి, పన్నామహే=నమస్కరించుచున్నారము. కాలుసేతులందలిగజ్జెలును పిఱుఁదులందు వ్రేలాడు మొలనూలును కూఁకటియందుఁ జెరివినముత్తావళియు, బాల్యమందలి యలంకారము లని తెలియునది.

చ. సరసనితంబమధ్యమున జాఱెడు పెన్మొలనూలుఁ చిన్నముం
గురులు దళంబుగాఁ గమిచి కూర్చినముత్తెపురావిరేకయుం
గరచరణాగ్రనిక్వణితకంకణకింకిణు లొప్ప నందమం
దిరమున సంచరించువసుదేవతపఃఫలమున్ భజించెదన్. 20

తా. కరచరణములందు మ్రోయుచున్నకంకణములందలి చిఱుగజ్జెలును, పిఱుఁదుల నడుమ వ్రేలాడుచున్న బంగరుమొలనూలును, జిప్పకూఁకటిని మోడ్చి చెరివిన ముత్తెపు రావిరేక గలిగి, వసుదేవునిభాగ్యస్వరూపమో యన నొప్పుచిన్ని బాలకృష్ణునికి నమస్కరించుచున్నాము.

శ్లో॥ బృన్దావనద్రుమతలేషు గవాం గణేషు
వేదావసానసమయేషు చ దృశ్యతే యత్ ।
తద్వేణునాదనపరం శిఖిపిఞ్ఛచూడం
బ్రహ్మస్మరామి కమలేక్షణ మభ్రనీలమ్॥ 21

టీ. బృన్దావన=బృందావనమందలి, ద్రుమ=వృక్షములయొక్క, తలేషు=ప్రదేశములందును, గవాం=గోవులయొక్క, గణేషు=సమూహములందును, వేదా...సమయేషు=వేద+అవసాన=వేదాంతములయొక్క, సమయేషు=సిద్ధాంతములందును, యత్=ఏది-ఏబ్రహ్మము,దృశ్యతే=చూడఁబడుచున్నదియో,తత్=ఆ-ప్రసిద్ధమైనదియు,వేణు...పరం వేణు=పిల్లఁగ్రోవియొక్క, నాదన=వాయించుటయందు, పరం=ఆసక్తమయినదియు, శిఖి...చూడం-శిఖిపిఞ్ఛ=నెమిలిపురి, చూడం=శిరోభూషణముగాఁగలదియు, కమల+ఈక్షణమ్-కమల=తామరరేకులవంటి, ఈక్షణమ్=నేత్రములుగలదియు, అభ్రనీలం-అభ్ర=మేఘమువలె, నీలమ్=నల్లనైనదియు, అగు, బ్రహ్మ=కృష్ణాఖ్యపరబ్రహ్మమును, స్మరామి=స్మరించుచున్నాను. బృందావనద్రుమతలములందును గోగణములందును వేణునాదనపరుఁడయ్యు, శిఖిపింఛచూడుఁడయ్యుఁ గనఁబడుచున్నాఁడు; వేదావసానసమయము లందు బ్రహ్మమయ్యుఁ గనఁబడుచున్నాఁ డని పరత్వసౌలభ్యములపరిపాటి యొఱుంగునది.

శా. బృందారణ్యతరుప్రదేశముల గోబృందాంగణక్షోణులన్
ఛందోవీథులఁ గానిపించుపరమస్వచ్ఛంబు మాతేజ మా
నందబ్రహ్మము పంచనీయము రళీనాదానుమోదంబు నా
యందున్ నిల్పెదఁ బింఛచూడము పయోజాక్షంబు మేఘాభమున్.

తా. బృందావనమండలి చెట్లనీడలను, గోసమూహములందును, వేదాంతసమయములందును గానఁబడునదియు, వేణువు నూఁదుటయందు దాసక్తి గలదియు, నెమిలిపురి తలయందు చేర్చినదియు, తామరరేకులవంటి కన్నులు గలదియు, మబ్బువలె నల్లనైనదియు నగు శ్రీకృష్ణాఖ్యపరబ్రహ్మమును స్మరించుచున్నాను.

అవ:—మరణసమయమునఁ దనకుఁ బ్రత్యక్షము కాఁగోరినమూర్తి విశేషమును వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ వ్యత్యస్తపాద మవతంసితబర్హిబర్హం
సాచీకృతాననని వేశితవేణురన్ధ్రమ్ ।
తేజః పరం పరమకారుణికం పురస్తాత్
ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్॥ 22

టీ. వ్యత్య...పాదం.వ్యత్యస్త=మార్పఁబడిన కుడిది యెడమప్రక్కగాను ఎడమది కుడిప్రక్కగాను బెట్టుకొనఁబడిన యనుట, పాదం = చరణములు గలదియు, అవ...ర్హం-అవతంసిత=శిరోభూషణముగఁ జేయఁబడిన, బర్హిబర్హమ్ = నెమిలిపురి గలదియు, సాచీ...రన్ధ్రమ్-సాచీకృత=ఓరగాఁ జేయఁబడిన, ఆనన = మోగమునందు, నివేశిత = చొనుపఁబడిన, వేణు=పిల్లఁగ్రోవియొక్క, రన్ధ్రమ్=బిలము గలదియు, పరమకారుణికమ్=మిక్కిలి దయాళువైనదియు, పరమ్=ఉత్కృష్టమైనదియు, అగు, తేజః=తేజము, మమ=నాయొక్క ప్రాణ...మయే-ప్రాణప్రయాణ = ప్రాణముల పోకయొక్క-మరణముయొక్క, సమయే=కాలమందు, పురస్తాత్=ఎదుట, సన్నిధత్తామ్ = సన్నిధిసేయుఁగాక-సాక్షాత్కరించుఁగాక యనుట. పాదములను మార్పడఁబెట్టుకొని, నెమిలిపురిని జెరువుకొని, మొగము నోరగావంచి వేణువు నూఁదునట్టి శ్రీకృష్ణునియాకారవైఖరి కవికి మిక్కిలి మనోహరమును బ్రియతమమునుగా నుండుటచే మరణకాలమునం దట్టి మూర్తియే పొడచూపవలయు నని కోరినాఁడు.

చ. మొగ మొకయోర సేసికొని కమ్మోవిని వేణువుఁ జేర్చి తిర్యగం
ఘ్రిగ విలసిల్ల మాళితటిఁ గేకికలాపకలాప మూంచి కే
విగఁ గనుపట్టు సౌఖ్యపదకవిం గను వేళ మదీయసన్నిధిన్
నిగమనివాస తేజము విశనిర్మలసత్కరుణాధురీణమై. 22

తా. నడిమెడమల ఎడమనడిపాదంబు లుంచుకొని, నెమలిపురిని జెరువుకొని, మొగమును గోంతయోరగా వంచి వేణువు నూదుచు, పరమకరుణానిధి యైనశ్రీకృష్ణాఖ్యతేజము మహాకాలమందు నాముంగటఁ బొడతెంచుఁగాత.

అవ. యశోద కృష్ణునిఁ గవ్వపుఁద్రాటితోఁ గట్టుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఘోషప్రఘోషశమనాయ మథోగుణేన
మధ్యే బబన్ధ జననీ నవనీతచోరమ్।
తద్బన్ధనం త్రిజగతా ముదరాశ్రయాణా
మాక్రోశకారణ మహో నితరాం బభూవ॥ 23

టీ. ఘోష...శమనాయ-ఘోష=గొల్లపల్లెయొక్క, ప్రఘోష=ఆక్రోశముయొక్క, శమనాయ=శాంతికొఱకు, జననీ=తల్లి-యశోద, నవనీతచోరమ్=వెన్నదొంగయైనకృష్ణుని, మధ్యే=నడుమునందు, మథ + గుణేన=కవ్వపుత్రాటిచేత, బబన్ధ=కట్టెను, తత్ + బన్ధనమ్=ఆకట్టుట, ఉదర + ఆశ్రయాణామ్-ఉదర=శ్రీకృష్ణునికడుపును, ఆశ్రయాణాం=ఆశ్రయముగాఁగల-శ్రీకృష్ణునికడుపులోనున్న, త్రిజగతాం=ముల్లోకములకు, ఆక్రోశ కారణమ్-ఆక్రోశ=అత్యంతఘోషమునకు, కారణమ్=హేతువు, నితరాం=మిక్కిలియు, బభూవ=అయ్యెను - వ్రేపల్లెయందుఁ దిరుగునట్టిపిల్లవాఁడు ముల్లోకములను గడుపులోనఁ దాల్చియున్న పరమపురుషుఁడు. ఇట్టివాఁడని తెలియక తల్లి వానినడుమున దారము గట్టఁగా లోపలిమూఁడులోకములకును గాసి గలిగెనని యర్థము. గొల్లపల్లెకు బాధ తీర్పఁబోయి ముల్లోకములకు బాధ గలిగించె ననుట.

శా. పాలున్ వెన్నయు ముచ్చిలించె నని గోపాలాంగనల్ గుయ్యిడన్
జాలిం జెందుచుఁ దల్లి మట్టువఱుపం బ్రజర్చించి యాబాలకున్
ఱోలం గవ్వపుఁద్రాటఁ గట్టె నట యాక్రోశించెఁ దత్కుక్షిలోఁ
ద్రైలోక్యంబును దన్మహామహిమ ముగ్ధల్ గాంచఁగా నేర్తురే. 23

తా. యశోద కృష్ణుఁడు గొల్లపల్లెయందు వెన్న దొంగిలించుటకు అందలివారు మొఱపెట్టుకొనఁగా నతనిని కవ్వపుఁద్రాటిచే నడుమునఁ జుట్టి కట్టివేచెను. ఆకట్టుటచేత ఆతనికడుపులో నున్న ముల్లోకములును గాసినొంది మొఱపెట్టిన వయ్యె.

అవ. తాను శైవుండయ్యును గృష్ణునియందు భక్తి గలుగుటకుఁ గారణమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
పఞ్చాక్షరీజపపరా నితరాం తథాపి।

చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్॥ 24

టీ. వయం=మేము, శైవాః=శివసంబంధులము, నితరాం=మిక్కిలి యు, పఞ్చా... పరాః-పఞ్చాక్షరీ=పంచాక్షరీ మంత్రముయొక్క, జప = జపమునందు, పరాః=ఆసక్తుల ము_వీరశైవుల మనుట, తథాపి=అయినప్పటికిని, మదీయం=నాదైన, చేతః=చిత్తము, అత...భాసం- అతసీకుసుమ=నూనెయగిసెవుప్పుయొక్క, అవభాసమ్ = కాంతివంటి కాంతిగలవాఁడును, స్మేరఆననమ్-స్మేర=నవ్వునట్టి, ఆననమ్=మొగముగలవాఁడును, అగు, గోప...రమ్-గోపవధూ=గొల్లపడఁతి యగు యశోదయొక్క, కిశోరమ్=శిశువును-కృష్ణుని, నితరాం=మిక్కిలియు, స్మరతి=స్మరించుచున్నది. మేము శైవులమే. అయినను నల్లని కాంతియు నగుమొగమును గలచిన్నికృష్ణుఁడు మామనస్సునుహరించుచున్నాఁడు. కావున వానినే అది మిక్కిలి స్మరించుచున్నది యనుట. పంచాక్షరీజపపరులగు శైవులెక్కడ! ఒక గొల్లపిల్లవానిని స్మరించుట యెక్కడ! అట్టిమమ్ముఁ గూడ ఆపిల్లవాని నల్లనికాంతియు నవ్వుమొగమును ఆకర్షించునంతమనోహరము లగు నని యాశయము.

మ. అనుమానింపఁగ నేమి శైవులము మే ♦ మత్యంతపంచాక్షరీ
మనుపారీణుల మౌదు మైన నెపుడున్ ♦ మందస్మితభ్రాజితా
ననచంద్రుం గపిలాతసీసుమసమాకనద్యోతని స్తంద్రుఁ గృ
ష్ణుని గోపాలకబాలు నెంచనె తలంచుం జిత్త మానక్తితోన్. 24

తా. మేము పంచాక్షరీమంత్రమును జపించుటయందు ఆసక్తి గల శైవులము. అయినను మామనస్సు నల్లనిసెవుప్పులకాంతి గలిగి నవ్వుమొగంబుతోఁ దులకించు యశోదచిన్నిబాలుని శ్రీకృష్ణునే మిక్కిలి చింతించుచున్నది.

అవ. రాధకును కృష్ణునకుఁ బరస్పరము గలమోహవిశేషమును వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ రాధా పునాతు జగ దచ్యుతద త్తచిత్తా
మన్థాన మాకలయతీ దధిరిక్తపాత్రే।
తస్యాః స్తనస్తబకచఞ్చలలోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరున్ధన్॥ 25

టీ. అచ్యు...చిత్తా-అచ్యుత=శ్రీకృష్ణునియందు, దత్త=ఉంపఁబడిన, చిత్తా=సతి =మనస్సుగలదియగుచు, దధి...పాత్రే-దధి=పెరుఁగుచేతి, రిక్త=శూన్యమైన-పెరుఁగు లేక-ఉత్తదిగానున్నయనుట, పాత్రే=కుండయందు, మన్థానం=కవ్వమును,ఆకలయతి= త్రిప్పుచున్నది, అగు, రాధా=రాధ యనెడి గోపిక, జగత్=జగమును, పునాతు=పవి

త్రము సేయుఁగాక-రాధ కృష్ణునియందే మనస్సంతయు మిక్కిలి లీనమైయుండుటచేత పెరుఁగులేని యుత్తకుండను గొని పెరుఁగు అందున్నదని తలఁచి కవ్వముతోఁ జిలికెనని యర్థము. తస్యాః=దానియొక్క-అరాధయొక్క, స్తన...దృష్టిః- స్తన స్తబక=పూగుత్తుల వంటిపాలిండ్లయందును, చఞ్చల=మాటికి వర్తించుచుండునదియు, లోల=ఆసక్తిగలదియు, అగు, దృష్టిః=చూపు గలవాఁడు అగుచు పూగుత్తులవలె సొగసు గలుగు రాధ చన్నుఁగవపయి మాటిమాటికి మిక్కిలి యాసక్తితోఁ జూపుల్ నిగుడ్చుచున్నవాఁడై యనుట, దోహనధియా=పిదుకుటయందలి బుద్ధిచేత-పిదుకుతలంపుతో ననుట, వృషభం=ఎద్దును, నిరుంధన్ = కట్టుచున్నవాఁడైన, దేవః అపి=దేవుఁడైన శ్రీకృష్ణుఁడును, జగత్ = లోకమును, పునాతు = పవిత్రము సేయుఁగాక - శ్రీకృష్ణుఁడు రాధ చన్నుఁగవపయి చూపుల్ నిగిడ్చియుండుటచే ఎద్దును ఆవుగా తలఁచి కట్టి పాలుపిదికె ననుట-రాధ పెరుఁగులేని కుండను గవ్వముతోఁ జిలుకుటయు, కృష్ణుఁడు ఎద్దును ఆవుగాఁగొని పాలు పిదుకుటయు, నొండొరులయందలి మోహాతిశయముచే నైనపారవశ్యమువలనఁ గలిగిన వని తెలియునది.

చ. భ్రమసి హరిం దలంచి దధిభాండమునందు వసించు రిక్తభాం
డము మథియించు రాధయు సుస్తనంబునఁ దత్కుచకుంభికుంభవి
భ్రమముఁ దలంచి యొక్కవృషభంబును దోహనబుద్ధిఁ గట్టిన
క్కమలదళాక్షుఁడుం గరుణఁ గాతురు గాత జగద్వితానమున్. 25

తా. కృష్ణునియందు మనస్సు నిలిపి యాపారవశ్యముచేఁ బెరుఁగు లేనివట్టికుండను గవ్వముతోఁ జిలుకుచున్న రాధయు, దాని చన్నుగుత్తులయందుఁ జూపుల్ నిలిపి యాపరవశత్వముచే ఎద్దును గొని పాలు పిండఁ దలంచుచున్న కృష్ణదేవుండును లోకమును గాపాడుదురు గాక.

శ్లో॥ గోధూళిధూసరితకోమలకున్తలాగ్రం
గోవర్ధనోద్ధరణకేళికృతప్రయాసమ్ ।
గోపీజనస్య కుచకుఙ్కుమముద్రితాఙ్గం
గోవిన్దమిన్దువదనం శరణం భజామః ॥ 26

టీ. గో...లాగ్రమ్-గోధూళిధూసరిత=గోవులసమర్దమువలనఁ బుట్టినదుమ్ముచేత బూడిదవన్నెగలదిగాఁ జేయఁబడినవియు, కోమల=మృదువులైనవియు, అగు, కున్తల=కురులయొక్క, అగ్రం=కొనలుగలవాఁడును, గోవ...ప్రయాసమ్-గోవర్ధన=గోవర్ధనపర్వతమును, ఉద్ధరణ=ఎత్తుటయనెడి, కేళి=క్రీడయందు, కృత = చేయఁబడిన, ప్రయాసమ్=ప్రయాసముగలవాఁడును-కొండనెత్తుటకై ప్రయాసము పుచ్చుకొన్నవాఁడనుట - ఆయెత్తుట చూచువారికిఁ బ్రయాసముగాఁ దోఁచినను గృష్ణునికి అతిసులభముగానుండుటచే,

'కేళి' యన్నాఁడు, గోపీ...తాఙ్గమ్-గోపీజనస్య=గోపికాసమూహముయొక్క - కుచ=చన్నులయందలి, కుఙ్కుమ=కుంకుమచేత, ముద్రిత=చిహ్నితములైన, అఙ్గం = అవయవములు గలవాఁడును-గోపికలు బిగ్గఁ గౌఁగిలించుకొనఁగా వారిచన్నులయందలికుంకుమ పూఁతలు తనమేన నంటుకొన్నవాఁడనుట, ఇన్దువదనమ్-ఇన్దు=చంద్రునివంటి, వదనమ్=మొగముగలవాఁడును, శరణం=రక్షకుఁడును, అగు, గోవిన్దమ్=శ్రీకృష్ణుని, భజామః = సేవించుచున్నాము. 'గోధూళి' యనుటచే గోవులును 'గోపీజనస్య' అనుటచే గోపికలును గ్రమ్ముకొనియుండఁగా ఇంద్రుఁడు శిలావర్షము గురియుటయు, అప్పుడు 'గోవర్ధన' అనుటచే గోవర్ధనమెత్తుటయు, అందులకు సంతుష్టలై గోపికలు 'కుచకుఙ్కుమ' అనుటచేఁ గౌఁగిలించుటయు, ఆసొంపుచే 'ఇన్దువదనమ్' అని నెమ్మొగము ప్రకాశించుటయు ఈశ్లోకంబునఁ దెలియునది. గోగోపికాజనములకు శరణుఁడై గోవర్ధనము నెత్తినవాఁడు గావున మాకును 'శరణమ్' శరణుఁ డైనాఁ డని భావము.

ఉ. గోపదధూళిధూసరితకోమలకుంతలు గోపికాకుచ
స్థాపితకుంకుమాంకితవిశాలభుజాంతరుఁ బాణిపంకజా
రోపితభూమిభృద్వరనిరూఢసుఖాన్వదనందగోకులున్
గోపకుమారు నిందువదనున్ మదనుగ్రహవాంఛఁ గొల్చెదన్. 26

తా. గోవులగుంపువలని దుమ్ముచే కురులకొనలు బూడిదవన్నెగలవి కాఁగా, గోవర్ధనపర్వతమును లీలతో నెత్తిన యలసటతోఁ గూడి, గోపికలు చన్నుఁగవలందలికుంకుమ పూఁతలు తనమేనియం దంటుకొనునట్లు బిగ్గఁ గౌఁగిలించుకొనఁగా, నెమ్మొగంబు చంద్రునివలెఁ బ్రకాశించుచున్న శ్రీకృష్ణునిఁ గొలుచుచున్నాము.

అవ. వరాహావతారవైభవమును వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ యద్రోమరన్ధ్రపరిపూర్తివిధావదక్షా
వారాహజన్మని బభూవు రమీ సముద్రాః ।
తం నామ నాథ మరవిన్దదృశం యశోదా
పాణిద్వయాన్తరజలైః స్నపయాం బభూవ॥ 27

టీ. వారాహజన్మని=వరాహావతారమునందు, అమీ=ఈ, సముద్రాః=సముద్రములు, యత్...ధా-యత్=ఎవ్వనియొక్క, రోమ=వెంట్రుకలయొక్క, రన్ధ్ర=బిలములయొక్క రోమకూపములయొక్క, పరిపూర్తి = పూరించుట యను, విధౌ=కార్యమునందు, అదక్షాః=అసమర్థములు, బభూవుః=అయినవియో, తం=ఆ, అరవిన్దదృశమ్ = తామరవంటి కన్నులు గలవాఁడైన, నాథమ్=ప్రభువగు శ్రీకృష్ణుని, యశోదా=యశోద, పాణి...జ

లైః-పాణిద్వయాః=రెండుచేతులయొక్క-దోయిలియొక్కయనుట, అన్తర = మధ్యమందలి, జలైః=జలములచేత-దోయిటిలో పట్టునంతటినీళ్లచేత, స్నపయాంబభూవనామ = స్నానముచేయించెను గదా-వరాహావతారమందు సప్తసముద్రములును ఎవ్వని రోమకూపములను నిండించజాలక పోయినవో, యట్టి ప్రభుండగు పుండరీకాక్షుని యశోద కృష్ణావతారమందు దోయిటిజలములచేఁ దడిపి స్నానము చేయించెను. ఏమి యాశ్చర్యమని యర్థము. సప్తసముద్రములును రోమకూపములను నిండింపజాలవిపుడు దోయిటిజలములలో తడియునంత సులభుఁ డైనాఁ డని తెలియునది.

ఉ. ఏయధికుంబు క్రోడతవహించిన నాతనిరోమరంధ్రము
న్దోయధు లెల్ల నించుహావర్ణముల్ గన నేరక యుండె నట్టినా
రాయణుఁ డర్భకాకృతిని రాగిలి నందవధూటిదోయిటం
దోయము చల్లఁగాఁ దనిసి తోఁగుచు నుండె ని దేమి చిత్రమో.

తా. వరాహావతారమెత్తినపుడు ఎవ్వనిరోమకూపములను ఈసప్తసముద్రములును బూరింపజాలకపోయినవో ఆపుండరీకాక్షుం డగుప్రభుని కృష్ణావతారమున యశోద దోయిటిజలములచేఁ దడిపి స్నానము చేయించెను. ఇ దేమి యాశ్చర్యము.

అవ. వేదాంతవిదులు వెదకి కానని తత్త్వము సులభముగా దొరకునట్టిచోటును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ పర మిమ ముపదేశ మాద్రియధ్వం
నిగమవనేషు నితాన్తచారఖిన్నాః ।
విచినుత భవనేషు వల్లవీనా
ముపనిషదర్థ ములూఖలే నిబద్ధమ్॥ 28

టీ. నిగమవనేషు-నిగమ=వేదము అనెడి, వనేషు=వనములయందు, నితాం...ఖిన్నాః-నితాన్త=మిక్కిలియు, చార=తిరుగుటచేత, ఖిన్నాః = బడలినవారా-అడవులవలె చిక్కుపలుమ మున్న వేదములందు వెదకివెదకి కోరినవస్తువును దెలియలేక యలసియున్న విద్వాంసులారా యనుట, పరం- మేలైన, ఇమం=ఈ, ఉపదేశమ్ = ఉపదేశమును-మీరు విచారించువస్తువును దెలుపునట్టి యీయుపదేశము ననుట, ఆద్రియధ్వం = ఆదరింపుఁడు-ఆలించివినుఁడనుట - ఆయుపదేశమును జెప్పుచున్నాఁడు - వల్లవీనాం = గోపస్త్రీలయొక్క, భవనేషు=గృహములందు, ఉలూఖలే=ఱోటియందు, నిబద్ధం = కట్టఁబడిన, ఉపనిషత్ + అర్థమ్-ఉపనిషత్=వేదాంతములయొక్క. అర్థం=లక్ష్యమైనలేక-విషయమైనదానిని-శ్రీకృష్ణుని అనుట, విచినుత=వెదకుఁడు గొల్లయిండ్లలో వెదకితిరేని అచట మీరు వేదాంతములందు వెదకి కానరానితత్త్వము కృష్ణరూపమున ఱోటఁ

గట్టఁబడియుండుట కనుఁగొనవచ్చు నవి భావము. వేదాంతములందును దెలిసికొనరాని పరుఁడు గొల్లయిండ్ల జోళ్ళకడ నుండు సులభుఁ డైనాఁ డని యాశయము.

చ. నిగమమహావనాంతములఁ దనే వెదకన్ వలె నఁడు ఖిన్నులై
వగవఁగ నేల యే నొకయుపాయముఁ జెప్పెదఁ బోయి చూడుఁడీ
యగణితవల్లవీమణిగృహాంగణభూమి నులూఖలంబుతోఁ
డ గుణనిబద్ధ మై శ్రుతుల డాఁగినభావము గాన నయ్యెడిన్. 28

తా. వేదంబులనెడి యడవులందుఁ దిరిగితిరిగి వేసరియున్న విద్వాంసులారా! మీరందు వెదకఁ దొరకని వస్తువు దొరకు మేలైనయుపాయము నుపదేశించెద నాలించి వినుఁడు. గొల్లయిల్లాండ్రయిండ్లయందుఁ బోయి వెదకుఁడు. మీరు ఉపనిషత్తులయందు వెదకుచున్నయర్థము కృష్ణరూపమున వారియిండ్లలో రోటికిఁ గట్టఁబడియుండును. మీరును సులభముగాఁ గనుఁగొనవచ్చును.

అవ. శ్రీకృష్ణపూజనస్మరణాదులచే నరకభయంబువాయునని చెప్పెడు

శ్లో॥ దేవకీతనయపూజనపూతః
పూతనారిచరణోదకధౌతః ।
యద్యహం స్మృతధనఞ్జయసూతః
కిం కరిష్యతి స మే యమదూతః ?॥ 29

టీ. అహం=నేను, దేవకీ...పూతః-దేవకీతనయ = దేవకీదేవికొడుకైన శ్రీకృష్ణునియొక్క, పూజన=పూజచేత, పూతః = పవిత్రుఁడును, పూత—ధౌతః-పూతనా + అరి=పూతనకు శత్రువైన కృష్ణునియొక్క, చరణ=పాదములయొక్క, ఉదక = జలముచేత, ధౌతః=కడుగఁబడినవాఁడును-పరిశుద్ధుఁడును, స్మృత...సూతః-స్మృత = స్మరింపఁబడిన, ధనఞ్జయ సూతః = అర్జునునియొక్క సారథి యైనకృష్ణుఁడు గలవాఁడును-శ్రీకృష్ణుని స్మరించినవాఁడు ననుట, యది=అయితి నేని, మే=నాకు, సః = ఆ-ప్రసిద్ధుఁడైన, యమదూతః=యమకింకరుఁడు, కిం=ఏమి, కరిష్యతి=చేయఁగలఁడు? ఏమియును జేయలేఁ డనుట-కోరినట్లు దేవకికడుపునఁ బుట్టి, ఆశ్రయించిన యర్జునుని రథమును దోలినట్టి కారుణ్యసౌలభ్యములు గలవానిని బూజించి శ్రీపాదతీర్థమును గ్రహించి స్మరించితినేని నరకభయమే కలుగ దని యర్థము.

మ. సకలప్రార్థిత దేవకీతనయపూజాపూజితుం బూతనాం
తకపాదాంబుజవారిధౌతుని మనోనాళీకహేళీభవ
త్ప్రికటాటోపకిరీటిసూతుని వచోరాజీవరాజన్ముఖుం
దకధాన్వీతుని నన్ను నాశమనదూతల్ సేరఁగాఁ జూతు రే. 29

తా. దేవకికడుపునం బుట్టి, దుష్టయగుపూతనం జంపి, ఆశ్రితుం డైనయర్జునున కు సారథ్యంబును జేసినకృష్ణుని పూజించి పాదతీర్థమును గ్రహించి స్మరించితినేని యమకింకరుండు న న్నేమియుఁ జేయలేఁడు.

శ్లో॥ భాసతాం భవభయైకభేషజం।
మానసే మమ ముహు ర్ముహు ర్ముహుః।
గోపవేష ముపసేదుష స్స్వయం
యాపి కాపి రమణీయతా విభోః॥ 30

టీ. భవ...భేషజమ్ - భవభయ = సంసారభయమునకు, ఏక = ముఖ్యమైన, భేషజమ్ = ఔషధమైనది యగు - సంసారభయమును బోఁగొట్టునదియైన, గోపవేషం= గోపాలవేషమును, స్వయం = తానై, ఉపసేదుషః = పొందినవాఁడైన-సౌలభ్యమువలన తనంతటనే సర్వపాపవినాశక మైన గోపాలకృష్ణరూపమున అవతరించినవాఁడైన, విభోః = విభునియొక్క, శ్రీకృష్ణమూర్తియొక్క, యాపికాపి = అనిర్వాచ్యమైన-ఇట్టి దట్టిదనరాని, రమణీయతా=సౌందర్యము, మమ = నాయొక్క, మానసే = మనస్సునందు, ముహుః ముహుః ముహుః = మాటికిమాటికి, భాసతామ్ = ప్రకాశించుఁగాక. సకలజనులకును నేత్రగోచరమైన తనరమణీయతచే వారి నాకర్షించి వారిపాపముల నెల్లఁ బోఁగొట్టునట్టి సౌలభ్యాతిశయము గలదిగాన గోపాలకృష్ణవేషమే భవభయమునకు ఏకభేషజ మని చెప్పఁబడినది. 'స్వయం' తానై గోపవేషమును బొందినాఁ డనుటచేఁ గర్మముచేఁగాక సౌలభ్యముచే అట్టివేషమును బొందినాఁ డని భావము.

చ. భవభయభేషజంబు శ్రుతిభావ్యము నై తగుగోపవేష ము
త్సవమునఁ బూనినట్టిహరి సర్వమనోహరదివ్యరూపవై
భవము మదీయభావమున భాసిలుఁగాత నిరంతరంబు మా
ఘవసుమణీతృణీకరణకౌశలపేశలతేజ మొప్పఁగన్. 30

తా. సంసారభయ మనెడి రోగమునకు ముఖ్యౌషధం బైనగోపవేషమును దానై పూనిన శ్రీకృష్ణమూర్తియొక్క యనిర్వాచ్యమైన సౌందర్యము నామనస్సునఁ బ్రకాశించును గాక.

శ్లో॥ *కర్ణలమ్బితకదమ్బమఞ్జరీ, కేసరారుణకపోలమణ్డలమ్।
నిర్మలం నిగమవాగగోచరం, నీలిమాన మవలోకయామహే॥ 31

---

*ఈశ్లోకమునర్థము గోపాలకల్పమునందు, 'నీలోత్పలదళశ్యామం పీతవాసస మచ్యుతమ్। శుద్ధస్ఫటికసఙ్కాశ మథవా పురుషోత్తమమ్। ధ్యాత్వా నిత్యం జపే న్మన్త్రం యావ ద్ద్రిసహస్రకమ్' అని గోపాలమంత్రరాజముయొక్క యాథోపయోగ ప్రయోగమందలిధ్యానముగాఁ జెప్పబడి యున్నది.

టీ. కర్ణ...మణ్డలమ్-కర్ణ=చెవులయందు, లమ్బిత=వ్రేలుచున్న, కదమ్బ=కడిమియొక్క, మఞ్జరీ=పూగుత్తులయొక్క, కేసర=కింజల్కములచే, అరుణ=ఎఱ్ఱనైన, కపోల=చెక్కిళ్లయొక్క, మణ్డలమ్=ప్రదేశముగలవాఁడును, నిర్మలమ్=పరిశుద్ధుఁడైనవాఁడును, నిగమవాగగోచరమ్-నిగమవాక్=వేదాంతవాక్యములకు, అగోచరమ్=విషయము కానివాఁడును-వేదాంతములకును ఇట్టివాఁడని ప్రతిపాదింపరానివాఁడును, అగు, నీలిమాసమ్=నల్లనివానిని-శ్రీకృష్ణుని, అవలోకయామహే = చూచుచున్నారము-వేదాంతములకును దెలియరానిపరుఁడే కడిమిపూగుత్తుల, జెవులందు వ్రేలచేసికొని వ్రేపల్లెయందుఁ దిరుగుచుండఁగాఁ జూచుచున్నార మని యర్థము.

మ. చెవులన్ వ్రేలుకదంబమంజరులచేఁ జిన్నారిచెక్కుల్ జ్వల
న్నవసంధ్యారుణితాభ్రకాంతి చెలు వంగ్రెడిన్ మందహాసప్రభా
లవమున్ వెన్నెలతెల్పుఁ జూప మృదులాస్యలంకారుఁడై వేదసం
స్తవనాగోచరుఁ డైనశౌరి యసితచ్ఛాయున్ విలోకించెదన్. 31

తా. చెవులందు వ్రేలాడుచున్న కడిమిపూగుత్తుల యకరువులచే ఎఱ్ఱవాఱిన చెక్కులు గలిగి, నిర్మలుఁడై, వేదాంతములకును బ్రతిపాదింపరానివాఁడై, వెలయు నల్లనికృష్ణునిఁ జూచుచున్నాము.

అవ. వేణుగానసమయమందలియభినయమునువర్ణించుచున్నాఁడు.

శ్లో॥ సాచిసఞ్చలితలోచనోత్పలం, సామికుట్మలితకోమలాధరమ్ ।
వేగవల్గితకరాఙ్గులీముఖం, వేణునాదరసికం భజామహే ॥ 32

టీ. సాచి...త్పలమ్-సాచి=ఓరగా, సఞ్చలిత=చలింపఁజేయఁబడిన, లోచన+ఉత్పలమ్=కన్నుఁగలువలు గలవాఁడును-కలువలవంటికన్నులు గలవాఁడును-తల యొక్క ప్రక్కకువాంచి కన్నులనడ్డముగా మెలపుచున్నవాఁడనుట, సామి...లాధరమ్-సామి=సగము, కుట్మలిత=మోడ్పఁబడిన, కోమల=మృదువైన, అధరమ్=పెదవిగలవాఁడును-పిల్లఁగ్రోవి యూఁదునపుడు పెదవిని సగముమోడ్చినవాఁడనుట, వేగ...ముఖమ్-వేగ=త్వరితముగ, వల్గిత=మెలపఁబడిన, కర+అఙ్గులీ=చేతివ్రేళ్లయొక్క,ముఖమ్=మొనలుగలవాఁడును-వేణువును ఊఁదునపుడు దానిసందులపై వ్రేళ్లమొనలను అతిశీఘ్రముగా జరుపువాఁ డనుట, అగు, వేణు...రసికమ్-వేణునాద=వేణుగానముయొక్క, రసికమ్=రసమును దెలిసినవాఁడు, అగుశ్రీకృష్ణుని,భజామహే=భజించుచున్నాము. వేణువు నూఁదునపుడు తలయొకప్రక్కకువాంచికన్నులు అడ్డముగా ఇటునటు స్వరముల కనుగుణముగాఁ ద్రిప్పుచును, వేణురంధ్రములందు ముఖవాయువును బూరించునపుడు పెదవులను సగము మోడ్చియు ఆవేణురంధ్రములమీఁద స్వరభేదములు కలుగునట్లు మునివ్రేళ్లను అతివేగముగాఁ ద్రిప్పుచును ఉన్నాఁడని భావము. కావుననే వేణుగానరసికుఁ డని యాశయము.

చ. విరతము నంఘ్రి మార్పడఁగ నిల్పి యొయారపుటోరచూపుతోఁ
దరళవిలోచనంబులను మూసడం బలరన్ దరహాసచంద్రికల్
ముఖ వశమున్న మోవి నరసమోడ్పుఁ జెలంగఁ గరాంగుళీతతిన్
మురళి నటింపఁ జేయు సతిసమ్మోహనగానధురీణుఁ గొల్చెదన్. 32

తా. తల యొకప్రక్కకు వాల్చుటఁజేసి కన్ను లోరగాఁ ద్రిప్పుచు, శ్వేత వాతెఱను సగము మోడ్చి, మున్ని వేళ్లను వేగముతోఁ బిల్లఁగ్రోవి రంధ్రములపైని మెలపుచు నొప్పుచున్న వేణుగానరసజ్ఞుని శ్రీకృష్ణుని భజించుచున్నాము.

అవ. రుక్మిణీకల్యాణమున రుక్మిణిని గొనిపోవుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ స్యన్దనే గరుడమణ్డితధ్వజే, కుణ్డినేశతనయాధిరోపితా ।
కేనచి న్నవతమాలపల్లవ, శ్యామలేన పురుషేణ నీయతే॥ 33

టీ. కుణ్డినేశతనయా-కుణ్డిన + ఈశ=కుండిన పట్టణమునకు ప్రభువైన భీమునియొక్క, తనయా = కూఁతురైన రుక్మిణీదేవి, గరు...ధ్వజే-గరుడ = గరుడుని చేత, మణ్డిత=ప్రకాశించుచున్న, ధ్వజే=టెక్కెముగల, స్యన్దనే=రథమందు, తమా...లేన-తమాలపల్లవ=నల్లకానుగు చిగురువలె, శ్యామల=నల్లనైన, కేనచిత్=ఒకానొక, పురుషేణ=పురుషునిచేత, అధిరోపితా సతీ=ఎక్కింపఁబడినదియై, నీయతే=కొనిపోవంబడుచున్నది. 'గరుడమణ్డితధ్వజ' మనుటచే కృష్ణునిరథ మనియు, 'శ్యామలుఁ' డైన పురుషుఁ డనుటచే శ్రీకృష్ణుఁ డనియు నూహ్యములు.

మ. కదనోర్విన్ శిశుపాలమాగధవిప ౯ క్షత్త్రక్ష్మాతలాధీశదో
ర్మదనిర్భేదవినోద మొప్పఁగ గరు ౯ త్మత్కేతుభాస్వద్రథా
స్పదపీఠంబున రుక్మిణీరమణి ని ౯ శ్శంకస్థితిం దెచ్చె నే
విదితుం డట్టితమాలనీలపురుషున్ ౯ విశ్వంభరుం గొల్చెదన్. 33

తా. నల్లకానుగుచిగురువలె నీలవర్ణము గల యొకానొక పురుషుఁడు గరుడ ధ్వజము గల తన రథమునందు రుక్మిణీదేవి నెక్కించుకొని పోవుచున్నాఁడు.

శ్లో॥ మాయాత పాన్థాః పథి భీమరథ్యా
దిగమ్బరః కోఽపి తమాలనీలః ।
విన్యస్తహస్తోఽపి నితమ్బబిమ్బే
ధూర్తస్సమాకర్షతి చిత్తవిత్తమ్ ॥ 34

టీ. హేపాన్థాః=ఓ తెరువరులారా, భీమరథ్యాః=భీమరథి అనెడినదియొక్క, పథి=మార్గమందు, మాయాత=పోకుఁడు. ఏలనఁగా:- తమాలనీలః-తమాల=నల్లకానుగువలె, నీలః=నల్లనైనవాఁడును, దిగమ్బరః=దిస్సమొలతోనున్నవాఁడును, అగు, కోఽపి=ఒకానొక

ధూర్తః=దుష్టుఁడు, బాలకృష్ణుఁడనుట, నితమ్బబిమ్బే=కటిప్రదేశమునందు. విన్యస్తహస్తౌ=విన్యస్త=ఉంచఁబడిన, హస్తః=చేతులుగలవాఁడైనవాఁడు–దొంగిలించుటకు చేతులు చాఁపక నడుమునయందే ఉంచుకొని యున్నవాఁడైనను అనుట, చిత్తవిత్తమ్–చిత్తం=మనస్సనియెడి, విత్తం=ధనమును, సమాకర్షతి=చెప్పనాకర్షించుచున్నాఁడు, చిత్తవిత్తమును హరించుచున్నాఁడుగావున నే ధూర్తుఁడు; వీఁడుతక్కిన ధూర్తులవంటివాఁడు గాఁడు; చేతులుచాఁపక మొలయందేపెట్టుకొనియుండినను తక్కిన ధూర్తులకంటెను జక్కఁగా దొంగిలించుచున్నాఁడు. ఇట్టివిపరీతధూర్తుఁడు ఏంచునట్టిభీమరథీమార్గమున మాఁబోవకుఁడని యర్థము; ఇందుమించుగా దిగంబరత్వమును నలుపును ధూర్తుఁడు బాలుఁడగు కృష్ణునికిఁబోలె విశేషణము లగును, భీమరథీనదియొద్దిమార్గమునందు–నల్లనికొనఁగుచిగురువంటి కాంతి గలిగి దిగంబరుఁడై తిరుగుచుండుచిన్నికృష్ణుఁడు ఆదారిని పోవువారిమనస్సులను తనయతిశయ సౌందర్యకాంతివిలాసవిశేషములచే హరించుచున్నాఁడని భావము.

చ. పథికులు పోకుఁ డచ్చటికిఁ గ్రబ్బలు భీమరథీపథంబునం
బృథులతమాలమేచకశరీరుఁ డొకండు దిగంబరాకృతిం
బ్రథితకటీతటీఘటితశయపాణితలుం డయి ప్రోన్మిషన్మనో
రథుఁ డయి చిత్తవిత్తము నిరంతరమున్ హరియించు ధూర్తుఁడై.

తా. బాటసారులారా! భీమరథీనదిమార్గమునఁ బోవకుఁడు. అందు దిగంబరుండై నల్లకొనుఁగుచిగురువలె నల్లనైన యొకానొకధూర్తుఁ డున్నాఁడు. వాఁడు చేతులు చాఁపక నడుమునందే యుంచుకొని యున్నను మనస్సులనెడిధనములు హరించుచున్నాఁడు.

## రాసక్రీడాష్టకము.

అవ. కవి యీపద్యము మొదలుగ ఎనిమిదిపద్యములవఱకురాసక్రీడలను వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ అఙ్గనా మఙ్గనా మన్తరే మాధవో
మాధవం మాధవం చాన్తరే ణాఙ్గనా ।
ఇత్థ మాకల్పితే మణ్డలే మధ్యగః
సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః ।



టీ. అఙ్గనామ్ అఙ్గనామ్=ఒక్కొక్క స్త్రీని, అన్తరే=విడిచి – ఒక్కొక్క స్త్రీకి నడుమ, మాధవః=శ్రీకృష్ణుఁడును, మాధవం మాధవం=శ్రీకృష్ణుని శ్రీకృష్ణుని, అన్తరేణ=విడిచి–ఒక్కొక్క–కృష్ణునియొక్క–నడుము, అఙ్గనా చ=అంగనయును – ఒక్కొక్క–అంగనను నడుమ ఒక్కొకకృష్ణుఁడును ఒక్కొకకృష్ణునికి నడుమ ఒక్కొకఅంగనయును గాననని యర్థము, ఇత్థం=ఈప్రకారముగా, ఆకల్పితే=కల్పింపఁబడిన, మణ్డలే=వలయాకార

మైన సమూహమునందు - లేక వలయమునందు, దేవకీనన్దనః = దేవకీకొడుకైన కృష్ణుఁడు, మధ్యగః సన్ = మధ్యమును బొందినవాఁడగుచు - అనఁగా ఒకొక్కక్కరుఁగన మను నడుమ తా నొక్కఁడొక్కఁడుగా ఏర్పడుటయే కాక ఇట్లు ఏర్పడిన వలయము నడుమనుగూడ తానొక్కఁడు నిలిచి యనుట, లేక, మధ్యగః = మధ్యస్వరమును బొందినవాఁడగుచు అనియు నర్థాంతరము, వేణునా = పిల్లఁగ్రోవిచేత, సజ్జగౌ = లెస్సగా గానముచేసెను. ఇట కృష్ణుఁడు పెక్కుఆకారము లొంది ఒక్కొక్కస్త్రీకిని నడుమఁ దా నొక్కొక్కఁడుగా ఏర్పడి మండలాకారముగా నిలుచుటయేగాక ఆమండలము నకు నడుమనుగూడ తా నొక్కఁడు నిలిచి యుండెనని యూహింపనది.

చ. ఇరుదెసఁ దాను నిల్చి తన క్రింతులు పార్శ్వములన్ వసింపఁగాఁ
గరములు కంఠపాళిఁ జెలఁగన్ బలభిన్మణివిద్రుమంబులన్
సర మొనరించినట్లు సరసస్థితి మండలమధ్యవర్తియై
మురళిరవంబునం జెలఁగుకమోహనమూర్తి మురారిఁ గొల్చెదన్.

తా. ఒక్కొక్కస్త్రీకిని నడుమ తాను దన రెండురూపులనడుమ నొక్కొక్క స్త్రీయుండునట్లు మండలముగాఁ జేరి నిలిచి వారినడుమఁగూడ తాను వేఱొకఁడై నిలిచి శ్రీకృష్ణుఁడు చక్కఁగా గానముచేసెను.

శ్లో॥ కేకికేకాదృతానేకపఙ్కేరుహాలీనహంసావళీహృద్యతాహృద్యతా।
కంసవంశాటవీదాహదావానలః, సజ్జగౌ వేణునా దేవకీనన్దనః॥ 36

టీ. కేకి... హృద్యతా - కేకి = నెమిళ్ళయొక్క, కేకా = కూఁతలయొక్క, ఆదృత = ఆదరించుటచేత - నెమిళ్ళకూఁతలను వినుటచేత ననుట, అనేక = అనేకములైన, పఙ్కేరుహ = తామరలనుండి, ఆలీన = లేచినవైన, హంస = అంచలయొక్క, ఆవళీ = పంక్తులకు, హృద్యతా = సంతోషమును, ఆహృద్యతా = సంపాదించుచున్నదైన - శ్రీకృష్ణునిఁజూచి మేఘముగాఁదలచి నెమిళ్లుకేకలుపెట్టెననియు, వర్షసమయమునందు నెమిళ్లు కేకలిడునుగాన వానియాకేకలను విని తమకు మిక్కిలి అనిష్టమైనవర్షాకాలము వచ్చెనని తలఁచి హంసలు తామరలనుండి లేచి పోఁజూచినవనియు మరల పిల్లఁగ్రోవిరవళిని వినఁగానే మేఘము గాదు కృష్ణుండని సంతోషమునొందినవనియు భావము; కాన వర్షాకాలమని [illegible] హంసలకు ఆభయమును మాన్పి సంతోషమును గూర్చుచున్నదైన, వేణునా = పిల్లఁగ్రోవిచేత, కంస... దావానలః - కంసవంశ = కంసునికులమనెడి, అటవీ = అడవియొక్క, దాహ = కాల్చుటయందు, దావానలః = కాఱుచిచ్చు అయినవాఁడగు - కాఱుచిచ్చు అడవిని దహించునట్లు కంసవంశమును నాశము సేసినవాఁడైనయనుట, దేవకీనన్దనః = శ్రీకృష్ణుఁడు, సజ్జగౌ = లెస్స గా గానము చేసెను. వర్షాకాలము హంసలకు అనిష్టమగుటయు నెమిళ్ళకు ఇష్టమగుటయు ఆసమయమునందు హంసలు మానససరస్సునకుఁబయనమైపోవుటయు నిటననుసంధించునది.

మ. తనుకాంతుల్ జలదంబటంచు శిఖిసంఘాతంబు కేకాస్వనం
బును మీఱన్ విని యంచపిండు లలితాంభోజాళిలో నుండి చ
య్యన లేవన్ భ్రమ మాన్చి సంతసము సేయం జాలువంశీమృదు
స్వనముం గాంచినకంసవంశదహనజ్వాలిన్ హరిన్ గొల్చెదన్. 36

తా. కృష్ణునిదేహచ్ఛాయను జూచి మబ్బు అని నెమిళ్ళు కేకలిడఁగా, వర్షాకాలమని బెదరి పెద్దతామరలందుండిన హంసలు లేవఁగా మబ్బు గాదు శ్రీకృష్ణుం డని తన ధ్వనిచేఁ దెలిపి వానికి సంతోషమును గలిగించునట్టి పిల్లఁగ్రోవిని గొని కంసవంశవినాశకుఁ డైన శ్రీకృష్ణుఁడు లెస్సగా గానముసేసెను.

శ్లో॥ క్వాపి వీణాభిరారావిణా కమ్పితః, క్వాపి వీణాభిరా కిఙ్కిణీనర్తితః।
క్వాపి వీణాభిరామాన్తరం గాపితః, సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః॥37

టీ. దేవకీనన్దనః=శ్రీకృష్ణుఁడు, క్వాపి=ఒకచోట, వీణాభిః=వీణలచేత, ఆరావిణా = ధ్వనిగలవానిచేత-వీణనువాయించువానిచే-ఒకరువీణవాయింపఁగాఆవాద్యమునకు అనుగుణముగాననుట, కమ్పితః=నటనము చేయింపఁబడినవాఁడును-ఒకరువాయించువీణకు అనుగుణముగా ఆడినవాఁడనుట, క్వాపి=ఒకచోట, వీణాభిరా=వీణకు అనుగుణముగా శబ్దించుచున్న, కిఙ్కిణీ = చిఱుగంటలతో, నర్తితః=నర్తనము సేయింపఁబడినవాఁడును, క్వాపి=ఒకచోట,వీణాభిరామాన్తరం-వీణా=వీణెచేత-వీణాధ్వనిచేత, అభిరామ=మనోజ్ఞమైన, అన్తరం యథాతథా=అవకాశము గలుగునట్లుగా-నడుమనడుమ వీణెలు మనోజ్ఞముగా వాయించుచుండఁగా ననుట, గాపితః=గానము పొందింపఁబడినవాఁడును,తాను పాడుచును పాటనిలిపిన నడిమియవకాశములందు వీణలను వాయింపఁగా వినుచును అనుట, వేణునా=పిల్లఁగ్రోవిచేత, సఞ్జగౌ=లెస్సగా గానము సేసెను.

మ. ఒకచో గాణలు మీటువీణియలకున్ సంయుక్తంబుగా నాడు వే
ఱొకచో వీణెకు వియ్యమై యొనరఁ జేయుం గింకిణీనాద మొం
డొకచో వీణియతోడఁ బాడు జతగా సుత్సాహి యై యుట్టినం
దకుమారాగ్రణి వేణునాద మొనర సద్వృత్తిన్ నుల్లాసి యై. 37

తా. శ్రీకృష్ణుఁడు ఒకచోట వీణెలు వాయించుటకు అనుగుణముగా ఆడుచును, ఒకచోట వీణాధ్వనులకు అనుగుణముగాఁ జిఱుగంటలు మ్రోయించుచును, ఒకచోట నడుమనడుమ వీణలు వాయింపఁగాఁ బాడుచును, వేణువును గొని లెస్సగా గానము సేసెను.

శ్లో॥ చారుచన్ద్రావళీలోచనై శ్చుమ్బితో
గోపగోబృన్దగోపాలికావల్లభః ।
వల్లవీబృన్దబృన్దారక ః కాముకః
సఙ్గగా వేణునా దేవకీనన్దనః ॥ 38

టీ. చారు...లోచనైః-చారు=మనోహరములైన, చన్ద్రా=(వెండి) భూషణములు గల స్త్రీలయొక్క, ఆవళీ=పంక్తులయొక్క, లోచనైః=నేత్రములచేత, చుమ్బితః=చుంబింపఁబడువాఁడును-చూడఁబడువాఁడనుట, గోప...వల్లభః-గోప=గోపకులయు, గోబృన్ద=గోవులయు, గోపాలికా=గోపస్త్రీలయు, వల్లభః=ప్రియుఁడైనవాఁడును, వల్లవీ...దారకః-వల్లవీబృన్ద=గోపస్త్రీసమూహములకు, బృన్దారకః = దైవతమైనవాఁడును, వారు కోరినకోర్కు లిచ్చువాఁ డనుట, కాముకః=వారలను కామించువాఁడును, అగు, దేవకీనన్దనః=శ్రీకృష్ణుఁడు, వేణునా = పిల్లఁగ్రోవిచేత, సఙ్గగా = లెస్సగా గానము సేసెను-స్త్రీజనులు ప్రేమపూర్వకముగాఁ జూచుచుండఁగా, గొల్లలకును గోవులకును గొల్లచెలువలకును ఇంపు పెంపారుచుండఁగా, గోపికలకుఁ గోరినకోర్కు లిచ్చుదైవమై, వారల యెడ మరులు చెలరేఁగ వేణుగానము సేసినాఁ డని యర్థము.

ఉ. ప్రేపులు గోపదంపతులుఁ గేవలభక్తి భజింప నప్సరో
రూపముఁ గల్గు వేతలు మకరులొ్కని క్రీడ రయొనర్ప సంభృతా
ష్టాపదభూమ లౌచెలులు సౌధముపం దిలకించి చూడఁగా
గోపకుమారుఁ డొప్పె రసగుంభితవేణునినాదలోలుఁడై. 38

తా. స్త్రీసమూహములు మోహముతో పయిని చూడ్కులు అల్లల్ల నిగుడ్చుచుండఁగా, గోగోపగోపీజనులకు ఇంపు పుట్టఁగా, గొల్లచెలువలకు దైవమై కాముకుఁడునై యొప్పుచిన్నికృష్ణుఁడు లెస్సగా వేణుగానము సేసెను.

శ్లో॥ మాలిమాలామిళన్మత్తభృఙ్గీలతా
భీతభీతప్రియావిభ్రమాలిఙ్గితః ।
స్రస్తగోపీకుచాభోగసమ్మేళితః ।
సఙ్గగా వేణునా దేవకీనన్దనః ॥ 39

టీ. దేవకీనన్దనః=శ్రీకృష్ణమూర్తి, మాలి...లిఙ్గితః-మాలి=సిగయందలి, మాలా=పూదండయందు, మిళత్=కూడుచున్న, మత్త=మదించినవైన, భృఙ్గీ=ఆఁడుతుమ్మెదల, లతా=తీఁగెలవలన-తీఁగెలవలె సన్నని నిడుదబంతులుగా సిగయందలి పూమాలికల నలమియున్న ఆఁడుతుమ్మెదలచేత ననుట, భీతభీత = మిక్కిలి భయపడినవారైన-భయపడినట్లున్న, ప్రియా=ప్రియురాండ్రచేత, విభ్రమ=విలాసముతోఁగూడినట్లు, ఆలిఙ్గితః=కౌ

గిలింపఁబడినవాఁడును-సిగయందలి పూదండను బారులుగా నలమియున్న యాఁడుతుమ్మెదలవు భయపడి ప్రియురాండ్రు తన్ను విలాసముతోఁ గౌఁగిలించుకొనిరనుట, ఇట్టివాఁడును, కావుననే, ప్రస్త... మేళితః-ప్రస్త=జాఱిన -వస్త్రము జాఱినయనుట-కౌఁగిలించుకొను నురవడిచేఁ బైఁటలు జాఱఁగా వెలువడిన యనుట, గోపీ=గోపస్త్రీలయొక్క, కుచ=స్తనములయొక్క, ఆభోగ=పరిపూర్ణతతోడ - వలుఁదచన్నుఁగవలతోడ ననుట, సమ్మేళితః=కూడినవాఁడును-గోపికలు భయమునఁ గౌఁగిలించుటచేఁ బైఁటలు జాఱఁగా స్ఫుటముగా వెలువడిన వారిగబ్బివలుఁదగుబ్బలు మేనఁ గ్రమ్మినవాఁ డనుట, ఇట్టివాఁడై, వేణునా=పిల్లఁగ్రోవిచేత, సఞ్జగౌ=లెస్సగా గానముసేసెను-మొదట భయముచేనైన గోపికల గాఢాలింగనమును, దానిచే ముక్తవస్త్రములైన వారికుచముల ఘట్టనము కృష్ణునికి నిర్భరానంద హేతు వయ్యె ననియు, అట్లు ఆనందమగ్నుఁ డవుటచేత, లెస్సగా వేణుగానము చేసెననియుఁ దెలియునది.

ఉ. మౌళితటిన్ ఘటించినసుమమ్ముల వెంబడి వచ్చుభృంగరా
జీలలితధ్వనిం గలఁగి చేలము లూడఁగఁ గౌఁగిలించు గో
పాలకభీరుకోటికుచభార మురమ్మున నానురాసలీ
లాలసమానమానసవిలాసుని వేణువినోదుఁ గాంచెదన్. 39

తా. సిగయందలిపూదండలకై బారులు గట్టి ముసరు ఆఁడుతుమ్మెదల యావళికి బెదరి గొల్లచెలువలు బిగ్గఁ గౌఁగిలింపఁగా అట్లు కౌఁగిలించునప్పుడు వారి పయివలువ లూడి వెలువడినబలితంపుగుబ్బలను నెమ్మేనఁ గ్రుమ్మఁగాఁ బరమానందంబునఁ గృష్ణుఁడు లెస్సగా వేణుగానము సేసెను.

శ్లో॥ చారుచామీకరాభాసభామావిభు
ర్వైజయన్తీలతావాసితోరస్స్థలః।
నన్దబృన్దావనేవాసితామధ్యగః
సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః॥ 40

టీ. చారు...విభుః-చారు=సుందరమైన, చామీకర=బంగారుయొక్క, ఆభాస=కాంతివంటి కాంతి గల, భామా=సత్యభామకు, విభుః=ప్రభుఁడైనవాఁడును, వైజయన్తీ...స్థలః - వైజయన్తీలతా=తీఁగెలవంటి వైజయంతి అనువనమాలచేత, వాసిత=పరిమళించుచున్న, ఉరఃస్థలః=వక్షఃస్థలము గలవాఁడును, నన్ద...మధ్యగః-నన్ద=నందునియొక్క, బృన్దావనే=బృందావనమందలి, వాసితా=స్త్రీలయొక్క-గోపస్త్రీలయొక్క, మధ్యగః=మధ్యమును బొందినవాఁడును, అగు, దేవకీనన్దనః=శ్రీకృష్ణమూర్తి, వేణునా=పిల్లఁగ్రోవిచేత, సఞ్జగౌ=లెస్సగా గానముచేసెను.

మ. జత లై బంగరుతీఁగెగుంపు నడలింపఁ చం జాలుబృందావనాం
చితబింబోష్ఠికవతుల్ విలాసగతులన్ సేవించ రాసక్రియా
చతురత్వంబున వైజయంతి నటియింపంగ వేణుగానస్వనా
మృతధారాపటిమం జెలంగువారి నెన్నిమ్మం బ్రోచు నన్నెప్పుడున్.

తా. మేలిబంగారుచాయగల సత్యభామకు వల్లభుఁడై, వైజయంతీమాల వక్షమునఁ గ్రాల, నందునిబృందావనమందలి గోపికలనడుమం జేరి శ్రీకృష్ణుఁడు లెస్సగా గానముసేసెను.

శ్లో॥ బాలికాతాళికాతాళలీలాలయా
సజ్జసన్దర్శితభ్రూలతావిభ్రమః ।
గోపికాగీతదత్తావధాన స్స్వయం
సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః ॥ 41

టీ. బాలికా = గోపాలబాలికలనెడి, తాళికా = తాళత్రియలయొక్క, తాళలీలా = తాళక్రియయొక్క, లయ = లయయొక్క-న్యూనాధికరాహిత్యముయొక్క, ఆసజ్జ = కూడికయందు, సన్దర్శిత = చూపఁబడిన, భ్రూలతా = తీఁగవంటి కనుబొమలయొక్క, విభ్రమః = విలాసముగలవాఁడగు, దేవకీనన్దనః = శ్రీకృష్ణుఁడు-బాలికలు వేయుతాళములు ఎక్కువ తక్కువలు లేక సరిగా నుండునట్లు గుదుటకై కనుబొమలు సొగసుగాఁ ద్రిప్పుచున్నవాఁడనుట, కనుబొమల మలుసం ద్రిప్పులచే వారితాళముల లయను తారకాణముగా నుండుటను దెలుపుచున్నవాఁడనుట, స్వయం = తాను, గోపి...ధానః - గోపికా = గోపికలయొక్క, గీత = గానమందు, దత్త = ఉంపఁబడిన, అవధానః సన్ = హెచ్చరిక గలవాఁడగుచు-గోపికల పాటలను హెచ్చరికతో వినుచు ననుట, వేణునా = పిల్లఁగ్రోవిచేత, సఞ్జగౌ = లెస్సగా గానముచేసెను. గోపికలు పాడుపాటలను హెచ్చరికతో వినుచును బాలికలు వేయు తాళములు ఎక్కువతక్కువలు లేక సరిగా నమరునట్లు కనుబొమలత్రిప్పులచే దిద్దుచును, దాను పిల్లఁగ్రోవి యూఁదినాఁడని భావము.

ఉ. తాళము లుగ్గడించువనితాకరతాళలయానుభావిత
భ్రూలతసొంపు వల్లవసరోజముఖీమృదుగానవైఖరిం
దాలిమి నెచ్చరించునవధానము మీఱఁగ వేణుపాణి యై
లాలితగానవైభవకళానిపుణుం డగుశౌరిఁ గొల్చెదన్. 41

తా. తాళక త్తైలైనబాలికలు వేయుతాళములు ఎక్కువతక్కువలులేక తారకాణముగానుండునట్లు దిద్దుటకై కనుబొమలను నీటుగాఁ ద్రిప్పుచును, గోపికలపాటలను ఎచ్చరికతో నాలకించుచును, శ్రీకృష్ణుఁడు లెస్సగా వేణువు నూఁదెను.

శ్లో॥ పారిజాతం సముద్ధృత్య రాధావరో
రోపయామాస భామాగ్రహస్యాఙ్గణే।
శీతశీతే వటే యామునీయే తటే
సజ్జగౌ వేణునా దేవకీనన్దనః॥ 42

టీ. రాధావరః=రాధకు పెనిమిటియైన, దేవకీనన్దనః=శ్రీకృష్ణమూర్తి, భామాగ్రహస్య=సత్యభామ యింటియొక్క, అఙ్గణే=ముంగిలియందు, పారిజాతం=పారిజాతవృక్షమును - సముద్ధృత్య=(ఇంద్రునివనమునుండి) పెల్లగించి, రోపయామాస = నాటి పెంచెను, అట్టి, దేవకీనన్దనః=శ్రీకృష్ణుఁడు, యామునీయే=యమునాసంబంధియైన, తటే=తీరమందు, శీతశీతే=శీతసదృశమైన, వటే=భాండీర మనెడి మఱ్ఱిచెట్టునందు, వేణునా=వేణువుచేత, సజ్జగౌ=లెస్సగా గానముచేసెను.

మ. *రమతోఁడన్ సమమైన కాంతిగుణముల్ గ రాధావయోరూపవి
భ్రమముల్ గల్గినభామముంగిటను గ గల్పక్ష్మాజము న్నిల్పి య
య్యమునాసైకతమధ్యశీతలతల గ న్యగ్రోధవీథిన్ ముదం
బమరన్ వేణువినోదనాదరతుఁడౌ గ నబ్జాక్షు నీక్షించెదన్. 42

తా. రాధావల్లభుండైన శ్రీకృష్ణుఁడు పారిజాతమును ఇంద్రుని నందనవనమునుండి పెల్లగించి సత్యభామ యింటిముంగిట మొలచునట్లు నాటెను. అట్టి కృష్ణుఁడు యమునానదిగట్టున మిక్కిలి చల్లనైన మఱ్ఱిచెట్టుక్రింద లెస్సగా వేణుగానము సేసెను.

శ్లో॥ †అగ్రే దీర్ఘతరోఽయ మర్జునతరు స్తస్యాగ్రతో వర్త్మనీ
సా ఘోషం సముపైతి తత్పరిసరే దేశే కళిన్దాత్మజా।
తస్యాస్తీరతమాలకాననతలే చక్రం గవాం చారయన్
గోపః క్రీడతి దర్శయిష్యతి సఖే పన్థాన మువ్యాహతమ్॥ 43

టీ. హేసఖే=ఓచెలికాఁడా, అగ్రే=ఎదుట, అయం=ఈకానఁబడుచున్నదియు,

---

*ఈపద్యము, 'పారిజాతం సముద్ధృత్య రాధావయోరూపయామాసభాసాగుణైరఙ్గణే, శీతశీతే.' అనుపాఠమున రాధావయోరూపయామా=రాధయొక్క వయోరూపములుగలదియు,గుణైః=గుణములచేత,మాసభాసా=లక్ష్మీదేవితోఁసమానురాలైనదియునగు నొకస్త్రీతోఁడఁ అఙ్గణే=దానిముంగిలియందు, పారిజాతం=పారిజాతమును, సముద్ధృత్య=స్థాపించి' అనునర్థమునకు అనుగుణముగా రచింపఁబడినది. ఈపాఠము సమంజసముకాదు.

†కొందఱు దీనికి యర్థమునుజెప్పుచున్నారు. ఆదెట్లనిన:-హేసఖే=ఓమిత్రుఁడా, అగ్రే=ముందట-తేరుముందట, దీర్ఘతరః=మిక్కిలి యున్నతుఁడైన, అయం=ఈ, అర్జున

దీర్ఘతరః=మిక్కిలిపొడవైనదియు, అగు, అర్జునతరుః=మద్దిచెట్టు, ఉన్నదని శేషము. తస్య దానియొక్క-ఆచెట్టుయొక్క, అగ్రతః=ముందట, వర్త్మని=కాలిత్రోవ, ఉన్నదని శేషము. సా=ఆకాలిత్రోవ, ఘోషం=గొల్లపల్లెను, సముపైతి=పొందుచున్నది. తత్ + పరిసరే=దాని యొక్క సమీపమునందలి, దేశే=ప్రదేశమందు, కళిందాత్మజా=యమునానది, ఉన్నదనుట, తస్యాః=ఆయమునానదియొక్క, తీర...తలే-తీర=గట్టునందలి, తమాల=కానుగుచెట్ల యొక్క, కానన=వనముయొక్క, తలే=ప్రదేశమందు, గవాం=గోవులయొక్క, చక్రం=సమూహమును, చారయన్=త్రిప్పుచు-మేలపుచు, గోపః=గొల్లవాఁడు, క్రీడతి=క్రీడించుచున్నాఁడు, వాఁడు, అవ్యాహతం=కొట్టువడని-సరియైనయనుట, పన్థానమ్=మార్గమును దర్శయిష్యతి=నీకుఁ జూపఁగలఁడు. మోక్షమార్గమును జూపఁగలఁడని భావము.

---

తరుః=తరువువంటి యర్జునుఁడు-బంధువధమును జేయఁజాలక శోకముచేఁ దరువువలె మ్రాన్పడియున్నయర్జునుఁడనుట, తస్య=ఆయర్జునునియొక్క, అగ్రతః=ముందర, వర్త్మని=మార్గము. ఉపదేశమార్గమనుట గీతారూపమై తత్త్వోపదేశకమైనమార్గమనుట, సా=ఆ మార్గము, ఘోషం=శబ్దమును-శబ్దప్రధానమైన ఉపనిషత్తుల ననుట, సముపైతి=పొందుచున్నది-ఆగీతామార్గము ఉపనిషత్తులను సంబంధించినది-అది ఉపనిషత్తులవిషయమే యైన దనుట, తత్పరిసరేదేశే=దానికి సమీపప్రదేశమందు-దానికి అందియునందకుండునట్లు-ఆ యుపనిషత్తులచేఁ బూర్ణముగాఁ బ్రతిపాదింపఁబడుటకుఅశక్యమై, కళిందాత్మజా=యమునానది-యమునానదివలె నల్లనైన కాంతిప్రవాహ మనుట, తస్యాః=అద్దానియొక్క, తీర...తలే-గట్టునందలి కానుగుచెట్లపట్టునందు. గవాం చక్రం = ఉపనిషద్వాక్యములను, చారయన్= అధ్యయనము సేయించుచు, గోపః=శ్రీకృష్ణుఁడు, క్రీడతి=విహరించుచున్నాఁడు, అవ్యాహతం=అక్షతమైన, పన్థానం=మార్గమును-మోక్షమార్గమును, దర్శయిష్యతి=చూపఁగలఁడు. ఈయర్థము మిక్కిలి క్లిష్టము. 'తత్పరిసరేదేశే కళిందాత్మజా' 'తస్యాస్తీరతమాలకాననతలే' అను రెండువాక్యములును ఈ యర్థాంతరమునకు అనుకూలముగా వ్యవస్థితములు గావు. కాన నిది కవిహృదయముగాఁ గానిపింపదు. 'అగ్రే' మొదలుకొని 'సఖే' అనువఱకును అర్థమొక్కటే గ్రహింపఁదగును, 'పన్థాన మవ్యాహతమ్' అనుటకు సరియైనమార్గమనియు మోక్షమార్గమనియు రెండుఅర్థములు గ్రాహ్యములు, మఱియు ఈశ్లోకము ఈయర్థమున 'పార్థే దిశన్తం గీతార్థం ధ్యానముద్రాలసత్కరమ్। రథస్థం భావయన్ జప్త్వా దశలక్ష మిమం మనుం। నోచిరాల్లభతే జ్ఞానం పరమైశ్వర్యదాయకమ్' అని గోపాలకృష్ణసర్వగతైకాక్షరీమంత్రధ్యానముగా సనత్కుమారసంహితయందుఁ జెప్పఁబడియున్నది.

మ. అదిగో ముంగల పెద్దమద్ది యట పోఁ నాచెంత వ్రేపల్లె యు
న్నది యాదండఁ గళిందజాతటమునం దాపింఛభూజాళిలోఁ
గదుపుల్ మేపుచు గోపబాలకుఁడు నిక్కంబొప్పఁగాఁ దెల్పు స
త్పదవిం బొమ్ము సఖా శుభాస్పదముగా భావంబురంజిల్లెడున్.43

తా. చెలికాఁడా! ముందట నదిగో ఒక పెద్దమద్దిచెట్టు కనఁబడుచున్నది. ఆచెట్టు నకు సుందర నొకకాలిత్రోవ పోవుచున్నది. ఆత్రోవ వ్రేపల్లెను జేరును. ఆవ్రేపల్లెకు సమీపమున యమునానది పాఱుచున్నది. దాని తీరమందలి కానుగచెట్ల యడవిలో గోవులను మేపుచు ఒకగొల్లవాఁడు విహరించుచున్నాఁడు. వానియొద్దకు పోయితివేని నీకుఁ జెలువు లేనిమార్గమును (మోక్షమార్గమును) జూపును.

అవ. కృష్ణుఁడు సాయంకాలమున గోవులను మేపికొని వచ్చి వానిని ఆయాయింటఁ గట్టుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ గోధూళిధూసరితకోమలగోపవేషం
గోపాలబాలకశతై రనుగమ్యమానమ్।
సాయన్తనే ప్రతిగృహం పశుబన్ధనార్థం
గచ్ఛన్త మచ్యుతశిశుం ప్రణతోఽస్మినిత్యమ్॥ † 44

టీ. గోధూ... వేషం-గోధూళి=గోవులసమ్మర్దముచేఁ బుట్టిన దువ్వచేత, ధూసరిత=బూడిదవన్నెగలదిగాఁజేయఁబడిన. కోమల=సుకుమారమైన, గోపవేషం=గొల్లలఆకారము గలవాఁడును, గోపాల... శతైః-గోపాలబాలక = గొల్లపిల్లవాండ్రయొక్క, శతైః=నూఱులచేత-వందలకొలఁది గొల్లపిల్లవాండ్రచేత ననుట, అనుగమ్యమానమ్=వెంబడింపఁబడుచున్న వాఁడును, సాయన్తనే=సాయంకాలమందు, పశుబన్ధనార్థమ్=పశు=ఆవులయొక్క, బంధనార్థమ్=కట్టుటకొఱకు, ప్రతిగృహమ్=ఇంటింటినిగూర్చి. గచ్ఛన్తమ్=పోవుచున్నవాఁడును, అగు, అచ్యుతశిశుమ్ - అచ్యుత=శ్రీవిష్ణుండైన, శిశుం=బాలునిగూర్చి-చిన్నికృష్ణునిగూర్చిఁ ప్రణతః=నమ్రుఁడను, అస్మి=అగుచున్నాను.

ఉ. గోపదధూళిధూసరితకోమలవేషముతోడ నందెలం
గోపక శాబకాళి తనకుం గయిదోడుగ నింటనింటనుం
గ్రేపులఁ గట్టఁగాఁ దిరుగుకృష్ణుని దామకరాభిశోభితున్
గోపకుమారు నిందువదనున్ మదనున్ మరునయ్యఁగొల్చెదన్ .44

తా. గోవులగుంపుచేఁ బుట్టినదువ్వచే బూడిదవన్నె పాఱినసుకుమారంపుగొల్ల యాకారము గలిగి, వందలకొలఁదిని గొల్లపిల్లవాండ్రు తన్ను వెంబడించి రాఁ గా,

సాయంకాలమున గోవులను గట్టుటకు వ్రేపల్లెయందు ఇంటింటను దిరుగుచున్న చిన్ని కృష్ణునికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ నిధిం లావణ్యానాం నిఖిలజగదాశ్చర్యనిలయం
నిజావాసం భాసాం నిరవధికనిశ్శ్రేయసరసమ్।
సుధాధారాసారం సుకృతపరిపాకం మృగదృశాం
ప్రపద్యే మాఙ్గల్యం ప్రథమ మధిదైవం కృతధియామ్॥ 45

టీ. లావణ్యానాం = కాంతివిశేషములకు, నిధిం=నిధానమైనవాఁడును-తళతళ కాంతులప్రోవు అయినవాఁడనుట, నిఖి...నిలయమ్-నిఖిల=సమస్తములైన, జగత్ = జగమునందలి, ఆశ్చర్య=ఆశ్చర్యములకు-ఆశ్చర్యకరములైన సౌందర్యాదివిశేషములకు అనుట, నిలయమ్=పట్టు అయినవాఁడును, భాసాం=కాంతులకు,నిజ+ఆవాసమ్-నిజ= సొంతమైన, ఆవాసమ్=గృహామైనవాఁడును, నిర...రసమ్-నిరవధిక=మేరలేని, నిశ్శ్రేయస = ఆనందముయొక్క, రసమ్=రసమైనవాఁడును - నిరవధికానందరసస్వరూపుఁ డనుట, సుధా...సారం-సుధా=అమృతముయొక్క, ధారాసారమ్ = జడివైనవాఁ డును, మృగదృశామ్=(లేడివంటికన్నులుగల) స్త్రీలకు, సుకృతపరిపాకం- సుకృత= పుణ్యముయొక్క,పరిపాకమ్=పరిణామమైనవాఁడును-యువతులు చేసికొన్న పుణ్యముల యొక్క ఫలమే యైనవాఁడనుట, కృతధియామ్ = సంస్కారము నొందినబుద్ధి గల వారగువిద్వాంసులయొక్క, మాఙ్గల్యమ్=మంగళమైనవాఁడును-తత్త్వవేత్త లైనవారికి శుభప్రదుఁడైనవాఁ డనుట, అగు, ప్రథమమ్=మొదటివాఁడైన-జగత్కారణుఁడైన, అధిదైవమ్=దైవమైనవానిని-శ్రీకృష్ణుని, ప్రపద్యే=సేవించుచున్నాను. 'నిధింలావణ్యానామ్' అనుటచే లావణ్యాతిశయమును, 'నిఖిలజగదాశ్చర్యనిలయమ్' అనుటచే లోకోత్తరలక్షణలక్షితత్వమును, 'నిజావాసమ్ భాసామ్' అనుటచే నిరతిశయకాంతిమత్త్వమును, 'నిరవధి...రసమ్' అనుటచే నిరవధికానందస్వరూపత్వమును, 'సుధాధారాసారమ్' అనుటచే అత్యంతభోగ్యత్వమును, 'సుకృత...దృశామ్' అనుటచే సౌందర్యాతిశయమును, 'కృతధియాం మాఙ్గల్యమ్' అనుటచే కల్యాణప్రదత్వమును, 'ప్రథమ మధిదైవమ్' అనుటచే జగత్కారణత్వమును అత్యంతపరత్వమును ఊహ్యములు.

ఉ. చక్కఁదనంబుప్రోవు రుచిసంతతి పోల్చినతావు లోకమ
మ్మక్కన నుండుదంట వికచాంబుజనేత్రలనోముపంట పెం
పెక్కుడుము క్తిధామము మునీశుల కాదిమధాము మార్యన
మ్యక్కృతసౌధవర్ష మజహార్షము నైనమురారిఁ గొల్చెదన్. 45

తా. లావణ్యములపుంజమై, లోకమునందలియద్భుతము లగుసౌందర్యములకెల్ల వాసస్థానమై, మితిలేనియానందమే స్వరూపముగాఁగలిగి, అమృతంపుజడివలెభోగ్యమై, యువతులపుణ్యఫలమో యనునట్లు మిక్కిలి మోహనాకారముగలిగి, విద్వాంసులకు శుభప్రదమై జగత్కారణమైనతొలుదైవమగు శ్రీకృష్ణపరబ్రహ్మమునుగొలుచుచున్నాను.

అవ. అర్జునునికి సారథ్యము సేయుచున్నవైఖరిని వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ ఆతామ్రపాణికమలప్రణయప్రతోద
మాలోలహారమణికుణ్డలహేమసూత్రమ్।
ఆవిశ్శ్రమామ్బుకణ మమ్బుదనీల మవ్యా
దాద్యం ధనఞ్జయరథాభరణం మహో నః॥ 46

టీ. ఆతామ్ర...తోదమ్-ఆతామ్ర=ఆంతటనుఎఱ్ఱనైన, పాణికమల=చేఁదమ్మియందు-తామరవంటిచేతియందు, ప్రణయ=మనోజ్ఞమైన, ప్రతోదమ్=మునికోలగలదియు, ఆలోల...సూత్రమ్-ఆలోల=చలించుచున్న, మణి=రత్నమయములైన, కుణ్డల=కుండలములును, హేమ=బంగారుమయమైన, సూత్రమ్=మొలనూలును గలదియు, ఆవి...కణమ్-ఆవిః=వెలికిపొడముచున్న, శ్రమామ్బు=చెమటయొక్క, కణం=బొట్లుకలదియును, అమ్బుదనీలమ్-అమ్బుద=మేఘమువలె, నీలమ్=నల్లనైనదియును, ధనం...భరణమ్-ధనఞ్జయ=అర్జునునియొక్క, రథ=రథమునకు, ఆభరణమ్=భూషణమయినదియు, ఆద్య, మహః=తేజము, నః=మమ్ము, అవ్యాత్=రక్షించునుగాక.

ఉ. కెంజిగురాకుఁగేలఁ దులకించుప్రతోదముచేత నాజి ధా
నంజయువాజిరాజిగమకక్రియ యేర్పఱుపన్ మొగంబునం
గ్రొంజెమ రూర హారమణికుండలముల్ చలియింప నొప్పున
య్యంబుదనీలతేజము రథాభరణం బనయంబుఁ బ్రోచుతన్. 46

తా. ఎఱ్ఱనైతామరవలె నొప్పుచేతియందు ప్రియ మయినచబుకును దాల్చి, రథగమనాదులచే చెవులయందలిరత్నాలకుండలములును నడుమునబంగరుమొలనూలును మిక్కిలి చలించుచుండఁగా, సారథ్యమువలన చెమటబొట్లు చూపట్టఁగా, అర్జునునిరథంబునం గూర్చుండి, దానికొక యలంకారమువలె తేజరిల్లుచు, మబ్బువలెనల్లనై యుల్లసిల్లుచున్న శ్రీకృష్ణాఖ్యతేజము మమ్ము రక్షించుఁగాత.

అవ. అర్జునునికిసారథియై చేయువ్యాపారవిశేషములనే చెప్పుచున్నాఁడు.

శ్లో॥ నఖనియమితకణ్డూ న్పాణ్డవస్యన్దనాశ్వా
ననుదిన మభిషిఞ్చ న్నఞ్జలిస్థైః పయోభిః।

అవతు వితతగాత్ర స్తోత్రనిష్ఠ్యూతమౌళి
ర్దశనవిధృతరశ్మి ర్దేవకీపుణ్యరాశిః ॥ 47

టీ. దశన...రశ్మిః-దశన=దంతములచేత, విధృత=ధరింపఁబడిన, రశ్మిః=పగ్గములుగలవాఁడును-గుఱ్ఱపుపగ్గములనుపండ్లతో నోటికి పట్టుకొన్నవాఁడు ననుట, తోత్ర...మౌళిః-తోత్ర=మునికోలతోడ, నిష్ఠ్యూత=కూర్పఁబడిన, మౌళిః=శిరస్సు గలవాఁడును-మునికోలను తలమీఁదఁబెట్టుకొన్నవాఁడు ననుట. వితతగాత్రః-వితత=నిట్టివిఁజెందిన, గాత్రః=దేహముగలవాఁడును-గుఱ్ఱమును కడుగుటకై దేహమును అవయవములను నిగిడించిన వాఁడనుట, నఖ...కణ్డూన్-నఖ=గోళ్లచేత, నియమిత=అడఁపబడిన-నివిరి పోఁగొట్టఁబడిన, కణ్డూన్=దురదగలవియైన, పాణ్డవ...నాశ్వాన్-పాణ్డవ=అర్జునునియొక్క, స్యన్దన=తేరియొక్క, అశ్వాన్=గుఱ్ఱములను, అఞ్జలిస్థైః=దోయిటనున్న, పయోభిః=జలములచేత, అనుదినం=ప్రతిదినమును, అభిషిఞ్చన్=స్నానము సేయించుచున్నవాఁడును, అగు, దేవకీపుణ్యరాశిః=దేవకీదేవియొక్క పుణ్యములప్రోవు-దేవకీపుణ్యసమూహమేయిట్లు కృష్ణుఁడై పుట్టినదనుట-ఇట్టిశ్రీకృష్ణుఁడు, అవతు=రక్షించుగాఁక గుఱ్ఱములను గడుగునపుడు పగ్గములను నోటఁగఱచుకొని మునికోలను తలపైఁబెట్టుకొని ఆగుఱ్ఱములను దురద పోవ గోళ్లతో నివురుచు దోసిటితో నీళ్లు గొని తనదేహమును జాఁచి వానిని ప్రతిదినమును గడుగుచున్నాఁడనియు ఇట్టినీచమైనసారథికృత్యములను చేయుచున్నకృష్ణుఁడు కేవలుఁడు గాక దేవకీపుణ్యఫలమైనపరుఁడే యనియు నర్థము.

మ. తలఁ దోత్రంబు ధరించి పగ్గములు దంతశ్రేణిఁ గీలించి యు
గ్గలికన్ మే నిగిడించి పార్థరథకంఠఖాణంబులన్ దోయిటన్
జలముల్ నల్లి నఖాళి నై నివురుచున్ సంరక్షించునా దేవకీ
లలనాపుణ్యఫలంబు నన్నుఁ గరుణాలంకారుఁగాఁ జేయుతన్. 47

తా. దంతములచే వాగెలుపట్టుకొని,మునికోలను దలపయిఁబెట్టుకొని, మేనినిటివిగాఁజేసికొని గుఱ్ఱంబులను దీటవోవగోళ్లతోనివిరిరుచుచు,దోసిటనీళ్లుగొని ప్రతిదినమును వానిని కడుగుచున్నవాఁడును దేవకీపుణ్యసమూహమైనవాఁడును అగుశ్రీకృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాత.

శ్లో॥ వ్రజయువతినవాయే యౌవనోల్లాసికాయే
సకలశుభవిలాసే కున్దమన్దారహాసే ।
నివసతు మమ చిత్తం తత్పదాయత్తవృత్తం
మునిసరసిజభానౌ నన్దగోపాలసూనౌ॥ 48

టీ. వ్రజ...సహాయే-వ్రజ=వ్రేపల్లెయందలి, యువతి=ఎలప్రాయముగల స్త్రీలకు, సహాయే=సహాయుఁడైనవాఁడును-వలపుకాఁడైనవాఁడనుట, యౌవ...కాయే-యౌవన=ప్రాయముచేత, ఉల్లాసి=ప్రకాశించుచున్న, కాయే=శరీరముగలవాఁడును, సకల...విలాసే-సకల=సమస్తమైన, శుభ = మంగళకరము లగు-లేక-సుంగళములయొక్క, విలాసే=విలాసములు గలవాఁడును-శుభలీల లన్నియుఁ గలవాఁడనుట, కున్ద...హాసే-కున్ద=మొల్లలవంటియు, మన్దార=కల్పవృక్షమువంటియు, హాసే=నవ్వుగలవాఁడును, ముని...భానౌ-ముని=మునులుఅనెడి, సరసిజ=తామరలకు, భానౌ=సూర్యుఁడైనవాఁడును, అగు, నన్ద...సూనౌ-నన్దగోపాల=గొల్లవాఁడైన నందునియొక్క, సూనౌ= కుమారుఁడగు శ్రీకృష్ణమూర్తియందు, మమ=నాయొక్క, చిత్తం=మనస్సు, తత్...వృత్తంసత్-తత్=ఆనందకుమారునియొక్క, పద=పాదములకు, ఆయత్త=అధీనమైన, వృత్తంసత్=వ్యాపారము గలదియగుచు,నివసతు=ఉండుఁగాత-నందకుమారునే చింతించుచు అతనియందే వర్తించుచుండుఁగాక యనుట.'యౌవనోల్లాసికాయుఁడు'గావున నే వ్రజమండలి'యువతి' యౌవనవతులకు సహాయుఁడైనాఁడనుట. ఆయువతులకు ముఖ్యులై భర్తలుండఁగా సహాయుఁడైకృష్ణుఁడున్నాఁడని అనఁగా వారలకు విటకాఁడైనవాఁడని-యాశయము. 'సకలశుభవిలాసుం' డనుటచే శుభప్రదుఁ డనియు 'కున్దమన్దారహాసుఁ' డనుటచేఁ గరుణాళుఁడనియు నర్థము. ఇట్టిసామాన్యుఁ డయ్యు 'మునిసరసిజభానుఁడు' అగుపరుఁడే యగునని భావము.

చ. వ్రజయువతీసహాయు నతిస్ఫురంజితయౌవనకాయు మానిచి
త్తజలజమిత్రు విశ్వజనస్తుతానుతిపాత్రు వినీలగాత్రుఁ దో
యజదళనేత్రుఁ గుందసభస్యహాసు శుభైకదయావిలాసునిక్ష
సుజనహితుం దదంఘ్రిరతిఁ జొప్పడునామతి నామతించెదన్. 48

తా. యౌవనవతులగు గోపికలకు వలపుకాఁడై, యౌవనముచే మేను విలసిల్ల, సకలశుభలీలలు నెఱపుచు, మొల్లలవలెను మందారవృక్షమువలెను తెల్లనైననవ్వు మొగమునఁ దొలఁకాడ, మునులకెల్లను దామరలకు సూర్యుండువోలె నుల్లాసము గలిగించుచు, నందగోపాలునికిఁ గొమరుఁడై కొమరారు శ్రీకృష్ణుని పదారవిందములయందే నామనస్సు లీనమై నెలకొనియుండును గాత.

శ్లో॥ అరణ్యాని మార్ద్రస్మితమధురబిమ్బాధరసుధా
సరణ్యా సంక్రాన్తై స్స్నపది మదయ న్వేణునినదైః ।
ధరణ్యా సానన్దోత్పులక ముపగూఢాఙ్ఘ్రికమలః
శరణ్యానా మాద్య స్స జయతు శరీరీ మధురిమా ॥ 49

టీ. ఆర్ద్ర...సరణ్యా-ఆర్ద్ర=సరసమైన-లేక శ్రోత్రాదియైన, స్మిత = చిఱునగవు చేత, మధుర=మనోహరమైన, బిమ్బాధర=దొండపండువంటి యధరమందలి, సుధా = అమృతముయొక్క- సరణ్యా=ప్రవాహముతోడ, సంక్రాన్తైః = సంక్రమించినవి-కూడు కొన్నవి, అగు, వేణువినదైః=వేణునాదములచేత, సపది=తోడనే, అరణ్యానీం=పేగడ వినిమదయన్=విజృంభింపఁజేయునదియు, మొల్లచిగురుల్చుట మొదలైనవానిచే బృందా రణ్యము నతిశయింపఁజేయున దనుట-అధరమో దొండపండువంటిది: అందును ఆర్ద్రస్మిత ముచే మధురమైనది: కాఁబట్టి యమృతప్రవాహ మొలుకునది: అట్టియమృతప్రవాహము తోఁగూడుటచేతనే వేణునినదములు అరణ్యమును 'సపది' తోడనే విజృంభింపఁజేయునవని భావము. ధరణ్యా=భూమిచేత-భూదేవిచేతననుట, సాన...లకం యథాతథా-స+ఆనం ద+ఉత్పులకమ్=ఆనందముతోడను దానిచే వెలికి పిక్కటిల్లినపులకలతోడనుగూడినట్లు గా, ఉప...కమలః-ఉపగూఢ=ఆలింగనముసేయఁబడిన, అఙ్ఘ్రికమలః=పాదపద్మములు గలదియును శ్రీకృష్ణునిపాదపద్మములు సోఁకఁగా భూదేవికి ఆనందమును దానిచే పులక లను బుట్టెననుట. శరణ్యానామ్=రక్షకులలోపల, ఆద్యః=మొదటిదియును, శరీరీ=శరీర ముగలదియును-మనుష్యాకృతినిపొందినదియనుట, అగు, సః=ఆ-ప్రసిద్ధమైన, మధురిమా= సౌందర్యము-శరీరమును దాల్చినసౌందర్యమే యనఁదగు శ్రీకృష్ణమూర్తి యనుట-శ్రీ కృష్ణుని నిరతిశయసౌందర్యవిభవమునుజూడఁగా కృష్ణుఁడుగాఁడు శరీరముకలయిగొన్న సౌందర్యమే యనఁదగు నని భావము, జయతి=సర్వోత్కృష్టమై వర్తించుచున్నది.

మ. స్మితబింబాధరమాధురీకలితవంశీనాదమోదంబుచే
నతివిస్ఫూర్తిని గాననం బలరఁ బాదాంభోజసంసక్తిచే
క్షితి రోమాంచము గాంచెనో యని వితర్కింపం బ్రవర్తించు న
చ్యుతుఁ డుద్యన్మధురాభిరూప్యమున సర్వోత్కృష్టుఁడై వర్తిలున్.

తా. సొగసైనచిఱునవ్వుతోఁగూడి దొండపండువలె ఎఱ్ఱనైయొప్పు నధరమందలి యమృతప్రవాహముతోఁ గూడినవేణుధ్వనులచేబృందారణ్యమునుతోడనే యుల్లసిల్లఁజే యుచు, పయినిసోఁకు తనపాదకమలములను ఆనందముతోడిగగురుపాటున భూమియుఁ గౌఁగిలించుకొనఁగా, రక్షకులకెల్ల మొట్టమొదటివాఁడై, రూపము నొందినసౌంద ర్యమే యయిన శ్రీకృష్ణమూర్తి సర్వోత్కర్షముతో వర్తించుచున్నాఁడు.

శ్లో॥*ముగ్ధం స్నిగ్ధం మధురమురళీమాధురీధీరనాదైః
కారం కారం కరణవివశం గోకులవ్యాకులత్వమ్ ।

---

* ఈశ్లోకము ఒకకొన్నిప్రతియందే కనుపట్టుచున్నది. సవ్యాఖ్యానము లగు ప్ర తులందును గానిపింపదు. కావున దీనికి తెనుఁగుకవియుఁ బద్యము రచించినవాఁడు గాఁడు.

శ్యామం కామం యువజనమనోమోహనం మోహనాఙ్గం
చిత్తే నిత్యం నివసతు మహో వల్లవీవల్లభం నః॥ + 50

టీ. ముగ్ధం=మనోజ్ఞమైనదియు, స్నిగ్ధమ్=నిద్దమైనది_నిద్దమైనకాంతిగలదియనుట-లేక స్నేహస్వభావము గలదియు, మధుర... నాదైః_మధుర=మనోహరమైన, మురళీ=పిల్లఁగ్రోవియొక్క, మాధురీ = తీయఁదనము చేత, ధీర = దిట్టమైన - అతిశయించిన, నాదైః=ధ్వనుల చేత_పిల్లఁగ్రోవియొక్క మిక్కిలియుఁ బైనధ్వనుల చేత ననుట, కరణవివశం యథాతథా_కరణ=ఇంద్రియములు, వివశం యథాతథా = పరవశమగునట్లు, గోకులవ్యాకులత్వమ్ - గోకుల=వ్రేపల్లెయొక్క-వ్రేపల్లెయందలి గోగోపగోపికలయొక్క, వ్యాకులత్వమ్=ఆకులపాటును, కారంకారం=చేయుచున్నదియు, శ్యామం = నల్లనైనదియు, కామం=మిక్కిలియు, యువ... మోహనమ్-యువజన=యౌవనవంతులయొక్క,మనో=మనస్సులను-మగవారి మనస్సులనుగూడ ననుట, మోహనం=మోహింపఁజేయునది_నిరవధికసౌందర్యము చేత మగవారినిగూడ వలపించునదియు, మోహన + అఙ్గమ్=మోహమును బుట్టించునట్టి అవయవములుగలదియు, వల్లవీవల్లభమ్_వల్లవీ=గొల్లపడఁతులకు, వల్లభమ్=ప్రియమైనదియు, అగు, మహః=కృష్ణాఖ్యతేజము,నః =మాయొక్క,చిత్తే=మనస్సునందు, నిత్యం=ఎల్లప్పుడును, నివసతు=నివసించును గాక.

తా. మనోజ్ఞమై, నిద్దంపుఁగాంతులతోఁగూడి, మధురములైన వేణుధ్వనుల చేత వ్రేపల్లెలోనివారినెల్లఁ బారవశ్యముగలుగునట్లు ఆకులపఱచుచు, నల్లనై,వయసుకాండ్రను గూడ వలపించునంత సుందరమై, మనోహరమైన యవయవములతోఁగూడి, గొల్లచెలులకు మిక్కిలి ప్రియమైన శ్రీకృష్ణాఖ్యతేజము మాహృదయమందు ఎప్పుడును వెలుఁగుచుండును గాక.

శ్లో॥ విదగ్ధగోపాలవిలాసినీనాం
సంభోగచిహ్నాఙ్కితసర్వగాత్రమ్ ।
పవిత్రమామ్నాయగిరా మగమ్యం
బ్రహ్మ ప్రపద్యే నవనీతచోరమ్ ॥ 51

టీ. విదగ్ధ...విలాసినీనామ్-విదగ్ధ=సుందరులైన-లేకదిట్టలయిన, గోపాలవిలాసినీనామ్=గోపస్త్రీలయొక్క, సమ్భోగ...గాత్రమ్_సమ్భోగచిహ్న=రతియొక్క గుఱుతుల చేత, చిహ్నిత=గుఱుతుచేయఁబడిన_గోపస్త్రీలతో సంభోగించినగుఱుతులుగల, సర్వ=సమస్తమైన, గాత్రమ్=శరీరముగలదియు_సర్వగాత్రమునను సంభోగచిహ్నములు ఉన్నవనుటచే నానావిధబంధములతోఁ గూడిన గాఢరతి వ్యంజితమగుచున్నది. పవిత్రం =

---

ఇందుఁ బదసారస్యమేకాని లీలాశుకుని యుపజ్ఞవైభవముచూపట్టదు. కాన యిది లీలాశుకప్రణీతము గాకుండవచ్చుననియుఁ దోఁచుచున్నది.

పావనమైనదియు, ఆమ్నాయగిరాం=వేదాంతవాక్యములకు, అగమ్యం=పొందనలవిగాని దియు, నవనీతచోరమ్-నవనీత=వెన్నను, చోరం=దొంగిలించునదియు, అగు, బ్రహ్మ=శ్రీకృష్ణాఖ్యపరబ్రహ్మమును, ప్రపద్యే=భజించుచున్నాను. గోపాలవిలాసినులు విదగ్ధలు అగుటచేనే తనుగోపకులనుగూడ సరకుసేయకవేపుటించి కృష్ణునితోఁ గూడిరని హృదయము. గోపకులభార్యలతో సంభోగించుట యనుజారత్వదోషము గలవాఁడయ్యు 'జారోఽపిసంసారహరః' అన్నట్లు 'పవిత్రుఁడే' యగునదియు, వేదాంతములకును అందరానివాఁడయ్యు వెన్నలు దొంగిలించునట్టికేవలుఁడు నగు నదియు పరత్వవిభవమును అవతారప్రయుక్తలీలాసూచితమైన సౌలభ్యసౌభాగ్యమును దెలియునది.

మ. నవలావణ్యవిలాసినీనికరనానాబంధసంబంధనం
భవదగ్ధాంకశరీరు విశ్వపరమాత్మామ్నాయాంతవాచోవిధే
యవిహారుఁ నవనీతచోరుని బవిత్రాచారసంచారునిన్
భువనాధారుని శాంతిసారుని నిను౦ బూజింతు నెల్లప్పుడున్. 51

తా. నేరుపుకత్తెలగు గొల్లమిటారులతో రతికేళిసలిపినచిన్నెలుశరీరమునం దంతయు వన్నెఁజూపఁ బవిత్రుఁడై, వేదాంతవాక్యముల కందరానివాఁడయ్యు వెన్నలు దొంగిలించులీలలు నెఱపుచుఁ బరబ్రహ్మమై యొప్పు శ్రీకృష్ణుని భజించుచున్నాను.

అవ. ఒకానొక గోపికయెడ శ్రీకృష్ణుఁడు చూపిన యాశ్చర్యలీలను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అన్తర్గృహే కృష్ణ మవేక్ష్య చోరం
బద్ధ్వా కవాటం జననీం గతైకా।
ఉలూఖలే దామనిబద్ధ మేనం
తత్రాపి దృష్ట్వా స్తిమితా బభూవ॥ 52

టీ. ఏకా=ఒకతె-ఒకానొకగోపిక, అన్తర్గృహే=లోపలియింటను-ఇంటిలోఁగిటను, చోరం=నవనీతాదులను దొంగిలించుచున్నవాఁడైన, కృష్ణం=కృష్ణుని, అవేక్ష్య=చూచి, కవాటం=తలుపును, బద్ధ్వా=బంధించి-లోపలనుండి బయటికి కృష్ణుఁడు తప్పించుకొనిరాకుండునట్లుతలుపు ఈవలిగడియవైచి యనుట-జననీం=ప్రతి=(శ్రీ)కృష్ణుని తల్లి యశోదనుగూర్చి, గతాసతీ=పోయినదగుచు, తత్ర అపి=అక్కడఁగూడ-ఆయశోదయింటి యందుఁగూడ, ఉలూఖలే=ఱోటియందు, దామనిబద్ధం-దామ=త్రాటిచేత, నిబద్ధం=కట్టఁబడిన, ఏనం=వీనిని-తనయింటఁ జూచి తలుపుగడియ వైచివచ్చినయాకృష్ణునిన్నే, దృష్ట్వా=చూచి, స్తిమితా=నిశ్చేష్టురాలు, బభూవ=ఆయెను-తన యింటిలోఁగిట దొంగతనముతోఁ జిక్కుకొని యున్నాఁడు గదా-ఇది తల్లి యగు యశోదకుఁ దెలిపి

తోడ్కొనివచ్చి కృష్ణుని దొంగతనముగా రూపింపవచ్చు నని తలంచి యశోద యింటికి రాఁగా అక్కడను రోటఁ గట్టఁబడియుండుటను జూచి యాశ్చర్యపరవశయై భ్రమసి పడి నిలిచె నని యర్థము.

చ. నిలయములో నొకర్తు నవ ♦ నీతహరున్ హరిఁ గాంచి గట్టిగాఁ
దలుపు బిగించి యక్కొడుకుఁ ♦ దల్లికిఁ జెల్వఁగఁ బోయి యచ్చట లూ
ఖలగుణబద్ధుఁ డౌనతనిఁ ♦ గన్గొని యూఱడి వచ్చి రిత్తబా
వలు గని సారె కేక లిడ ♦ వత్తిలు నాబలుఁ గంటఁ గొల్చెదన్. 52

తా. ఒకానొక గోపిక తన యింటిలోఁగిట కృష్ణుఁడు వెన్న దొంగిలించుచుండఁగాఁ జూచి వాఁడు తప్పించుకొని పోకుండునట్లు ఆ లోఁగిలి తలుపు మూసి యశోదాదేవికిఁ జెప్పి చూపుటకై యామె యింటికిఁ బోవఁగా అచ్చటను ఆ కృష్ణుఁడే రోటను గట్టఁబడి యుండఁగాఁ జూచి ఆశ్చర్యపరవశయై యేమియుఁ దోఁపక యుండెను.

అవ.—శ్రీకృష్ణుని శైశవమందలి మానుషలీలను వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ రత్నస్థలే జానుచరః కుమారః
సఙ్క్రాన్త మాత్మీయ ముఖారవిన్దమ్ ।
ఆదాతుకామ స్తదలాభఖేదా
ద్విలోక్య ధాత్రీవదనం రురోద ॥ 53

టీ. జానుచరః=జాను=మోఁకాళ్ల చేత, చరః=సంచరించుచున్న, కుమారః=బిడ్డఁడగు శ్రీకృష్ణుఁడు, రత్నస్థలే=రతనములు దాపఁబడిన ప్రదేశమునందు-రతనంపు నెలకట్టునందు, సఙ్క్రాన్తం=తగులుకొన్న-ప్రతిబింబించిన యనుట. ఆత్మీయ...విన్దమ్-ఆత్మీయ=తనదైన, ముఖ + అరవిన్దమ్=ముఖకమలమును, ఆదాతుకామః=గ్రహింపఁగోరినవాఁడగుచు-రత్నస్థలమందు మోఁకాలితో జరుగుచుఁ బోవఁగా అందుఁ దామరవంటి తన మొగము ప్రతిఫలించెననియు దానిని శిశువుగావున ఒక తామర యని తలఁచి పట్టుకొనఁ గోరినవాఁడై, తత్ + అలాభఖేదాత్-తత్=అప్రతిబింబించిన ముఖారవిందముయొక్క, అలాభ=అప్రాప్తివలననైన-లభింపమిచేతఁ గలిగిన, ఖేదాత్=వగపువలన-ధాత్రీవదనం ధాత్రీ=దాదియొక్క, వదనమ్=మొగమును, విలోక్య=చూచి, రురోద=ఏడ్చెను.

మ. ఘనరత్నస్థగితావనిన్ నిజముఖా ♦ కారంబు పద్మాకృతిం
గనుపట్టం గని నవ్వి తద్గ్రహణకాం ♦ క్షం జిన్నికేల్ సాచి చే
రనిఖేదంబున జానుయానము దలి ♦ ర్చన్ దాని నీక్షించి కా
వనుచుం బోరిడునందనందనుని మా ♦ యాడింభకుం గొల్చెదన్. 53

తా. బాలకుండగు చిన్నికృష్ణుఁడు రత్నములు దాపిన నెలకట్టునందు మోఁకాళ్లచే జరుగుచుఁ బోవఁగా అందుఁ దామరవంటి తన మొగము ప్రతిఫలించుటఁ జూచి దానిని నిసువగుటచే ఒక తామరగాఁ దలఁచి పట్టుకోనఁ గోరఁగా అది చిక్కకుండుటచే దుఃఖము కలిగి దాదిమొగమును గాంచి రోదించెను.

శ్లో॥ ఆనన్దేన యశోదయా సమదనం గోపాఙ్గనాభి శ్చిరం
సాశఙ్కం బలవిద్విషా సకుసుమైః సిద్ధైః పృథివ్యాకులమ్ ।
సేర్ష్యం గోపకుమారకై స్సకరుణం పౌరై ర్జనైః సస్మితం
యో దృష్టః స పునాతు నో మురరిపుః ప్రోత్క్షిప్త గోవర్ధనః॥ 54

టీ. యశోదయా=యశోదచేత, ఆనన్దేన=ఆనందముతోడను,గోప + అఙ్గనాభిః=గోపస్త్రీలచేత, సమదనం యథాతథా=మన్మథునితోఁ గూడుకొన్నట్లును-మన్మథవికారముతోడను, బలవిద్విషా=దేవేంద్రునిచేత, చిరం=తడవుగాను, సాశఙ్కమ్=శంకతోఁ గూడుకొన్నట్లును-కృష్ణుఁడేమి సామాన్యుఁడా అతిశయుఁడా అను శంకతోడ ననుట, సకుసుమైః=పువ్వులతోఁగూడిన, సిద్ధైః=సిద్ధులచేత-సిద్ధులచేఁ బువ్వులతోడను అనుట, పృథివ్యా=భూమిచేత, ఆకులం=కలఁగినట్లును-కలఁతతోడను-పర్వతమును ఎత్తెను కావున డికి కలఁతనొందియనుట, గోపకుమారకైః=గొల్లపిల్లవాండ్రచేత,స + ఈర్ష్యమ్=అసూయతోఁ గూడినట్లును-మనకంటె వీఁడు అతిశయుఁ డయ్యెనుగదా అని అసూయతోడను అనుట, పౌరైః=పురజనులచేత, సకరుణం=దయతోఁగూడినట్లుగాను-బాలుఁడు పెద్దకొండనెత్తి యేమికష్టపడునో అనుజాలితోడననుట, జనైః=తక్కినజనులచేత, సస్మితం=నవ్వుతోఁగూడినట్లును-నవ్వుతోడను, యః=ఎవఁడు, దృష్టః=చూడఁబడెనో, ప్రోత్క్షిప్తగోవర్ధనః-ప్రోత్క్షిప్త=చక్కఁగా పైకి ఎత్తఁబడిన, గోవర్ధనః=గోవర్ధనపర్వతము గలవాఁడైన-గోవర్ధనపర్వతమును బొడవుగా ఎత్తినవాఁడైన, సః=ప్రసిద్ధుఁడైన, మురరిపుః=శ్రీకృష్ణమూర్తి, నః=మమ్ము, పునాతు=పవిత్రులను జేయుఁగాత.

చ. ముదమున నంద గోపికలు ♦ మోహామునన్ జనపాళి నవ్వునం
ద్రిదశవిభుండు సాధ్వసమ ♦ తిన్ విరివానల సిద్ధపుంగవుల్
పొదలినయాకులత్వమున ♦ భూమియు గోపకుమారు లేపునన్
సదయతఁ బౌరులుం గన ర ♦ సాధర మెత్తినచక్రి ప్రోచుతన్. 54

తా. శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతమును ఎత్తఁగా ఆనందముతో యశోదయు, మన్మథవికారముతో గోపికలును, వీఁడేమి సామాన్యుఁడు కాఁడు కాఁబోలునని శంకతో దేవేంద్రుఁడును, మెప్పుచే పువ్వులు చల్లుచు సిద్ధులును, కొండనెత్తిన యదరపడికి కలఁతపడి భూమియు, మనకంటె మించినవాఁడయ్యెను గదా యని అసూయతో గొల్లపిల్ల

వాఁడనుచు, అయ్యో పసిబాలుఁ డెంతకష్టమో యని జాలితో పురజనులును, సెబాసు అని నవ్వుచు తక్కినజనులును జూచిరి. అట్లు చూడఁబడిన శ్రీకృష్ణుఁడు మమ్ము పవిత్రులను జేయుఁగాక !

అవ. కవి తనకు భగవంతుని కృష్ణావతారమందును అందును కృష్ణుని బాల్యలీలలయందునే మిక్కిలియుఁదాత్పర్యము గలదని చెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఉపాసతా మాత్మవిదః పురాణాః
పరం పుమాంసం నిహితం గుహాయామ్ ।
వయం యశోదాశిశుబాలలీలా
కథాసుధాసిన్ధుషు లీలయామః ॥ 55

టీ. పురాణాః = పూర్వులైన, ఆత్మవిదః = ఆత్మస్వరూపమును దెలిసినవారు-తత్త్వవేత్తలు, గుహాయాం = హృదయమందు-దహరాకాశమందు, నిహితం = ఉంపఁబడినవాఁడగు-హృదయమధ్యంబున పరమాత్మస్వరూపముగా వెలుఁగుచున్నవాఁడైనవాఁడనుట, పరం పుమాంసమ్ = పరమపురుషుని, 'పరం పరస్మాత్' అను పాఠమున-పరస్మాత్ = పరమునకన్నను-పరం = పరమైన తత్త్వమును అనుట, ఉపాసతాం = ఉపాసింతురుగాక-ఆత్మస్వరూపవిదులు పరమాత్మస్వరూపమును గనుఁగొని యుపాసించిన నుపాసింపనీ, వయం = మేము, ఆత్మస్వరూపమును దెలియని సామాన్యులమైన మేము, యశోదా...సిన్ధుషు-యశోదా = యశోదయొక్క, శిశు = శిశువైన కృష్ణునియొక్క, బాలలీలా = బాలక్రీడలను సంబంధించిన, కథా = కథ అనెడి, సుధాసిన్ధుషు = అమృతనదులయందు- అమృతప్రవాహములవలె అత్యంతభోగ్యము లైన శ్రీకృష్ణుని బాలక్రీడాచరిత్రములందు, లీలయామః = విహరించుచున్నాము. పరస్వరూపము మాకు వలదు; సౌలభ్యప్రయుక్తమై శ్రీకృష్ణాఖ్యమైన అవతారరూపమే మాకు ప్రియ మని భావము.

మ. దహరాకాశనివాస మాపరము సాత్మజ్ఞాను లీక్షించి ప్ర
త్యహముం గాంతురు గాక నే నలయశోదాబాలలీలాసుధా
లహరీవీచిపరంపరం గడిసి కల్లోల్ గాఁగఁ గ్రీడించుచు
న్నవాన్ప్రౌఢిఁ దెలుంగుడెందమున నానందంబు సంధించెదన్. 55

తా. పూర్వులైన పరతత్త్వవిదులు హృదయమందలి దహరాకాశమున నున్న పరమపురుషుని పరమాత్మస్వరూపమును ఉపాసించిన నుపాసింతురుగాక. మేమో సౌలభ్యముచే యశోదకుఁ జిన్నబాలుఁడై యవతరించిన శ్రీకృష్ణునిబాలక్రీడాచరిత్రము అనెడి అమృతప్రవాహములందే యోలలాడెదము.

అవ. శ్రీకృష్ణునియం దాసక్త యైనయొక గోపిక పారవశ్యమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ విక్రేతుకామా కిల గోపకన్యా, మురారిపాదార్పితచిత్తవృత్తిః।
దధ్యాదికం మోహవశాదవోచ,ద్గోవిన్ద దామోదర మాధవేతి॥56

టీ. దధి + ఆదికమ్= పెరుఁగు మొదలగువానిని, విక్రేతుకామా=విక్రయింపఁగోరిక గల, గోపకన్యా=ఒక గొల్లకన్నియ, మురారి=...వృత్తిః=మురారి శ్రీకృష్ణునియొక్క, పాద=పాదములందు, అర్పిత=సమర్పింపఁబడిన, చిత్తవృత్తిః=మనోవ్యాపారముగలదియై శ్రీకృష్ణునియందుగులే చింతించుచున్నదై యునుట, మోహవశాత్=(కృష్ణునియందలి) మోహముවలన, గోవిన్ద=గోవిందా అనియు, దామోదర=దామోదరా యనియు, మాధవ ఇతి= మాధవా అనియు, అవోచత్ కిల=పలికెనట, పెరుఁగు అమ్మునపుడు పెరుఁగో యనిపలుకక 'గోవిందా మాధవా' యని మోహపారవశ్యమునఁ బలికిన దని యర్థము.

మ. నవలావణ్యవిలాసినీతిలక మాఘనందంబునన్ నందనం
భవపాదార్పితచిత్తవృత్తి మరలెంగఁ నేరకే వీటిలో
నవనీతాదిక మమ్ముచో మఱపుఁజెంగవం బౌరులం గాంచి మా
ధవ గోవింద ముకుంద కృష్ణ యను నుగ్యస్నోహవిభ్రాంతితోన్.56

తా. ఒక గోపకన్య వ్రేపల్లెయందు పెరుఁగు మొదలగువానిని అమ్మఁగోరి శ్రీకృష్ణుని పాదంబులయందే తనమనంబు తగులువడి మోహము మించఁగా పెరుఁగో పెరుఁగు అనుటకు మాఱుగా గోవిందా దామోదరా మాధవా యని పలుకుచుఁ దిరిగెనఁట.

అవ. శ్రీకృష్ణుఁడు దొరకఁగూడినచోటులు మూఁటిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ఉలూఖలం వా యమునాం మనో వా
గోపాఙ్గనానాం కుచకుట్మలం వా।
మురారినామ్నః కలభస్య నూన
మాలాన మాసీ త్త్రియ మేవ భూమౌ॥ 57

టీ. మురారినామ్నః=మురారి=శ్రీకృష్ణుఁడనెడి, నామ్నః=పేరుగల, కలభస్య= ఏనుఁగుగున్నకు, ఉలూఖలం వా=ఱోలుగాని, యమినాం=మునులయొక్క, మనో వా=మనస్సుగాని, గోపాఙ్గనానాం=గోపస్త్రీలయొక్క, కుచకుట్మలం వా=చనుమొగ్గగాని-మొగ్గలవంటిచన్నులుగాని ఇటు త్ర్యేకవచనము, భూమౌ=భూమియందు, (ఆ) మేవ=(ఈ)

మూఁడే, ఆలానం=కట్టుఁగంబము, ఆసీత్=ఆయెను, నూనం=నిశ్చయము-మురారిని కలభ మనుటచే కలభమువలె నిరంకుశమైనవిహారము గలిగియుండుటను దెలియునది. అట్టి వానికిఁగట్టుఁగంబములవంటివి మూఁడేకాని మఱియొకచోట నది చిక్కువడదు గాన కానరాదని భావము. యశోదకు వాత్సల్యముచేతను మునులకు మనోనిగ్రహాదులంబట్టియు గోపికలకు మోహామువలనను జిక్కినాఁడని తెలియునది.

చ. మునిజనమానసాంబురుహకముం బశుపాలకబాలికామణీ
స్తనవనజాతకోరకవి తాన ములూఖలమున్ మురారిమో
హానకలభంబు నిల్పుటకు నై విలసిల్లినకట్టుఁగంబముల్
దనరెడు నొండురెండు నివి దక్క ధరాస్థలిఁ గల్గనేర్చునే. 57

తా. యశోదయింటిఱోలును, మునుల మనస్సులును, గోపికల చనుమొగ్గలును, అనెడి యీమూఁడే శ్రీకృష్ణుఁ డనెడి యేనుఁగుగున్నకు కట్టుఁగంబములు. మఱొక్కచోట అది కట్టుపడ దనుట నిక్కము.

అవ. వటపత్రమున శయనించువైఖరిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కరారవిన్దేన పదారవిన్దం, ముఖారవిన్దే వినివేశయన్తమ్।
వటస్య పత్రస్య పుటే శయానం, బాలం ముకున్దం మనసా స్మరామి॥

టీ. కర+అరవిన్దేన-హస్తకమలముచేత్=తామరవంటిచేయిచేత, పదారవిన్దమ్=అడుగుఁదామరను-తామరవంటి యడుగును, ముఖ+అరవిన్దే=మోముఁదామరయందు-తామరవంటి మొగమునందు, వినివేశయన్తం=చొనుపుచున్నవాఁడును, వటస్య = మఱ్ఱి యొక్క, పత్రస్య=ఆకుయొక్క, పుటే = దొన్నెయందు-దొన్నెవలె నడుమ పల్లముగా నున్న మఱ్ఱియాకునందు, శయానమ్=శయనించువాఁడును, బాలం=బాలుఁడును, అగు, ముకున్దమ్=కృష్ణుని, మనసా=మనస్సుచేత, స్మరామి=స్మరించుచున్నాను.

శా. కేలుందామరచేఁ బదాబ్జ మెలమిం గీలించి నెమ్మోముపై
హాళిన్ నిల్పి వటప్రవాళమృదుశయ్యం బొల్చునబ్బాలునిన్
లీలాలోలవిశాలలోచనుని లోలిం బెట్టి లాలించుచున్
జోలల్ వాడుయశోదభాగ్యమున కే జోహారు గావించెదన్. 58

తా. కరకమలమునఁ బాదకమలమునుబట్టి ముఖకమలంబునఁ జొనుపుచు వటపత్రంబునఁ బవ్వళించు బాలుండైన ముకుందుని మనంబున స్మరించుచున్నాను.

అవ. శ్రీకృష్ణుఁడు ఒకప్పుడు నిజపరత్వసూచకముగాఁ గలలోఁ బలికినమాటలను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ శమ్భో స్వాగత మాస్యతా మిత ఇతో వామేన పద్మాసన
క్రౌఞ్చారే కుశలం సుఖం సురపతే విత్తేశ నో దృశ్యసే।
ఇత్థం స్వప్నగతస్య కైటభజిత శ్శ్రుత్వా యశోదా గిరః
కిం కిం బాలక జల్పసీతి రచితం ధూథూకృతం పాతు నః॥ 59

టీ. హేశమ్భో=ఓశివుఁడా, స్వాగతం=స్వాగతము. పద్మాసన=ఓబ్రహ్మ, ఇతః ఇతః=ఇటుఇటు. ఈప్రక్క, వామేన=దాపల, ఆస్యతామ్=కూర్చుండుట సేయఁబడును గాక-కూర్చుంపుమా యనుట, హేక్రౌఞ్చారే=ఓయికుమారుఁడా, కుశలం=కుశలమా, హేసురపతే=ఓయియింద్రుఁడా, సుఖం=సుఖమా ఏమి, హేవిత్తేశ=ఓకుబేరుఁడా, నోదృశ్యసే=చూడఁబడవు-కనఁబడవేమి యనుట, ఇత్థం=ఈప్రకారముగా, స్వప్నగతస్య-స్వప్న=కలను, గతస్య=పొందిన-కలగనుచున్న, కైటభజితః=కృష్ణునియొక్క, గిరః=వాక్యములను, యశోదా=యశోదాదేవి, శ్రుత్వా=విని, హేబాలక=ఓరిబాలకుఁడా, కిం కిం=ఏమిఏమి, జల్పసి=గొణఁగుచున్నావు, ఇతి=అని, రచితం = చేయఁబడిన - యశోద చేసిన, ధూథూకృతమ్=ధూథూకారము, నః=మమ్ము, పాతు=రక్షించునుగాక.

మ. హర రా రమ్ము శుభంబె డాపలను భాగ్యపాధీశ కూర్చుండుమా
పరిణామంబె కుమార యింద్ర సుఖమే యౌ పౌలస్త్య వీక్షింప మే
సరణిన్ నిన్ననఁగా యశోద విని వత్సా యేమి యే మంచు ని
ద్దురమ బ్బాలునికృష్ణుపై నిడినధూథూంకారముల్ ప్రోచుతన్. 59

తా. ఒకప్పుడు శ్రీకృష్ణుఁడు కలగనును ఆకలలో 'ఓశివుఁడా! నీకు స్వాగతము. ఓబ్రహ్మ! ఇటుదాపలిప్రక్క కూర్చుండుము. కుమారుఁడా! నీవుఁగుశలమా? దేవేంద్రా! నీవు సుఖమా? కుబేరా! కనఁబడవేమి?' అని పలుకుచుండఁగా యశోద విని 'నాయనా! ఏమేమి గొణఁగుచున్నావు? ధూథూ ఊరకుండుము! చిరకాలము జీవింపుము.' అని చేసిన ధూథూకారము మమ్ము రక్షించుఁగాక.

అవ. ఒకప్పుడు యశోదకును శ్రీకృష్ణునకును జరిగినసంవాదముఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మాతః, కిం యదునాథ, దేహి చషకం, కిం తేన, పాతుం పయ
స్తన్నాద్య, కదాస్తి వా, నిశి, నిశా కా, వాన్ధకారోదయః।
ఆమీల్యాక్షియుగం నిశా ప్యుపగతా దేహీతి మాతు ర్ముహు
ర్వక్షోజాంశుకకర్షణోద్యతకరః కృష్ణ స్స పుష్ణాతు నః॥ 60

టీ. హేమాతః=ఓతల్లీ-ఇది కృష్ణునివాక్యము, యదునాథ=కృష్ణా! కిం=ఏమి-ఇది యశోదవాక్యము. (కృష్ణ) చషకం=పానపాత్రను, దేహి=ఇమ్ము. (యశో) తేన=ఆ

వంచించుటయందు-పాలుద్రాగినచో సిగ పెరుఁగుననియూరకయే యబద్ధముచెప్పివంచిం చుటయందు, పరాః=ఆసక్తను లైన,యశోదాగిరః=యశోదవాక్యములను,శ్రుత్వా = విని, ప్రముదితః సన్=నిక్కిలిసంతోషించినవాఁడగుచు, క్షీరే=పాలు, అరపీతేసతి = సగము త్రావఁబడఁగా,స్వశిఖామ్-స్వ=తనయొక్క, శిఖాం=సిగను,స్పృశన్=తాఁకుచున్న వాఁడై న-పాలుత్రాగితిమే సిగపెరిఁగెనా యని బేలవలె దానిని ముట్టిచూచుచున్న, హరిః=శ్రీ కృష్ణుఁడు, నః=మమ్ము, పాయాత్=రక్షించుఁగాత! యశోద కృష్ణుని ఇతరబాలుర తోఁబాటిగాఁ దలఁచి ఏమఱించి పాలుత్రాగింపఁజూచినదై బలరాముఁడు వచ్చునంతలో పాలుత్రాగుము. లేకున్న వాఁడువచ్చి దానిం త్రాగివైచునని బెదరుచూపెననియు, పాలు త్రాగినయెడల సిగపెరుఁగునని యబద్ధముచెప్పివంచించెననియు, కృష్ణుఁడుఅది తెలిసియుఁ దెలియనివానివలె పాలగిన్నెయెత్తుకొని సగముపాలు త్రాగినంతటనే తనసిగ పెరిఁగెనా యని దానిని అంటిచూచుకొనెననియు మౌగ్ధ్యనాటకము తెలియుచున్నది.

ఉ. హేళితనూభవాపులినకేళిఁ జరించుచు బలుఁడు రాకమున్
బాలక పైఁడిగిన్నెఁ గలక్షపాల్ వెస నానుము గొప్పవెండ్రుక
ల్గాలు నటన్న నందనతికలాలనమాటల నుబ్బి సామిపాల్
గ్రోలుచుఁ జుంచుఁ జూచికొను గోపకుమారుఁడు నన్నుఁ బ్రోచుతన్.

తా. యశోద కృష్ణునిఁజూచి 'ఓకృష్ణా! బలరాముఁడు యమునానదియిసుకదిన్నె లలో విహరింపఁబోయెను.వాఁడువచ్చునంతలోపల గిన్నెలోనిపాలుత్రాగుము. మఱియు ను బాలుత్రాగినయెడల సిగపెరుఁగును' అనితన్ను బాలునిఁగా నెంచి పాలు త్రాగించుట కై ఏమఱించుమాటలు విని కృష్ణుఁడు తెలిసియు, తెలియనివానివలె గిన్నెదీసికొనిసగము పాలు త్రాగినంతనే సిగ పెరిఁగెనాయని దానిని దడవి చూచుకొనెను. ఇట్లు మౌగ్ధ్యలీల ను నటించిన శ్రీకృష్ణుఁడు మమ్ముఁ బ్రోచుఁగాత!

అవ. యశోదఒకప్పుడు కృష్ణుఁడుమన్నుదినెనని విని యతనిని'మన్నేలతింటివి, వసఁగా నతఁడు 'నేనుమన్ను దినలేదు. నానోరుచూడు' మని నోరు తెఱచిచూపఁగాఅందుపర్వతసముద్రములతోఁ గూడినప్రపంచము ను జూచినదయ్యు అది నిజమని నమ్మక వేఱువిధముగాగ్రహించిఅజీర్తి కలిగిన దని యాశీర్వదించుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కైలాసో నవనీతతి క్షితి రయం ప్రాగ్జగ్ధమృల్లోష్టతి
క్షీరోదోఽపి నిపీతదుగ్ధతి లస త్స్మేరే ప్రఫుల్లే ముఖే।
మాత్రాఽజీర్ణధియా దృఢం చకితయా నష్టాఽస్మి దృష్టః కయా
థూథూ వత్సక జీవ జీవ చిర మి త్యుక్తోఽవతా న్నో హరిః॥ 62

టీ. లసత్ స్మేరే-లసత్=ప్రకాశించుచున్న, స్మేరే=చిఱునగవుగల, ముఖే=శ్రీకృష్ణుని మొగము-నోరుఅనుట, ప్రఫుల్లేసతి=మిక్కిలి వికసించినదికాఁగా-కృష్ణుఁడు నోరు తెఱచి చూపఁగా ననుట, కైలాసః=కైలాసపర్వతము, నవనీతతి=వెన్నవలె నాచరించుచున్నది. ఇయం=ఈ, క్షితిః=భూమి, ప్రా...ష్టతి-ప్రాక్=పూర్వము, జగ్ధ=భక్షింపఁబడిన,మృత్ + లోష్టతి=మట్టిపెళ్ళవలె నాచరించుచున్నది. క్షీరోదః అపి=పాలసముద్రమును, నిపీతదుగ్ధతి-నిపీత=మిక్కిలి త్రావఁబడిన, దుగ్ధతి = పాలవలె నాచరించుచున్నది. అజీర్ణధియా=అఱుకను అనెడిబుద్ధిచేత, దృఢం=మిక్కిలి, చకితయా=భయపడిన దైన, మాత్రా=తల్లియైనయశోదచేత, కయా=ఎవ్వతెచేత, దృష్టః = చూడఁబడినవాఁడో, నష్టా=చెడినదానను, అస్మి = అగుచున్నాను-ఎవ్వతెకనుఁజూపు నాబిడ్డపైఁ దగిలెనో నేను చెడిపోతిని అని తాత్పర్యము. హేవత్సక = ఓబిడ్డా, థూథూ = థూథూయని అనుకరణము, జీవజీవ=జీవింపుము జీవింపుము, ఇతి=అని, ఉక్తః=చెప్పఁబడినవాఁడైన, హరిః=శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, అవతాత్=రక్షించుఁగాక. కైలాసాదులను నోటియందుఁజూచియు బాలుఁడనెడు బుద్ధిచేత వానినెల్ల నవనీతాదులుగా గ్రహించి అవి యెవ్వతె కన్ను పడెనో జీర్ణింపక యట్లె నిలిచియున్న వనుచు 'జీవజీవ'యని యశోద యాశీర్వదించెనని యర్థము. జగత్తంతయు లోపలఁ గలవాఁడని తెలియునది.

చ. ననిచిననవ్వొనెమ్మొగమున్ననన్ ధర భక్షితమృత్తుగాఁ బయో
వనధి నిపీతదుగ్ధసమవస్థితిగా రజతాద్రి వెన్నగాఁ
గని భ్రమఁ జెల్ల నేచెలువ గాంచెనొ దృష్టిగ నంచు నంబ దీ
వనమును థూత్కృతుల్ నినుప వర్తిలుపాపని ప్రాపుఁగాంచెదన్.

తా. యశోద కృష్ణుఁడు నోరు చక్కఁగా తెఱచిచూపఁగా లోపలఁగనఁబడిన వెండికొండను వెన్నముద్దగాను, భూమిని మునుదిన్నమట్టిపెళ్ళగాను, పాలసముద్రమును మిక్కిలిగాత్రాగినపాలుగాను, గ్రహించినదై యివి యంతయు అఱిగిలేదని తలంచి మిక్కిలి భయపడి 'అయ్యో ఎవ్వతె కన్ను పడినదో నేను చెడిపోతినే, థూథూ! నాయనా! చిరకాలము బ్రతుకుము బ్రతుకుము' అనిచెప్పెను. అట్లుతల్లిచేతఁ జెప్పఁబడిన కృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక!

అవ. శ్రీకృష్ణుఁడు చనుఁబాలు త్రాగునప్పటివైఖరిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కిఞ్చిత్కుఞ్చితలోచనస్య పిబతః పర్యాయపీత స్తనం
సద్యః ప్రస్నుతదుగ్ధబిన్దు మపరం హస్తేన సమ్మార్జితః।

మాత్రైకాఙ్గులిలాలితస్య చుబుకే స్మేరాననస్యాధరే
శౌరేః క్షీరకణాన్వితా నిపతితా దన్తద్యుతిః పాతు నః॥ 63

టీ. పర్యాయపీతం-పర్యాయ=క్రమముచేత, పీతం=త్రాగఁబడిన-అనఁగా ఒక చన్నుత్రాగినపిదపఁ గ్రమముగాఁ ద్రాగఁబడుచున్నదైన, స్తనం=చన్నును, పిబతః=త్రాగుచున్నవాఁడును-దీనిచేత ఇంతకుముందు ఒకచన్నును ద్రాగివిడిచినాఁడనియు ఇప్పుడు మఱొక చన్నును ద్రాగుచున్నాఁడనియుఁ దెలియుచున్నది. బిడ్డలుఒక్కొక్కచన్నుగా వరుసగా మార్చి మార్చి త్రాగుటను ఇట అనుసంధించునది. కిఞ్చిత్...లోచనస్య-కిఞ్చిత్=కొంచెము, కుఞ్చిత-వంపఁబడిన, లోచనస్య=కన్నులుగలవాఁడును, సద్య...బిన్దుమ్-సద్యః=అప్పుడే, ప్రస్నుత=కాఱిన, దుగ్ధబిన్దుమ్=పాలబొట్లుగలిగిన, అపరం స్తనం=మఱియొకచన్నును-ఇది యింతకుఁ గొంతముందే త్రాగి విడువఁబడినది గాన నిం దిప్పుడే పాలబొట్లుకొన్ని కాఱియున్నవనుట. ఇట్టియాచన్నును, హస్తేన=చేతితోడ, సమ్మార్జతః=రాయుచున్నవాఁడును, మాత్రా=తల్లిచేత, చుబుకే=గడ్డమునందు, ఏకా...లాలితస్య-ఏకా=ఒక, అంగులి=వ్రేలిచేత, లాలితస్య-బుజ్జగింపఁబడినవాఁడును, స్మేర+ఆననస్య=నవ్వుమొగముగలవాఁడును, అగు, శౌరేః=కృష్ణునియొక్క, అధరే=మోవియందు, నిపతితా=పడియున్నదియు, క్షీర...న్వితా-క్షీరకణ=పాలబిందువులతోడ, అన్వితా=కూడినదియు, అగు దన్తద్యుతిః-దంత=పండ్లయొక్క, ద్యుతిః=కాంతి, నః=మమ్ము, పాతు=రక్షించుఁగాక, కన్నులు కొంతవంచి ఒకచన్ను మార్చియొకచన్నుఁగా బాలు త్రాగుటయు ఒకచన్ను త్రాగునపుడు మఱియొకచన్నును జేతితోఁ బుడుకుచుండుటయు బాలలక్షణము. తల్లి వ్రేలితోఁ జిన్ని కృష్ణుని గడ్డమును బుడుకఁగా నతఁడు 'స్మేరాననుఁ' డగుచు నవ్వెనయ్యు నప్పుడు పాల బొట్లతోఁగూడిన పలువెలుంగులు పెదవిపయిని బడె ననియు భావము.

చ. ఒకకుచ మాని వేఱొకకుచంబు గ్రోలుచు నొక్కకుచం బొకకేలఁ బూని యా
ముకుళితనేత్రుఁడై జననికమ్మునఁ జుబుకంబు వ్రేలఁ జి
ట్టకముగ నంటి మోవి [illegible] బగు లేనగ వొప్పశౌరి దు
గ్ధకణసమేతదంతరుచిరతప్రగతిన్ నను బ్రోచు గావుతన్. 63

తా. కన్నులు కొంతవంచి మునుపు త్రాగిన చన్నును విడిచి మఱొక చన్నునుబట్టి త్రాగుచు నపుడె బొట్లు గాఱియున్న మునుపటిచన్నును జేతితోఁ బుడుకుచు, తల్లియొక్క వ్రేలితో నల్లన చుబుకమును బుడుకఁగాఁ జిఱునవ్వునవ్వి దానిచేత లోపలిపండ్ల కాంతులు పాలబొట్లతోఁగూడి పెదవిపయిని బడఁగా బెడఁగారుచున్న కృష్ణుఁడు మమ్ముఁ బ్రోచుఁగావుత.

అవ. లక్ష్మీకల్యాణమంగళలీలాంబి శేషమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ఉత్తుఙ్గస్తనమణ్డలోపరిలసత్ప్రాలమ్బముక్తామణే
రన్తర్బిమ్బిత మిన్ద్రనీలనికరచ్ఛాయానుకారిద్యుతేః।
లజ్జావ్యాజ ముపేత్య నమ్రవదనా స్పష్టం మురారే ర్వపుః
పశ్యన్తీ ముదితా ముదేఽస్తు భవతాం లక్ష్మీ ర్వివాహోత్సవే॥64

టీ. వివాహ+ఉత్సవే=వివాహమనెడి ఉత్సవకాలమందు, లజ్జావ్యాజమ్-లజ్జా=సిగ్గుఅనెడి, వ్యాజం=నెపమును, ఉపేత్య=పొంది-సిగ్గునుబట్టియనుట, నమ్రవదనా-నమ్ర=వంగిన,వదనా సతీ=ముఖముగలదియై, ఉత్తుఙ్గ...మణేః-ఉత్తుఙ్గ=పొడవైన, స్తనమండల=చనుప్రదేశముయొక్క, ఉపరి=మీఁద, లసత్=ప్రకాశించుచున్న, ప్రాలంబ=మెడనుండి రొమ్మునందు సరిగా వ్రేలెడి హారముయొక్క, ముక్తామణేః=ముత్తెముయొక్క, అంతః=నడుమ, బింబితం=ప్రతిఫలించినదైన, ఇన్ద్ర...ద్యుతేః-ఇంద్రనీల = ఇంద్రనీలమణుల యొక్క, నికర=సమూహముయొక్క, ఛాయా=కాంతిని, అనుకారి=అనుకరించునట్టి,ద్యుతేః=కాంతిగలవాఁడైన, మురారేః-కృష్ణునియొక్క, వపుః=దేహమును, స్పష్టం=విశదముగా, పశ్యన్తీ=చూచుచున్నదియు, కావుననే, ముదితా=(పురుషునిఁ జూడవలయునను కోరిక ఈతీరున సిద్ధించుటచే) సంతోషించినదియు, అగు, లక్ష్మీః=లక్ష్మీదేవి-లక్ష్మీరూపమైన రుక్మిణీదేవి; భవతాం=మీయొక్క, ముదే=సంతోషముకొఱకు, అస్తు=అగుఁగాక. రుక్మిణీదేవి తనపెండ్లియపుడు శ్రీకృష్ణుని చూడఁగోరి పెండ్లికూఁతురుగావునఁ జక్కఁగా ఆతనిని చూచుటకుఅనువుపడక సిగ్గునెపమున తలవంచి యుబ్బుగుబ్బలమీఁదనున్న తెలిముత్తెమునందుఁ జక్కఁగాఁ బ్రతిఫలించినయతనినల్లనిమూర్తిని జూచి ముదముఁబొందె నని యర్థము. ముక్తామణియందుఁ బ్రతిబింబమును స్పష్టముగాఁ జూచుటనుఁ జెప్పుటచే ఆముత్తెము ప్రతిబింబమును స్పష్టముగాఁ గనఁబఱుచునంత పెద్దనాయకమణిగా నుండునని తెలియునది. మఱియు కృష్ణునిదేహము నల్లనిదిగానఁ దెల్లనిముక్తామణియందు 'స్పష్ట'ముగాఁ గనఁబడెనని యూహ్యము.ఆముక్తామణిరొమ్మునందు సరిగా వ్రేలుచుండిననే రుక్మిణి తలవంచికొన్నపుడు అందలిప్రతిబింబము కనఁబడఁజాలునుగాని రొమ్మునకుపైనికంఠమందుఁగాని రొమ్మునకుఁగ్రిందుగాఁగాని వ్రేలుచుండెనేనిఆప్రతిబింబము కనఁబడనేరదు. కావుననే'ప్రాలంబ'ముయొక్క-అనఁగారొమ్మునకుసరిగా వ్రేలుహారముయొక్క-ముక్తామణి యన్నాఁడు.ఇంతేకాకఆముక్తామణి సరిగాఁగ్రిందికి వ్రేలుచుండెనేని అందలిప్రతిబింబము రుక్మిణికిమిక్కిలితలవంచుకొన్ననుఁ జక్కఁగాఁ గనఁబడనేరదు. అట్లుగాక అది'ఉత్తుఙ్గస్తనమణ్డలోపరి'ముందఱికి నిక్కియున్న విఱివిగుబ్బలమీఁద బాఱువుగా ఊనియుండుటచే అందలిప్రతిబింబమును దలవంచుకొన్నంతనే సుఖముగాను స్పష్టముగాను గనఁబడఁగూడును. కావుననే, ఉత్తుంగస్తనమండలముమీఁదిదిగా దానిని చెప్పినాఁడని తెలియునది.

ఆప్రతిబింబమును జూచి ముదము నొందినదిగావున నే మీకును ముదము నొసంగు ననుట.

మ. హరినీలచ్ఛవిఁ గేరుశౌరిమృదుదేహచ్ఛాయ వక్షోరుహా
పరిముక్తామణియందుఁ గన్పడఁ బ్రసాదవ్యాజంబునం బెండ్లికూఁ
తురు దాఁ గావున మోము వాంచికొని సంతోషస్థితిం జెందునిం
దిర మీ కీవుత నిష్టసంపద దపాంగదృష్టిన్ విలోకించుచున్. 64

తా. తనవివాహమునందు రుక్మిణీదేవి శ్రీకృష్ణుని చూడఁగోరి పెండ్లికూఁతురు గావున చక్కఁగాఁ జూడనేరక సిగ్గునెపమునఁ దలవంచుకొని తనయుబ్బుగుబ్బలమీఁద సరిగా వ్రేలుచున్న హారపుముత్తెమునందు ఇంద్రనీలముల కాంతి గల శ్రీకృష్ణునిశరీరము ప్రతిఫలింపఁగా స్పష్టముగాఁ జూచుచు కోరికి యీడేఱినందున సంతోషించిన దయ్యె. అట్టిరుక్మిణి మీకు సంతోషము కలిగించుఁగాత.

అవ. బలభద్రునికిని కృష్ణునికిని యశోదకును నైనసంవాదమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ కృష్ణే నామ్బ గతేన రన్తు మధునా మృద్భక్షితా స్వేచ్ఛయా
తథ్యం కృష్ణ క ఏవ మాహ ముసలీ మిథ్యామ్బ పశ్యాననమ్।
వ్యాదేహీతి విదారితే శిశుముఖే దృష్ట్వా సమస్తం జగ
న్మాతా యస్య జగామ విస్మయపదం పాయాత్స నః కేశవః॥ 65

టీ. హేఅమ్బ=ఓయమ్మా, రన్తుం=ఆటలాడుటకు, గతేన=పోయినట్టి, కృష్ణేన= కృష్ణునిచేత, స్వేచ్ఛయా=తనయిచ్ఛచేత-ఒకరిప్రేరణములేక తానేయనుట, మృత్ = మన్ను, భక్షితా=భక్షింపఁబడినది. (ఇది బలభద్రుఁడు యశోదతోఁ జెప్పినమాట. ఇది విని యశోద కృష్ణునితో) కృష్ణ=కృష్ణా, తథ్యం=యథార్థమా-నీవు మన్నుదింటివన్న విషయము నిజమా(అనియడుగఁగా, కృష్ణుఁడు)ఏవం=ఇట్లు, కః=ఎవ్వఁడు, ఆహ=చెప్పెను, నేను మన్నుదింటినని ఎవఁడుచెప్పెను, (అనియడుగఁగా, యశోద) ముసలీ = బలరాముఁడు (చెప్పెననఁగా కృష్ణుఁడు) అమ్బ=అమ్మా, మిథ్యా = అబద్ధము - బలరాముఁడు చెప్పినది కల్ల, ఆననమ్=నాముఖమును, పశ్య = చూడుము, (అనిచెప్పఁగా, యశోద) వ్యాదేహి=తెఱువుము-నోరు తెఱువుము (అని చెప్పి) విదారితే = తెఱవఁబడిన, శిశుముఖే= నిసువైన శ్రీకృష్ణునినోటియందు, సమస్తం = సకలమైన, జగత్ = లోకమును, దృష్ట్వా=చూచి, యస్య=ఎవ్వనియొక్క, మాతా=తల్లియైన యశోద, విస్మయపదం=ఆశ్చర్యమునెడిస్థానమును, ఆశ్చర్యముననుట, జగామ=పొందినదో, సః=ఆ, కేశవః=శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, పాయాత్ = రక్షించుఁ గాక-మున్ను నోటియందలి శైలాసాదులను జూచి

నమ్మక నవనీతాదులుగా గ్రహించి సమాధానము చేసికొన్నది. ఇప్పుడు రెండవమాటును జూచుటచే నమ్మి ఆశ్చర్యమును బొందిన దనుట.

మ. మను భక్షించితె కృష్ణ, యెవ్వ రని రకమ్మా,యన్నయన్నాఁడు, గ
న్గొను నామో మది కల్ల, చూపు మనుచుఁ గనోరత్త విశ్వంబు లె
ల్లను గన్పించిన నింత పెల్లఁ దిన నీకలా గయ్యె నాశ్చర్య మం
చును వీక్షించుయశోదఁగాంచి నగుకృష్ణుంగాంతుసంత్రాంతమున్.

తా. బలరాముఁడు యశోదతో 'అమ్మా! కృష్ణుఁడు ఆటలాడఁబోయి తానైమన్నుదిన్నాఁ' డనిచెప్పఁగా యశోద, కొమరుతో'కృష్ణా ! మన్నుదినుట నిజమా?' యని యడుగఁగా' కృష్ణుఁడు 'ఎవరు నేను మన్ను దిన్నట్లుచెప్పి' రనఁగా, యశోద 'బలరాముఁడు చెప్పె' ననెను. కృష్ణుఁడు 'అమ్మా! అది యబద్ధము. నానోరు చూడు' మనఁగా యశోద 'నోరు తెఱువు' మని చెప్పి తెఱవఁబడినయానిసుపునోటియందు సమస్తప్రపంచమును జూచి ఆశ్చర్యపడెను. అట్టి కృష్ణుఁడు మమ్ము రక్షించు గాఁక.

అవ:—శ్రీకృష్ణుఁడు రోహిణీనక్షత్రమం దవతరించుటను ఉత్ప్రేక్షించుచున్నాఁడు.

శ్లో॥ స్వాతీ సపత్నీ కిల తారకాణాం, ముక్తాఫలానాం జననీతి రోషాత్।
సారోహిణీ నీల మసూత రత్నం, కృతాస్పదంగోపవధూకుచేషు॥66

టీ. తారకాణాం=నక్షత్రములకు. సపత్నీ=సవతియైనట్టి, స్వాతీ=స్వాతియనెడి నక్షత్రము-అశ్వినిమొదలగు నిరువదియేడునక్షత్రములును జంద్రునికి భార్యలని ప్రతీతి గనుక అందు స్వాతి తక్కినసక్షత్రములకు సపతి యగుననుట, ముక్తాఫలానాం=ముత్తెములకు, జననీకిల=తల్లిగదా-ఉత్పాదించునదిగదాయని భావము,ఇతి=అని, రోషాత్ = రోషమువలన, సా=ఆ-చంద్రునికిఁ బ్రియతమురాలుగాఁ బ్రసిద్ధినొందిన, రోహిణీ=రోహిణి యనెడు నక్షత్రము, గోపవధూకుచేషు-గోపవధూ=గోపస్త్రీలయొక్క, కుచేషు=గుబ్బలయందు, కృత + ఆస్పదం=చేయఁబడిన స్థానము గలిగినదైన-వారి గుబ్బలయందు నెలకొన్న, నీలం=నీలమైన,రత్నం=రత్నమును-నీలరత్నవర్ణుఁడైనకృష్ణుని అని భావము. అసూత=కనెను. సవతులు ఒండొరులమేలు చూడఁజాలరు గనుక రోహిణి తన సవతియైనస్వాతి ముత్తెములను గని ప్రసిద్ధినొందుటను సహింపక తాను నీలరత్నమునుగనెనని యర్థము. ముక్తారత్నము స్త్రీలకుచంబులపయిని విలసిల్లునట్లు ఈ నీలరత్నమును గోపికలకుచములపయి విలసిల్లుచున్న దని రత్నముతోడి సాధర్మ్యమును దీనికిఁ జెప్పెనాఁడు. మఱియు ముత్యములకంటె రత్నము విశేషము గావున ముత్యమును గన్న స్వాతికన్న రత్నమును గన్నరోహిణియే యధికురాలనియు ఆశయము స్ఫురించెడి,స్వాతిముక్తా ఫల

ములను_అనఁగా 'ము క్త + అఫల' ముక్తులను అఫలమైనవానిని-ఫలము కానివారిని-కనఁగా,రోహిణిముక్తులను ఫలరూపమైనవానినిగ నెననియుఁదాత్పర్యము ధ్వనించెడిని. స్వాతీ ప్రవేశమందుఁ గురియునట్టివానబిందువులు ముత్తెపుఁజిప్పలందుఁ బడి ముత్తెము లగునని రత్నశాస్త్రప్రసిద్ధము. దానినిబట్టి స్వాతి ముత్తెములనుఁ దల్లియని యుత్ప్రేక్షితమైనది. శ్రీకృష్ణుఁడు రోహిణీనక్షత్రమం దవతరించుటనుబట్టియు ఇంద్రనీలవర్ణుఁ డగుటనుబట్టియు రోహిణి నీలరత్నమును గన్నదియని యుత్ప్రేక్ష తెలియుచున్నది. కృష్ణుఁడు గోపికాలోలుఁడు గావున 'కృతాస్పదం గోపవధూకుచేషు' అని గోపికాకుచములందు నెలకొన్న నీలరత్నముగాఁ జెప్పినాఁ డని తెలియునది.

ఉ. తారల కెల్లనుక్క సవతి ౕ దా నగుస్వాతి విశుద్ధమౌక్తికో
దారమణుల్ గనం గని నిజాత్మ నసూయ వహించి రోహిణీ
తారక గాంచె గోపవనితాకుచకోరకహారసంతతి
నేరినకృష్ణనాయకమణిన్ రవికోటిఘృణిన్ ముదంబునన్. 66

తా. స్వాతీ నక్షత్రము ముత్తెములను గనునని ప్రఖ్యాతిఁ బొందుచున్నదని రోషముచేత దానిసవతి యగు రోహిణి తానును గోపికాకుచములందుఁ బ్రకాశించుచున్న యొకనీలరత్నమును (శ్రీకృష్ణుని) గని మించిన దయ్యెను.

శ్లో॥ నృత్యన్త మత్యన్త విలోకనీయం,కృష్ణంమణిస్తమ్భగతంమృగాక్షీ।
నిరీక్ష్య సాక్షాదివ కృష్ణ మగ్రే, ద్విధా వితేనే నవనీత మేకమ్॥ 67

టీ. నృత్యన్తం=నర్తనము సేయుచున్నవాఁడును, అత్యన్త విలోకనీయమ్-అత్యన్త=మిక్కిలియు, విలోకనీయం = చూడఁదగినవాఁడును,మణి...గతం-మణి స్తంభ=రత్నపుకంబమును, గతం=పొందినవాఁడును-ప్రతిబింబరూపమైనవాఁడనుట, అగు, కృష్ణం=కృష్ణుని, మృగాక్షీ=లేడివంటికన్నులుగలయశోద, అగ్రే=ఎదుట, నిరీక్ష్య=చూచి, ఏకం=ఒకటియైన, నవనీతం=వెన్నను, ద్విధా=రెండుభాగములుగా, వితేనే=చేసెను. యశోద రత్నస్తంభమునందలిప్రతిబింబమును నిజముగా కృష్ణుఁడు గాఁ డని తెలిసినదయ్యు అది నృత్యమువలన 'అత్యంతవిలోకనీయ'ముగా నుండుటచే నందు వ్యామోహముగలదై ఆవ్యామోహమున దానికిని సాక్షాత్కృష్ణునివలెనే వెన్నముద్దను పంచి యిచ్చె నని భావము.

మ. ప్రకటానందవిచిత్రనాట్యపరుఁ డైౕబాలున్ విలోకించుచుం
జకితాలోకకురంగలోచన మణిౕస్తంభంబులో నిక్కమై
నకుమారుంబలెఁ దోఁచునీడఁ జెలువొంౕదం గాంచి భాగించె నా
త్మకరాంభోజమునందు నున్ననవనీౕతం బయ్యెడన్ రెండుగన్. 67

తా. శ్రీకృష్ణుఁడు మిక్కిలిరమణీయముగా ఆడుచుండఁగా ఆతనిప్రతిబింబము ను రత్నస్తంభంబునందు మిక్కిలిచూడఁదగినట్లు సొగసై కనఁబడఁగాఆప్రతిబింబము నందలివ్యామోహమువలన దానినిగూడ నిజముగాఁ గృష్ణునివలెనే భావించి యశోద చేతనున్న వెన్నముద్దను ఇద్దఱుకృష్ణులకును రెండుగాఁ బంచెను.

అవ. యశోద కృష్ణుని మేలుకొలుపుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥వత్స జాగృహి విభాతి మాగతం, జీవ కృష్ణ శరదాం శతంశతమ్।
ఇత్యుదీర్య సుచిరం యశోదయా, దృశ్యమానవదనం భజామహే॥

టీ. హేవత్స=ఓబిడ్డా ,విభాతం=ప్రాతఃకాలము. ఆగతం=వచ్చెను. జాగృహి= మేలుకొనుము, హేకృష్ణ=ఓకృష్ణా, శరదాం=సంవత్సరములయొక్క, శతం శతమ్= నూఱునూఱు-నూఱులకొలఁదిసంవత్సరము లనుట. జీవ=జీవింపుమా, ఇతి=అని, ఉదీర్య= చెప్పి, సుచిరం=బహుకాలవు-చాల సేపు, యశోదయా=యశోద చేత, దృశ్య...వద నమ్-దృశ్యమాన=చూడఁబడుచున్న, వదనం=ముఖము గలవాఁ డగు శ్రీకృష్ణుని, భజా మహే=భజించుచున్నాము. తెల్లవాఱుటయందు కృష్ణుని మేలుకొలిపి అతఁడు లేచు నప్పటి నిద్దురమబ్బు మొగముయొక్క చెలువము మిక్కిలి కంటికి ఇంపుగా నుండుటచే చాలసేపు యశోద చూచుచుండె నని యర్థము.

ఉ. వెన్నయుఁ బాలుఁ ద్రాగుదువు వేగమ లెమ్ము కుమార తెల్లవా
ఱెన్నను గన్నతండ్రి నినుఁ గాంచెదవు లే పదివేలయేండ్లు నీ
కున్నతి నాయు వబ్బుఁ గుమారక యటన్న యశోదఁ జూచునా
వెన్నుని ముద్దు నెమ్మొగము వేడుక మీఱ భజింతు మెప్పుడున్. 68

తా. యశోద వేడుకను గృష్ణునిజూచి నాయనా! మేలుకొనుము తెల్లవారెను. కృష్ణా! పదివేలయేండ్లు బ్రతుకుము. అని చెప్పి నిద్దురలేచుచున్న యతనిముద్దుమొగ మును జాలసేపు చూచుచుండెను. అట్టికృష్ణుని మేము భజించెదము.

అవ. శ్రీకృష్ణుఁడు శైశవమునఁ జేయుధూర్త్యలీలను జెప్పుచు న్నాఁడు.

శ్లో॥ఓష్ఠంజిఘ్రన్ శిశురితి ధియా చుమ్బితో వల్లవీభిః
కణ్ఠం గృహ్ణన్ స్మరుణితపదం గాఢ మాలిఙ్గితాఙ్గః,
దోర్భ్యా లజ్జావద మభిమృశ న్నఙ్క మారోపితాత్మా
ధూర్తస్స్వామీ హరతు దురితం సూరతో బాలకృష్ణః॥ 69

టీ. శిశురితి=శిసువు అను, ధియా=బుద్ధిచేత, వల్లవీభిః=గోపస్త్రీలచేత, చుమ్బితః సన్=ముద్దు ఇడఁబడినవాఁడగుచు, ఓష్ఠం=అధరమును, జిఘ్రన్ = సీత్కారముతోఁ

గోనువాఁడును-బిడ్డఁడని గోపికలు ముద్దిడఁగా ఆతెఱపిని వారికెమ్మోవులను జుంబించు ననుట, అలిఙ్గితాఙ్గకసన్-అలిఙ్గిత=కౌఁగిలింపఁబడిన-అఙ్గకసన్ = దేహముకలవాఁడగుచు, అరుణితపదం-అరుణిత=వట్టుగాఁ జేయఁబడిన, పదంయథాతథా=ప్రదేశము గలుగున ట్లుగా, కంఠం=గోపికలకంఠమును, గాఢం=గట్టిగా, గృహ్ణన్=గ్రహించువాఁడును,బిడ్డఁ డని గోపికలు కౌఁగిలించుకొనఁగా ఆయనువున వారికంఠములను ఎఱ్ఱఁబాఱునట్లు బిగ్గఁ గౌఁగలించుననుట అఙ్గమ్=ఒడిని, ఆరోపిత + ఆత్మా - ఆరోపిత=ఎక్కింపఁబడిన ఆత్మాసన్=దేహముకలవాఁడగుచు, లజ్జాపదం=లజ్జాస్థానమును-మర్మస్థానమును అనుట, దోర్ణా=చేతితో, అభిమృశన్=తడవుచున్నవాఁడును, బిడ్డఁడని గొల్లచెలువలు తొడల యందు దిడుకొనఁగా ఆవీలున వారిమర్మప్రదేశములను అంటు ననుట కావున నే, ధూర్త స్వామి-ధూర్త=విటులకు,స్వామీ= అధిపతియైనవాఁడును-నీనువుఅని గోపికలులాలించు నవుడు విటకానిచేష్టలు పచరించువాఁడు గాన ధూర్తుఁ డనియు కేవలశైశవమందే ధూర్తత్వము అలవడుటచే కేవలధూర్తుఁడుగాక ధూర్తస్వామి యగు ననియు భావము, ఇట్టివాఁడైన, బాలకృష్ణః=చిన్నికృష్ణుఁడు, దురితం=పాపమును, దూరతః=దూరమున-దవ్వుగా, హరతు=తొలఁగించుఁ గాత-తాను ధూర్తుఁ డైనవాఁడు ఒకదురితమును హరించుట శక్యముకాదు. అందును ధూర్తస్వామియైనవాఁడు దురితములను హరించుట యసంగతము. మఱి వాఁడు 'దూరత, దవ్వుగాను హరించుట మిక్కిలియు అసంభా వ్యము. అయినను పరమపురుషుఁడుగాన హరింపఁజాలు నని యాశయము ధ్వనితము.

ఉ. బాలుఁడటంచు ముద్దిడుక బాలలఁ బట్టుక మోవి నొక్కి- కెం
గేలఁ దెమల్చి మన్మథనికేతన మంకముమీఁద నుంపఁ జాల్
చాలు నటంచు నెత్తికొనఁగ జఙ్గనఁ బట్టుక కౌఁగిలించుగో
పాలకధూర్తశేఖరుఁడు పాపముఁ బాప కృతార్థుఁ జేయుతన్. 69

తా. గోపికలు శిశువుగాఁ దలఁచి ముద్దుపెట్టుకొనఁగా వారలకెమ్మోవిని చుం బించుచును, బిడ్డఁడని కౌగిలించుకొనఁగా వారికంఠము ఎఱ్ఱగా నగునట్లు బిగ్గఁ గౌఁగి లించుకొనుచును, కూన యని ఒడియందు వారెత్తి పెట్టుకొనఁగాఁ దనచేతితో వారి మర్మస్థానమును అంటుచును, పనువిటకానివలె నడచుబాలకృష్ణుఁడు మాపాపములను దవ్వుగాఁ దొలఁగించుఁగాక.

అవ. శ్రీకృష్ణుఁడు ఒకనాఁడు కన్నకలను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఏ తే లక్ష్మణ జానకీవిరహితం మాం ఖేదయ న్త్యమ్బుదా
మర్మాణీవ చ ఘట్టయ న్త్యల మమీ క్రూరాః కదమ్బానిలాః।

ఇత్థం వ్యాహృతపూర్వజన్మచరితం యో రాధయా వీక్షితః
సేర్ష్యం శఙ్కితయా స నస్సుఖయతు స్వప్నాయమానో హరిః॥ 70

టీ. హే లక్ష్మణ=ఓలక్ష్మణా, ఏతే=ఈ, అమ్బుదాః=మేఘములు, జానకీవిరహితం-జానకీ=సీతచేత, విరహితం=లేనివాఁడైన-సీత నెడఁబాసినవాఁడైనయనుట, మాం=నన్ను, ఖేదయన్తి-ఖిన్నునిగాఁజేయుచున్నవి. క్రూరాః=క్రూరములైన- విరహిజనులకుదుస్సహములైనవనుట, అమీ=ఈ, కదమ్బ+అనిలాః=కడిమిపువ్వులవాయువులు-కడిమిపూఁదావులతోఁగూడిన తెమ్మెరలు, మర్మాణి=మర్మస్థానములను, అలం=మిక్కిలి, ఘట్టయన్తి ఇవచ=కొట్టుచున్నట్లున్నవియును - మర్మములు దాటించినట్లు పీడించుచున్నవనుట, ఇత్థం=ఈప్రకారముగా, యః=ఎవఁడు, వ్యాహృత... చరితం యథాతథా - వ్యాహృత=చెప్పఁబడిన, పూర్వజన్మ=మునుపటిపుట్టుకయొక్క - పూర్వపు రామావతారముయొక్క, 'చరితం యథాతథా=చరిత్రముగల్గునట్లుగా, స్వప్నాయమానః=కలగనుచున్నవాఁడును, 'వ్యాహృతపూర్వజన్మచరితః' అనుపాఠమున- చెప్పఁబడినపూర్వజన్మపుచరిత్రముగలవాఁడును అనియర్థము-ఇట్టివాఁడును, స+ఈర్ష్యం=అసూయతోఁ గూడినట్లుగా, శఙ్కితయా=(తన్నుగురించి) సందేహపడినదగు, రాధయా=రాధచేత, వీక్షితః=చూడఁబడినవాఁడును-కలలో దనరామావతారమందలి సీతావిరహవేదనమును అదాటున అనుభవించుచుండఁగాఁ బ్రక్కనున్న రాధవిని 'ఇతఁడేమి జానకియను మఱొకప్రియురాలినిఁ దలఁచి వెతపడుచున్నాఁడు?' అని సవతితనముచే ఈర్ష్యయు 'లక్ష్మణాజానకియని శ్రీరాముని వలెకలవరించుచున్నాఁడే యితఁడేమిసామాన్యుఁడా లేకపరమపురుషుఁడా' యని శంకయు నుగలదై కృష్ణునిఁ జూచినదనుట - ఇట్లు రాధచేఁ జూడఁబడినవాఁడును అగు, సః=ఆ, హరిః=శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, సుఖయతు=సుఖింపఁజేయుఁగాత. విరహిజనులకు మేఘములును, కదంబవాయువులును మిగులగునవి విరహోద్దీపకములని తెలియునది.

శా. అన్నా లక్ష్మణ జానకీరహితు న న్నంభోధరశ్రేణి యీ
సన్నంపువ్వులిగాలి మర్మములు నొంచం జొచ్చె నంచుం బురా
ఖిన్నత్వంబు వచింప నీసు వెఱపుం గీల్కొన్న చిత్తంబుతోఁ
దన్నన్ రాధిక గాంచఁగాఁ గలవరింపం దంగూర్కు వాఁడేలుతన్. 70

తా. కృష్ణుఁ డొకరాత్రి రాధతోఁగూడఁ బరుండి నిదురించుచున్నపుడు రామావతారమందలి సీతావిరహమును అనుసంధించుచు 'లక్ష్మణా! ఈమేఘములు జానకిని ఎడఁబాసియున్న నన్ను దుఃఖితునిగాఁజేయుచున్నవి. కడిమిపూవులతావులుగల యీయెలతెమ్మెరలు నామర్మములనుదాటించునట్లు పీడించుచున్నవి' అని పూర్వావతారమందలి వృత్తాంతమును జెప్పుకొనుచు స్వప్నముగనుచుండఁగా బ్రక్కనున్న రాధవినిఅతనికి జానకియని మఱొకపడఁతియున్నదని తెలియుటచే అసూయయు, శ్రీరామచరితమును అనుసంధించు

టచే 'పరమపురుషుఁడాయితఁడేమి' యని శంకయును గలదై చూడఁగా నొప్పుచున్న శ్రీకృష్ణుఁడు మమ్ము సుఖులనుగాఁ జేయుఁగాత.

అవ. లక్ష్మీస్వరూప యైనరుక్మిణీదేవి శ్రీకృష్ణునితో నొకప్పుడాడిన సరసోక్తులను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఓష్ఠం ముఞ్చ హరే బిభేమి భవతా పానైర్హతా పూతనా
కణ్ఠాశ్లేష మముం జహీహి దళితా వాలిఙ్గనే నార్జునౌ
మా దేహి చ్ఛురితం హిరణ్యకశిపుర్నీతో నఖైః పఞ్చతా
మిత్థం వారితరాత్రికేళి రవతా ల్లక్ష్మ్యాపహాసా ద్ధరిః॥ 71

టీ. హేహరే=ఓకృష్ణా, ఓష్ఠం=అధరమును, ముఞ్చ=విడువుమా-మోవిని నొక్కకుమాయనుట-ఏలనఁగా, బిభేమి=భయపడుచున్నాను. భయమునకు కారణ మేమనఁగా, భవతా=నీచేత, పానైః = పానములచేత-చన్నుఁబాలు ఒకటిరెండుగ్రుక్కలు త్రాగుటచేత, పూతనా=పూతనయనురక్కసి, హతా = చంపఁబడినది-నీవు పూతనవంటిబలాఢ్యురాలగురక్కసినే రెండుమూఁడుగ్రుక్కలు చనుఁబాలు ఆనినంతనే చంపితివిగాన నను బోఁటిదానియధరమును ఆనితివేని నాకేమిచెఱువు గలుగునోయని భయపడుచున్నాను గనుక మోవినినానకుమాయనియర్థము. అముం=ఈ-ఇదిగో నీవు కావించుచున్న, కణ్ఠాశ్లేషమ్=మెత్తుకకాఁగిలిని-కంఠాలింగనమును, జహీహి=విడువుమా,ఏలయనఁగా, ఆలిఙ్గనేన=నీ కాఁగిలిచేత, అర్జునౌ-రెండుమద్దిచెట్లు, దళితౌ = చీల్పఁబడినవి - మద్దిచెట్లవంటి వానిని కాఁగిలించుటచే చీల్చితివిగావున ననుబోఁటిని కాఁగిలించితివేని ఏమిచెట్టకలుగునోయని భయపడుచున్నాను గనుక కంఠమును కాఁగిలింపకుమా యనుట, ఛురితం=నఖక్షతమును, మాదేహి=ఇయ్యకుమా-నఖక్షతమును జేయకుమాయనుట-ఏలనఁగా, హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుఁడనురాక్షసుఁడు నఖైః=నీగోళ్ళచేత, పఞ్చతామ్ = మరణమును, నీతః=పొందింపఁబడెను-నీవు గోళ్ళగిల్లులచేతనే హిరణ్యకశిపునట్టివానిని చంపితివి గాన ననుబోఁటికి నీగోళ్లగిల్లులచే నేమికలుగునోయని వెఱచుచున్నాను గాన నఖక్షతములు ఉంపకుమాయనుట,ఇత్థం=ఈప్రకారముగా, లక్ష్మ్యా=లక్ష్మిచేత-రుక్మిణిచేత, అపహాసాత్=అపహాసము నహేతువునుబట్టి, వారిత...కేళిః-వారిత=నివారింపఁబడిన, రాత్రికేళిః = రాత్రియందు మన్మథక్రీడగల, హరిః=విష్ణుఁడు-శ్రీకృష్ణుఁడు, అవతాత్=(మమ్ము)రక్షించుఁగాక. రుక్మిణీదేవి ఒకరాత్రితనతో రతిక్రీడ సలుపఁబూనినకృష్ణుని నిజముగాఁగాక వేడుకకొఱకు ఇట్టిసరసోక్తు లాడి ఆరతిక్రీడ నివారింపఁజూచిన దని యర్థము.

ఉ. అమ్మకచెల్ల మోవిచవి కయ్యానకు పూతన సోలెఁ గ్రోలఁగా
గ్రమ్మకు ఆమ్మ బల్మిని ధరం బడె మద్దులు కాన గోటిచేఁ

జిమ్మకుమీ హిరణ్యకశిపుచే మది భీతిలె నంచుఁ దచ్చనల్
బ్రమ్మచుఁ గేళి మాన్పు రమ కైకొని కూడినశౌరిఁ గొల్చెదన్

తా. లక్ష్మీస్వరూపయైన రుక్మిణీదేవి యొకనాఁటిరాత్రి శ్రీకృష్ణుఁడు తనతో మరుకేళి సలుపఁబూనఁగా వేడుకగా 'కృష్ణా! నీవు ఒకటిరెండుగ్రుక్కలానినంతనే పూతనను జంపితివి. కావున నా మోవిని ఆనినయెడల ఏమి కలుగునో యని భయపడుచున్నాను. కనుక నా మోవిని విడువు. నీవు కౌఁగిలించినంతనే మద్దిచెట్లు రెంటిని గూల్చితివి. నన్ను కౌఁగిలించినను ఏమగునో కనుక నాకంఠమును గౌఁగిలించుటను మానుము. నఖములచే హిరణ్యకశిపునిఁ జంపితివి. కాఁబట్టి నీనఖక్షతములకు వెఱచుచున్నాను. వానిని జేయకుమా' యని సరసోక్తు లాడుచు వరుని యధరచుంబన కంఠాలింగన నఖక్షతములను వారించుచు రతికేళిని మాన్పఁజూచినది. అట్టిశ్రీకృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

అవ॥ యశోద ఒకనాఁడు కృష్ణునినిదురపుచ్చుటకై రామాయణకథను జెప్పుచుండఁగా ఊఁకొట్టుచు వినుచున్నకృష్ణుఁడు అందురావణుఁడుసీతను గొనిపోయె ననుఘట్టమును విని తనపూర్వవృత్తాంతమగుటచే అప్పటియవతారమును మఱచి సీతను విడిపించుటకై సంభ్రమించుటను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ రామోనామ బభూవ హుం తదబలా సీతేతి హుం తాం పితు
ర్వాచా పఞ్చవటీతటే విహరత స్తస్యాహర ద్రావణః।
నిద్రార్థం జననీకథా మితి హరే ర్హుఙ్కారతః శృణ్వతః
సౌమిత్రే క్వ ధను ర్ధను ర్ధను రితి వ్యగ్రా గిరః పాన్తు వః॥ 72

టీ. రామోనామ=రాముఁడను పేరుగలవాఁడు, బభూవ=ఉండెను-ఇది యశోద వాక్యము: హుం=హుం అని కృష్ణుని ఊఁకొట్టుట-ఇట్లేమీఁద నెల్ల తెలియునది. తత్+అబలా=అతని పడఁతి-సీతా ఇతి=సీత అని-సీత అని అతనిభార్య-ఇదియశోదవాక్యము, హుం=ఇది కృష్ణుని ఊఁకొట్టుట, పితుః=తండ్రియైన దశరథునియొక్క, వాచా = వాక్యముచేత-తండ్రి అడవికి పొమ్మన్న మాటనుబట్టి, పఞ్చవటీతటే = పంచవటియొక్క ప్రాంతమందు, విహరతః=విహరించుచున్న, తస్య=ఆరామునియొక్క, తాం=అమెను-రామునిభార్యయైన ఆసీతను, రావణః=రావణుఁడు, అహరత్=దొంగిలించుకొని పోయెను, ఇతి=ఈప్రకారముగా, నిద్రార్థమ్=నిదురకొఱకు, జననీకథామ్-జననీ=తల్లియైన యశోదయొక్క, కథామ్=కథను, హుఙ్కారతః=హుంకారమువలన-హుం అని ఊఁకొట్టుచుననుట, శృణ్వతః=వినుచున్న, హరేః=శ్రీకృష్ణమూర్తియొక్క, సౌమిత్రే=ఓలక్ష్మణా ధనుః ధనుః ధనుః=విల్లువిల్లువిల్లు, క్వ ఇతి=ఎక్కడ అనెడు, వ్యగ్రాః=తొందరపాటుతోఁ

చెప్పఁబడిన, గిరః=మాటలు-సీతను గొనిపోయినాఁడని విన్నంతనే నిలుపోపక 'లక్ష్మణా విలు విల్లెక్కడ' అని సంభ్రమముతోఁ జెప్పబడినమాట లనుట, మః=మిమ్ము, పాన్తు= రక్షించుఁగాక, సీతను విడిపించుటకై విల్లుఁదెమ్మన్నాఁ డని తెలియునది.

మ. ఇలలో రాఘవుఁ డొప్పు వానిసతి యస్త్యాఖ్యన్ సీత వారిన్ వనం
బులకుం బంచె గురుండటంచు నిదురం బొందించునయ్యంబ ప్రవిల్
ల్కులు దా నూఁకొని రావణుండు మహిజం గొంపోయె నానుల్కి
విలు దేలక్ష్మణయంచుఁ బల్కు హరి యుద్వేలోక్తి నన్ బ్రోచుతన్.

తా. యశోద ఒకనాఁడు కృష్ణుని నిదురపుచ్చుటకై రామాయణకథను జెప్పఁ బూని 'రాముఁడనువాఁ డొకఁడు ఉండెను. అతనిభార్య సీత. అతఁడు తండ్రియాజ్ఞచొప్పున పంచవటియొద్ద విహరించుచుండఁగా అతనిభార్యయైనసీతను రావణుఁ డనురాక్షసుఁడు దొంగిలించుకొనిపోయెను' అనఁగానే ఇంతవఱకు హుం హుం అని ఊఁకొట్టుచు వినుచుండినకృష్ణుఁడు సీతను గొనిపోవుటకు నిలుపోపక 'లక్ష్మణా! విల్లు విల్లు విల్లెక్కడ' అని వేగముచేఁ దొట్రుపడుచుఁ జెప్పినమాటలు నన్ను రక్షించుఁగాత.

శ్లో॥ బాలోఽపి శైలోద్ధరణాగ్రపాణి, ర్నీలోఽపి నీరన్ధ్రతమఃప్రదీపః।
ధీరోఽపి రాధానయనావబద్ధో, జారోఽపి సంసారహరః కుతస్త్వమ్॥

టీ. హేకృష్ణ=ఓకృష్ణా-అని అధ్యాహార్యము, త్వం=నీవు, బాలః+అపి=బాలుఁడవయ్యును, కుతః=దేనిచేత, శైలో...పాణిః-శైల=గోవర్ధనపర్వతముయొక్క, ఉద్ధరణ=ఎత్తుటగల, అగ్రపాణిః=ముంజేయిగలవాఁడవు, బాలుఁడెక్కడ! కొండనెత్తుట ఎక్కడ! నీవెట్లు గోవర్ధనమును ఎత్తితివో తెలియరాకున్నది యనిభావము. నీలః+అపి=నల్లనివాఁడైనను. కుతః=ఎందువలన-ఏప్రకారమున, నీరన్ధ్ర...ప్రదీపః-నీరన్ధ్ర=దట్టమైన, తమః=చీఁకటికి, ప్రదీపః=దీపమైనవాఁడవు-నల్లనివస్తువు నల్లని-చీఁకటిని పోఁగొట్టఁజాలదు-నీవో నల్లనివాఁడవయ్యును చీఁకటినిగూడ వెలిఁగించుచున్నావు. ఇది యెట్లుకలిగెనో తెలియరాదనుట. ధీరః+అపి=ధైర్యముగలవాఁడవైనను-ధీరత్వమనఁగా మనోవికారము లేకుండుట-దేనికిని మనోవికారము పొందనివాఁడయ్యు, కుతః=ఎందువలన, రాధా...బద్ధః రాధా=రాధయొక్క, నయన=కన్నులకు, అవబద్ధః=కట్టుపడినవాఁడవు-రాధకుఁ గనుసన్నల మెలఁగునంతవశుఁడవు-వికారపడనిమనస్సు గలవాఁడవయ్యును ఏకారణముచేత రాధకన్నులకు బేలుపోయి దానికిఁ గట్టువడితివో తెలియరాదనుట, జారః+అపి=జారుఁడవైనను, కుతః=ఏహేతువువలన, సంసారహరః-సంసార=జననమరణాదిరూపమైన యీసంసారమును, హరః=హరించువాఁడవు-సంసారమునందు మగ్నుఁడైన విటకాఁడెక్కడ! సంసారమును బోఁగొట్టుట యెక్కడ! జారుఁడవైననీవు ఏరీతిని సంసారమును బోఁగొట్టెదవో తెలియరాదు అని యర్థము.

ఉ. బాలుఁడ వయ్యు శైల మొకక్రపాణితలంబునఁ దాల్చి నిల్పఁగాఁ
జాలుట, పాపపుంజముల కా జారుఁడ వయ్యు హరించుటల్, మహా
నీలతనుండ వయ్యు నతిక్రనిర్భరగాఢతమఃప్రదీప మై
ప్రాలుట, ధైర్యశాలి వయి క రాధకుఁ జిక్కుట వింతగా హరీ! 73

తా. కృష్ణా ! నీవు బాలుఁడ వయ్యుఁ గొండను చేత నెత్తుటయు, నల్లనివాఁడ వయ్యు దట్టంపుఁజీకటినికూడ వెలిఁగించుటయు, మనస్సు వికారపడనివాఁడయ్యు రాధకుఁ గన్నుసన్నల మెలఁగునంతవశుఁ డగుట యు, విటకాఁడవయ్యు సంసారబంధములను బోఁగొట్టుటయు మిక్కిలి వింతగా నున్నవి.

శ్లో॥ బాలాయ నీలవపుషే నవకిఙ్కిణీక
జాలాభిరామజఘనాయ దిగమ్బరాయ ।
శార్దూలదివ్యనఖభూషణభూషితాయ
నన్దాత్మజాయ నవనీతముషే నమ స్తే. 74

టీ. నీలవపుషే నీల=నల్లనైన, వపుషే=శరీరముగలవాఁడును, నవ...జఘనాయ–నవ=నూతనము లైన, కిఙ్కిణీక = చిఱుగంటలయొక్క, జాల=సమూహముచేత, అభిరామ=మనోజ్ఞమైన, జఘనాయ=కటిపురోభాగము–మొల గలవాఁడును, దిగమ్బరాయ=దిస్స మొలగా నుండువాఁడును, శార్దూల...భూషితాయ–శార్దూల=పులియొక్క, దివ్య=శ్రేష్ఠమైన, నఖ=చిటికెనవ్రేలిగోరనెడి, భూషణ=సొమ్ముచేత,భూషితాయ=అలంకరింపఁబడినవాఁడును, నవనీతముషే=వెన్నదొంగిలించువాఁడును, నన్ద + ఆత్మజాయ = నందుని కొడుకును, బాలాయ=బాలుఁడును, అగు, తే=నీకొఱకు, నమః=నమస్కారము.

చ. అలరుపసిండికంకణము క లందెలు మువ్వలు రావిరేక నం
దలపులిగోరుఁ దాయెతులుఁ క గుప్పెడపున్మొలనూలు మద్దికా
యలుఁ గలనందనందను దిగంబరుఁ జారుకటీతటోజ్జ్వలు
న్నీలసితనీలదేహు నవనీతహరుం డగుబాలుఁ గొల్చెదన్. 74

తా. నల్లనిమేను గలిగి, క్రొత్తగజ్జెలచే సొగను గలుగుమొల గలవాఁడై, దిస్స మొలతో, మేలిపులిగోరుసొమ్ముదాల్చి, వెన్న దొంగిలించువాఁడై, నందునికొమరుఁ డగుబాలునికి నీకు నమస్కారము.

శ్లో॥ పాణౌ పాయసభక్త మాహితరసం బిభ్రన్ముదా దక్షిణే
సవ్యే శారదచన్ద్రమణ్డలనిభం హైయంగవీనం దధత్
కణ్ఠే కల్పితపుణ్డరీకనఖమ ప్యుద్దామదీప్తిం వహన్
దేవో దివ్యదిగమ్బరో దిశతు న స్సౌఖ్యం యశోదాశిశుః ॥ 75

టీ. దక్షిణే=వలపలి-కుడిప్రక్కది యైన, పాణౌ = చేతియందు, ఆహితరసమ్-ఆహిత-ఉంపఁబడిన, రసం=మధురసముగల, పాయసభక్తం=పరమాన్నమును, ముదా=సంతోషముచేత, బిభ్రత్ = ధరించుచున్నవాఁడును, సవ్యే = డాపలి, పాణౌ = చేతియందు, శారద...నిభమ్-శారద = శరత్కాలసంబంధియైన, చంద్రమండల = చంద్రమండలముతోడ, నిభమ్-సాటియైన, హైయంగవీనమ్ = అప్పుడు వెన్నకాఁచిన నెయ్యిని, దధత్=వహించుచున్నవాఁడును, కణ్ఠే = కంఠమందు, ఉద్దామదీప్తిమ్-ఉద్దామ =అతిశయమైన, దీప్తిం=కాంతిగల, కల్పిత = రచింపఁబడిన, పుండరీకనఖమపి= పులిగోరును, వహన్=ధరించువాఁడును, దివ్యదిగమ్బరః-దివ్య=అప్రాకృతుఁడైనవాఁడును-లేక-దివ్యమ్ యథాతథా=మిక్కిలి ఒప్పిదమగునట్లుగా, దిగమ్బరః = దిస్సములతో నుండువాఁడును, యశోదాశిశుః=యశోదనిసువునైన, దేవః=శ్రీకృష్ణమూర్తి, నః=మాకు, సౌఖ్యమ్=సుఖమును, దిశతుం=ఇచ్చుఁగాక. వలపలిచేత 'ఆహితరస' మైన పాయసభక్తము, డాపలి చేత 'శారదచంద్రమండలనిభ' మైన హైయంగవీనము, కంఠమున 'ఉద్దామదీప్తి' యైన పుండరీకనఖము. ఇట్లు మిక్కిలి సౌఖ్యప్రదముగా ఆయావస్తువులను దాల్చినవాఁడు గాన మనకు 'సౌఖ్య'మును ఇచ్చుఁగాతమని హృదయము.

మ. అలడాకేల శరన్మృగాంకనిభ మా(గ)హైయంగవీనంబు న
వ్వలికేలన్ రసయుక్తపాయసము గ్రీ(వ)వాబద్ధచామీకరో
జ్జ్వలశార్దూలనఖం బనం బరకటీ(చ)చక్రంబుఁ బెంపొంద ని
చ్చలుఁ గ్రీడించుయశోదపట్టి కరుణన్ (గ) సౌఖ్యంబు మాకీవుతన్. 75

తా. వలపల చేతియందు మధురసముతోఁ గూర్పఁబడినపరమాన్నమును దాల్చి డాచేతియందు శరత్కాలపు చంద్రమండలముతో సాటియైన వెన్నకాచిననెయ్యి నుంచుకొని, కంఠమందు మిక్కిలి ప్రకాశించుపులిగోరు ధరించి మిక్కిలి యొప్పిదముగా దిస్సమొల గలవాఁడై యశోదకూనయగు శ్రీకృష్ణదేవుఁడు మాకుసౌఖ్యము నొసంగుఁగాత

శ్లో॥ కిఙ్కిణికిణికిణిరభసైరఙ్గణ, భువి రిఙ్గణైః సదాఽటన్తమ్ ।
ఝుణ్ఝుణుఝుణుపదయుగళం కఙ్కణ, కరభూషణం హరిం వన్దే॥ 76

టీ. కింకిణి...రభసైః-కింకిణి=గజ్జెలయొక్క, కిణికిణి=కిణికిణి యనెడి, రభసైః=ధ్వనులుగల, రిఙ్గణైః=ప్రాఁకుటలచేత, అంగణభువి-అంగణ = ముంగిలియొక్క - భువి = ప్రదేశమునందు, సదా = ఎప్పుడును, అటన్తం = తిరుగాడుచున్నవాఁడును, శైశవమున గజ్జెలుకిణికిణియని మ్రోఁగుచుండఁగా ముంగిట నెప్పుడు ప్రాఁకులాడుచు, దిరుగులాడుచుండువాఁ డనుట, ఝుణ్ఝు...యుగళమ్-ఝుణఝుణఝుణ = ఝుణుఝుణుఝుణు అనెడిధ్వని గల, పదయుగళం=పాదద్వయము గలవాఁడును, అగు, హరిం = శ్రీకృష్ణ, మూర్తినిగూర్చి, వన్దే=నమస్కరించుచున్నాను.

చ. గణనకు నెక్కు డైనకరకంకణ క్వణనంబు మీఱఁ గుం
ఝుణుఝుణునాదపాదములఁ గ్రమ్ము దగు హేమమణీసబద్ధకిం
కిణికిణినాదసంభ్రమము గీల్కొన దాఁటుచు నందమందిరాం
గణమున సంచరించు నమరాగారపుముద్దులబాలుఁ గొల్చెదన్. 76

తా. కిణికిణియని చిఱుగంటలు మొరయుఁ బ్రాఁకులాడుచు ముంగిట నెప్పుడుఁ దిరుగుచు, ఝుణుఝుణు అని యందెల రెంటియందును అందియలు మ్రోఁగఁగాఁ జేతులందు కడియములు మెఱయఁగా నొప్పుచున్న కృష్ణమూర్తికి నమస్కరించుచున్నాను.

శ్లో॥*సమ్మర్దే సురభీణా మమ్బా, మాయాసయన్త మనుయాన్తీమ్।
లమ్బాలక మవలమ్బే తం బాలం తనువిలగ్న జమ్బాలమ్॥ 77

టీ. సురభీణాం=గోవులయొక్క, సమ్మర్దే=సమ్మర్దమందు, అనుయాన్తీం=వెంబడిగావచ్చుచున్న. అమ్బామ్=తల్లిని, ఆయాసయన్తం = శ్రమమునొందించుచున్నవాఁడును-తల్లితన్నుఁబట్టుకొనుటకై వెనుకొనిరాఁగా దట్టంపుగోవులగుంపులో దూఱి యాగోవులమాటునఁ జిక్కక ఇటునటుపాఱుచు ఆమెను అలయించుచున్నవాఁడనుట, లమ్బ+అలకమ్-లమ్బ=వ్రేలుచున్న, అలకమ్=ముంగురులుగలవాఁడును-ఇటునటు తప్పించుకొనబరుగిడుటచే గురులు మఱియు మొగమునందు వ్రేలుచున్నవాఁడనుట, తను... జమ్బాలమ్-తను=దేహమునందు, విలగ్న=మిక్కిలితగిలిన, జమ్బాలమ్ = బురదగలవాఁడును. గోవులసమ్మర్దమున బరుగెత్తుటచే వానిగొరిజలదుమ్ము పయినిబడి చెమటతోఁగలసి దేహమంతయు మిక్కిలి రొంపిగలిగి యున్నవాఁ డనుట, అగు, తం = ఆ-ప్రసిద్ధుఁడైన, బాలం=బాలుఁడైనకృష్ణుని, అవలంబే=ఆశ్రయించుచున్నాను.

ఉ. బాలకకేళి నాలగుమిఁకి బమ్మెఱ నాడఁగ నంబ వెంబడిన్
బ్రాలిమి లేక రా గునగునం బరువెత్తుఁలలాటభాగజం
బాలకుఁ జక్రవాతశకటాదివిఘాలకు నంగలగ్నజం
బాలకుఁ బాలకుం దలఁతుఁ బాలితదిక్తటలోకపాలకున్. 77

తా. తల్లియగుయశోద తన్నుఁబట్టుకొనుటకు వెంబడించిరాఁగా, గోవులగుంపులో దూఱి చిక్కక ఆమెను అలయించుచు, ముంగురులు మొగమున వ్రేల, మేనంతయు దుమ్మయు చెమటయును గలసి బురదకాఁగా జెలువారుచున్న చిన్నికృష్ణునాశ్రయించెద.

*ఈశ్లోకమునకు ముందు 'పశ్చాదాయాన్తమీశానం ధావమానం వ్రజాఙ్గణే। కిఙ్కిణీనూపురగ్రైవా కర్ణభూషోజ్జ్వలం స్మరేత్' అని గోపాలకృష్ణసంపత్కృదష్టాక్షరీమన్త్రధ్యాన మని సనత్కుమారసంహితయందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ అఞ్చితపిఞ్ఛాపీడం వఞ్చితసౌజన్యవల్లవీవలయమ్।
అధరమణినిహితవేణుం బాలం గోపాల మనిశ మవలమ్బే॥ 78

టీ. అఞ్చిత=ఒప్పుచున్న, పిఞ్ఛ=నెమిలిపురియనెడి, ఆపీడం = శిరోభూషణము గలవాఁడును, వఞ్చిత...వలయమ్-వఞ్చిత=వంచింపఁబడిన, సౌజన్య = ప్రేమము గల, వల్లవీ=గోపస్త్రీలయొక్క, వలయమ్ = సమూహము గలవాఁడును-గోపస్త్రీల ప్రేమలను హరించినవాఁడనుట-'సఞ్చితసౌజన్యవల్లవీవలయమ్' అను పాఠమున సఞ్చిత=సంగ్రహింపఁబడిన, సౌజన్య=సుజనభావము-ప్రేమము-గల, వల్లవీవలయమ్=గోపస్త్రీసమూహము గలవాఁడు-గోపస్త్రీలప్రేమమును సంగ్రహించినవాఁ డని యర్థము, అధర...వేణుం-అధరమణి-మణివంటిఅధరమందు, నిహిత=ఉంపఁబడిన, వేణుం = పిల్లఁగ్రోవిగలవాఁడును, గోపాలం=గోపరిపాలకుఁడైనవాఁడును-గొల్లజాతిని జనించినవాఁడనుట, అగు, బాలం=బాలుఁడగు కృష్ణుని, అనిశం=ఎల్లపుడును, అవలమ్బే=ఆశ్రయించుచున్నాను.

మ. విలసత్పింఛవతంసుఁడై చిగురుమోఁవిన్ వేణువుం జేర్చి కం
దళితాలాపసుధాపరంపరలచేఁ తం జేతనాచేతన
మ్ములకున్ నిశ్చలతాచలత్వములఁ పెంపుల్ గూర్చు సద్గోపికా
లలితాంగీసుజనత్వవంచకునిఁ గొల్వం గాంతు గోపాలకున్. 78

తా. తలయందు నెమిలిపురి యొప్పుచున్నవాఁడును, గోపస్త్రీలవలపును కొల్లలాడినవాఁడును, మోవికెంపున పిల్లఁగ్రోవిని మోపినవాఁడును, గొల్లవంశమునఁ బుట్టినవాఁడును, అగు చిన్నబాలుని శ్రీకృష్ణుని ఎప్పుడును ఆశ్రయించుచున్నాను.

శ్లో॥ *ప్రహ్లాదభాగధేయం నిగమమహాద్రేర్గుహాన్తరాధేయమ్।
నరహరిపదాభిధేయం విబుధవిధేయం మమానుసంధేయమ్॥ 79

---

*'అవతారాస్సన్త్వన్యే సరసిజనయనస్య సర్వతోభద్రాః। కృష్ణాదన్యః కోవా ప్రభవతి' 'ప్రాయశ్చిత్తం గుణగణనయా గోపవేషస్య విష్ణోః' 'ఉపాసతామాత్మవిదః పురాణాః...వయం యశోదాశిశుబాలలీలాకథాసుధాసిన్ధుషు లీలయామః' 'విహాయ కోదణ్డశరౌ ముహూర్తం గృహాణపాణౌ మణిచారువేణుమ్' ఇత్యాదులచే శ్రీవిష్ణుదేవునవతారములందుఁ గృష్ణావతారమునే కంఠోక్తిగాఁ దనకభీష్టతమమని చెప్పుటే కాక ప్రతిశ్లోకమందునుఁ గృష్ణావతారమునకు మాత్రమే ఉపలక్షకములగు పింఛ, వ్రజ, నంద, యశోదా, గోపికా వేణు రాధాదిపదములందేదేని ప్రయోగించి కృష్ణునందే కానితక్కినయవతారములందది అన్వయింపకుండునట్లు నిబంధించి యున్నాఁడు. ఏశ్లోకమందేని తక్కినయవతారములలీలలు వర్ణించినను అందే కృష్ణావతారమందు పర్యవసించుపదములను గూర్పక మానఁడు ఈశ్లోకమందో 'ప్రహ్లాదభాగధేయం' 'నరహరిపదాభిధేయమ్' అనిమిక్కిలి నరసింహావతారమందే

టీ. ప్రహ్లాదభాగధేయమ్-ప్రహ్లాద=ప్రహ్లాదునియొక్క, భాగధేయమ్=భాగ్యమైనదియు, నిగమమహాద్రేః-నిగమ=వేదమనెడి, మహాద్రేః=పెనుఁగొండయొక్క, గుహా+అంతర=గుహానడుమ, ఆధేయమ్=ఉంపఁదగినదియు-ప్రతిపాదింపఁదగిన దనుట, నర...ధేయమ్-నరహరిపద=నృసింహుఁడనుపదముచేత, అభిధేయమ్-చెప్పఁదగినదియు-నరసింహుఁడని పేరఁ బొందఁబడునదియు, విబుధ...ధేయమ్-విబుధ=దేవతలకు, విధేయమ్=లోనైనదియు-విబుధులకులోనై రక్షించుటకు నరసింహావతారమెత్తినదియనుట, అగువస్తువు, మమ=నాకు, అనుసంధేయం=అనుసంధింపఁదగినది. వేదమును 'మహాద్రి' అనుటచే అతివిస్తృతమైనదనియు అందలి 'గుహాలో' ఆధేయుఁ డనుటచే తత్ప్రతిపాద్యుఁ డనియు గ్రాహ్యములు.

మ. యమిసంభావితరూపధేయమును బ్రహ్లాదోల్లసద్భాగధే
యము నామ్నాయమహాగుహాంతరనితాంతాధేయముం బ్రోల్లస
త్సుమనఃశ్రేణివిధేయమున్ నరమృగాస్తోకాభిధానాభిధే
యముఁ గొల్తుం గమలామనఃకమలనిత్యాధేయమున్ వేడుకన్. 79

తా. ప్రహ్లాదుని భాగ్యమై, అతివిస్తృతములైన వేదములందుఁ బ్రతిపాద్యుఁడై, దేవతలకుఁ గరుణచే లోనై వారిని రక్షింప స్తంభమున నవతరించి, నరసింహుఁ డను పే రొందిన పరతత్త్వము నాకు అనుసంధింపఁదగినది.

శ్లో॥ సంసారే కిం సారం కంసారే శ్చరణకమలపరిభజనమ్ ।
జ్యోతిః కి మన్ధకారే యదన్ధకారే రనుస్మరణమ్ ॥ 80

టీ. సంసారే=సంసారమందు-జననమరణాత్మకమై సుఖదుఃఖరూపమైనసంసారమందు, సారం=శ్రేష్ఠమయినది, కిం=ఏమి-ఇది ప్రశ్నము. ఇందులకు ఉత్తరము:—కంసా

---

తాత్పర్యము కనఁబడుటచే కాక కృష్ణునకు అసాధారణములైనవిఏవియుఁ గానరావు. ఆయినను 'ఉత్తుఙ్గస్తనమణ్డలోపరి...లక్ష్మీర్వివాహోత్సవే' ఇత్యాదులు కేవల కృష్ణునిగూర్చి కాక సాధారణముగా విష్ణుపరములుగానే నిబద్ధములై యుండునట్లు ఇదియును నరహరిపరముగా నుండ నున్న యెడల 'కాన్తాకచగ్రహణవిగ్రహబద్ధలక్ష్మీ ఖడ్గాఙ్గరాగరసరఞ్జితమఞ్జులశ్రీ...కృష్ణతేజః' 'వారితరాత్రికేళి రవతా ల్లక్ష్మ్యుపహాసా ద్ధరిః' ఇత్యాదులందు లక్ష్మీశబ్దమునకు 'కృష్ణతేజః' 'వారితరాత్రికేళిః' ఇత్యాదిపదములతోడి సంగతిని బట్టి లక్ష్మీదేవి కాక రుక్మిణీదేవియే యని యర్థము గ్రాహ్యముగాన పూర్వశ్లోకమందలి లక్ష్మీశబ్దము రుక్మిణీపరముగానే యగునుగాన ఆశ్లోకమును కృష్ణునిగుఱించినదనియే యూహింపఁదగియున్నది. ఇట్లు ఈ శ్లోకము కృష్ణావతారపరము గామిచే ప్రక్షిప్తమే యగును.

రేః=కంసునికి విరోధియైన కృష్ణునియొక్క, చరణ...భజనమ్-చరణకమల=అడుగుదామరలయొక్క, పరిభజనమ్=కొలుచుట-ధ్యానించుట-శ్రీకృష్ణుపాదారవిందముల చింతనమే సంసారమం దెల్ల సారమైనదనుట-దుష్టుఁడగు కంసునికి విరోధియైనట్లు దుష్టమగు సంసారమునకు విరోధియగునని 'కంసారి' పదాభిప్రాయము. అంధకారే=చీకటియందు-తమఃఫలమైన అజ్ఞానమందనుట, జ్యోతిః=వెలుతురు-బుద్ధిప్రకాశకమైనదనుట, కిం=ఏది-ఇదిప్రశ్నము. ఇందులకు త్తరము:—అంధక + అరేః=అంధకాసురునికి విరోధియైన శివుని యొక్క, అనుస్మరణమ్=స్మరణము, యత్=ఏదియో, (తత్=అది అని యధ్యాహార్యము) శివుని స్మరించుటయే అజ్ఞానమును బోఁగొట్టునది యని యర్థము.

ఉ. సారము గంసవైరి పద ✠ సారసచారుతరార్చనంబు సం
సారమునందు నిందుధర ✠ సన్నుతి గాఢతమాంధకారని
స్తారము వీనికిం దగిన ✠ సద్గుణసేవయు కారణంబు గా
కారయ నింతకంటెను శు ✠ భావహమైనవిశేష మున్న దే. 80

తా. సంసారమునందుఁ గంసారియగు కృష్ణుని పాదారవిందములను భజించుటయే శ్రేష్ఠము. అజ్ఞానమును బోఁగొట్టుటకు శివుని స్మరించుటయే మేలైనది.

శ్లో॥ కలశనవనీతచోరే కమలా, దృక్కుముదచన్ద్రికాపూరే।
విహరతు నన్దకుమారే చేతో, మమ గోపసున్దరీజారే॥ ✝ 81

టీ. కలశ...చోరే-కలశ=కుండయందలి, నవనీత=వెన్నను, చోరే=దొంగిలించువాఁడును, కమలా...పూరే-కమలా=రుక్మిణీదేవియొక్క, దృక్-కన్నులనెడి, కుముద=కలువలకు, చన్ద్రికాపూరే=వెన్నెలప్రవాహమైనవాఁడును=వెన్నెలవెల్లికి కలువ లెట్లు వికాసమునొంది చెలఁగునో శ్రీకృష్ణునిఁజూచినయెడల లక్ష్మీదేవినేత్రములును అట్లుహర్షముచేత వికాసమునొందుననుట-ఇట్టివాఁడును, గోప...జారే-గోపసున్దరీ=గొల్లచెలువలకు, జారే=విటకాఁడైనవాఁడును, అగు, నన్దకుమారే=నందునికొడుకైన శ్రీకృష్ణుని యందు, మమ=నాయొక్క, చేతః=చిత్తము, విహరతు=విహరించుఁగాక-శ్రీకృష్ణుని శైశవమందు అత్యంతాసక్తుఁడగు కవికి శైశవలీలలగు నవనీతచోరత్వ గోపీజారత్వములు తన హృదయమునకు అతిభోగ్యములుగాన ఇట అనుసంధించినాఁడు. కావుననే తనచేతమునకు అందు 'విహరతు' అని విహారశబ్దసూచితమైన సుఖస్వైరసంచారమును-అనఁగా స్నేహపూర్వకమైన అత్యంత చింతనమును-జెప్పినాఁడు.

ఉ. శ్రీరమణీమణీవికచ ✠ దృక్కుముదస్మిత సాంద్రచంద్రికా
సారు వ్రజాంగనానివహ ✠ జారు జగజ్జనతామనోహరా

కారు విశుద్ధమానినిహృదయ గారుఁ బయోనవనీతచోరు నా
భీరకుమారు నాహృదయపీఠికయందు వసింపఁజేసెదన్. 81

తా. కలశంబులందలి వెన్నను దొంగిలించువాఁడును, రుక్మిణీదేవి కనులకు ఆనందము చే వికాసముఁ గలిగించునట్టి మనోహరాకారము గలవాఁడును, గొల్ల చెలువలకు విటకాఁడును, నందునికుమారుఁడు నైన కృష్ణునియందు నామనస్సు విహరించుఁగాక.

అవ. ఒక గోపికయింటఁగృష్ణుఁడు వెన్న దొంగిలించుచుండఁగాఁ గాంచిన యాగోపికకును గృష్ణునకును జరిగిన ఉక్తిప్రత్యుక్తులను గవి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ *క స్త్వం బాల, బలానుజః, కి మిహ తే మన్మన్ది రాశఙ్కయా
యుక్తం తన్నవనీతపాత్రవివరే హస్తం కిమర్థం న్యసేః ।
మాతః కఞ్చన వత్సకం మృగయితుం మాగా విషాదం క్షణా;
దిత్యేవం వరవల్లవీప్రతివచః కృష్ణస్య పుష్ణాతు నః ॥ 82

టీ. హేబాల=ఓబాలుఁడా, త్వం=నీవు: కః=ఎవ్వఁడవు-ఇది గోపికవచనము, బల+అనుజః=బలరామునితమ్ముఁడను-ఇదికృష్ణునివాక్యము, (గోపిక) తే=నీకు, ఇహ=ఇక్కడ, కిం=ఏమి-ఏమిపని యనుట, (కృష్ణ) మత్...శంకయా-మత్=నాయొక్క, మన్దిర=ఇల్లు అనెడి, ఆశఙ్కయా=సందేహముచేత-నాయిల్లు అని సందేహపడి వచ్చితి ననుట, (గోపిక) తత్=అది, యుక్తం=యుక్తము-నాయిల్లు అని భ్రమసి వచ్చితి ననుట యుక్తమేకాని, నవ..వివరే-నవనీత=వెన్నయొక్క, పాత్ర=పాత్రయొక్క, వివరే=రంధ్రమునందు-నోటియం దనుట, కిమర్థం=ఎందులకు, హస్తం=చేతిని, న్యసేః=పెట్టుచున్నావు, (కృష్ణ) హేమాతః=ఓతల్లీ, కఞ్చన=ఒక, వత్సకం=దూడను, మృగయితుం=వెదకుటకొఱకు-దూడను ఒకటిని వెదకుటకై వెన్నకుండలోఁ జేయి పెట్టుచున్నాననుట, క్షణాత్=క్షణకాలము, విషాదం=ఖేదమును, మాగాః=పొందకుము, ఇతి=అని, ఏవం=ఈప్రకారము; కృష్ణస్య=కృష్ణునియొక్క, వర...వచః-వర=శ్రేష్ఠమైన, వల్లవీ=గోపికకియ్యబడిన, ప్రతివచః=ప్రత్యుత్తరము, నః=మమ్ము, పుష్ణాతు=పోషించునుగాక.

ఉ. చిన్నికుమార యెవ్వఁడవు సీరికిఁ దమ్ముఁడ నేల యిందు రా
మన్నిలయం బటంచు నిది మంచిదె కేలటు సాఁచె దేటికి

* ఈ శ్లోకమునర్థము 'హార న్తం నవనీతాదిచౌర్యేణ వ్రజయోషితామ్! సుగోపాలైర్వృతం । కృష్ణం ధ్యాయే న్మన్త్రం జపే దిదమ్' అని గోపాలకృష్ణైకాదశాక్షరీ మంత్రధ్యానముగా సనత్కుమారసంహితయందుఁ జెప్పంబడియున్నది.

న్వెన్నపనంటిలోన జన నీ యొకదూడను జూడవచ్చితిన్
ఖిన్నదనంబు మాను మని వ్రేతకుఁ బల్కుమురారిఁ గొల్చెదన్.

తా. ఒక గోపిక తనయింట వెన్నకుండలోఁ జేయిపెట్టుచున్న కృష్ణునిగాంచి 'ఓ బాలా! నీవెవ్వఁడ' వనఁగా కృష్ణుఁడు 'నేను బలరాముని తమ్ముఁడ' ననియె. గోపిక నీకు నాయింట పనియేమి' అని యడుగఁగా, కృష్ణుఁడు 'నాయిల్లు అని సందేహపడి వచ్చితి' ననెను. అందుకు గోపిక 'అదిసరియేకాని వెన్నకుండలో చేయిపెట్టెదవేల? అనఁగా కృష్ణుఁడు 'తల్లీ! ఒకదూడను వెదకుటకై అందుజేయిపెట్టినాను కాని అందులకు క్షణకాలమును దుఃఖింపకుమా' అని చెప్పెను. ఇట్లు కృష్ణుఁడు గోపికకు చెప్పిన మేలైన ప్రత్యుత్తరము మమ్ముఁ గాపాడునుగాక.

శ్లో॥ గోపాలాఽజిరకర్దమే విహరసే విప్రాఽధ్వరే లజ్జసే
బ్రూషే గోకులహుఙ్కృతైః స్తుతిశతైర్మౌనం విధత్సే విదామ్।
దాస్యం గోకులపుంశ్చలీషు కురుషే స్వామ్యం న దాన్తాఽత్మసు
జ్ఞాతం కృష్ణ తవాఙ్ఘ్రిపఙ్కజయుగం ప్రేమ్ణాఽచలం మఞ్జులమ్॥83

టీ. హేకృష్ణ=ఓకృష్ణా, గో...కరమే-గోపాల=గొల్లలయొక్క, అజిర=ఇంటి ముంగిళ్లయందలి, కర్దమే=రొంపియందు, విహరసే=విహరించెదవు, విప్ర+అధ్వరే=బ్రాహ్మణులయజ్ఞమందు, లజ్జసే=సిగ్గుపడెదవు-గొల్లముంగిళ్లయందు తిరుగాడుటకు సిగ్గుపడవు గాని బ్రాహ్మణులయజ్ఞములకు వచ్చుటకు సిగ్గుపడెద వనుట. గోకులహుఙ్కృతైః-గోకుల=గొల్లపల్లెయొక్క - గొల్లపల్లెలోనివానియొక్క - లేక-గోసమూహముయొక్క, హుఙ్కృతైః=హుంకారములతోడ, బ్రూషే=పలికెదవు, వానిహుంకృతులకు మాఱుపలికెద వనుట, విదాం=తత్త్వవేత్తలైనవారియొక్క, స్తుతిశతైః=వందలకొలఁది స్తోత్రములచేత, మౌనం=మూకత్వమును, విధత్సే=చేయుచున్నావు-గోకులహుంకారములకు బదులు పలికెదవు గాని జ్ఞానులెంతస్తోత్రములు చేసినను బలుకవనుట, గోకులపుంశ్చలీషు-గోకుల=వ్రేపల్లెయందలి, పుంశ్చలీషు=స్వైరిణుల విషయమునందు-స్వైరిణులకు అనుట, దాస్యం=దాసభావమును ఊడిగమును, కురుషే=చేయుచున్నావు, దాన్త+ఆత్మసు-దాన్త=దమముగల-విషయములనుండి నివృత్తమైన, ఆత్మసు=మనస్సుగలవారియందు, స్వామ్యం=స్వామిత్వమును-స్వామిగా నుండుటను, న (కురుషే)=చేయవు-గొల్లకుటారికత్తెలకు ఊడిగమైన చేయుదువు గాని జితేంద్రియులగు మహాత్ములను ఏలుకొనుటను జేయవు అనుట-కాఁబట్టి, తవ=నీయొక్క, మఞ్జులమ్=మనోజ్ఞమైన, అఙ్ఘ్రి...యుగం-అంఘ్రిపంకజ=అడుగుఁదామరలయొక్క, యుగం=దోయి, ప్రేమ్ణా=ప్రేమచేత, అచలం=స్థిరమైనదిగా-లేక, చలం=చలించునదిగా-నిగుడునదిగా, జ్ఞాతం=తెలియఁబడినది. గొల్లలముంగిళ్లు మొదలైన నికృష్టవస్తువులు నీకు ఎక్కువ గాను మిక్కిలి ఉత్కృష్టము

లైనవిప్రయజ్ఞాదులు నీకుఁ దక్కువగాను నుండుటను జూడఁగా ఆయావస్తువుల ఎక్కువ తక్కువనుబట్టి కాదు నీప్రేమనుబట్టియే వానివానికి నీయంఘ్రికమలములు చూపుదు వనుట-నీ కెక్కడ ప్రేమ గలదో అక్కడికే నీయడుగుదమ్ములు నిగుడును-అనఁగా నీవు పోదు వని తాత్పర్యము.

మ. క్రతుభూమిం జొరఁ జొవ్వు గోపగృహపంక్తికిం బన్ను మెట్టెవు గో
తతిహుంకారము విన్నఁ బల్కెదవు విద్వద్గోష్ఠికిం బల్క వా
నతి గావింతువు గోపజారలకు దాస్య న్నిశ్శేణిఁ గైకోవు యో
గ్యత యేహేతువు ప్రేమ కారణము గాదా దేవ నీచర్యకున్. 83

తా. కృష్ణా! గొల్లలయింటిముంగిళ్ల యందుఁ దిరుగాడెదవు గాని బ్రాహ్మణులు సేయుయజ్ఞములందు పొడనూపుటకు సిగ్గుపడెదవు. గోవులహుంకారధ్వనులకు మాఱు పలికెదవు గాని తత్త్వవిదులు ఎన్నిస్తోత్రములుచేసి పిలిచినను మాఱుపలుకవు. గొల్లవిటకత్తియలకు దాసుఁడుగా నుందువు గాని యింద్రియనిగ్రహము గలమహాత్ములకు ఏలికగానైన యుండవు. ఈకారణములనుబట్టి చూడఁగా ఆయావస్తువులయోగ్యతలనుబట్టి కాక నీప్రేమను బట్టియె వానివానికడకు నీయడుగుదమ్ములు సాఁగునని నాకుఁ దెలియనైనది.

శ్లో. నమ స్తస్మై యశోదాయా దాయాదాయాస్తు తేజసే।
యద్ధి రాధాముఖామ్భోజం భోజం భోజం వ్యవర్ధత॥ 84

టీ. యత్=ఏది-ఏతేజము, రాధాముఖామ్భోజం-రాధా=రాధయొక్క, ముఖ+అమ్భోజమ్=మోముఁదామరను, భోజంభోజం=భుజించిభుజించి-రాధయొక్క తామర వంటిమొగమును ఆస్వాదించి ఆస్వాదించి యనుట, వ్యవర్ధత=పెరిఁగినదో-రాధయొక్క ముఖారవిందసమాస్వాదనముచేఁ బయింబయి తులకించినదో యని భావము, యశోదాయాః=యశోదయొక్క, దాయాదాయ=పుత్త్రుఁడైన, తస్మై=ఆ-ప్రసిద్ధమైన, తేజసే=తేజమునకొఱకు, నమః=నమస్కారము, అస్తు=అగుఁగాక 'యశోదాయాదాయాదాయ' అనుటచేఁ బిన్ననాఁటిమొదలుగా, 'భోజంభోజం' అనుటచే రాధాముఖారవిందమును మిక్కిలి ఆస్వాదించి వర్ధిల్లినది. అనఁగా బాల్యమునుండి రాధాభోగపరతంత్రుఁ డని భావము.

ఉ. ఏమహితప్రకాశ ముదయించినపిన్నటనాఁటనుండి రా
ధామధురాధరాంచితసుధారసధారలఁ గ్రోలుచుక్ యశో
దామహనీయదాయసముదాయముఁ గాంచి ప్రవర్ధమాన మా
నామహ మిచ్చుఁగా కహరహంబు నశేషసుఖాయురున్నతుల్.

తా. యశోదకుం బుత్త్రుఁడై యవతరించి రాధాదేవిముఖారవిందమును మిక్కిలి యాస్వాదించి వర్ధిల్లిన శ్రీకృష్ణాఖ్యతేజమునకు నమస్కారము.

అవ. కృష్ణావతారమునకు సర్వసమాశ్రయణీయత్వరూప మైన సౌలభ్యముచేఁ గలిగిన వైలక్షణ్యమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ అవతారాః సన్త్వన్యే సరసిజనయనస్య సర్వతోభద్రాః ।
కృష్ణాదన్యః కో వా ప్రభవతి గోగోపగోపికాముక్త్యై॥ 85

టీ. సరసిజనయనస్య=(తామరవంటికన్నులు గల) శ్రీకృష్ణునియొక్క, సర్వతోభద్రాః=ఎల్లెడల శుభకరము లైన, అన్యే=ఇతరము లైన, అవతారాః = అవతారములు, సన్తు=కలుగుఁగాక, కృష్ణాత్=కృష్ణునికన్నను, (శ్రీకృష్ణావతారమునకన్నను, అన్యః=ఇతర మైన, కో వా = ఏది-ఏయవతారము, గో...ముక్త్యై-గో = గోవులయొక్కయు, గోప=గోపకులయొక్కయు, గోపికా=గోపికలయొక్కయు, ముక్త్యై=ముక్తికొఱకు, ప్రభవతి=సమర్థమగుచున్నది-కృష్ణావతారము తప్ప మఱేదియు సమర్థము కాదనుట, శ్రీవిష్ణుదేవునియవతారములలోఁ గొన్ని ఒకానొకటికి భద్రములైనవియుఁ గొన్ని సర్వతోభద్రాః అన్నిటికి భద్రము లైనవియు నగును- కృష్ణావతారమును సర్వతోభద్రము లైనయవతారములలో ఒకటియగును. అయినను ఈసర్వతోభద్రావతారములలోఁ గూడఁ గృష్ణావతారమే సామాన్యము లగుగోగోపగోపికాజనములకుఁగూడ ముక్తిప్రద మైనదిగాన సర్వతోభద్రము లగువానిలో నెల్ల నిదియే మేలైన దని భావము. కావుననే తనకు మిక్కిలి యభీష్ట మైన దని హృదయము.

మ. అవతారంబులు లేవె శౌరి కతికల్యాణంబు లీద్ధాత్రిలో
నవి వెక్కుల్ గల వెంచ గోనికరగోపానీకగోపాంగనా
నివహాశ్రేయ మొనంగఁ జాలెనె కృపాసాంద్రుఁ డై నట్టిశౌ
రివలెన్ వేఱొకమూర్తి గావునఁ దదంఘ్రిం గొల్తు నెల్లప్పుడున్.

తా. శ్రీవిష్ణుదేవునియవతారములలో సర్వత్ర శుభకరము లైన యవతారములు ఉండినను వానిలోనెల్ల కృష్ణావతారమే సామాన్యము లైన గోగోపగోపీజనములకును ముక్తి నొసంగ నేర్చినది గావున అదియే శ్రేష్ఠ మైనది.

శ్లో॥ *మధ్యేగోకులమణ్డలం ప్రతిదిశం చామ్బారవోజ్జృమ్భితే
ప్రాతర్దోహమహోత్సవే నవఘనశ్యామం రణన్నూపురమ్ ।

* ఈశ్లోకమునర్థము 'పఙ్క్త్యాయతన మీశానం ధావమానం వ్రజాఙ్గణే। కిఙ్కిణీనూపురగ్రీవాకర్ణభూషోజ్జ్వలం స్మరేత్' అని గోపాలకృష్ణసర్వసంపత్కృదష్టాక్షరీమంత్రధ్యాన మని సనత్కుమారసంహితయందు చెప్పంబడినది.

ఫాలే బాలవిభూషణం కటిరటత్సత్కిఙ్కిణీమేఖలం
కణ్ఠే వ్యాఘ్రనఖంచ శైశవకళాకల్యాణ కార్త్స్న్యం భజే. 85

టీ.ప్రాతః...మహోత్సవే-ప్రాతః = రేపకడ, దోహ = పిదుకుటఅనెడి, మహోత్సవే = గొప్పఉత్సవమందు, ప్రతిదిశం = ప్రతిదిక్కునందును, ఆమ్భా ..జృమ్భితే-అంభారవ = అంభాఅనెడి ధ్వనులచేత, ఉజ్జృమ్భితే = మిక్కిలియుఁ బ్రకాశించుచున్న, మధ్యే...మణ్డలమ్-గోకుల = గోసమూహముయొక్క, మండల = ప్రదేశముయొక్క, మధ్యే = నడుమ, నవ...శ్యామమ్-నవ = నూతనమైన, ఘన = మబ్బువలె, శ్యామమ్ = నల్లనైనదియును, రణత్ + నూపురమ్-రణత్ = మ్రోగుచున్న, నూపురమ్ = అందియలు గలదియును, ఫాలే = నొసటి యందు, బాలవిభూషణం = రావిరేక గలదియు, కటి...మేఖలమ్-కటి = మొలయందు, రటత్ = శబ్దించుచున్న, సత్ = శ్రేష్ఠమైన, కిఙ్కిణీ = గజ్జెలుగల, మేఖలమ్ = మొలనూలుగల దియును, కణ్ఠే = కంఠమునందు, వ్యాఘ్రనఖం = పులిగోరుగలదియు, అగు, శైశవ...కార్త్స్న్యమ్-శైశవ = శిశుసంబంధమైన, కళా = కళలయొక్క-రేఖలయొక్క, కల్యాణ = శుభములయొక్క, కార్త్స్న్యమ్ = సర్వమును. అత్యంతశుభములైన శైశవలక్షణములన్నింటియొక్క రాశియైన శ్రీకృష్ణునిఅనుట-శిశురేఖలయొక్క శుభప్రపంచమంతయు నీతఁడన అయ్యెనో అన్నట్లున్న కృష్ణుని అనుట, భజే = భజించుచున్నాను. రణన్నూపురము, ఫాలమందలిబాలవిభూషణము, కటిగటత్కింకిణీమేఖలము, కంఠమందు వ్యాఘ్రనఖము మొదలైనవి శైశవకళలుగా నిబంధించినాఁడని తెలియునది.

మ. మొలనూ లందెలు గజ్జెలున్ మొరయ జీమూతాకృతిం జేరి మం
దల నంభారవ మెల్లెడం జెలఁగఁ బ్రాతర్దోహ మీక్షింపఁ జా
రులలాటంబున రావిరేక పులిగోరుం గంఠవీథిం దటి
త్తులగా ముద్దులు గుల్కు బాలకునిఁ గాంక్షతున్ జీవసప్రౌఢికిన్. 86

తా. వేకువను మిక్కిలివేడుకగాపాలుపిదుకునప్పుడు పలుగడల అంభాయనియఱచుచున్న ఆవులగుంపునడుమ, క్రొత్తమబ్బువలె నల్లనై అందియలు కాలియందు మొరయ మొలనూలిగజ్జెలు మ్రోఁగ, కంఠమందుఁ బులిగోరు విలసిల్ల, నొసటియందు రావిరేక దళుకొత్త, నిట్లు శిశువుయొక్క శుభరేఖలన్నియు మిక్కిలియొప్పుచున్న చిన్నికృష్ణుని భజించుచున్నాను.

శ్లో॥ సజలజలదనీలం దర్శితోదారలీలం
కరతలధృతశైలం వేణునాదైరసాలమ్ ।
వ్రజజనకులపాలం కామినీకేళిలోలం
కలితలలితమాలం నౌమి గోపాలబాలమ్ ॥ 87

టీ. సజల...నీలం-సజల=నీటితోఁగూడిన, జలద = మబ్బువలె, నీలం=నల్లనైన వాఁడును, దర్శి...లీలమ్-దర్శిత=చూపఁబడిన,ఉదార=అధికములైన, లీలమ్=(పూతనా వధము మొదలైన)విలాసములుగలవాఁడును, కర...శైలమ్-కరతల = హస్త(ప్రదేశమందు, ధృత=ధరింపఁబడిన, శైలమ్(గోవర్ధన)పర్వతముగలవాఁడును, వేణునాదైః = వేణుధ్వనులచేత, రసాలమ్=రసవంతుఁడైనవాఁడును - రసవంతమైన వేణుధ్వనులు గలవాఁడను ట-రసముచిప్పిలునట్లు వేణువునూఁదువాఁడనిభావము, వ్రజ...పాలమ్-వ్రజ=వ్రేపల్లెయందలి, జనపల=జనసమూహముయొక్క-పాల,మ్=పాలకుఁడైనవాఁడును, కామినీ...లోలమ్-కామినీ=(కామవతులైన) స్త్రీలతోడి, కేళి=క్రీడలయందు, లోలమ్ = ఆసక్తుఁడైన వాఁడును,కలిత...మాలమ్-కలిత=ధరింపఁబడిన, లలిత=మనోజ్ఞమైన,మాలమ్=వనమాల గలవాఁడును, అగు, గోపాలబాలమ్ = గొల్లపిల్లవాఁడగు కృష్ణుని, నౌమి = నుతించుచున్నాను.

మ॥ మురళీనాదవిశాలు నీలమణిజీమూతాతసీనీలు నీ
రరుహాక్షీరతిలోలు హస్తజలజాగ్రన్యస్తశైలున్ సదా
దరశీలున్ వ్రజలోకపాలుఁ గరుణోదారైకలీలున్ భుజాం
తరరాజద్వనమాలుఁ గొల్చెద సముద్యద్గోపబాలున్ మదిన్. 87

తా. నీటితోఁగూడినమేఘమువలె నల్లనై, పూతనాసంహారాదులైన పెనులీలలు ప్రచరించుచు, అఱచేతగోవర్ధనమునెత్తి, రసమొలుకునట్లు పిల్లఁగ్రోవినూఁదుచు, వ్రేపల్లెయందలిజనములఁ గాచుచు, అంగనలతోడిక్రీడలు సలుపుచు, మంచివనమాలికఁ గాల, వెలుఁగుచుండు గొల్లపిల్లవానిని శ్రీకృష్ణుని నుతించుచున్నాను.

శ్లో॥ స్మితలలితకపోలం స్నిగ్ధసంగీతలోలం
లలితచికురజాలం చౌర్యచాతుర్యలీలమ్ ।
శతమఖరిపుకాలం శాతకుమ్భాభచేలం
కువలయదళనీలం నౌమి గోపాలబాలమ్॥ † 88

టీ. స్మిత...కపోలం-స్మిత=చిఱునగవుచేత, లలిత=చెలువైన, కపోలం=చెక్కిళ్లుగలవాఁడును, స్నిగ్ధ...లోలమ్-స్నిగ్ధ=మనోజ్ఞమైన, సంగీత=వేణుగానరూపమైనసంగీతమందు, లోలమ్=ఆసక్తుఁడైనవాఁడును-లేక, 'మురళీనినదలోలమ్' అనుమీఁదిపద్యమునందలిదానితో పునరుక్తిలేకుండుటకై, స్నిగ్ధ=తనయందు భక్తిరూపమైన స్నేహముగల నారదాదులయొక్క-, సంగీత = గానమందు, లోలమ్ = ఆసక్తుఁడైనవాఁడును అనియు నర్థము,లలిత...జాలమ్-లలిత=సుందరమైన, చికుర=ముంగురులయొక్క-,జాలమ్=సమూహము గలవాఁడును, చౌర్య.. లీలమ్ చౌర్య=దొంగతనముయొక్క-, చాతుర్య=నేర్పుతోఁ గూడిన, లీలమ్ = విలాసచేష్టలుగలవాఁడును - వెన్న దొంగిలించుట మొదలైన

చతురము లగుచోరలీలలు గలవాఁడనుట, శత...కాలమ్_శతమఖ=ఇంద్రునికి, రిపు=శత్రువు లైనరాక్షసులకు, కాలమ్=యముఁ డైనవాఁడును, శాత...చేలమ్_శాతకుమ్భ=బంగారుతో, అభ=సాటియైన-లేక 'ఆభా' యనఁగా కాంతి గనుక బంగారువలె మెఱయుచున్న, చేలమ్=వస్త్రము గలవాఁడును, కువ...నీలమ్-కువల యదళ = కలువరేకుల వలె, నీలమ్=నల్లనైనవాఁడును, అగు, గోపాలబాలమ్ = గొల్లపిల్లవానిని_చిన్నికృష్ణుని, నౌమి=నుతించుచున్నాను.

మ. సరసస్మేరకపోలుఁ గొల్తు మురళీసంగీతలోలున్ శుభా
కరచామీకరచేలు నీలమణిరంగత్కుంతలు శ్రీవిశా
లు రమాపాలు నితాంతచౌర్యగుణశీలుం దానవప్రాణహృ
త్కరవాలుం గపిలాదనీకువలయోద్యన్నీలు గోపాలునిన్. 88

తా. చిఱునగవుచేఁ దెలుపైనచెక్కిళ్ళు గలిగి, ఇంపైనవేణుగానమం దాసక్తుఁడై శోభనమైనముంగురులు గ్రాల, మిక్కిలి నేర్పుతోఁ గూడిన వెన్నదొంగిలించులీలలు నెఱపుచు, ఇంద్రునిపగతు రైనరాక్షసులకు యముఁడై, బంగారువన్నె చేలగట్టి, కలువ రేకులవలె నల్లనై యొప్పుగొల్లవానిని కృష్ణుని నుతించుచున్నాను.

శ్లో॥ మురళినినదలోలం ముగ్ధమాయూరచూళం
దళితదనుజజాలం ధన్యసౌజన్యలీలమ్ ।
పరహితనవహేలం పద్మసద్మానుకూలం
నవజలధరనీలం నౌమి గోపాలబాలమ్॥ 89

టీ. మురళి...లోలమ్_మురళి=పిల్లఁగ్రోవియొక్క, నినద = నాదమందు - పిల్లఁగ్రోవిని ఊఁదుటయందు, లోలమ్=ఆసక్తుఁ డైనవాఁడును, ముగ్ధ...చూళమ్_ముగ్ధ=సుందరమైన, మాయూర=నెమిలిసంబంధియైన, చూళ=జుట్టుగలవాఁడు-నెమిలిపురిగలవాఁడనుట, దళిత...జాలమ్_దళిత=చీల్పఁబడిన, దనుజ=రాక్షసులయొక్క, జాలం=సమూహము గలవాఁడును, ధన్య...లీలమ్-ధన్య=కృతార్థులవిషయమైన, సౌజన్య=సుజనత్వముయొక్క-మంచితనముయొక్క, లీలం = విలాసములు గలవాఁడు-ధన్యులైననిజభక్తులకు సుజనత్వముతోఁ గూడినలీలలు నెఱపువాఁ డనుట, పర...హేలమ్_పర = అన్యులకు, హిత=మేలు కలిగించునదైన, నవ=క్రొత్తదైన, హేలమ్=విలాసములు గలవాఁడును-లేక, పర=శత్రువులకు,హిత=పథ్యములైన, నవ=క్రొత్త-విచిత్రము లగు, హేలమ్=(సంహరించుట మొదలైన)విలాసములు గలవాఁడును, పద్మ...కూలమ్-పద్మసద్మా = (తామరయందు వసించెడి) లక్ష్మికి, అనుకూలమ్ = అనుకూలనాయకుఁడైనవాఁడును, నవ...నీలమ్-నవ=క్రొత్తయైన-వర్షము కురియుని యనుట, జలధర=మబ్బువలె, నీలమ్=నల్ల

నైనవాఁడును, అగు, గోపాలబాలమ్ = గొల్లపిల్లవానిని-శ్రీకృష్ణుని, నౌమి = నుతించు చున్నాను.

చ. మురళినినాదలోలు నతిక్రముగ్ధశిఖావళపింఛచూళునిం
బరహితశీలు రాత్రిచరసాళివిఘాలుఁ గృతార్థలోలుఁ బం
కరుహాగృహానుపాలు వ్రజపంకజముఖీహితహేలు నవ్యపు
ష్కరధరనీలుఁ గొల్తు శుభకాంచనచేలుని గోపబాలునిన్. 89

తా. మురళీగానమం దాసక్తుఁడై, సుందరమైన నెమిలిపురిని దాల్చి, రాక్షససమూహములను జీల్చి, ఆశ్రితులైనధన్యులకు సుజనశ్లాఘ్యలీలలు పచరించి, మఱియు నితరులకు హితములై నూత్నములైనవిలాసములు నెఱపుచు, లక్ష్మీదేవికి అనుకూలనాయకుఁడై, క్రొత్తమబ్బువలె నల్లనై విలసిల్లుగొల్లపిల్లవానిని శ్రీకృష్ణుని నుతించుచున్నాను.

శ్లో॥ సరసగుణనికాయం సచ్చిదానన్దకాయం
శమితసకలమాయం సత్యలక్ష్మీసహాయమ్ ।
శమదమసముదాయం శాన్తసర్వాన్తరాయం
సుహృదయజనదాయం నౌమి గోపాలరాయమ్॥ 90

టీ. సరస...కాయం-సరస=రసయుక్తములైన, గుణ=సౌందర్య సౌకుమార్యాది గుణములయొక్క, నికాయం = సమూహముగలవాఁడును, సత్ + చిత్ + ఆనంద కాయం=సత్యము జ్ఞానము ఆనందము అనెడిఈమూఁటిచేనైన దేహము గలవాఁడును, సత్యజ్ఞానానంద స్వరూపుఁడనుట, శమిత—మాయం-శమిత = అడఁపఁబడిన, సకల = సమస్తములైన, మాయమ్ = మాయలుగలవాఁడును, సత్య...హాయం—సత్యలక్ష్మీ= సత్యరూపయైనలక్ష్మికి, సహాయమ్=సహాయుఁడైనవాఁడును, శమ=బహిరింద్రియనివృత్తియొక్కయు, దమ=అంతరింద్రియనివృత్తియొక్కయు, సముదాయమ్ = సమూహమైన వాఁడును, శాంత...రాయమ్-శాంత=నశించిన, సర్వ=సమస్తములైన, అంతరాయమ్= విఘ్నములుగలవాఁడును, సుహృదయ...దాయమ్—సుహృదయ = నిర్మలమైన అంతరంగములు గల, జన=జనములకు, దాయం = భాగమైనవాఁడును_వశుఁడైనవాఁడనుట, అయిన, గోపాలరాయమ్—గొల్లవారికి రాజైన కృష్ణుని, నౌమి=నుతించుచున్నాను.

చ. సరసగుణోదయుఁ శమితసర్వసుశాంచరమాయునిన్ సుహృ
న్నరవరదాయు సత్యచిదనంతసుఖోజ్జ్వలకాయు సత్యకా
హారిణదృగిందిరాచిరసహాయుని శాంతమహాంతరాయు జి
త్వరు దమశాంతిముఖ్యసముదాయునిఁ గొల్చెద గోపరాయునిన్.

తా. సౌందర్యాదిగుణముల రాశియై, సత్యజ్ఞానానందస్వరూపుఁడై, రాక్షసాదుల సకలమాయలను దూలించుచు, సత్యసంపన్నులకు సహాయుఁడై, శమదమాదియుక్తుఁడై, సకలవిఘ్నములను బోఁగొట్టుచు, నిర్మలాంతరంగులపాలిసామ్మై, గొల్లవారలకెల్ల మొనగాఁడై వెలయు కృష్ణుని నుతించుచున్నాను.

శ్లో॥ లక్ష్మీకళత్రం లలితాబ్జనేత్రం, పూర్ణేన్దువక్త్రం పురుహూతమిత్రమ్।
కారుణ్యపాత్రం కమనీయగాత్రం, వన్దే పవిత్రం వసుదేవపుత్రమ్॥91

టీ. లక్ష్మీకళత్రం-లక్ష్మీ=లక్ష్మీదేవి, కళత్రమ్=భార్యగాఁ గలవాఁడును, లలి... నేత్రం-లలిత=సుందరములైన, అబ్జ=కమలములవంటి, నేత్రం=కన్నులు గలవాఁడును, పూర్ణేన్దువక్త్రం-పూర్ణ+ఇన్దు=నిండుచందురునివంటి, వక్త్రం=మొగము గలవాఁడును, పురుహూతమిత్రం-పురుహూత=ఇంద్రునికి, మిత్రం=స్నేహితుఁడైనవాఁడును, కారుణ్యపాత్రం-కారుణ్య=దయకు, పాత్రం=ఆస్పదమైనవాఁడును, కమనీయగాత్రం-కమనీయ=మనోజ్ఞమైన, గాత్రం=శరీరము గలవాఁడును, పవిత్రం=పావనుఁడైనవాఁడును, అగు, వసుదేవపుత్రమ్-వసుదేవుని కుమారుఁడైన శ్రీకృష్ణుని, వన్దే=నమస్కరించుచున్నాను.

ఉ. శ్రీరమణీకళత్రు సర - సీరుహపత్రవిశాలనేత్రు బృ
న్దారకనాథమిత్రుఁ గరు - ణాగుణపాత్రుఁ బవిత్రుఁ బూర్ణిమా
నీరజవైరివక్త్రుఁ గమ - నీయవయఃపటుగాత్రు నాబృహ
ద్ధీరవనౌఘచైత్రు వసు - దేవునిపుత్రు మదిం దలంచెదన్. 91

తా. లక్ష్మీదేవి భార్యగాఁ గలిగి, కలువై తామర రేకులంబోలు కన్నులు గలిగి, నిండుచందురునివంటి మొగముతోఁగూడి, ఇంద్రునికి చెలికాఁడై, కరుణానిధియై, సుందరమైన దేహము గలిగి, లోకములనెల్ల పవిత్రమును జేయునట్టి వసుదేవుని కొడుకును శ్రీకృష్ణుని నుతించుచున్నాను.

శ్లో॥ మదమయ మదమయ దురగం యమునా మవతీర్య వీర్యశాలీయః।
మమ రతి మమరతిరస్కృతిశమనపరస్స క్రియాత్కృష్ణః॥ 92

టీ. యః=ఎవఁడు-ఏకృష్ణుఁడు, వీర్యశాలీసన్-వీర్య=పరాక్రమముచేత, శాలీసన్=ఒప్పుచున్నవాఁడగుచు, యమునాం-యమునానదిని-యమునానదియందు దనుట, అవతీర్య=దిగి, మదమయం=మిక్కిలి మదముగల, ఉరగం=(కాళియుఁడను) సర్పమును, అదమయత్=అణంచెనో అమర...పరః-అమర=దేవతలయొక్క, తిరస్కృతిం=పరిభవమును-రాక్షసాదులచేఁ దనభక్తులైన దేవతలకుఁ గలుగు అవమానమును,శమన=అణఁచుటయందు-పోఁగొట్టుటయందు, పరః=ఆసక్తుఁడైనవాఁడగు, సః=ఆ, కృష్ణః=శ్రీకృష్ణుఁడు, మమ=నాకు, రతిం=సుఖమును, క్రియాత్=చేయుఁగాక.

శా. కాళిందీజల ముబ్బి గట్ల కెసురే కక్కుం జొచ్చి హాలాహల
జ్వాలాలీఢకరాళకాళియఫణా జాలంబు నృత్తక్రియం
గాలం గేల నడంచి నిర్జరతిర స్కారంబు వారించుగో
పాస్త్రామికటాక్షవీక్షణము మాకు పాలం దిరం బయ్యెడిన్. 92

తా. పరాక్రమము మీఱ యమునాహ్రదములోదిగి, మిక్కిలి మదించిన కాళియ సర్పమును అణంచి, దేవతలకు రాక్షసులు మొదలైనవారిచేఁ గలుగునవమానమును బోఁగొట్టుటయుం దాసత్త్వఁడై యొప్పు శ్రీకృష్ణుఁడు నాకు సుఖమును గలిగించుఁగాక.

శ్లో॥ మౌళౌ మాయూరబర్హం మృగమదతిలకం చారులాలాటపట్టే
కర్ణద్వన్ద్వేచ తాళీదళ మతిమృదుం మౌక్తికం నాసికాయామ్ ।
హారో మన్దారమాలాపరిమళభరితే కౌస్తుభస్యోపకణ్ఠే
పాణౌ వేణుశ్చ యస్య వ్రజయువతియుతః పాతు పీతామ్బరో నః॥ 93

టీ. యస్య=ఎవనికి, మౌళౌ=శిరస్సునందు, మాయూరబర్హం=నెమిలిపురియో, లాలాటపట్టే-లాలాట=నుదుటిని సంబంధించిన, పట్టే=భాగమునందు, చారు=సుందరమైన, మృగమదతిలకం=కస్తురిబొట్టో, కర్ణద్వన్ద్వే-కర్ణ=చెవులయొక్క, ద్వన్ద్వే=రెంటియందు, అతిమృదులం=మిక్కిలిమృదువైన, తాళీదళంచ=తాటియాకో, నాసికాయాం=ముక్కునందు, మౌక్తికం=ముత్యమో, మన్దార...భరితే-మన్దారమాలా=మందార పుష్పముల దండయొక్క, పరిమళ=వాసనచేత, భరితే=నిండినదైన, కౌస్తుభస్య=కౌస్తుభమణియొక్క, ఉపకణ్ఠే=సమీపమునందు, హారః=హారమో, మన్దారమాలాపరిమళభరితః అను పాఠమున మన్దారమాలాపరిమళముతోనిండిన హారము అని యర్థము. పాణౌ=చేతియందు, వేణుశ్చ=పిల్లఁగ్రోవియో, సః=ఆ, వ్రజయువతియుతః-వ్రజయువతి=గొల్లజవ్వనులతోడ, యుతః=కూడినవాఁడు, అగు, పీత+అంబరః=పచ్చనివస్త్రము గలవాఁడైన శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, పాతు=రక్షించుఁగాక.

మ. సిగచుట్టం గస్తురిబొట్టు నాసికతుద న్ముత్యంబు కర్ణద్వయిన్
మృదుతాళీదళయుగ్మమున్ మురళి పాణిన్ మాళిఁ బింఛంబు పే
రెదపైఁ గౌస్తుభహారకల్పసుమనో హేమాంబరాడంబరం
బొడవన్ గోపికలెల్లఁ గొల్వ హరి డా యున్ మమ్ము నెల్లప్పుడున్.

తా. సిగయందు నెమిలిపురియు, నెన్నుదుటఁ గస్తురిబొట్టును, చెవుల రెంటను లేత తాటియాకును, ముక్కునందు ముత్యమును, కౌస్తుభమణి మొదలగు మందారపుష్పముల పరిమళముతోఁ గూడిన హారమును, చేత పిల్లంగ్రోవియును, దాల్చి పచ్చని వలువఁ గట్టుకొని గొల్లచెలువలతోఁ గూడియుండు కృష్ణుండు మమ్ముఁ గాపాడుఁగాక.

శ్లో॥ మురారిణా వారివిహారకాలే, మృగేక్షణానాం ముషితాంశుకానాం
కరద్వయంవా కచసంహతిర్వా, ప్రమీలనంవా పరిధానమాసీత్॥

టీ. వారి...కాలే-వారివిహార=జలక్రీడయొక్క, కాలే = సమయమందు, మురారిణా=కృష్ణునిచేత, ముషిత + అంశుకానాం-ముషిత=దొంగిలింపఁబడిన,అంశుకానాం= వస్త్రములు గలవారైన, మృగ + ఈక్షణానాం=(లేడివంటికన్నులుగల) స్త్రీలకు, కరద్వయంవా-కర=చేతులయొక్క, ద్వయంవా=రెండుగాని, కచసంహతిర్వా-కచ=కురులయొక్క, సంహతిర్వా=సమూహముగాని, ప్రమీలనంవా = కన్నులుమూసికొనుటగాని, పరిధానం=వస్త్రముగా, ఆసీత్=ఆయెను. కృష్ణుఁడు వలువలు అపహరింపఁగాఁ బ్రౌఢలు కొందఱు తమగుహ్యములను కురులచేతను జేతులతోను మూసికొని రనియు ముగ్ధలు కొందఱు కన్నులు మూసికొని దానిచేఁ దమగుహ్యములు ఇతరులకుఁ దెలియవని తలఁచి రనియు భావము.

ఉ. వారివిహారకాలమున వారిరుహాక్షుఁడు చీర లెత్తఁగా
వారిజపత్రపాళి కచభారము కన్నులమోడ్పుఁ జేతు ల
వ్వారికి మాటులై యెసఁగె వారిచరాక్షుల కెల్లనారయన్
వారికి మాటు లేటికి సవారితమోహతమంబు గ్రమ్మఁగన్. 94

తా. గోపికలు జలక్రీడలు సలుపునపుడు కృష్ణుండు వారిచీరలను అపహరింపఁగా వారిలోఁ గొందఱు చేతులతో గుహ్యములను మూసికొనిరి. మఱికొందఱు వెండ్రుకలతో వానిని గప్పిరి. కొందఱు ముగ్ధలు ఊరక కన్నులు మూసికొనిరి.

శ్లో॥ యాసాం గోపాఙ్గనానాం లసదసితతరాలోలలీలాకటాక్షా
యన్నాసాచారుముక్తామణిరుచినికరవ్యోమగఙ్గాప్రవాహే।
మీనాయన్తేఽపి తాసా మతిరభసచలచ్చారునీలాలకాన్తా
భృఙ్గాయన్తే యదఙ్ఘ్రిద్వయసరసిరుహే పాతు పీతామ్బరో నః॥95

టీ. యన్నాసా...ప్రవాహే-యత్=ఎవ్వనియొక్క, నాసా=ముక్కుయొక్క, చారు=సుందరమైన, ముక్తామణి=ముత్యముయొక్క, రుచి = కాంతులయొక్క, నికర= సమూహమనెడి, వ్యోమగఙ్గా = ఆకాశగంగయొక్క, ప్రవాహే = ప్రవాహమునందు, యాసాం=ఏ, గోపాఙ్గనానాం=గోపస్త్రీలయొక్క,లసత్...కటాక్షాః-లసత్ = ప్రకాశించుచున్నవియు, అసితతర=మిక్కిలి నల్లనైనవియు, ఆలోల = చలించుచున్నవియు, అగు, లీలా=విలాసప్రయుక్తములైన, కటాక్షాః = కడగంటిచూపులు, మీనాయన్తే=మత్స్యములవలె నాచరించుచున్నవో, తాసాం = ఆగోపస్త్రీలయొక్క, 'యాసాం' అను పాఠమున 'ఏగోపస్త్రీలయొక్క'యనియర్థము, అతిరభస...కాన్తా-అతిరభస = అతివే

గముచేత, చలత్=చలించుచున్నట్టి, చారు=మనోజ్ఞములైన, నీల=నల్లని, అలక=ముంగురులయొక్క, ఆస్తాః=కొనలు,యదంఘ్రి..రుహే-యత్=ఎవ్వనియొక్క, అంఘ్రిద్వయ=అడుగుదోయియనెడు,సరసీరుహే=తామరయందు, భృఙ్గాయన్తే + అపి=తుమ్మెదలవలె ఆచరించుచునున్నవో, సః=ఆ పీతామ్బరః=కృష్ణుడు, 'యాసాం' అను పాఠమున, 'తాసాం' అని అధ్యాహరించుకొనదగును గాన 'తాసాం'ఆగోప స్త్రీలను సంబంధించిన, సః=ఆ,పీతామ్బరః=కృష్ణుడా అనియర్థము, నః=మమ్ము, పాతు=రక్షించుగాక. ఆకాశగంగ తెల్లనిది గనుక కృష్ణునియొక్క ముక్కుముత్యముయొక్క తెల్లని కాంతిప్రవాహమును తెల్లనిగంగానదిగాను అందు 'లసత్'తళతళమనిప్రకాశించుచు 'అలోల' మిక్కిలి చలించుచున్న గోపీకటాక్షములను తళతళమనిప్రకాశించుచు మిక్కిలి యిటునటు చలించుచున్న చేపలుగాను రూపించినాడు. కృష్ణుని అడుగుదామరయందు 'చలత్' చలించుచు 'నీల' నల్లనైనముంగురులను, చలించుచున్న నల్లనితుమ్మెదలనుగా రూపించినాడు. అనగా కటాక్షములను 'లసత్' 'అపితతర' 'అలోల' అనువిశేషణములచే ప్రవాహమునందు తళతళ మని యీదులాడు నల్లనిచేపలతోడిసామ్యమును, అలకాంతములకు 'చలత్' 'నీల' అనువిశేషణములచే దామరలయందు వ్రాలుచున్న నల్లనితుమ్మెదలతోడిసామ్యమును మిక్కిలియు బొసగించినవాడని తెలియునది. గోపికలచూపులు కృష్ణునిముక్కుముత్యము కాంతియందు నిగిడె ననుటచే ఆచెలువలు కృష్ణుని నెమ్మొగమును జూచిరనియు 'తాసాం భృఙ్గాయన్తేపి' అని అట్లుచూచిన చెలువలయొక్క ముంగురులు కృష్ణుని అడుగుదమ్ములయందుదుమ్మెదలవలె వ్రాలినవియునయ్యె ననుటచే కృష్ణుని మొగమునుజూచినంతనే కామపరవశలై మాకోరికల నొడగూర్చి కావు మని యతనిచరణములయందు నుదురుసోక పడి మ్రొక్కి ప్రార్థించిరనియు భావము. ముంగురులు 'అతిగభస'ముగా చలించుటను చెప్పుటచే వారు కృష్ణునిపాదములందు అతిరభసముగా పడి వేడిరనియు దానిచే వారికామాతిశయము అతిదుస్సహముగా నుండెననియు, ఇట్టికామోద్రేకమును గలిగించునంతమనోజ్ఞమై కృష్ణుని మొగ ముండెననియు నాశయములుధ్వనించెడిని. 'యాసాం' అనుచో కృష్ణునిఁ జూచినచెలువలే 'తాసాం' 'అపి' అనుటచే కృష్ణునిపాదములం బడిరని తెలియుచున్నది. 'యాసామ్' అనుపాఠమున చూచినచెలువలు ఒకరనియు మ్రొక్కినచెలువలు మఱొకరనియు భావమున కవకాశమిచ్చెడిని గాన అది సరసము గాదు. ముత్యముల తెలికాంతి ఆకాశమున వ్యాపించుటచే ఆకాశగంగగా రూపితమైనది.

మ. సరసీన్ మీనము లయ్యె నేవిభునినాస్రసామాక్తికోద్యత్ప్రభా
మరగంగన్ వ్రజభామినీచటులకంక్రపాలోలదృక్పాళు లే
హరిపాదాంబురుహంబునందు నళులై వ్యాపించె గోపాంగనా
తరళారాళవినీలకుంతలము లాశ్రధన్యుండు నన్ బ్రోచుతన్. 95

తా. ఎవ్వనియొక్క అచ్యుత్యముయొక్క తెల్లనికాంతిప్రవాహ మనెడి ఆకాశగంగయందు గోపస్త్రీలయొక్క తెళతెళమని ప్రకాశించుచుఁ జలించుచున్న నల్లనిమలుపుఁజూపులు చేపలవలె నుండునో, ఎవ్వనియొక్క అడుగుల నెడితామరయందు ఆచూచినగోపస్త్రీలయొక్క చలించుచున్న సొగసైన నల్లనిముంగురులకొనలు తుమ్మెదలవలె నుండునో అట్టి(శ్రీ)కృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ యద్వేణుశ్రేణిరూపస్థితసుషిరముఖోద్గీర్ణనాదప్రభిన్నా
ఏణాక్ష్య స్తత్క్షణేన త్రుటితనిజపతిప్రేమబన్ధా బభూవుః।
అ స్తవ్యస్తాలకాన్తాః స్ఫురదధరకుచద్వన్ద్వనాభిప్రదేశాః
కామావేశప్రకర్షప్రకటితపులకాః పాతు పీతామ్బరో నః॥ 96

టీ. యత్ ... భిన్నాః-యత్=ఎవ్వనియొక్క, వేణు=పిల్లఁగ్రోవియందు, శ్రేణిరూపః=పంక్తిరూపముగా, స్థిత=ఉన్నట్టి, సుషిర=రంధ్రములయొక్క, ముఖ=ముఖములనుండి ఉద్గీర్ణ=వెలిపుచ్చఁబడిన, నాద=ధ్వనులచేత, ప్రభిన్నాః= మిక్కిలిభేదింపఁబడినవారు, తమపురుషులనుండి మిక్కిలియు వేఱుపడినవారనుట, అగు, ఏణ+అక్ష్యః=(లేడివంటి కన్నులుగల) స్త్రీలు, తత్క్షణేన=ఆక్షణమందే, త్రుటి... బన్ధాః-త్రుటిత=తెంపఁబడినదైన, నిజ=తమయొక్క, పతి=మగలవలని, ప్రేమ = ప్రీతివిశేషముయొక్క, బన్ధాః స్యః= బంధము (ముడి)గలవారు అగుచు-కృష్ణుని అతిమోహనమైన వేణునాదము విన్నంతనే స్త్రీలు తమపురుషులవలనఁ గలిగియున్న ప్రేమను వీడి వారలను విడిచి వచ్చినవారైరనుట, మఱియును, అ స్త... కాన్తాః-అ స్త=తిరస్కరింపఁబడినవియు- వ్య స్త=తాఱుమాఱైనవియు-వీడినవిఅనుట, అగు, అలక+అన్తాః=ముంగురులకొనలుగలవారును-పురుషులను బాసి కృష్ణునొద్దకు పోవువేగమున ముంగురులువిడివడిచెల్లచెదరైనను కృష్ణునివలని పారవశ్యమున వానిని చక్కఁగా సవరించుకొనక, నిరాకరించిరనుట, స్ఫుర... ప్రదేశాః-స్ఫురత్=అదురుచున్న, అధర=మోవియును. కుచద్వన్ద్వ=చన్నుదోయియు, నాభిప్రదేశాః=పొక్కిలిపట్లునుగలవారును, కామా... పులకాః-కామ ఆవేశ=మన్మథావేశముయొక్క ప్రకర్ష=అతిశయముచేత, ప్రకటిత=బయలుపఱుపఁబడిన, పులకాః=గగ్గురులు గలవారును - మన్మథావేశము మిక్కుటమగుటచే దానిచేఁ గలిగిన గగ్గురులును స్పష్టముగాఁ గనఁబడుచుండెననుట-ఇట్టివారును. బభూవుః=అయిరో, సః=అట్టి. పీతామ్బరః=కృష్ణుఁడు, నః=మమ్ము, పాతు=రక్షించుఁగాక-శ్రీకృష్ణుఁడు తనవేణునాదముచే తానే స్త్రీలను భర్తలనుగోని విడనాడి తనయొద్దకుఁ బాఱివచ్చునట్లు చేసినాఁడు. ఇఁకఁ దనదర్శనస్పర్శనాదులచే నెంత చేయునో చెప్ప వశము గా దనుట.

మ. మురళీరంధ్రవిసర్గతస్వరముచే శ్రీ మోహించి గోపాంగనల్
మరుబారిన్ బలుగుబ్బ లుబ్బి పులకింపం గ్రొమ్ముడుల్ వీడ వా

తెలిసొంపుల్ నిగిడింప నీవియును భర్తృప్రేమముల్ జాఱి నే
హారివెంటం జరియింతు రట్టిసుకుమారాకారుఁ గీర్తించెదన్. 96

తా. ఎవనివేణునాదమును విన్నంతనె స్త్రీలు మిక్కిలియు నతనియందు మోహాక్రాంతలై తమపురుషులయెడలఁ గల ప్రేమబంధములనువీడి వారిని బెడఁబాసియుం గురులు చెదర, నీవియుఁ జన్నుదోయియుఁ జొక్కిలియు నదర, మరులు పయింబయి మీఱి పులకలు స్ఫుటముగాఁ గ్రమ్మ, ఒద్దదు వేగ వచ్చిరో అట్టిశ్రీకృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ దేవక్యా జఠరాకరే సముదితః క్రీతో గవాంపాలినా
నన్దే నానకదున్దుభే ర్నిజసుతాపణ్యేన పుణ్యాత్మనా।
గోపాలావళిముగ్ధహారతరళో గోపీజనాలఙ్కృతిః
స్థేయాన్నో హృది సన్తతం సుమధురః కోఽపీన్ద్రనీలో మణిః॥ 97

టీ. దేవక్యాః=దేవకియొక్క, జఠరాకరే-జఠర=గర్భమనెడి, ఆకరే=గనియందు. సముదితః=పుట్టినదియు, పుణ్య + ఆత్మనా=పావనమైనఆత్మఁగలవాడును, నందేన=నందుడు అనువాఁడును అగు, గవాం పాలినా=గోవులయొక్క కాచువానిచేత-గొల్లవానిచేత, నిజ... పణ్యేన-నిజసుతా=తనకూఁతురనెడి, పణ్యేన=వెలచేత-తనకూతురైనయోగమాయనువెలగానిచ్చి యనుట, క్రీతః=కొనఁబడినదియు, గోపాలా... తరళః గోపాల=గొల్లవాండ్రయొక్క, ఆవళీ - వరుస-సమూహము-అనెడి. ముగ్ధ=మనోజ్ఞమైన, హార = హారమునకు, తరళః=నాయకమణియైనదియు, గోపీ... లఙ్కృతిః=గోపీజన= గోపస్త్రీసమూహమునకు, అలంకృతిః=అలంకారభూతమైనదియు, సుమధురః=మిక్కిలి అందమైనదియు. కోఽపి= ఇట్టిదట్టిదని వర్ణింప నలవికానిదియు, అగు, ఇంద్రనీలః=ఇంద్రనీలరూపమైన, మణిః= రత్నము, నః=మాయొక్క, హృది=(మణిపరముగా) వక్షమునందు, (కృష్ణపరముగా) మనస్సునందు, సతతఁ=ఎప్పుడును. స్థేయాత్ =ఉండుఁగాత. ఒకరత్నము మొదట గనిలో దొరకుటయుఁ బిదప వెలయిచ్చి దానినికొనుటయు పిదప సానఁదీర జనులకు అలంకారమగుటయు మిక్కిలిశ్రేష్ఠమైనయెడ హారమునకు నాయకమణియగుటయు పక్షమునఁ దాల్పఁబడుటయు లోకమునఁ గలదుగదా. ఆశ్రీకృష్ణుఁడనెడియింద్రనీలమణి దేవకి అనెడి గనిలోపుట్టెననియు వసుదేవునికి దొరకఁగా అతనివద్దనుండి నందుఁడనెడి గొల్లవాఁడు తనకూతురైనయోగమాయను వెలగానిచ్చి కొనెననియు గోపికలకు అలంకారమయ్యెననియుశ్రేష్ఠమైనదిగానగోపకులసమూహమనెడిహారములకు నాయకమణియయ్యెననియును, కావున మావక్షమునందును నెలకొనియుండు, గాత మనియు నర్థము. దేవకికడుపునంబుట్టి నందునిపాలం జేరి గోపాలురకెల్ల మేలుబంతియై గోపీజనులను శోభిల్ల

నట్లు చేసి యింద్రనీలమణివంటికాంతితో వెలుఁగుశ్రీకృష్ణుఁడు మాహృదయములలో విలసిల్లునుగాక యని భావము.

మ. వసుదేవప్రియదారగర్భఖనిజశ్శ్వాం బొప్ప జన్మించి యా
వసుదేవుం డిడ నందగోపుఁడు సుతాశ్రవణ్యంబునం గొంచు రా
ననమానవ్రజజాలహారతరళం బై గోపికాకల్ప మై
రసలీలాకృతి యైనకృష్ణమణి సత్ప్రాంతం బెదన్ నిల్పెసన్. 97

తా. మీఁద సుగమము.

అవ. శ్రీకృష్ణుని బాల్యలీలలను గొన్నిటిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ పీఠే పీఠనిషణ్ణబాలకగళే తిష్ఠ న్స గోపాలకో
యన్త్రాన్తః స్థితదుగ్ధభాణ్డ మపకృష్యాచ్ఛాద్య ఘణ్టారవమ్।
వక్త్రోపాన్తకృతాఞ్జలిః కృతశిరఃకమ్పం పిబ న్యః పయః
పాయా దాగతగోపికానయనయో ర్గణ్డూషఫూత్కారకృత్॥ 98

టీ. యః=ఎవఁడు-ఏబాలకుఁడు,పీఠే=పీఁటయందు,పీఠ...గళే-పీఠ=పీఁటయందు, నిషణ్ణ=కూర్చున్నట్టి, బాలక=బాలునియొక్క, గళే=కంఠమందు-అనఁగా మూఁపులందు, తిష్ఠన్=నిలిచియున్నవాఁడై - మీఁదిఉట్టియందు వ్రేలాడుచున్న పాలకుండ బాలుఁడగుటచేఁ దనకు అందకుండఁగా దానిని అందుటకై క్రింద ఒకపీఁటవైచి దానిమీఁద ఒక బాలునిఁ గూర్చుండఁబెట్టి వానిమూఁపులమీఁద ఎక్కి నిలుచున్నవాఁడై యనుట, యన్త్రా...భాణ్డం-యన్త్ర=ఉట్టియొక్క, అన్తః=నడుమ, స్థిత=ఉన్నట్టి, దుగ్ధభాణ్డమ్=పాలకుండను, అపకృష్య=ఈడ్చి-వంచి, ఘణ్టారవమ్-గంటయొక్క-ధ్వనిని-కృష్ణుఁడు వచ్చి ఆకుండను బట్టి లాగు నేని తెలిసికొనుటకై సొంతగాండ్రు దానికిఁ గట్టియున్న గంటయొక్క-ధ్వనిని అనుట, ఆచ్ఛాద్య=కప్పి-ఆగంటయొక్క ధ్వనిని నిలిపి యనుట, వక్త్ర...జలిః సన్-వక్త్ర=నోటియొక్క, ఉపాన్త=సమీపమందు, కృత = చేయఁబడిన అంజలిః న్ = దోయిలిగలవాఁడగుచు-త్రాగుటకై నోటియొద్ద దోయిలిపట్టికొనియనుట, కృత...కమ్పమ్ యథాతథా-కృత=చేయఁబడిన, శిరఃకమ్పం యథాతథా = తల యూఁచుట గలుగునట్లుగా-వేడుకచే తల యూఁచుచు ననుట,పయః=పాలను,పిబన్=పానము సేయువాఁడగుచు, ఆగత...నయనయోః-ఆగత=(పాలుత్రాగుచున్న సడి తెలిసి) వచ్చిన, గోపికా=గోపికయొక్క,నయనయోః=కన్నులయందు, గణ్డూ...కృత్-గణ్డూష=పుక్కిటిపాలయొక్క, ఫూత్కార=ఫూత్ అనుశబ్దముతో ఉమియుటయొక్క, కృత్ = చేయువాఁడైన, సః=ఆ, గోపాలకః=గొల్లవాఁడైన శ్రీకృష్ణుఁడు, పాయాత్=రక్షించుఁ

గాక-తలయూఁచుచు పాలుత్రాగుచుండఁగా అజాడ తెలిసివచ్చిన గోపికకన్నులయందు పాల నుమిసినాఁడనుట.

ఉ. తోరపుఁబెద్దగద్దియలు రెండొంతరగా నిడి బాలు నాపయిం
జేరిచి దానిపయూఁపున వ్రసించుచు నుట్టిపనంటి వంచి ఘుం
టారుతి నిల్పి పాల్ కరముగ్రనం దల యూఁచుచు నాని వచ్చునా
భీరికకన్నులందు నుమిసి రెప్పెట్టక పూటినజాఱుఁ గొల్చెదన్. 98

తా. ఒకగోపికయింటఁ జొచ్చి మీఁదనున్న యుట్టిలోనిపాలకుండ పసిబాఁడగు తనకు అందకపోఁగా ఒకపీఁటవైచి దానిమీఁద ఒకబాలునిసిలిపి వానిమూఁపులమీఁద నెక్కి నిలుచుకొని ఉట్టిలోఁగి తనజాడను దెలుపుటకై దానికిఁ గట్టఁబడియున్నగంటను మ్రోఁగకుండునట్లు చేసి దానిని వంచి నోటియొద్ద దోసిలి పట్టుకొని తలయూఁచుచును దోసిటిలోఁబడుచున్నపాలుత్రాగుచుండఁగా అజాడ తెలిసి ఆయింటిగొల్లదిరాఁగా దాని కన్నులయందు పుక్కిటఁడు పాలును ఉమిసినకృష్ణుఁడు రక్షించుఁగాక.

శ్లో॥ యజ్ఞై రీజిమహే ధనం దదిమహే పాత్రేషు నూనం వయం
వృద్ధాన్భజిమహే తపశ్చకృమహే జన్మాన్తరే దుశ్చరమ్।
యేనాస్మాక మభూదనన్యసులభా భక్తిర్భవద్వేషిణీ
చాణూరద్విషి భక్తకల్మషముషి శ్రేయఃపుషి శ్రీజుషి॥ 99

టీ. వయం=మేము, జన్మాంతరే=మఱియొకజన్మమందు-పూర్వజన్మమునందనుట-యజ్ఞైః=యాగములచేత, ఈజిమహే=పూజించినవారము, పాత్రేషు=తగినవారియందు-తగినవారి కనుట, ధనం-ధనమును, దదిమహే=ఇచ్చినవారము, వృద్ధాన్=పెద్దలను, భజిమహే=సేవించినారము, దుశ్చరమ్=ఆచరింపరానటిదైన-మిక్కిలికఠినమైన, తపః=తపస్సును, చకృమహే=చేసినారము, నూనం=నిశ్చయము-ఇందులకుఁగారణము చెప్పుచున్నాఁడు, యేన=దేనిచేత-ఏకారణముచేత, అస్మాకం=మాకు, భక్త...ముషి-భక్త=భక్తులయొక్క, కల్మష=పాపములను ముషి-అపహరించువాఁడును, శ్రేయఃపుషి-శ్రేయః-మేళ్లను, పుషి=పోషించువాఁడును శ్రీజుషి-శ్రీ=లక్ష్మీదేవిని, జుషి=పొందినవాఁడును-లక్ష్మీపతియైన వాఁడనుట, అగు, చాణూరద్విషి-చాణూర=చాణూరుఁడనెడికంసునిమల్లువానిని, ద్విషి=ద్వేషించువాఁడగు శ్రీకృష్ణునియందు, భవద్వేషిణీ-భవ=సంసారమునకు, ద్వేషిణీ=విరోధియైనదియు, కావునసే, అనన్యసులభా=ఇతరులకు సులువుగా లభింపరానిదియు, అగు, భక్తిః=భక్తి, అభూత్=కలిగెనో, ఆకారణముచేత నిజముగా జన్మాంతరమందు యజ్ఞాది పుణ్యకార్యములు చేసినవారమని పూర్వముతో నవ్వయము. అన్నిమహనీయకార్యములు చేయనియెడల సామాన్యముగా ఇతరులకు లభింపరానికృష్ణభక్తి మాకుఁగలుగనేరదని

భావము. సాధారణముగా నందఱును సంసారమున బద్ధులగుటచే సంసారద్వేషిణి యైనభక్తి వారికి దుర్లభము. కనుకనే యది అసులభ యైనది. కృష్ణునియందలి భక్తియే సంసారమును బోఁగొట్టునదనియు అది జన్మాంతరమందలి యజ్ఞదానాది మహాపుణ్యకార్యములచేతనే సిద్ధింపఁగూడిన దనియు భావము. ఇచట 'భక్త... ముషి' అనుటచే ఆశ్రితరక్షకత్వమును 'చాణూరద్విషి' అనుటచే దుష్టశిక్షకత్వమును 'శ్రేయఃపుషి' అనుటచే సకలపురుషార్థదాయకత్వమును 'శ్రీజుషి' అనుటచే సర్వోత్కృష్టత్వమును బ్రతిపాదితములు.

మ. మును జన్మాంతరవేళ దుష్కరతపఃపుంజంబుల్ పాత్రదానంబు స
జ్జనసంసేవయు నధ్వరంబు లొనరింపం గంటిఁ గాకున్నఁ గ
ల్గున లోకోత్తరభక్తి నాదుమది నాలోకింపఁ బాదావనే
జనకృత్తోషణు దుష్టభీషణు మహాశ్చాణూరవిద్వేషణున్. 99

తా. పూర్వజన్మమందు మేము నిజముగా యాగములను జేసితిమి. సత్పాత్రములకు ధనము నొసంగితిమి. పెద్దలను సేవించితిమి. కఠినమైన తపస్సు ఆచరించితిమి. కాఁబట్టియే మాకు భక్తులపాపములను దూలించి శ్రేయస్సులను గలిగించువాఁడై లక్ష్మీపతియై చాణూరసంహారకుఁడై యొప్పు శ్రీకృష్ణునియందు సంసారమును బోఁగొట్టునదై కావుననే యితరులకు సులువుగాఁ బడయనిదై యుండు భక్తి సిద్ధించినది.

శ్లో॥*త్వయి ప్రసన్నే మమ కిం, గుణేన త్వయ్యప్రసన్నే మమ కిం గుణేన
రక్తే విరక్తే చ వరే వధూనాం,నిరర్థకః కుఙ్కుమపత్రభఙ్గః॥ 100

టీ. త్వయి = నీవు, ప్రసన్నే సతి = (నాయెడ) ప్రసన్నుఁడగుచుండఁగా, మమ = నాయొక్క, గుణేన = గుణముచేత, కిం = ఏమి-ఏమిప్రయోజనమనుట, త్వయి = నీవు, అప్రసన్నే సతి = ప్రసన్నుఁడవు కాకుండఁగా, మమ = నాయొక్క, గుణేన = గుణముచేత, కిం = ఏమిప్రయోజనము? నీవు ప్రసన్నుఁడగుట నాగుణముచేతఁగాదు. నీవు అప్రసన్నుఁడైనయెడల నాగుణము ప్రసన్నునిగాఁ జేయఁజాలదు అనుట - నాగుణమునుబట్టి కాక నీయంత నీవే ప్రసన్నుఁడవుగాఁ గాని అప్రసన్నుఁడవుగాఁ గాని అగుదువనిభావము: ఇందులకు దృష్టాంతము చెప్పుచున్నాఁడు:—వరే = నాయకుఁడు, రక్తేసతి = అనురక్తి గలవాఁడై యున్నను, విరక్తేసతి = అనురక్తిలేనివాఁడై యున్నను, వధూనాం = నాయికలయొక్క, కుంకుమ... భంగః-కుంకుమ = కుంకుమచేతనైన, పత్ర = మకరికాపత్రముల

* ఈశ్లోకమునకు 'త్వయి ప్రసన్నే మయి కిం గుణేన' త్వయ్యప్రసన్నే మయి కిం గుణేన। రక్తే విరక్తే దయితేఽఙ్గనానాం, వృథా భవేత్కుఙ్కుమపత్రభఙ్గః' అని పాఠాంతరము.

యొక్క, భఙ్గః = రచన, నిరర్థకః = వ్యర్థము. వరునికి మకరికాపత్రమాలనుబట్టి రక్తిగాని విరక్తిగాని కలుగుటలేదు. అది వానికి తనయంతనే కలుగవలసినది కాఁబట్టి మకరికాపత్రరచన వ్యర్థమే. ఇట్లే నీయొక్క ప్రసన్నతగాని అప్రసన్నతగాని తమయంతనే కలుగునవి గాని నాగుణమునుబట్టి కలుగునవి కావు. కాఁబట్టి నీ ప్రసన్నత్వాదులకొఱకు నాగుణము వ్యర్థమే యగు నని భావము.

ఉ. నీవు ప్రసన్నవైనయెడ నేరుపు లేటికి నప్రసన్నతన్
నీవు పరాకుచేసినను నేరుపు లేటికిఁ గెంచి చూడఁ గృ
ష్ణా విభుఁ డాదరించునమయంబున నొల్లమి సేయువేళలం
గావలెనే లతాంగులకుఁ గగ్గ పగుకుంకుమపత్రభంగముల్. 100

తా. వరునికి నాయికయందు రక్తిగాని విరక్తిగాని కలుగుటకు మకరికాపత్రరచన కారణము గానట్లు, నీకు నాయందుఁ బ్రసన్నతగాని అప్రసన్నతగాని కలుగుటకు నాగుణము కారణము కానేరదు. అవి నీకు నీయంతటనే కలుగవలయును.

శ్లో॥ గాయన్తి క్షణదావసానసమయే సానన్ద మిన్దుప్రభా
రున్ధన్త్యో నిజ దన్త కాన్తి నివహై ర్గోపాఙ్గనా గోకులే ।
మథ్నన్త్యో దధి పాణికఙ్కణఝణత్కారానుకారం జవా
ద్వ్యావల్గద్వసనాఞ్చలా య మనిశం పీతామ్బరోఽవ్యాత్స నః॥

టీ. గోకులే=వ్రేపల్లెయందు, క్షణ...సమయే-క్షణదా = రాత్రియొక్క, అవసాన=ముగియుట యగు, సమయే = సమయమందు, 'క్షణదా విరామసమయే' అను పాఠమున రాత్రి ఉడుగుసమయమున అనుట - తెలతెలవాఱునపు డనుట, జవాత్ = వేగమువలన - పెరుఁగు చిలుకునరవడివలన, వ్యావ...చలాః - వ్యావల్గత్=మిక్కిలి చలించుచున్న, వసన=చీరలయొక్క, అంచలాః = కొనలుగలవారును, పాణి...కారం యథాతథా-పాణి=చేతియందలి, కఙ్కణ = కడియములయొక్క, ఝణత్కార = ఝణఝణయను శబ్దములయొక్క, అనుకారం యథాతథా=అనుకరించుట గలుగునట్లుగా - చేతికడియముల ఝణఝణధ్వనులను అనుకరించుచు అనుట, దధి = పెరుఁగును, మథ్నన్త్యః=చిలుకుచున్నవారును, నిజ...నివహైః-నిజ = తమయొక్క, దన్తకాన్తి = పలు మెఱుఁగులయొక్క, నివహైః=సమూహములచేత, ఇన్దుప్రభాః = చంద్రునికాంతులను, రున్ధన్త్యః = తిరస్కరించుచున్నవారును-పాడునప్పుడు వారిదంతకాంతులు చంద్రకిరణములకంటెఁ దెల్లనై ప్రసరించు ననుట, అగు, గోపాఙ్గనాః = గోపస్త్రీలు, స+ఆనన్దమ్ = ఆనందముతోడ, యం = ఎవనిని, అనిశం = ఎల్లప్పుడును, గాయన్తి = పాడుచున్నారో, సః=అ, పీతామ్బరః = కృష్ణుఁడు, నః = మమ్ము, అవ్యాత్ = రక్షించుఁ

గాక-తెల్లవాఱు జాముఁన గోపస్త్రీలు కడియములు మ్రోఁగఁగా చీరచెఱఁగులు అల్లలాడఁగా పెరుఁగు చిలుకుచుఁ బలుమెఱుఁగులు తెల్లగా నిగుడఁగాఁ గృష్ణునిగూర్చి సొంపుగా పాడుదు రని యర్థము.

ఉ. ప్రాకటకంకణారవము ♣ భాసిలి పయ్యెదకొంగు దూఁగఁగా
వేఁకువ మోద మొప్ప నరవిందముఖుల్ పెరుఁగుల్ మథించుచుం
గోకవిరోధికిం గలలు ♣ గూర్చు రదద్యుతి మీఱ సేవరిక
గోకులవాటిఁ బాడుదురు ♣ కోరికలా హరి యిచ్చుఁ గావుతన్. 101

తా. వ్రేపల్లెయందు గోపికలు తెలతెలవాఱునప్పుడు లేచి చేతికడియముల ఝణఝణశబ్దములను సరిపడునట్లు గాను పయ్యెదకొంగు చిలుకువేగమున అల్లలాడఁగాను పెరుఁగు చిలుకుచు పలుమెఱుఁగులు చంద్రకిరణములను దిరస్కరించుచు నిగుడఁగా వేడుకగా ఎవనిని గూర్చి పాడుదురో అట్టి శ్రీకృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ అంసాలమ్బితవామకుణ్డలభరం మన్దోన్నతభ్రూలతం
కిఞ్చిత్కుఞ్చితకోమలాధరపుటం సాచిప్రసారేక్షణమ్॥
ఆలోలాఙ్గుళిపల్లవై ర్మురళికా మాపూరయన్తం ముదా
మూలే కల్పతరో స్త్రిభఙ్గిలలితం జానే జగన్మోహనమ్॥ 102

టీ. అంసా...భరం-అంస=మూఁపున, ఆలమ్బిత = ఆశ్రయించిన, వామ=ఎడమప్రక్కదైన, కుండలభరం = కుండలములభారముగలవాఁడును - ఎడమప్రక్కగాఁ దలవంచుటచే ఆప్రక్క చెవికుండలము మూఁపును అనిన దనుట, మన్ద...లతమ్-మన్ద=వంగినదియు, ఉన్నత = పొడవైనదియు, అగు, భ్రూలతం=తీఁగవంటి కనుబొమలు గలవాఁడును-ఒక కనుబొమ వంగి మఱియొకటి పొడవైనవాఁ డనుట, కిఞ్చిత్...పుటమ్-కిఞ్చిత్=కొంచెము, కుఞ్చిత=మోడ్పఁబడిన, కోమల=మృదువైన, అధరపుటమ్=మోవిపుటము గలవాఁడును-పిల్లఁగ్రోవిని ఊఁదునప్పుడు పెదవులను గొంత మోడ్చినాఁడనుట, సాచి...క్షణమ్-సాచి=అడ్డముగా, ప్రసార = వ్యాప్తిగల-నిగుడ్చినట్టి యనుట, ఈక్షణమ్=చూపులు గలవాఁడును-తల కొంత వంచి యొక ప్రక్కకు వాల్చి వేణువును ఊఁదునపుడు చూపులు అడ్డముగా నిగుడుచుండెననుట, ఆలోల...పల్లవైః-ఆలోల = చలించుచున్న-మురళిపైని రంధ్రములమీఁదుగా సంచరించుచున్న యనుట, అఙ్గుళిపల్లవైః-చిగుళ్లవంటి వ్రేళ్లచేత, మురళికాం=వేణువును, ముదా = సంతోషముతోడ, ఆపూరయన్తం = పూరించుచున్నవాఁడును, త్రిభఙ్గిలలితమ్-త్రిభఙ్గి=మూఁడువంపులచేత, లలితం=సుందరమైనవాఁడును, జగత్ + మోహనమ్-జగత్ = లోకములను, మోహనమ్ = మోహింపఁజేయువాఁడును అగు కృష్ణుని, కల్పతరోః=

కల్పవృక్షముయొక్క, మూలే = అడుగుప్రదేశమందు, జానే = తెలియుచున్నాను, పాదములు మొదలు కటివఱకు నొకవంపును గటి మొదలు మెడవఱకు నొక వంపును దల యొకవంపునుగా మూఁడువంపులు తెలియునది.

ఉ. మూఁపున వామకుండలముఁ మోవి నొకించుక మోడ్పు నందముం
జూపెడునోరచూపు సొగఁసుంబొమ నొక్కట సక్కఁ గన్నడం
గ్రేఁపులు సొక్కఁ గల్పకముఁ క్రిందఁ ద్రిభంగిగ నిల్చి యంగుళీ
వ్యాపితవంశపూర్తియయిఁ వర్తిలు మోహనమూర్తిఁ గొల్చెదన్.

తా. వేణుగానమందు ఎడమప్రక్కతల వంచుటచే ఆప్రక్క చెవికుండలములు మూఁపున ఆనఁగా, ఒకకనుబొమ వంగియు మఱొకబొమ పొడుగయ్యుఁ గ్రాలగా, మోవిపుటమును గొంత మోడ్చి అడ్డముగా ఇటునటు చూపుక్కలు నిగుడ చిగుళ్లవంటి వ్రేళ్లను బఱపి వేణువును ఆనందముతో పూరించుచు జగన్మోహనాకారముతోఁ గల్పవృక్షముక్రింద విలసిల్లుకృష్ణుని తెలియుచున్నాను.

అవ. శ్రీకృష్ణుఁడు మథురలో మల్లయుద్ధరంగమందుఁ గంసాదులకుఁ గనఁబడిన ఆయావిధములను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మల్లైః శైలేన్ద్రకల్పః శిశు రితరజనైః పుష్పచాపోఽఙ్గనాభి
ర్గోపైస్తు ప్రాకృతాత్మా దివి కులిశభృతా విశ్వకాయోఽప్రమేయః।
క్రుద్ధః కంసేన కాలో భయచకితదృశా యోగిభి ర్ధ్యేయమూర్తి
ర్దృష్టో రఙ్గావతారే హరి రమరగణానన్దకృత్పాతు యుష్మాన్॥

టీ. రంగ + అవతారే-రంగ = కంసుఁడు పన్నించిన మల్లయుద్ధరంగమందు అవతారే=దిగుటయందు-మల్లరంగమును జొచ్చి నిలిచినప్పు డనుట, మల్లైః = చాణూరుఁడు మొదలైనమల్లులచేత, శైలేన్ద్రకల్పః - శైల + ఇన్ద్ర = పెద్దకొండతో - లేక కొండలకు రాజైన హిమవంతముతో, కల్పః = సమానుఁడుగాను-కొండవలె ఎదిరింపరాకయు చలింపకయు నుండు ధైర్యాతిశయము గలవాఁడుగాను అనుట, ఇతరజనైః =తక్కినజనులచేత, శిశుః=బాలుఁడుగాను, అఙ్గనాభిః=స్త్రీలచేత, పుష్పచాపః= (పూవిలు గల) మన్మథుఁడుగాను, గోపైస్తు = గొల్లవారిచేత నన్ననో, ప్రాకృత+ ఆత్మా=ఈప్రకృతికి లోనైనస్వభావము గలవాఁడుగాను-సామాన్యుఁడుగా ననుట, దివి=ఆకాశమందు, కులిశభృతా=ఇంద్రునిచేత, విశ్వకాయః-విశ్వ = ప్రపంచమనెడి, కాయః=శరీరము గలవాఁడు-సర్వశరీరుఁడగు, అప్రమేయః = కొలఁది పెట్టరానివాఁడుగాను-ప్రపంచమంతయు తానై యుండుటచేత ఇంతిం తనరానివాఁడుగా ననుట,

భయ...దృశా - భయ = భయముచేత, చకిత = చంచలమైన, దృశా = కన్నులు గల, కంసేన = కంసునిచేత, క్రుద్ధః = కోపించినట్టి, కాలః = యముఁడుగాను, యోగిభిః = యోగులచేత, ధ్యేయమూర్తిః-ధ్యేయ = ధ్యానముసేయఁదగిన - ధ్యానమునకు విషయమైన, మూర్తిః = స్వరూపము గలవాఁడుగాను, దృష్టః = చూడఁబడినవాఁడును-కావున నే, అమర...కృత్-అమరగణ = దేవతాసమూహమునకు, ఆనంద = ఆనందమును, కృత్ = చేయువాఁడును, అగు, హరిః = శ్రీకృష్ణుఁడు, యుష్మాన్ = మిమ్ము, పాతు = రక్షించుఁగాక - కంసాదిదుష్టులను జంపి లోకము నిష్కంటకము సేయు ననుచు దేవతల కానందము కలిగె నని తెలియునది.

చ. నగ మని జెట్లు పాపఁ డని నాగరికుల్ మరుఁ డంచుఁ గాంత ల
భ్రగపతి విశ్వరూపుఁ డని ప్రాకృతుఁ డంచును గోపబాలు రు
గ్రగతిఁ దనర్చు మృత్యు వని కంసుఁడు యోగులు స్వామిగాఁ గనం
దగి సురలుబ్బ రంగమునఁ దార్కొను దేవుఁడు మిమ్ముఁ బ్రోచుతన్.

తా. కంసుని మల్లరంగమును జొచ్చి నిలిచినపుడు చాణూరాదిమల్లులచే పెనుఁగొండవలె అతిధీరుఁడుగాను, తక్కినవారికి పసిబాలుఁడుగాను, స్త్రీలకు మన్మథుఁడుగాను, గొల్లవారికిఁ దమవలె నొకప్రాకృతుఁడుగాను, ఆకాశమునందు ఇంద్రునికి విశ్వరూపుఁడుగాను, భయపడి చూచుచున్న కంసునికిఁ గోపితుఁడైనయముఁడుగాను, యోగులకు ధ్యానింపఁదగినమూర్తి గలవాఁడుగాను, గనఁబడుచు దేవతాసమూహములకు హర్షము గూర్చుకృష్ణుఁడు మిమ్ము రక్షించుఁగాత.

శ్లో॥ సంవిష్టో మణివిష్టరేఽఙ్కతల మధ్యాసీనలక్ష్మీముఖే
కస్తూరీతిలకం ముదా విరచయన్ హర్షాత్కుచౌ సంస్పృశన్।
అన్యోన్య స్మితచన్ద్రికా కిసలయై రారాధయ న్మన్మథం
గోపీగోపపరివృతో యదుపతిః పాయా జ్జగన్మోహనః॥ 104

టీ. మణివిష్టరే = రత్నమయమైన ఆసనమందు, సంవిష్టః = కూరుచున్నవాఁడును, అఙ్కతలమ్ = తొడను-తనతొడమీఁదను, అధ్యా...ముఖే-అధ్యాసీన = కూర్చున్న, లక్ష్మీ = లక్ష్మీదేవియొక్క, 'రాధా' అనుపాఠమున-రాధయొక్క, ముఖే = మొగమునందు, కస్తూరీతిలకం = కస్తూరిబొట్టును, ముదా = సంతోషముచేత, విరచయన్ = దిద్దుచున్నవాఁడును, హర్షాత్ = సంతోషమువలన, కుచౌ = స్తనములను, సంస్పృశన్ = మిక్కిలిస్పృశించుచున్నవాఁడును, అన్యో...కిసలయైః - అన్యోన్య = పరస్పరమును, స్మిత = చిఱునగవులనెడి, చన్ద్రికా = వెన్నెలయొక్క, కిసలయైః = చిగుళ్ళచేత-వెన్నెలవలె తెల్లనై చిగురొత్తుచున్న నవ్వులచేత అని భావము, మన్మథమ్ = మన్మథునిని,

ఆరాధయన్ = ఆరాధించుచున్నవాఁడును - ఆరాధనమున నుపయుక్తముగాఁ కిసలయ శబ్దముఁ గూర్చినాఁ డని తెలియుచున్నది. జగత్ + మోహనః = లోకమును మోహింపఁ జేయువాఁడును, కావున నే, గోపీ...వృతః-గోపీ = గోప స్త్రీలచేతను, గోప = గొల్లవారిచేతను, పరీవృతః = పరివేష్టింపఁబడినవాఁడును, అగు, యదుపతిః = కృష్ణుఁడు, పాయాత్ = రక్షించుఁగాత. మొదట తొడమీఁద లక్ష్మిని ఉంచుకొనుటచే మన్మథుఁ డుదయించినాఁ డనియు; కావున నే కస్తురిబొట్టును దిద్దఁగా వాఁడు కొంత విజృంభించినాఁడనియు; అవిజృంభణమువలనఁ గుచముల నంటఁగా వాఁడు మఱియు నతిశయించినాఁడనియు; అయుతిశయించుటవలన ఒండొరులకు లేనవ్వులు మొలకలెత్తె ననియు; మన్మథవికారప్రయుక్తమైన సొగసుందెలినవ్వుమొలకలచే ఆమన్మథుఁడు మీఁదుమిక్కిలి వృద్ధిఁ బొందింపఁబడినాఁ డనియు-అనఁగా మన్మథవికారము వృద్ధి నొందెనదనియు-తెలియుచున్నది. జగన్మోహనుఁడు గావున నే ఆమోహనాకృతికిఁ జొక్కి-గోపికలే కాక గోపకులును జుట్టుకొని కొలుచుచుండి రని యూహకయును.

చ. చెలు వగురత్నపీఠమున శ్రీసతి సంకమునఁ జేర్చి కస్తురిం
దిలకము దిద్ది దిద్ది తమి దీరక వెంటన గుబ్బ లంట మో
ములఁ దళుకొత్తునవ్వు విరిమొత్తములన్ మరుపూజ సేయు న
చ్చెలు వగువల్లవప్రకరసేవిత మోహనమూర్తి ప్రోచుతన్. 104

తా. రత్నమయమైన పీఠమునఁ గూర్చుండి తొడయం దిడుకొన్న లక్ష్మీదేవి నెమ్మొగమునందలికస్తురిబొట్టును దిద్దుచును, దానిచేఁ గలిగినమదమున కుచము లంటుచును, దానిచే ఒండొరులకుఁ గలిగిన నెన్నెలవంటి తెలినవ్వుమొలకలచేత మన్మథ వికారము పయింబయి నతిశయింపఁజేయుచును, జగన్మోహనాకృతి గలుగుటచే గోపికలును గోపకులును జుట్టు బలసి కొలుచుచుండఁగా విలసిల్లుకృష్ణుఁడు రక్షించుఁ గాత.

శ్లో॥ ఆకృష్టే వసనాఞ్చలే సపది యత్త్యాపహా త్రపాధఃకృతా
దృష్టిః సంవలితా రుచా కుచయుగే స్వర్ణప్రభే శ్రీమతి।
బాలః కశ్చన చూతపల్లవ ఇతి ప్రాన్తస్మితాస్యశ్రియం
శ్లిష్యం స్తా మథ రుక్మిణీం సతముఖీం కృష్ణ స్స పుష్ణాతు నః॥

టీ. (యస్యాః = ఎవతెయొక్క-ఏరుక్మిణియొక్క-)వసన + అఞ్చలే = పయ్యెద చెఱఁగు, ఆకృష్టేసతి = లాగికొనఁబడునది 'అగుచుండఁగా-కృష్ణునిచేతననుట, అథ = పిమ్మట, త్రపా...కృతా-త్రపా = సిగ్గుచేత-పైఁట లాగికొనఁబడుటచేతఁ గలిగినసిగ్గుచేత-హ్రియా' అనుపాఠమునను ఇదియే యర్థము. అధఃకృతా = క్రిందుగాఁ జేయఁ

బడినదియు—అసిగ్గుచేతఁ దలవంచుకొనఁగా క్రిందుగా నిగిడినదియు, కువలయశ్యామా-కువలయ=నల్లగల్వవలె శ్యామా=నల్లనయినదియు, అగు, దృష్టిః=చూపు, రుచా=కాంతిచేత, స్వర్ణప్రభే-స్వర్ణ=బంగారుయొక్క, ప్రభే=కాంతివంటి కాంతి గలిగినదియు, శ్రీమతి=సౌందర్యముతోఁ గూడినదియు, అగు, కుచయుగే=చనుదోయియందు, సంవలితా=తగులుపడినదో, తాం=ఆ-అట్లు లజ్జాయుక్తురాలైనదియు, కావుననే, నతి=వంపఁబడిన, ముఖీం=మొగముగలదియు, బాలాం=లేఁతదైన, కశ్చన=ఒకానొక, చూత పల్లవ ఇతి=మామిడిచిగురు అని-పయఁటలేని చనుగుబ్బలమీఁద తలవాల్చుటచే క్రిందికి నిగిడినచూపు పడఁగా ఆగుబ్బల బంగరుచాయతో చూపులనలువు గలసి ఒకమామిడిచిగురువలెఁ గనుపట్టెననుట—ఇట్లు మావిచిగురు అని, ప్రాన్త...శ్రియమ్-లేక-ప్రాన్త=సమీపమం దున్న-దాపున ఉన్న, స్మిత + ఆస్యశ్రియాం=చిఱునవ్వు గల మొగము యొక్క కాంతిగలదియు-మొగమునందు చిఱునవ్వు దళుకొత్తఁగా దాపున నున్నది. అనుట, లేక:—ప్రాన్త=కెంపులయందు-పెదవి యోరలయందలి-స్మిత=చిఱునగవు గల, ఆస్య=ముఖముయొక్క, శ్రియం=కాంతి గలదియు-సిగ్గు పైకొనుటచే నవ్వు చక్కఁగా వికసిల్లక పెదవికెలఁకులమాత్రము వ్యాపించినదనుట, 'భ్రాన్త్యా స్మితాస్య శ్రియమ్' అను పాఠమున భ్రాన్త్యా=మామిడిచిగురను భ్రాంతిచేత, స్మితాస్య శ్రీయగు అని యర్థము. ప్రాంతమందుండుటయే వసనాంచలము లాఁగికొనుటయును బిగఁ జేర్చి కౌగిలించుకొనుటయును అనువై శృంగారరసము మఱింత గూర్చుచున్నది గావున 'ప్రాన్త' యను పాఠమే సరసము, ఇట్టిదగు, రుక్మిణీం=రుక్మిణీదేవిని, శ్లిష్యన్=కౌఁగిలించుచున్న, సః=ఆ, కృష్ణః=కృష్ణుఁడు, వః=మిమ్ము, పుష్ణాతు=పోషించుఁగాక, ఇట 'సంవలితా' అనుటచే చూపు సిగ్గుచేత నిశ్చలముగాఁ జనుదోయియందుఁ దగులుపడినదనియు, కావుననే ఆతగులువడినచోట చూపుయొక్కయు చన్నుయొక్కయు కాంతి గలిసి మావిచిగురులాగున నిలుకడగాఁ గనుపట్టెననియుఁ దెలియుచున్నది.

మ. అలరుంబయ్యెదకొంగు దీయుఁ దపనీయశ్రీ విడంబించుగు
బ్బలపై సిబ్బితి గబ్బిచూపు నెలకొల్పం దద్ద్యుతిన్ నూత్నచూ
తలతాపల్లవరీతిఁ గాంచి స్మితవక్త్రప్రౌఢ యారుక్మిణీ
లలనం గౌఁగిట గారవించుహరి కళ్యాణంబు మాకిచ్చుతన్. 105

తా. శ్రీరుక్మిణీదేవి కొంత సమీపమునఁ గూర్చుండఁగా శ్రీకృష్ణుఁడు విలాసముగా నామె పైఁటచెఱఁగును లాఁగికొనెను. అపుడా లలన సిగ్గుచే దలవంచుకొనఁగా నల్లగలువవలె నల్లనైన యామెచూపు క్రిందుగా బంగరుచాయ గల తన చనుదోయిపై నిగిడి నెలకొని యుండఁగా, నెలకొన్నచోట చూపుయొక్క నలుపును చన్నుల బంగరుచాయయుఁ గలిసి మామిడిచిగురువలెఁ గనఁబడఁగా 'మామిడిచిగు రెక్కడిది' అని భ్రమసి రుక్మిణి చిఱునవ్వుతో సిగ్గున తలవంచుకొనియుండెను. కృష్ణుండది యెఱిఁగ

దగ్గఱకుఁ జేర్చి ఆమెను కౌఁగిలించుకొనెను. అట్టి కృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

అవ. కృష్ణునకును రుక్మిణీదేవికిని అయిన యొకానొక సంవాదమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఉర్వ్యాం కోఽపి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీలయా
తేన త్వం దివి భూతలే చ సతతం గోవర్ధనోద్ధారకః ।
త్వాం త్రైలోక్యధరం వహామి కుచయో రగ్రే న తద్గణ్యతే
కిం వా కేశవ భాషణేన బహునా పుణ్యైర్యశో లభ్యతే ॥ 106

టీ. హే కేశవ=ఓకృష్ణా! ఉర్వ్యాం=భూమియందు, కోఽపి=ఒకానొక, లఘుతరః=మిక్కిలి చులుకనైన, మహీధరః=కొండ-గోవర్ధన పర్వత మనుట, దోర్భ్యామ్=హస్తములచేత, లీలయా=విలాసముగా, ధృతః=ధరింపఁబడెను - నీచేత ననుట, తేన=దానిచేత-అట్లు ధరించిన కారణముచేత, త్వం=నీవు, దివి=స్వర్గమందును, భూతలే చ = భూమియందును, సతతం=ఎప్పుడును, గోవర్ధన + ఉద్ధారకః = గోవర్ధనము ఎత్తినవాఁడవు-గోవర్ధనోద్ధారకుఁడను బిరుదు నొందితివనుట. త్రైలోక్యధరం=త్రిలోకమును ధరించుచున్న, త్వాం=నిన్ను, కుచయోః=స్తనములయొక్క, అగ్రే=తుదను, వహామి=వహించుచున్నాను, తత్=అది-అట్లు నిన్ను వహించుట, గణ్యతే న=లెక్కింపఁబడలేదు. మిక్కిలి చులుకనైన కొండను నీవెత్తుటయే గణింపఁబడినది కాని, ఒక కొండమాత్రము కాదు, మూఁడులోకములను ధరించియున్న నిన్ను చన్నుమొనమీఁద నేను వహించుట గణింపఁబడలేదు; ఏమి అన్యాయము మనుట. బహునా=అనేకమైన, భాషణేన=పలుకుటచేత, కిం=ఏమి-ఏమి ప్రయోజనము-పెక్కుమాటలేల యనుట, పుణ్యైః=పుణ్యములచేత, యశః=కీర్తి, లభ్యతే=పొందఁబడుచున్నది. కీర్తి పుణ్యముచేతనే కలుగుచున్నది గాని శక్తినిబట్టి కలుగదనుట.

మ. ధరణిం జేతుల నొక్కచిన్నగిరి యెత్తన్ నిన్ను గోవర్ధనో
ద్ధరణుం డంచు నుతించె నీదశదిశల్ త్రైలోక్యధౌరేయ ని
న్నురువక్షోజములన్ భరింప ననుఁ జేరొక్కరెవ్వారుం బుణ్యవి
స్ఫురణం గీర్తి చెలంగుఁ బెక్కువచనంబుల్ కృష్ణ యింకేటికిన్.

తా. కృష్ణా! నీవు భూమియందు మిక్కిలి చులుకనయిన గోవర్ధన మను నొక కొండను లీలగాఁ జేతులతో నెత్తఁగానే దేవలోకమందును భూలోకమందును నిన్ను గోవర్ధనోద్ధారకుఁడని జనులు పొగడుచున్నారు. నేను మూఁడులోకములను ధరించిన నిన్ను నా చనుమొనలమీఁదఁ దాల్చుచున్నానుగాని నన్నెవ్వరును బొగడుటలేదు. పెక్కుమాటలేల? కీర్తి పుణ్యముచేతనే కలుగుచున్నది కాని యోగ్యతచేతఁ గాదు.

అవ. కృష్ణస్మరణము తప్ప పాపపరిహారమునకుఁ దక్కినయనుష్ఠానము లేమియు నక్కఱలే దనుచున్నాఁడు.

శ్లో॥ సన్ధ్యావన్దన భద్రమస్తు భవతే భోః స్నాన తుభ్యం నమో
భో దేవాః పితరశ్చ తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతాం।
యత్రక్వాపి నిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః
స్మారం స్మార మఘం హరామి తదలం మన్యే కిమన్యేన మే॥

టీ. హేసన్ధ్యావన్దన = ఓసంధ్యావందనమా, భవతే=నీకు, భద్రం=మంగళము, అస్తు=అగుఁగాక, భోఃస్నాన=ఓస్నానమా, తుభ్యం=నీకొఱకు, నమః = నమస్కారము, భోదేవాః=ఓదేవతలారా, హేపితరః=ఓపితరులారా, తర్పణవిధౌ-తర్పణ = మీకు జలాదితర్పణములను, విధౌ=చేయుటయందు, అహం = నేను, క్షమః న=శక్తుఁడనుగాను, క్షమ్యతాం=క్షమింపఁదగినది. యత్రక్వాపి = ఎక్కడనైనను, నిషీద్య=కూర్చుండి, యాదవ... త్తంసస్య-యాదవకుల=యదువంశమునకు, ఉత్తంసస్య = శేఖరుఁడైన-అలంకారభూతుఁడైన, కంసద్విషః=కంసునికివిరోధి యగుకృష్ణుని, స్మారం స్మారం=స్మరించి స్మరించి, అఘం=పాపమును, హరామి=పోవ నడుచుచున్నాను. తత్=అది-ఆకంసవిరోధిస్మరణము-కంసవిరోధియనుటచే దుష్టవిరోధియనియు, కావున దుష్టములగుపాపములను హరించువాఁడనియు, కావున అతనిని స్మరించుటచేతనే పాపము లన్నియుఁ బోఁగొట్టుకొనవచ్చు ననియు హృదయము, ఇట్టివానిస్మరణము, అలం=(పాపనివృత్తికి) చాలునని, మన్యే=తలఁచుచున్నాను, అన్యేన = ఇతరముచేత-తక్కినసంధ్యావందనాదినిత్యనైమిత్తికకర్మానుష్ఠానములచేత, మే=నాకు, కిం= ఏమిప్రయోజనము-ప్రయోజనము ఏమియు లేదనుట.

చ. సతతము సంధ్యకున్ శుభము స్నానజపాదివిశేషసత్క్రియా
తతికిని మ్రొక్కు దేవపితృతర్పణచర్య కశక్తియుక్తుఁడన్
మతిఁ గరుణింపుఁ డొక్కనియతస్థితిఁ గంసరిపున్ యదూద్వహున్
స్తుతి యొనరించి కల్మషవిదూరుఁడ నౌదు ననన్యకర్మతన్. 107

తా. ఓ సంధ్యావందనమా ! నీకు శుభం బగుఁగాక; నీవు నా కక్కఱలేదు. స్నానమా! నీకు నమస్కారము. నీజోలియు నక్కఱలేదు. ఓదేవతలారా ! పితృదేవతలారా ! మీకు తర్పణము విడుచుటకు నేను శక్తుఁడను గాను. ఎక్కడ నైనను గూర్చుండి యదుకులతిలకుండును కంసాదిదుష్టసంహారకుఁడు నైన కృష్ణునే స్మరించి నాపాపమును బోఁగొట్టుకొనెద. పాపనివృత్తికి ఇదియే చాలు. కాఁబట్టి తక్కిన సంధ్యావందనాదులతో నాకుఁ బనిలేదు.

శ్లో॥ హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే
హేకంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ
హేరామానుజ హేజగత్త్రయగురో హేపుండరీకాక్ష మాం
హేగోపీజననాథ పాలయ పరం జానామి న త్వాం వినా॥ 108

టీ. హేకృపాజలనిధే = ఓయి దయాసముద్రుఁడా, హేసింధుకన్యాపతే-సింధుకన్యా=సముద్రునికూఁతురైనలక్ష్మికి, పతే = పెనిమిటియైనవాఁడా, హేకంస+అంతక= కంసునికి యముఁడైనవాఁడా, హేగజే... పారీణ-గజేంద్ర = గజశ్రేష్ఠుని విషయమైన, కరుణా=దయచేత, పారీణ=నిండినవాఁడా-గజేంద్రునివిషయమై మిక్కిలి కరుణచూపినవాఁడా యనుట, హేమాధవ=ఓమాధవుఁడా, హేరామ+అనుజ = ఓబలరామునితమ్ముఁడా, హేజగ...గురో - జగత్ + త్రయ=మూల్లోకములకును, గురో=తండ్రియైనవాఁడా, హేపుండరీక+అక్ష = ఓ తెల్లదామరలవంటికన్నులుగలవాఁడా, హేగోపీ...నాథ-గోపీజన = గోపస్త్రీసమూహమునకు, నాథ = ప్రభువైనవాఁడా, హేగోపాలక=ఓగోపాలకృష్ణా, మాం=నన్ను, పాలయ = రక్షింపుమా, ఏలనఁగా, త్వాంవినా=నిన్నుతప్ప, పరం=మఱియొక్కటిని, నజానామి = ఎఱుఁగను, కావున నీవే నన్ను రక్షింపవలయు ననుట.

శా. ఓకారుణ్యసముద్ర యోశరటిరక్షోదీర్ణ యోమాధవా
యోకంసాంతక యోరమానహచరా ృ యోవల్లవీకింకరా
యోకంజేక్షణ యోజగద్గురుమణీ ృ యోరౌహిణేయానుజా
మీకన్నన్ మఱియన్య నేనెఱుఁగఁ జక్రమ్మా నన్నురక్షింపుమీ.

తా. ఓదయాసముద్రుఁడా! ఓలక్ష్మీనాథా! ఓకంససంహారకా! గజేంద్రునియందు మిక్కిలి కరుణచూపినవాఁడా! ఓమాధవా! ఓబలరామునితమ్ముఁడా! ఓమూల్లోకములకును దండ్రీ! ఓ తెల్లదామరలవంటికన్నులుగలవాఁడా! ఓగోపస్త్రీమనోహరా! ఓగోపాలకృష్ణా! నన్నుఁగాపాడుమా. నిన్నుఁదప్పమఱియొక్కటిని నేనెఱుఁగను.

శ్లో॥ కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కఙ్కణమ్॥
సర్వాఙ్గే హరిచన్దనం చ కలయన్ కణ్ఠేచ ముక్తావళిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః॥ + ~ 109

టీ. లలాటఫలకే = పలకవంటినుదుటియందు, కస్తూరీతిలకం = కస్తురిబొట్టును, వక్షఃస్థలే=ఱొమ్ముపట్టునందు, కౌస్తుభం=కౌస్తుభమణియు, నాసా+అగ్రే = ముక్కుకొనయందు, నవమౌక్తికమ్-నవ=క్రొత్తదైన, మౌక్తికమ్=ముత్తెమును, కరతలే = చే

స్త్రప్రదేశమందు, వేణుం=పిల్లఁగ్రోవియు, కరే=హస్తమునందు, కటకౌ=కడియ మును, కణ్ఠే=కంఠమునందు, ముక్తావళిం = ముత్తెపుహారమును, సర్వ+అఙ్గే = దేహ మంతటను, హరిచన్దనం = శ్రీచందనమును, కలయన్ = తాల్చుచున్నవాఁడును, గోప ...వేష్టితః-గోపస్త్రీ=గోపికలచేత, పరివేష్టితః = చుట్టఁబడినవాఁడును, అగు, గోపాల చూడామణిః- గోపాల = గొల్లవారలకు, చూడామణిః = శిరోరత్నము-శ్రేష్ఠుఁడైన కృష్ణుఁడు, విజయతే=సర్వోత్కృష్టుఁడై వర్తించుచున్నాఁడు.

మ. నుదుటం గస్తురిబొట్టు నాసికతుద న్ముత్తెంబు శ్రీగంధసం
పద నెమ్మేనఁ గరంబులం గటకముల్ వంశంబు హస్తాగ్రమం
దెసపై నిస్తులకౌస్తుభంబు నఱుతన్ శృంగారహారంబు నిం
పొదవం గృష్ణుఁడు గోపికావృతుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తిలున్.

తా. పలకవలె నిద్దమైన నెన్నుదుటియందు కస్తురిబొట్టును, ఱొమ్మునందు కౌస్తుభమనెడి కెంపును, ముక్కుతుదను శ్రేష్ఠము ముత్తెమును, ఆఱచేత వేణువును, చే తులందు కడియములును, మెడయందు ముత్తెపుసరియు, దేహమంతటను మంచిగంధ మును దాల్చి గొల్లచెలువలు చుట్టునుబలసి కొలువఁగా గొల్లవారికెల్లఁ దలమిన్నయై యొప్పు శ్రీకృష్ణుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తించుచున్నాఁడు.

శ్లో॥ లోకా నున్మదయన్ శ్రుతీ ర్ముఖరయన్ క్షోణీరుహాన్ హర్షయన్
శైలా న్విద్రవయన్ మృగా న్వివశయ న్గోబృన్ద మానన్దయన్
గోపాన్ సంభ్రమయన్ మునీన్ముకుళయన్ సప్తస్వరాన్ జృమ్భయ
న్నోఙ్కారార్థ ముదీరయ న్విజయతే వంశీనినాద శ్శిశోః॥ 11(

టీ. లోకాన్ = లోకములను, ఉన్మదయన్ = ఉన్మత్తములుగాఁ జేయుచున్న దియు-ఆనందముచేఁ బరవశమైనదిగాఁ జేయుచున్న దనుట, 'ఉద్ధరయన్' అనుపాఠ మున-లోకములను ఉద్ధరించుచున్నదియనుట, శ్రుతీః = వేదములను, ముఖరయన్ = ధ్వ నింపఁజేయుచున్నదియు - శ్రుత్యర్థములను బ్రతిపాదించుచున్నది యనుట, క్షోణీరు హాన్ = వృక్షములను, హర్షయన్ = ఉబ్బించుచున్నదియు - చిగిరింపఁ జేసి సొంపు గూర్చుచున్నది యనుట, శైలాన్ = కొండలను, విద్రవయన్ = మిక్కిలి కరఁగించుచు న్నదియు, మృగాన్ = మృగములను, వివశయన్ = పరవశములైనవానినిగాఁ జేయు చున్నదియు, గోబృన్దమ్ = గోవులసమూహమును, ఆనన్దయన్ = ఆనందింపఁజేయుచు న్నదియు, గోపాన్=గొల్లవారిని, సంభ్రమయన్ = తొట్రుపడఁజేయుచున్నదియు, ము నీన్=మునులను, ముకుళయన్ = మోడ్పుఁగేలుగలవారినిగాఁ జేయుచున్నదియు - లేక

ధ్యానసమాధియందు లయించునట్లు చేయునదియు, సప్తస్వరాన్ = 'సరిగమపధని' అను ఏడుస్వరములను, జృమ్భయన్ = చెలఁగునట్లు చేయుచున్నదియు, ఓఙ్కార+అర్థం = ప్రణవముయొక్క అర్థమును, ఉదీరయన్ = ప్రతిపాదించుచున్నదియు, అసౌ, శౌరేః = నీసువైనచిన్నికృష్ణునియొక్క, వంశీనినాదః-వంశీ = వేణువుయొక్క, నినాదః=ధ్వని, విజయతే=సర్వోత్కర్షముతో వర్తించుచున్నది.

చ. మృగములుసొక్క మ్రాఁకులిగుర్పింపఁగ రాలుగరంగ మోహితుఁగా
నిగమము లావు లుబ్బఁగ మునిచ్ఛట మ్రాన్పడ గోవు లాడఁగా
జగము సెలంగ నోంకృతి యొసంగఁగ సప్తవిధస్వరాంగుళు
ల్నిగుడఁ గడంగె బాలమురళీనినదంబు ముదం బెసంగఁగన్. 110

తా. శ్రీకృష్ణునివేణునాదము, లోకములఁ జొక్కించుచును, వేదములను మ్రోయించుచును, వృక్షములను జిగుర్పంజేయుచును, పర్వతములను కరఁగించుచును, మృగములను మ్రాన్పడఁజేయుచును, గోవులను ఆనందింపఁజేయుచును, గోపకులను దొట్రుపఱచుచును, మునులను ధ్యానముద్రనొందించుచును, సప్తస్వరములను జెలఁగించుచును, ప్రణవముయొక్క తాత్పర్యమును బ్రతిపాదించుచును, అంతట సర్వోత్కర్షముతో వర్తించుచున్నది.

శ్లో॥*యస్యాత్మభూతస్య గురోః ప్రసాదా
దహం విముక్తోఽస్మి శరీరబన్ధాత్ ।
సర్వోపదేష్టుః పురుషోత్తమస్య
తస్యాఙ్ఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యమ్॥ 111

టీ. ఆత్మభూతస్య = అంతరాత్ముఁడై యున్న-(సోమగిరిపరముగా)ఆత్మవలెధారకుఁడైన, యస్య = ఏ, గురోః = గురువుయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, శరీరబన్ధాత్ = దేహబంధమునుండి-దేహరూపబంధమును గలిగించుకర్మపటలమునుండి, అహం = నేను, విముక్తః = విడిపడినవాఁడను, అస్మి=అగుచున్నానో, సర్వ+ఉపదేష్టుః-సర్వ = 'సోమగిరి గ్గురు ర్మే శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపిఞ్ఛమౌలిః' అన్నట్లు సోమగిరియు శ్రీకృష్ణుఁడును దనకు గురువులుగాఁ గవి మొదటఁ జెప్పియుండుటచే ఇట కృష్ణపరముగా సమస్తమైనవారికి, ఉపదేష్టుః = ఉపదేశించువాఁడైన-సోమగిరిపరముగా, సర్వ = సమస్తములైన అర్థములును, ఉపదేష్టుః = ఉపదేశించువాఁడైన, తస్య=ఆ-ప్రసిద్ధుఁడైన, పురుషోత్తమస్య = కృష్ణునియొక్క, (సోమగిరిపరముగా) పురు

*ఈశ్లోకము ఒకానొక ప్రతియందే చూపట్టుచున్నది; కాఁబట్టి తెనుఁగుపద్యము లేదు.

షోత్తమస్య=పురుషశ్రేష్ఠునియొక్క, అఙ్ఘ్రిపద్మం=అడుగుఁదామరనుగూర్చి, నిత్యమ్=ఎప్పుడును, ప్రణతః=నమస్కరించినవాఁడను, అస్మి=అగుచున్నాఁడను.

తా. పరమాత్మస్వరూపుఁడైన (ఆత్మధారకుఁడైన) యేగురువుయొక్క అనుగ్రహముచేత నేను సంసారబంధములైన కర్మములనుండి విడివడితినో యట్టిసర్వజనోపదేశకుఁడు (సర్వార్థోపదేశకుఁడు) అగు శ్రీకృష్ణునియొక్క (పురుషశ్రేష్ఠుఁడైన సోమగిరియొక్క) పాదారవిందములకుఁ బ్రణామము సేయుచున్నాను.

ఇతి శ్రీలీలాశుకవిరచితే శ్రీకృష్ణకర్ణామృతే
ద్వితీయశతకం సమాప్తమ్
శ్రీలీలాశుకుఁడు రచించిన శ్రీకృష్ణకర్ణామృతమందు
ద్వితీయశతకము సమాప్తము.

---

మాలినీవృత్తము. సతతవినుతభీమా ♦ సచ్చిదానందసీమా
శతముఖనుతనామా ♦ సాధుమానిప్రణామా
దితిజకులవిరామా ♦ దేవతాసార్వభౌమా
వితతతపనధామా ♦ వేంకటాహార్యధామా.

మ. ఇది కృష్ణాశ్రయయోగిపుంగవకృపాసంవీక్షాత్తసారస్వతా
భ్యుదయశ్రీవిభవప్రసిద్ధచిదచిద్బోధక్షమాశాన్తిస
త్యదయాభూషణ వెల్లపూడిమణిపెద్దామాత్యవెంగాగ్రణీ
గదితాశ్వాసము వొల్చుఁ బ్రాథమిక మై ♦ కర్ణామృతశ్రీకృతిన్.





శ్రీ

# శ్రీ కృష్ణ కర్ణామృతము.

## తృతీయాశ్వాసము.



శ్లో॥ అస్తి స్వస్త్యయనం సమస్తజగతా మభ్యస్తలక్ష్మీస్తనం
వస్తు ధ్వస్తరజస్తమోభి రనిశంన్యస్తం పురస్తాదివ
హాస్తోదస్తగిరీన్ద్రమస్తకతరుప్రస్తారవిస్తారిత
స్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్ప్రస్తావిరాధాస్తుతమ్. 1

టీ. సమస్తజగతాం=సకలలోకములకు, స్వస్త్యయనం=రక్షకమైనదియు, అభ్యస్త... స్తనం-అభ్యస్త=అలవాటు చేయంబడిన - పెక్కుమాఱులుఅనుభవింపఁబడిన, లక్ష్మీ=లక్ష్మీదేవియొక్క, స్తనం = కుచములుగలదియు,ధ్వస్త...తమోభి-ధ్వస్త=నష్టములైన,రజఃతమోభిః = రజోగుణతమోగుణముల చేత- రజస్తమోగుణముల నాశము చేత- లేక రజస్తమోగుణములు నశించినవారి చేత, అనిశం=ఎల్లప్పుడును, పురస్తాత్=ముందట, న్యస్తమివ=ఉంపఁబడినదానివలె నున్నదియు-రజస్తమోగుణములు నశించి శుద్ధసత్త్వనిష్ఠులైనవారిచే ఎదుటనే యున్నదానివలె అతివిశదముగా వర్ణితమైయున్నదియు, హాస్త...లసత్-హాస్త=హస్తముచేత, ఉదస్త=ఎత్తఁబడిన, గిరీన్ద్ర=గోవర్ధన పర్వతముయొక్క, మస్తక=శిఖరమందలి, మీఁదిభాగమందలి,తరు = చెట్లయొక్క, ప్రస్తార=సమూహమునందు, విస్తారిత=విస్తరించినదిగాఁ జేయఁబడినదియు- ఆ చెట్లపువ్వులతోఁ గూడి మిక్కిలి యధికమైనది యనుట, స్రస్త=జాఱినదియు, అగు, స్వస్తరు=కల్పవృక్షములయొక్క, సూన=పుష్పములయొక్క, సంస్తర = అంచెలచేత-పైపైని పడుటలచేత, లసత్ = ప్రకాశించుచున్నదియు - గోవర్ధనమును ఎత్తఁగా దానిశిఖరములందలి వృక్షములనుండి రాలినపుష్పములును దేవతలు మెచ్చి కురిసిన కల్పవృక్షపుష్పములును గూడి విస్తారమై పయిని బడఁగా ప్రకాశించుచున్నదియనుట, ప్రస్తావి...స్తుతమ్-ప్రస్తావి=ఆగోవర్ధనపర్వతము నెత్తుటను) జెప్పుచున్న, రాధా=రాధచేత,స్తుతమ్-స్తోత్రము చేయఁబడుచున్నదియు, లేక 'హాస్తో...స్తుతమ్' అని యొకటెసమాసముగా గ్రహించినయెడల గిరీంద్రమస్తకతరుప్రస్తారముల చేత, విస్తారితములైన కల్పతరుప్రసూనముల చేతనైన, సంస్తర=పడకయందు,లసత్=ప్రకాశించుచున్నదియు, ప్రస్తావి=ఆ గోవర్ధమును ఎత్తినప్రస్తావము గలదియు, అగు,

...ధచేత స్తుతమైన దని యర్థాంతరము. గోవర్ధనము నెత్తియైనతర్వాత దానిపైఁ బడి క్రింద రాలినకల్పవృక్షపుష్పములసెజ్జయందు రాధ కృష్ణునితోఁ గూర్చుండి, ఆ గోవర్ధనపర్వతము నెత్తినప్రస్తావము దెచ్చి ఆతనిని పొగడినదనుట, ఇట్టిదైన, వస్తు= శ్రీకృష్ణాఖ్యమైన వస్తువు, అస్తి=కలదు.

శా. హస్తోద స్తగిరీంద్రము స్తకతరుస్రవ్యత్య స్తవిస్తారిత
ప్రస్తవ్య స్తరుసూనస్త రలసత్సారిస్తార మభ్య స్తవ
ద్వామస్తోక స్తన మ స్తకల్మషపుషోస్య స్తంబు నుద్యజ్జగ
త్స్వ స్తిశ్రీదము రాధికాస్తుతము చంచద్వస్తు వెంతే తగున్. 1

తా. సకలజగత్తులను రక్షకమై, లక్ష్మీదేవిచన్నుదోయిని అనుభవించుట యందు మరగినదై, శుద్ధసత్త్వనిష్ఠులచే విశదముగా ప్రతిపాదింపఁబడినదై, గోవర్ధనము నెత్తఁగా అందలికోనలలోని చెట్లనుండి రాలినపుష్పములచేతను దేవతలు కురిసిన కల్పవృక్షపుష్పములచేతను నెఱసి, యాకొండ నెత్తినందున రాధ మిక్కిలి పొగడఁగా నొప్పుచున్న కృష్ణుండనెడితత్త్వము ఒకటి కలదు.

శ్లో॥ రాధారాధితవిభ్రమాద్భుతరసం లావణ్యరత్నాకరం
సాధారణ్యపదవ్యతీతసహజస్మేరాననామ్భోరుహమ్।
ఆలమ్బే హరినీలగర్వగురుతాసర్వస్వనిర్వాపణం
బాలం వైణవికం విముగ్ధమధురం మూర్ధాభిషిక్తం మహః॥ 2

టీ. రాధా...రసం-రాధా = రాధచేత, ఆరాధిత = గారవింపఁబడుచున్న, విభ్రమ=విలాసముచేత, అద్భుత=ఆశ్చర్యకరమైన, రసమ్=శృంగారరసము గలది యనుట-శృంగారరసాతిశయము అత్యాశ్చర్యముగాఁ జిప్పిలుచున్నదనియు, శృంగార రసప్రయుక్తములైన తదీయవిలాసములను రాధయు మిక్కిలి మెచ్చి కొలుచుచున్న దనియు భావము. లావణ్యరత్నాకరమ్-లావణ్య=కాంతివిశేషముయొక్క, రత్నాకరమ్= సముద్రమైనదియును-నిరతిశయకాంతివిశేషము గలదియును, సాధారణ్య...రుహమ్- సాధారణ్య=సాధారణముగా నుండుటయొక్క-సమానమైయుండుటయొక్క, పద= మార్గమును, వ్యతీత=అతిక్రమించినదియు-తనకు సమానమైనది మఱియొక్కటిలేనిదియు అనుట, సహజ=స్వభావసిద్ధముగా, స్మేర=చిఱునవ్వుతోఁ గూడినదియు, అగు, ఆనన+అమ్భోరుహమ్=మోముఁదామరగలదియు, ఈడుజోడు లేకయెప్పుడును చిఱు నవ్వుకొలఁకుచున్న తామరవంటిమొగము గలదియనుట, హరి...నిర్వాపణమ్- హరినీల=ఇంద్రనీలమణులయొక్క, గర్వ=అహంకారముయొక్క, గురుతా=గొప్ప తనముయొక్క, సర్వస్వ=సమస్తమును, నిర్వాపణమ్=పోఁగొట్టునదియు-ఇంద్రనీలమణుల గర్వాతిశయము నంతయు పోఁగొట్టునట్టి నల్లనికాంతి గలది యనుట, వైణవికం=

వేణువు నూదుచున్నదియు, విముగ్ధమధురం-విముగ్ధ=మిగుల సుందరమైనవానిలో మధురం=సుందరమైనదియు, మూర్ధాభిషిక్తం=మనోజ్ఞ వస్తువులన్నిటికిని రాజైనదిగా పట్టాభిషిక్తమైనదియు-నిరతిశయమనోజ్ఞమైనది యనుట, అగు, మహః=తేజమును-శ్రీకృష్ణాఖ్య తేజస్సును, ఆలంబే=ఆశ్రయించుచున్నాను.

శా. సాధారణ్యపదవ్యతీతదరహాసశ్రీముఖాంభోజుఁడై
మాధుర్యైకనిధానుఁడై మరకతాశ్మప్రౌఢిగర్వార్భటీ
వైధుర్యావహతేజుఁడై సరసనిర్వ్యాజాంగశృంగారుఁడై
రాధారాధితుఁడైన వైణవికమూర్ధన్యుఁ డెదిం గొల్చెదన్. 2

తా. రాధచేఁగూడ మిగుల గొప్పగాఁ గొనియాడఁదగినంత యాశ్చర్యకరమైన శృంగారరసముగలదియును, విశేషకాంతివైభవముగలదియు, సాటిలేనిదై చిరునవ్వు సహజముగాఁ దొలఁకుచుండు మోముఁదామర గలదియు, ఇంద్రనీలముల కాంతి నతిశయించిన నల్లనికాంతిచే మించినదియు, వేణువు నూదునదియు, చక్కనివానిలో పల మిగులఁ జక్కనైనదియు లోకోత్కృష్టమైనదియు, నగు బాలకృష్ణాఖ్యతేజమును ఆశ్రయించుచున్నాను;

శ్లో॥ కరిణామలఙ్ఘ్యగతివైభవం భజే
కరుణావలమ్బితకిశోరవిగ్రహమ్।
యమినామనారతవిహారి మానసే
యమునావనాన్తరసికం పరం మహః॥ 3

టీ. కరిణాం=ఏనుగులకు, అలఙ్ఘ్యగతివైభవమ్-అలఙ్ఘ్య = అతిక్రమింపరాని మీఱరాని, గతి = గమనముయొక్క, వైభవమ్ = పెంపుగలదియును-ఏనుఁగులనడకను మించిననడకపెంపు గలది యనుట, కరుణా...విగ్రహమ్-కరుణా=దయచేత, అవలమ్బిత=స్వీకరింపఁబడిన, కిశోర=బాలునియొక్క, విగ్రహమ్=శరీరముగలదియును, కరుణచే బాలుఁడై యవతరించినయనుట, యమినాం=ఋషులయొక్క, మానసే=మనస్సునందు, అనారతవిహారి-అనారత=ఎడతెగక, విహారి = విహరించునదియు, యమునా...రసికం-యమునా=యమునానదీతీరమందలి, వన + అంత=రమణీయమైన వనమందు-ఇచట అంత శబ్దము రమణీయవాచకము, రసికం=(సంచారముచేయుటయందలి) రసమునెఱిగినదియు, పరం=ఉత్కృష్టమైనదియు, అగు మహః=శ్రీకృష్ణాఖ్యతేజమును, భజే=సేవించుచున్నాను. ఋషులమనంబుల విహరించుటచేఁ బరత్వమును, యమునానదివనాంతములందు విహరించుటచే సౌలభ్యమును దొలఁకుచున్నవి.

ఉ. అల్లన మందయానమున గజావలి గేరఁగ మానిమానసో
త్ఫుల్లసరోజపాళిఁ బదకమ్ముల్ సెలఁగన్ యమునాతరంగిణీ
సల్లలితాంబుపూరకములు సారవయస్యలమీఁదఁ జిమ్ముచుం
జల్లనిచూపులం గరుణఁ జల్లెడునల్లనిబాలుఁ గొల్చెదన్. 3

తా. మదపుటేనుఁగుల నడకను మించిన నడకసొంపు గలదియు, కరుణారసముచే బాలుఁడై యవతరించినదియు, యోగులమనంబులయం దెపుడును విహరించుచుండునదియు, యమునానదీతీరమందలి రమణీయమైనయడవియందుఁ దిరుగాడుటయందు నిపుణమైనదియు, సర్వోత్కృష్టమైనదియు నగుకృష్ణాఖ్యతేజమును భజించుచున్నాను.

శ్లో॥ అతన్త్రితత్రిజగదపి వ్రజాఙ్గనా
నియన్త్రితం విపులవిలోచనాజ్ఞయా।
నిరన్తరం మమ హృదయే విజృమ్భతాం
సమన్తతః సరసతరం పరం మహః॥ 4

టీ. అతన్త్రితత్రిజగత్ అపి—అతన్త్రిత = స్వతంత్రములు కానివిగాఁ జేయఁబడిన-తనకు పరతంత్రములైన యనుట, త్రిజగత్ అపి = మూఁడులోకములు గలదియైనను, 'నియన్త్రితసకలజగత్' అను పాఠమున, యత్ = ఏ తేజము, సకలజగత్ = సమస్తలోకమును, నియన్త్రి = నియమించునదో, తత్ = అది - సర్వలోకనియామకమైనదని యర్థము, విపుల...జ్ఞయా - విపుల = విశాలములైన, విలోచన - కన్నులయొక్క, ఆజ్ఞయా = ఆజ్ఞచేత-వాలుఁగనుసన్నలచేఁ జేయునట్టియాజ్ఞలచేత ననుట, వ్రజా...త్రితమ్ - వ్రజ + అఙ్గనా = గోపస్త్రీలచేత, నియన్త్రితమ్ = నియమింపఁబడినదియై, - గొల్ల చెలువలు కనుసన్నలచే చేయునాజ్ఞలకు లోనై ప్రవర్తించునదియనుట, సమన్తతః = అంతటను, సరసతరం = మిక్కిలిసరసమైనదియు - ఎచ్చటఁ జూచినను ఏమి చేసినను మిగులరసవంతముగానే యుండునదనుట, పరం = ఉత్కృష్టమైనదియు, అగు, మహః = తేజము-కృష్ణాఖ్యతేజము, మమ = నాయొక్క, హృదయే = హృదయమునందు, నిరన్తరం = ఎప్పుడును, విజృమ్భతాం = ప్రకాశించుఁగాక - ముల్లోకములను నియమించునంతటి దేవదేవుఁడు గొల్లచెలువలు మాట చెప్పి చెప్పక వట్టికనుసన్నలచేతనే చేసినయాజ్ఞలకు లోనై నడచుకొన్నాఁ డనుట సౌలభ్యాతిశయ ముద్ఘోషించుచున్నది. కనుసన్నలకే లోనై నడచుకొనుట అత్యంతవిధేయత్వమును సూచించుచున్నది. ముల్లోకములయేలిక గొల్లచెలువలకు గులామైనాఁడని భావము. ఇట్టిసౌలభ్యమునుబట్టి సులభాశ్రయణీయమై, 'సమన్తతః సరసతరమ్' అంతటను రసము చిప్పిలుటఁబట్టి అత్యంతభోగ్యమై యుండుటచే నామనస్సునందు ఒకప్పుడు గాక 'నిరన్తరమ్' ఎప్పుడును, అందును, ఉండుట మాత్రమే కాక 'విజృమ్భతామ్' పయిపయి నతిశయిల్లుచును, ఉండును గాక యని యాశయము.

ఉ. లోకము లన్నియుం దనకుఁ గ్లోకువగాఁ గొని యేలుమేటి య
స్తోకమనోహరావయవశోభితుఁ డెంతటివింత గోపికా
లోకనలీల నెల్లపనుకలుం దనుఁ దాన యొనర్చె వారిదే
కాక ప్రభావ మట్టిత్రిజగత్సులభున్ మది నాశ్రయించెదన్. 4

తా. ముల్లోకములును దనవు వశముగా నడపుచుండునట్టి ఏలిక యయ్యును, గొల్లచెలువలు కనుసన్నలతోఁ జెప్పినపనులు సేయునంతసౌలభ్యము గలదై, సమస్త విషయములందును మిక్కిలిసరసమై, యొప్పుశ్రీకృష్ణాఖ్యతేజము నాహృదయమందు నిరంతరము పయింబయి అతిశయిల్లుచుండుఁగాక!

శ్లో॥ కన్దర్పప్రతిమల్లకాన్తివిభవం కాదమ్బినీబాన్ధవం
బృన్దారణ్యవిలాసినీవ్యసనినం వేషేణ భూషామయమ్।
మన్దస్మేరముఖామ్బుజం మధురిమవ్యామృష్టబిమ్బాధరం
వన్దే కన్దళితార్ద్రయౌవనవనం కైశోరకం శార్ఙ్గిణః॥ 5

టీ. కన్దర్ప...విభవమ్-కన్దర్ప = మన్మథునికి, ప్రతిమల్ల = ప్రతిభటమైన - ఎదిరియైన యనుట, కాంతి = కాంతియొక్క, విభవమ్ = పెంపుసొంపు గలదియు-మన్మథునికాంతిని అతిశయించునట్టి కాంతి గలది యనుట, కాదమ్బినీబాన్ధవమ్ - కాదమ్బినీ = మేఘపంక్తికి, బాన్ధవమ్ = చుట్టమైనదియు - మేఘసమూహముయొక్క కాంతివంటి కాంతి గలది యనుట-ఇచట మేఘము అనక మేఘసమూహమును జెప్పుటచేఁ గాంతి యొక్క అతిశయము తెలియుచునది. బృన్దా...వ్యసనినం బృన్దారణ్య = బృందావన మండలి, విలాసినీ=విలువిలాండ్రయిన గోపికలయందు, వ్యసనినం = ఆసక్తిగలదియు, వేషేణ=వేషముచేత-తాను ధరించియున్న నెమలిపురి వేణువు మొదలైనసామాన్య పరికరముచేతనే, భూషామయమ్ = భూషణప్రచుర మైనదియు - మిక్కిలిసొమ్ములు గలది యనుట - సామాన్యము లైనవి తొడిగినను మిక్కిలి భూషణములు దాల్చినట్లు ఉండునది; లేక, భూషామయమ్ = భూషణస్వరూప మయినది-భూషణములు వేఱు అక్కఱ లేదు. సామాన్యమైన వేషమే భూషణముగా నుండునది యనుట; లేక భూషామయమ్=మిక్కిలి భూషణములు గలది-నానావిధభూషణములతోఁ గూడిన వేషముగలది యనుట, మన్ద...బుజమ్-మన్దస్మేర = చిఱునగవుతోఁ గూడిన, ముఖ + అమ్బుజమ్=మోముఁదామర గలదియు, మధురిమ...ధరమ్-మధురిమ = సౌందర్యము చేత, వ్యామృష్ట = మిక్కిలియు తడుపఁబడిన - చక్కఁదనము పూర్ణముగా నిండి యున్న-అంతటను చక్కనైయున్న, బిమ్బ + అధరమ్=దొండపండువంటి యధరము గలదియు, కైశోరకం = బాల్యముగలదియు- మిక్కిలిబాల్యముతోఁ గూడియున్నది యనుట, అగు, శార్ఙ్గిణః=కృష్ణునియొక్క, కన్ద...వనం-కన్దళిత = మొలకెత్తినదియు,

ఆర్ద్ర=సరసమైనదియు, అగు, యౌవన=ఎలప్రాయమనెడి, వనం=వనమునుగూర్చి, వన్దే=నమస్కరించుచున్నాను- ఇట కందళితమైనవనము (చిగిర్చినయడవి)వలె కందళితమైన యౌవనమును మిక్కిలి రమణీయముగా నుండుటచే యౌవనమును వనముగా రూపించినాఁ డని తెలియునది. టీక-'యౌవనమిదమ్' అనుపాఠమున, ఇదం-ఈ-ప్రసిద్ధమైన 'కందళితార్ద్రయౌవన' మని అన్వయము. దానినిగూర్చి, వన్దే=నమస్కరించుచున్నాను. ఇచట 'కన్దర్ప...విభవమ్' అనుచోఁ బ్రతిమల్లశబ్దముచే మన్మథుని కంటె సౌందర్యము మఱింత మోహాన మగుటయు, 'కాదమ్బినీ' అని మేఘమునుగాక మేఘపంక్తిని జెప్పుటచే నీలచ్ఛాయ మఱియు నతిశయించుటయు, 'బృన్దా=వ్యసని నం'అనుటచే గోపస్త్రీలయందు వ్యామోహము హెచ్చుటయు, 'వేషేణ...మయమ్' అనుటచే అలంకారము హెచ్చగుటయు, 'మన్ద...మ్బుజం' అనుటచే మొగము చిఱునవ్వుచేఁ జక్కఁగా నివ్వటిలుచుఁ దామరవలె మఱియుఁ దులకించుటయు, మధురిమ... ధరం' అనుటచే మోవియందు ఎఱుపును మెఱుపును మఱింత మీఱుటయు, బాల్యము మిక్కిలియు వీడని యౌవనప్రాదుర్భావముయొక్క లక్షణములుగాఁ దెలియునది.

శా. కందర్పప్రతిమల్లధాము నవమేఘశ్యాముఁ బ్రేమోల్లస
ద్బృందారణ్యవధూరతుఁ మధురిమాస్పృష్టాధరోష్ఠాన్వితు
న్మందస్మేరకపోలు వేషకృతనానాభూషణోద్వేలుఁ జె
ల్వొందం గొల్చెద బాల్యయౌవనవిలాసాలంకృతుఁ శ్రీయుతున్. 5

తా. మన్మథుని నిరసించునట్టి సౌందర్యశోభ గలిగి, మబ్బులపంక్తితో సాటియైన నీలచ్ఛాయతో నొప్పి, బృందారణ్యమందలి గొల్లకలికులాంగ్రయందుఁ దగులు వడి, సొమ్ములు పెక్కులు దాల్చి, చిఱునవ్వు దొలఁకుమోముఁదామరయు సొగసు మిక్కిలి గులుకు దొండపండువంటిమోవియుఁ బ్రకాశింపఁగా, బాల్యముతో మిక్కిలి కూడినదై క్రొత్తగా మొలకొత్తుచున్నట్టి కృష్ణుని సరసయౌవనమునుగూర్చి నమస్కరించుచున్నాను.

అవ. బాల్యము మిక్కిలి వీడని యౌవనాగమమునే వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ ఆముక్తమానుష మముక్తనిజానుభావ
మారూఢయౌవన మగూఢవిదగ్ధలీలమ్ ।
ఆమృష్టయౌవన మనష్టకిశోరభావ
మాద్యం మహః కి మపి మాద్యతి మానసే మే॥ 6

టీ. ఆముక్తమానుషమ్-ఆముక్త = కొంచెముగావిడువఁబడిన, మానుషమ్=మనుష్యభావముగలదియు, అముక్త...భావమ్-అముక్త = విడువఁబడని, నిజ = తనదైన,

అనుభావమ్=ప్రభావము గలదియు_మనుష్యభావము గలిగియుండియు తనమహత్త్వమును విడనాడకుండునది యనుట, ఆరూఢవిగ్రహమ్-ఆరూఢ = పైకొనిన-పరిగ్రహింపఁబడిన యనుట- లేక-పెరిఁగినదైన, విగ్రహమ్ = శరీరముగలదియు, అగూఢ... లీలమ్-అగూఢ = రహస్యములుకాని - ప్రకాశించుచున్న; విదగ్ధ = ప్రౌఢములైన, లీలమ్=విలాసములుగలదియు-శరీరము పెరుఁగుచును ప్రౌఢలీలలు పొదరుచును ఉండుటనుబట్టియే, ఆమృష్ట యౌవనమ్-ఆమృష్ట=కొంచెము స్పృశించిన, యౌవనమ్ = ఎలప్రాయముగలదియు-ఎలప్రాయము తలసూపుచున్న దనుట, కావుననే, అనష్ట... భావమ్-అనష్ట=నశింపని-పోదని, కిశోరభావం = బాలత్వముగలదియు_బాల్యము వీడనిది అనుట, కిమపి=ఇట్టిదట్టి దనరానిదియు, ఆద్యం = జగత్కారణమైనదియు, అగు, మహః= తేజము, కృష్ణాఖ్యతేజము, మమ = నాయొక్క; మానసే=మనస్సునందు, మాద్యతి=విఱ్ఱవీఁగుచున్నది-విజృంభించుచున్న దనుట. ఇట విగ్రహము ఆరూఢమగుటయు, విదగ్ధలీలలు అగూఢ మగుటయు, కిశోరభావము అనష్టమగుటయు, యౌవనము కందళించుటయొక్క లక్షణములని తెలియునది.

ఉ. మానవలీలయు న్నిరుపమానమహామహిమానుభావముం
మేనిపరిగ్రహంబు మితి మీఱినప్రౌఢియు బాల్యచాపలా
నూనవిలాసముం దనమనోహరయౌవనముం జెలంగ నెం
తేనియు హర్షవిస్మయము లిచ్చుఁ జెలంగ వెలుంగు నామదిన్. 6

తా. మనుష్యభావమును దాల్చియుండియు పూతనాసంహారాదులచేఁ దన ప్రభావము వదలక నెఱపుచుండునదియు, వృద్ధిక్షయములు లేనిదయ్యు శరీరమునఁ బెరుఁగుచున్నదియు, సర్వజ్ఞమయ్యును యౌవనము వచ్చినందులకు సూచకముగాఁ బ్రౌఢములైనలీలలు పచరించునదియు, బాల్యము తీవిపోవకుండునదియు, యౌవనము తలసూపుచుండునదియు, ఇట్టిదట్టిదని నిర్వచింపరానిదియు, మొట్టమొదటిదిగావున జగత్తునకెల్ల కారణమైనదియు, అగు శ్రీకృష్ణాఖ్యతేజము నామనస్సునందు మిక్కిలి చెలరేఁగుచున్నది.

అవ. లోకమునందలి సమస్తమనోజ్ఞవస్తువులకంటె శ్రీకృష్ణుఁడే అతిమనోజ్ఞుఁ డని కవి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ తే తే భావా స్సకలజగతీలోభనీయప్రభావాః
నానాతృష్ణా సుహృది హృది మే కామ మావిర్భవన్తు।
వీణావేణుక్వణితలసితస్మేరవక్త్రారవిన్దా
న్నాహం జానే మధుర మపరం నన్దపుణ్యామ్బురాశేః॥ 7

టీ. సకల...ప్రభావాః...సకల=సమస్తమైన. జగతీ = జగములకును, లోభనీయ = మిక్కిలి ఆశింపఁదగిన. ప్రభావాః = సామర్థ్యములు గలవి-లేక మహిమలు

గలవి, అగు, తేతే=ఆయాప్రసిద్ధములైన, భావాః = భావములు - పదార్థములు, నానా...సుహృది - నానా=అనేకములైన-పుత్త్రకళత్రధనధాన్యాది విషయములైన, తృష్ణా=పేరాసలను, సుహృది=మిత్త్రమైన, మే=నాయొక్క, హృది=హృదయము నందు, కామం=యథేచ్ఛముగా, అవిర్భవన్తు=పుట్టునుగాక-నాహృదయము అనేక విధములైన పేరాసలచే పూరితమైనదిగావున లోకమునందలిరమ్యపదార్థంబు లెల్లను దానికి మిక్కిలియింపై యాసగొలుపుచుఁ బ్రకాశించుఁగాక యనుట, అయినప్పటి కిని, వీణా...విన్దాత్-వీణా=వీణియవలె నున్న, వేణు=పిల్లఁగ్రోవియొక్క, క్వణిత =ధ్వనిచేత, లసిత=ప్రకాశించుచున్న, స్మేర=చిఱునగవుతోఁ గూడిన, వక్త్ర+ అరవిన్దాత్=ముఖకమలము గలదైన, నంద...రాశేః-నంద=నందునియొక్క, పుణ్య+ అమ్బురాశేః-పుణ్య=సుకృతరూపమైన, అమ్బురాశేః=సముద్రముకంటెను - సము ద్రమువలె అపారమై యున్న నందుని పుణ్యసమూహమే యిట్లు పుట్టిన దని చెప్పఁ దగిన శ్రీకృష్ణునికంటెను, మధురం=మనోజ్ఞమైన అపరం = మఱియొకవస్తువును, అహం=నేను, నజానే=ఎఱుఁగను-శ్రీకృష్ణుఁడే లోకోత్కృష్టమనోహరుఁ డనుట. లోకోత్కృష్టమైనయిట్టిమనోజ్ఞత్వమునకు 'వేణుక్వణిత' మును 'స్మేరవక్త్రారవింద' మును పోషకము లని తెలియునది. లోకమునందు అత్యంతలోభనీయము లైనవస్తు వులు పెక్కులు. హృదయము పేరాసలచే అత్యంతచపలమైనది గాన ఒక్కొక్కవస్తు వునందును దగులుపడినది. అట్టివస్తువులన్నిటిని అతిశయించి, యిట్టిచపలహృదయ మును దనయందే లీనము సేసికొని మించునంతటిమాధుర్యాతిశయము, మంజులవేణు నాదమును మందహాసముఖమును గలకృష్ణునికే కలదని యాశయము.

మ. అమితాశావశమానసుదిన్ నిఖిలలోకాశాస్య మాపెక్కుభా
వములెన్నేనియు నిల్పుఁగాక విలసద్వంశీనినాదానుమో
దము మందస్మితసుందరం బగుయశోదానందపుణ్యాంబుసా
రముకన్నన్ మధురంబు లేదొకటి చర్చల్ సేయ నింకేటికిన్. 7

తా. సర్వలోకములకును మిక్కిలియుఁ గోరఁదగినసౌందర్యాదిమహత్త్వములచేఁ బ్రసిద్ధము లైనవస్తువు లనేకములు గలవు. అవి పేరాసలకు పట్టయిన నాహృదయ మందు మిక్కిలియు ఆసగొలుపుచుఁ బ్రకాశించినను బ్రకాశింపనీ. వీణెవలె మొరయు చున్న వేణునాదముచే విలసిల్లుచు చిఱునవ్వుతోఁ గూడుచు తామరవలెనున్న మొగము గలవాఁడై నందునిపుణ్యసమూహమే యిట్లు పుట్టె ననఁదగిన శ్రీకృష్ణుని కంటెను మనోజ్ఞమైనపదార్థము మఱియొకటి నాకుఁ దెలియకున్నది.

శ్లో॥ సుకృతిభి రాదృతే సరసవేణునినాదసుధా
రసలహరీవిహారనిరవగ్రహకర్ణపుటే।

వ్రజవరసున్దరీముఖసరోరుహసారసికే
మహసి కదాను మజ్జతి మదీయ మిదం హృదయమ్॥ 8

టీ. సుకృతిభిః=పుణ్యాత్ములచేత, అదృతే=ఉపలాలింపఁబడినదియు, సరస... పుటే-సరసః=రసయుక్తమైన, వేణునినాద=వేణుధ్వనియనెడి, సుధారస=అమృతరసముయొక్క లహరీ=ప్రవాహమందు, నిరవగ్రహ=నిరాటంకమైన, కర్ణపుటే=చెవి పుటముగలదియు-అమృతరసప్రవాహమువలె అత్యంతభోగ్యముగా నిగుడుచున్న వేణునాదమును సొంపుగా ఆలించుచున్నది యనుట, వ్రజ... సారసికే-వ్రజ=వ్రేపల్లెయందలి, వర=శ్రేష్ఠమైన, సున్దరీ=చెలువలయొక్క-గోపస్త్రీలయొక్క, ముఖసరోరుహ=ముఖపద్మవిషయమయి, సారసికే=రసజ్ఞమైనదియు-గోపస్త్రీల తామరలవంటి మొగముల సౌందర్యసౌకుమార్యాదిరసములను చుంబనాదులచే అనుభవించు నేర్పుగలది యనుట, 'ముఖసరోరుహసన్మధుపే' అనుపాఠమున, ముఖసరోరుహ=మొగమనెడి తామరయందు సత్ = శ్రేష్ఠమైన మధుపే=తుమ్మెదయైనదియు-తామరయందలి రసమును గ్రోలుతుమ్మెదవలె గోపస్త్రీముఖతామరసములరసమును ఆస్వాదించునదియనుట. ఇట్టిదైన, మహసి=తేజస్సునందు-కృష్ణాఖ్యమైన తేజస్సునం దనుట, మదీయం=నాదైన, ఇదం=ఈ, హృదయం=మనస్సు, కదాను=ఎప్పుడు, మజ్జతి = మునుఁగును - ఆ తేజస్సునందు నాహృదయము ఎపుడు పూర్ణముగా లీన మగునో యనుట.

చ. విమలతపోధనామృతము ♪ వేణురవామృతసారపూరవి
శ్రమపదకర్ణగోళము ♪ వ్రజప్రమదాముఖపద్మచంచరీ
కము కమనీయనాకనుత ♪ కామజనావనమైనదివ్యతే
జమున మునుంగు టెన్నఁడొకొ ♪ చల్లగ నుల్లము పల్లవింపఁగన్.

తా. పుణ్యాత్ములచే నుపలాలితమైనదియు, అమృతరసప్రవాహమువలె నిగుడుచున్న వేణునాదములను ఎచ్చరికతో నాలించుచుండునదియు, గొల్లచెలువల ముఖారవిందముయొక్క భోగ్యతను ఆస్వాదించుటయందు రసజ్ఞమైనదియు, అగు శ్రీకృష్ణాఖ్య తేజమునందు నామనస్సు ఎపుడు పూర్ణముగా లీనమగునో.

శ్లో॥ కృష్ణాతురే చేతసి జృమ్భమాణాం, ముష్ణన్తు హార్దో మహదన్ధకారమ్।
పుష్ణాతు నః పుణ్యదయైకసిన్ధోః, కృష్ణస్య కారుణ్యకటాక్షకేళిః॥ 9

టీ. పుణ్య... సిన్ధోః-పుణ్య=పుణ్యముయొక్కయు, దయా=దయయొక్కయు, ఏక=ఏకరూపమైన, సిన్ధోః=సముద్రమైన-అపారమైనదయయు పుణ్యమును గలవాఁడైన, కృష్ణస్య=కృష్ణునియొక్క, కారుణ్య... కేళిః-కారుణ్య=కరుణచేఁ బ్రయుక్తమైన, కటాక్ష=కడగంటిచూపులయొక్క, కేళిః=క్రీడ-విలాసముగా నిగుడుట,

తృష్ణ + ఆతురే-తృష్ణ=పేరాసచేత, ఆతురే=తమకించుచున్న, చేతసి=మనస్సునందు, ముహుః=మాటికి, జృమ్భమాణం=విజృంభించుచున్న, మోహ...కారం-మోహ= మోహమనెడి, మహత్ + అన్ధకారం=కటికచీకటిని, ముష్ణన్=హరించుచున్నదై, నః= మమ్ము, పుష్ణాతు=పోషించుఁగాక. చేతము 'తృష్ణాతుర' మైనది గావుననే 'మోహ మహాంధకార' ము అందు 'జృంభమాణ' మైనది. ఇట్టి జృంభమాణ మహామోహమును 'దయైకసింధుఁ' డగుటచే బోఁగొట్టునంత దయాతిశయము గలవాఁడును, 'పుణ్యైకసింధుఁ' డగుటచే 'కటాక్షకేళి' చేతనే పోఁగొట్టునంత శక్త్యతిశయము గలవాఁడును అగు నని గ్రాహ్యము.

మ. అమితాశావశ మైననామది నవ ప్రశ్యం బైనమోహాంధకా
రము గారుణ్యకటాక్షవీక్షణవిభా ప్రాశిఁ విఘాలించి నె
య్యమునం బ్రోచు దయాపయోధి ఘనపుణ్యశ్రదారణ్యకర్మంది బృం
దమనోలోచనసాధుసేవధి ప్రమోదం బొప్ప నెల్లప్పుడున్. 9

తా. పుణ్యస్వరూపుఁడును దయానిధియు నగు శ్రీకృష్ణుని కరుణాకటాక్షము లీల గా బాలసి, పేరాసచే నా మనస్సున మాటికి చెలరేఁగుచున్న అజ్ఞాన మనెడి పెనుఁ జీఁకటిని హరించి, మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ నిఖిలనిగమమౌళిలాలితం పద, కమలం పరమస్య తేజసః।
వ్రజభువి బహుమన్మహేతరాం సర, సకరీషవిశేషరూషితమ్॥ 10

టీ. పరమస్య=సర్వోత్కృష్టమైన, తేజసః=శ్రీకృష్ణాఖ్యతేజముయొక్క, నిఖిల...లాలితం-నిఖిల=సమస్తములైన, నిగమ=వేదములయొక్క, మౌళి=శిరస్సులచేత-వేదాంతములచేత ననుట, లాలితం=లాలింపఁబడినదియు, వ్రజభువి-వ్రజ=వ్రేపల్లెయొక్క, భువి=భూమియందు, సరస...రూషితమ్-సరస=రసయుక్తమైన, కరీషవిశేష=రేణము చేత, రూషితమ్=పూయఁబడినదియు, 'భూషితమ్' అనుపాఠమున, అలంకరింపఁబడి నదియు, అగు, పదకమలం=అడుగుఁదామరను, బహుమన్మహేతరాం=మిక్కిలియు బహూకరించుచున్నాము-గొప్పగా నెన్నుచున్నామనుట, వేదశిరస్సు లెక్కడ! వ్రేపల్లె వీథు లెక్కడ: అలంకారభూతమైన పాదకమలము వ్రజభూమికరీషముచేత రూషిత మైనది అని పరత్వాతిశయమును సౌలభ్యాతిశయమును సూచితములు.

మ. సిరి కేల్దమ్ముల నొత్తఁగా శ్రుతివధూ ప్రసీమంతసింధూరసుం
దరమై యొప్పెసలార నందమునఁగ మంద్రదఁ నందగోపాలమం
దిరశాలాంతకరీషరూషితరసో ప్రదీర్ణంబుతో పాదము
ల్పరమానందముఁ జేయు నామదికి నుత్కల్లాసంబు గల్పించుచున్. 10

తా. వేదాంతములం దుపలాలిత మయ్యు, వ్రేపల్లెవీధులయందలి రేణముచేఁ బూయంబడి యొప్పుచున్న శ్రీకృష్ణాఖ్యమహాతేజస్సుయొక్క పాదపద్మమును మిక్కిలి గొనియాడుచున్నాము.

శ్లో॥ ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం
ముదా ముహు రుదీర్ణయా మునిమనోమ్బుజామ్రేడితమ్ ।
మదాలసవిలోచన వ్రజవధూముఖాస్వాదితం
కదాను కమలేక్షణం కమపి బాల మాలోకయే॥ 11

టీ. ఉదార...మాననమ్-ఉదార = గంభీరములును, మృదుల=కోమలములును అగు, స్మిత=చిఱునగవుయొక్క, వ్యతికర=సంకరముచేత-మిశ్రణముచేత, అభిరామ= మనోహరమైన, ఆననం=ముఖము కలవాఁడును, చిఱునవ్వు కూడుటచే మఱింత గొనబు చూపు మొగము గలవాఁడనుట, ముహుః=మాటికిని, ఉదీర్ణయా=ఉరవడించిన, పయిం బయి నతిశయించుచున్న, ముదా=సంతోషముచేత, ముని...మ్రేడితం-ముని=మునుల యొక్క-హృదయమునందు మననము సేయువారియొక్క, మనోమ్బుజ=హృదయకమ లములందు, అమ్రేడితమ్-ద్విగుణీకృతము-ఇనుమడి-యైనవాఁడును-మునులు హృదయము నందు 'మృదులస్మితాభిరామానన' మును ధ్యానింపఁగా మాటికి సంతోషము హెచ్చు టచే అందు శ్రీకృష్ణస్వరూపభోగ్యతావిభవమును ఇనుమడిగా అతిశయించుచుండుననుట, మదా...స్వాదితం-మద=యౌవనమదముచేత, అలస=మందములైన, విలోచన=కన్నులు గల, వ్రజవధూ=గోపస్త్రీలయొక్క, ముఖ=ముఖములచేత, ఆస్వాదితం=అనుభవింపఁ బడుచున్నవాఁడును-గోపస్త్రీలు యౌవనమదముచే మందదటిల్లిన మోహంపుఁజూపుల్కలు నిగిడ్చియు చుంబనాదు లిడియు, శ్రీకృష్ణమూర్తియొక్క భోగ్యతాగసమును అనుభవింతు రనుట, కమల+ఈక్షణం=తామరరేకులవంటి కన్నులు గలవాఁడును, కమపి=ఇట్టట్టని చెప్పరానివాఁడును, అగు, బాలం = బాలుని-చిన్నకృష్ణుని, కదాను = ఎప్పుడు, ఆలోకయే=చూతునో.

ఉ. కన్నులకొద్దిఁ జూచి వ్రజ కాంతలు వేడుక ముద్దు లాడఁగా
నన్నవునవ్వు వెన్నెలలు సల్లఁగఁ జల్లఁగ నెల్లమానులున్
సన్నుతమానసాబ్జముల సారెకు సారె వహింప మించున
క్కన్నులపండు వైనముఖ కంజము రంజిలుబాలుఁగాంచెదన్. 11

తా. ఉదారమును సుకుమారము నైన మొలకనవ్వు దొరయుటచే మఱింత ము ద్దుగులుకు నెమ్మొగము గలిగి, అట్టి ముద్దుమొగము తోడిరూపును మునులు హృదయం బున మననముసేయుటచే మాటికి గెలరేఁగుచున్న సంతోషమువలన వారల హృదయ కమలములందు రెండింతలుగా నతిశయించుచును, యౌవ్వనంపు మత్తుచే నుంద టిలిన

చూడ్కులు నిగిడ్చియు చుంబించియు తనభోగ్యతావిభవమును గొల్లచెలువలు అనుభవింపఁగా, తామరరేకులవంటికన్నులు గలిగి, ఇటటని వర్ణింపరాక వెలుంగుచున్న బాలకృష్ణుని ఎప్పుడు చూతునోకదా!

శ్లో॥ వ్రజజనమదయోషిల్లోచనోచ్ఛిష్టశేషీ
కృత మతిచపలాభ్యాం లోచనాభ్యా ముభాభ్యామ్।
సకృదపి పరిపాతుం తే వయం పారయామః
కువలయదళనీలం కాంతిపూరం కదాను॥ 12

టీ. వ్రజ...కృతమ్-వ్రజజన = వ్రేపల్లెలోనిజనులయొక్క, మద=యావనపదము గలిగిన, యోషిత్ = స్త్రీలయొక్క, లోచన = నేత్రములచేత, ఉచ్ఛిష్ట = ఉచ్ఛిష్టమాత్రము, శేషీకృతం = మిగిలినదిగాఁ జేయఁబడినదియు, కువలయ...నీలం – కువలయ=నల్లగలువలయొక్క, దళ = రేకులవలె, నీలం = నల్లనైనదియు, అగు, కాంతిపూరమ్ = (శ్రీకృష్ణునిమేని) కాంతిప్రవాహమును-ఇచట 'మదయోషిత్' అని స్త్రీలను యావనమదము గలవారినిగాఁ జెప్పుటచే యావనమదప్రయుక్తమైనమోహాతిరేకముచే ఆకాంతిపూరమును గన్నులచే మిక్కిలి డిగ్గఁద్రాగిరనియు కావుననే అందు ఉచ్ఛిష్టమాత్రము మిగిలినదనియు భావము, తే = అ-దౌర్భాగ్యమునందుఁబ్రసిద్ధులమైనయునుట, లేక, తే = నీయొక్క-ఇది కృష్ణునిసంబోధించి చెప్పుమాట, దీనికి కాంతిపూరముతో అన్వయము. వయం=మేము, అతిచపలాభ్యామ్ = మిక్కిలి చపలములైన, లోచనాభ్యాఁ=కన్నులు, ఉభాభ్యామ్ = రెంటిచేత, సకృత్ అపి = ఒకమారైనను, పరిపాతుం=పానముసేయుటకు, కదాను = ఎపుడు, పారయామః = శక్తులముగుదుమో-గోపస్త్రీలు యావనంపుమరులువెల్లున డిగ్గఁద్రావి యుచ్ఛిష్టమాత్రమే మిగిల్చియున్న యానల్లనికాంతిపూరమును మాకార్కొదీర రెండుకన్నులార ఒక్కమారైనను ఎప్పుడు ద్రావఁగలుగుదుమో యని యర్థము.

మ. కౌమరుంబ్రాయపుమబ్బు గుబ్బతిలఁ గోర్కుల్ జొబ్బిలన్ వల్లవ
ప్రమదల్ గన్నుల నాని యాని దిగువార్పఁజన్ శేషమై పొల్చునా
రమణీయోత్పలకాంతిపూర మెదురై గ్రా నొక్కసారైనఁ బాం
కముగా నీకనుదోయి నానఁ గలభాగ్యం బెన్నఁడో కల్గెడున్. 12

తా. యావనపుమదంబు నివ్వటిలుగొల్లచెలువలు మోహాతిరేకమున డిగఁద్రావఁగా ఉచ్ఛిష్టమాత్రమే మిగిలిన ట్లున్నదై, నల్లకలువరేకులంబోనిచాయ గలదై, యొప్పునీకాంతిప్రవాహమును గృష్ణా! మారెండుకన్నులార ఒకపరియైనను ద్రావఁగలుగుట యెన్నఁడోకదా!

శ్లో॥ ఘోషయోషిదనుగీతయావనం, కోమలస్తనితవేణునిస్వనమ్।
సారభూతమభిరామసమ్పదాం, ధామ తామరసలోచనం భజే॥ 13

టీ. ఘోష...యౌవనమ్-ఘోష = వ్రేపల్లెయందున్న, యోషిత్ = స్త్రీలచేత-గోపికలచేత ననుట, అనుగీత = అనుసరించి గానము సేయఁబడుచున్న, యౌవనమ్ = ఎలప్రాయము గలదియు గోపికలు కృష్ణునియౌవనవిభవమునకుఁ జొక్కి దానిని గూర్చి వర్ణించి పాటలు పాడుదు రనుట, కోమల...స్వనమ్ - కోమల=మృదువైన, స్తనిత = ఉఱుమువంటి, వేణు = పిల్లఁగ్రోవియొక్క, నిస్వనం = నాదము గలదియు-ఉఱుమనుటచే గంభీరముగాను, లేఁతయుఱు మనుటచే ఉఱుమువలె భయంకరము గాక సుఖావహముగాను, ఉండున దనుట-గంభీర మగునొప్పధ్వని గలిగియు కర్ణసుఖావహమైయుండున దని యర్థము. ఇట్టివేణునాదము గలదియు, అభిరామసంపదామ్ - అభిరామ = మనోజ్ఞములైన, సంపదాం = సిరులయొక్క - మనోజ్ఞములైన సౌందర్యసౌకుమార్యాదులగు సొంపుపెంపులయొక్క, సారభూతం = సారాంశమైనదియు-సౌందర్యాదులసార మనుట-ఒప్పిదములలోనెల్ల ఒప్పిద మైనది అనుట, తామరసలోచనం = తామరలవంటికన్నులు గలదియు, అగు, ధామ = తేజమును, భజే=సేవించుచున్నాను.

ఉ. వ్రేజవరాంగ్రదు జవ్వనపు(?)విన్ననువుం గొనియాడఁగా ముఖాం
భోజమునందు లేయుఱుముఁబోనిరవంబున వేణు వొప్ప రా
రాజితకాంతిసంపదలరాశి యనన్ వెలుఁగొందుశారదాం
భోజదళాక్షు దైవతవిభుం ద్రిజగత్పతి నాశ్రయించెదన్. 13

తా. వ్రేపల్లెయందలిగోపికలు తనయౌవనమునుగూర్చి వర్ణించుచు పాటలు పాడఁగా, పిల్లఁగ్రోవి లేఁతయుఱుమువలె గంభీరముగాను కర్ణసుఖముగాను మ్రోయఁగా, చక్కనివానిలో నెల్లఁ జక్కనిదై తామరరేకు వంటికన్నులు గలిగి వెలుఁగుచుండు శ్రీకృష్ణాఖ్యతేజమును భజించుచున్నాను.

శ్లో॥ లీలయాలలితయావలమ్బితం, మూలగేహమివమూర్తిసమ్పదామ్।
నీలనీరదవికాసవిభ్రమం, బాలమేవ వయ మాద్రియామహే॥ 14

టీ. లలితయా=సుందరమైన, లీలయా = విలాసముచేత, అవలమ్బితం = ఆశ్రయింపఁబడినవాఁడును-మనోజ్ఞములైన లీలలకు పట్టయినవాఁ డనుట, మూర్తిసమ్పదామ్ = ఆకారముయొక్క సంపదలకు-శరీరముయొక్క చక్కఁదనంపు పెంపులకు, మూలగేహమివ = మొదలి టెంకివలె-పొట్టమొదట పుట్టినచోటువలె-నున్నవాఁడును-ఆకార సౌందర్యవిశేషములు మొదట ఇక్కడనుండియే పుట్టినవి గాని మఱెచ్చటను గాదనుట, నీల...విభ్రమం-నీల = నల్లని, నీరద = మబ్బుయొక్క, వికాస = ప్రకాశముయొక్క, విభ్రమమ్ = విలాసము గలవాఁడును-నల్లనిమేఘముయొక్క కాంతివిలాసము గలవాఁడును-నల్లనై విలాసము దొలఁకుచున్నకాంతి గలవాఁడనుట, అగు, బాలమేవ=బాలుఁ డగుకృష్ణునే, వయం=మేము, ఆద్రియామహే = ఆదరించుదు

న్నాము-అత్యంతప్రేమభక్తిపూర్వకముగాఁ గయికొనుచున్నార మనుట. 'ఆశ్రయామహే' అనుపాఠమున ఆశ్రయించుచున్నా మని యర్థము. లలితము లైనలీలలును సౌందర్యాతిశయమును విలాసము గులుకు నల్లనికాంతియుఁ గల కృష్ణునిబాల్యవేషమునందే కవికి వ్యామోహ మని తెలియునది.

శా. బాలున్ మోహనవేషలీలు మురళీపాండిత్యశీలున్ దయా
లోలున్ సాంద్రఘనాఘనావళివినీలున్ గోపకన్యానుత
శ్రీలావణ్యవయోవిశాలు నవనీరేజాయతాక్షిప్రభా
జాలున్ సర్వకళాలవాలు నతివాంఛం గొల్తు నానెమ్మదిన్. 14

తా. చెలువంపులీలలఁ బట్టయి, ఆకారముయొక్క చక్కఁదనంపుసొంపుల కెల్ల మెండలిపెంకి యై, నల్లనిమబ్బువంటి కాంతివిలాసము గులుకుచు నున్న చిన్ని బాలుఁ డగుకృష్ణునియందే మాకు ఆదరాతిశయము.

శ్లో॥ వన్దే మురారే శ్చరణారవిన్ద, ద్వన్ద్వం దయా దర్శితశైశవస్య।
వన్దారుబృన్దారకబృన్దమౌళి, మన్దారమాలావినిమర్దభీరు॥ 15

టీ. దయా...శైశవస్య-దయా=కారుణ్యముచేత, దర్శిత=చూపంబడిన, శైశవస్య=బాల్యముగలవాఁడైన-కారుణ్యముచేత బాలుఁడైయవతరించి బాల్యలీలలు నెఱపినవాఁ డైన యనుట, మురారేః = శ్రీకృష్ణమూర్తియొక్క, వన్దారు...భీరు-వన్దారు=మ్రొక్కుచున్న, బృన్దారక=దేవతలయొక్క, బృన్ద = సమూహముయొక్క, మౌళి=శిరములయందున్న, మన్దారమాలా = కల్పవృక్షపుపుష్పమాలికలయొక్క, వినిమర్ద=సమ్మర్దనమునకు-రాపిడికి, భీరు = భయపడుచున్నదైన-కల్పవృక్షపుపూదండలు శిరము లందు ముడుచుకొన్న దేవతలు లెక్కింపరానట్లు వచ్చి మ్రొక్కఁగా వారు అపార సంఖ్యగలవా రగుటచే వారిశిరములనుండియు అపారముగాఁ దొరగు చున్నయా పూదండలరాపిడికి జంకుచున్నది యనుట, ఇట్టి, చరణారవిన్దద్వన్ద్వమ్-చరణ+అరవిన్ద=పాదపద్మములయొక్క, ద్వన్ద్వమ్ = దోయినిగూర్చి, వన్దే = నమస్కరించుచున్నాను. పూదండలరాపిడిని చెప్పుటచే అవి అపరిమితములుగా నుండవలయుననియు, అవి అట్లగుటకు వానినిదాల్చి మ్రొక్కునట్టిదేవతలును అపరిమితసంఖ్యలుగా నుండవలయు ననియు, అపరిమితదేవతలచే మ్రొక్కఁగొనుటకు వాఁడు దేవదేవుఁడుగా నుండవలయు ననియు, భావములు ధ్వనించుచున్నవి. పూదండలరాపిడికి భయపడు నట్లు చెప్పుటచే ఆపాదపద్మములు అతిసుకుమారము లగుటయు సూచితము.

మ. దితిజానీకముఁ ద్రుంప మానితతి వర్తింపన్ యశోదాదయో
ధితకైశోరకళావిలాసుఁ డగునా దేవాదిదేవోత్తమున్

నతబృందారకబృందమాళివిలసన్మందారమాలాంతరం
గళితధారాళమరందబిందుమృదులాంఘ్రిద్వంద్వు సేవించెదన్.

తా. కారణముచే బాలుఁడై యవతరించి బాల్యలీలలు నెఱపు శ్రీకృష్ణమూర్తికి మ్రొక్క అపరిమిత దేవతాసమూహముల శిరంబులందుండి అవ్వారిగా కల్పవృక్షపుష్ప మాలికలు దొరఁగగా, ఆమాలికల మిక్కుటపు రాపిడికిఁ దాళలేక గొందుచున్న యతని పాదారవిందయుగళమునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ యస్మి న్నృత్యతి యస్య శేఖరభరైః క్రౌఞ్చద్విష శ్చన్ద్రికీ
యస్మి న్దృప్యతి యస్య ఘోషసురభిం జిఘ్రు న్వృషో ధూర్జటేః।
యస్మిన్సజ్జతి యస్య విభ్రమగతిం వాఞ్ఛ న్హరే స్సిన్ధుర
స్తద్బృన్దావనకల్పక ద్రుమవనం తం వా కిశోరం భజే॥ 16

టీ. క్రౌఞ్చద్విషః=క్రౌంచపర్వతమునకు విరోధియైన) కుమారస్వామియొక్క, చన్ద్రికీ = నెమిలి, యస్య = ఏకృష్ణునియొక్క, శేఖర = సిగయందలి నెమిలిపురిదండలయొక్క, భరైః = సమృద్ధులచేత-సిగయందు మిక్కిలి చెరవుకొని యున్న నెమిలి పురులచేత ననుట, యస్మిన్ = ఎందు - ఏవనమునందు, నృత్యతి=నర్తించుచున్నదో-కృష్ణుని సిగయందలి నెమిలిపురులను జూచి నెమిలి యని తలఁచి కుమారుని నెమిలి యాడుచున్న దనుట-అవి ఒకటిరెండు పురులు కాక 'భరైః' అని సమృద్ధులను జెప్పటచే నెమిలిపురుల బాహుళ్యమును, దన్మూలమున నెమిలి యనుభ్రాంతియు, సిద్ధించిన దని తెలియునది, ధూర్జటేః=శివునియొక్క, వృషః = వృషభము, యస్య = ఏకృష్ణుని యొక్క, ఘోష=వ్రేపల్లెయందలి, సురభిం=ధేనువును, జిఘ్రన్ = (యోనిదేశమును) ఆఘ్రాణించుచున్నదై, యస్మిన్ = ఏవనమందు, దృప్యతి = గర్వించుచున్నదో, 'హృష్యతి' అనుపాఠమున 'హర్షించుచున్నదియో' యని యర్థము, హరేః = ఇంద్రుని యొక్క, సిన్ధురః=గజమైన ఐరావతము, యస్య = ఏకృష్ణునియొక్క, విభ్రమగతిం = విలాసముతోఁ గూడిన నడను, వాఞ్ఛన్ = కోరుచున్నదగుచు, యస్మిన్ = ఏవనమందు సజ్జతి=ఆసక్తిగలది యగుచున్నదో, తత్=ఆ, బృన్దా...వనమ్-బృన్దావన = బృందావనమందున్న, కల్పకద్రుమ = కల్పవృక్షములయొక్క, వనం=వనమునైనను, తం = ఆ, కిశోరంవా = బాలకుఁడైన కృష్ణునైనను, భజే=సేవించుచున్నాను. ఇచట కుమారుని నెమిలి, శివునియెద్దు, ఇంద్రుని యేనుఁగును కృష్ణుఁ డున్న బృందావనమునకు వచ్చె ననుటచే ఆవాహనముల నెక్కి కుమారుఁడును, శివుఁడును, ఇంద్రుఁడును అచటికి కృష్ణుని సేవింపవచ్చిరనియు, కాఁబట్టి కృష్ణుఁడు దేవదేవుఁడనియుఁ దెలియునది. అట్టికుమారాదిదేవతలును దేవదేవుఁ డగు కృష్ణుఁడును చరించిన యాబృందావనకల్పక ద్రుమ వనము అత్యంతపావన మగుటచే దానిని భజించుటయు, శివాదులకును వందనీయుఁ డగు దేవదేవుఁ డగుటచే శ్రీకృష్ణుని భజించుటయుఁ, గవి చెప్పినాఁ డని తెలియునది.

శా॥ ఎందే నెవ్వనిమాళిఁ గాంచి గుహవాహజేంద్రంబు నర్తించుఁ దా
నెందే నెవ్వనియానరీతి హరిమత్తేభంబుఁ గాంక్షించుఁ దా
నెందే నెవ్వనిమంద మూర్కొనుచు భూతేశాశ్వముం బొంగునా
బృందారణ్యసురద్రుమసాంద్రవని నాకృష్ణుఁ మదిం గొల్చెదన్. 16

తా. ఏవనమందు ఎవ్వనిసిగయందలినెమిలిపురులజొంపమును జూచి సేనాధిపతి వచ్చినకుమారస్వామియొక్క నెమిలి అది యొకనెమిలి యని తలఁచి యాడునో, ఏవనమందు ఎవ్వనిశ్రీపల్లెగోవుయొక్క యోనిదేశము నాఘ్రాణించుచు శివునివృషభము విజృంభీఁగునో, ఏవనమందు ఎవ్వనివిలాసంపునడకను జూచి ఇంద్రునియేనుఁ గయిన ఐరావతము ఆప్రదేశమునం దాసక్తిగలది యగునో, అట్టి పరమపవిత్రమైన బృందావనమందలి ఆకల్పవృక్షములతోఁటను దేవదేవుఁడైన ఆబాలకృష్ణుని భజించుచున్నాను.

శ్లో॥ అరుణాధరామృతవిశేషితస్మితం, వరుణాలయానుగతవర్ణవైభవమ్।
తరుణారవిన్దదళదీర్ఘలోచనం, కరుణామయం కమపి బాలమాశ్రయే॥

టీ. అరుణా...స్మితం-అరుణ = ఎఱ్ఱనైన, అధర + అమృత = అమృతమువలె అత్యంతభోగ్యమగుఅధరముచేత, విశేషిత=అతిశయించినదిగాఁ జేయఁబడిన, స్మితం= చిఱునవ్వుగలవాఁడును-చిఱునవ్వే మిక్కిలిసొగసైనది మఱి యది అమృతప్రాయమై యెఱ్ఱనై యుండు పెదవియందు నెలకొనుటచే దానిమనోజ్ఞత మిక్కిలియు నతిశయించినదనుట, వరుణ...వైభవం-వరుణాలయ = సముద్రముచేత, అనుగత=అనుకరింపఁబడిన, వర్ణ=దేహచ్ఛాయయొక్క, వైభవమ్=విభవము గలవాఁడును-సముద్రమువలె నల్లనైనదేహకాంత్యతిశయముగలవాఁడనుట, తరుణ...లోచనమ్-తరుణ = లేఁతయైన, అరవిందదళ=తామరరేకులవంటి, లోచనమ్=కన్నులుగలవాఁడును, కరుణామయం= కరుణాస్వరూపుఁడును, 'కరుణాలయమ్' అనుపాఠమునఁ గరుణకు స్థానమైనవాఁడని యర్థము, కమపి=వాచామగోచరుఁడును. అగు, బాలం=బాలకృష్ణుని, ఆశ్రయే=ఆశ్రయించుచున్నాను.

ఉ. చల్లనివాని నవ్వు వెదఁజల్లెడువాని దయారసంబు జొ
బ్బిల్లెడువానిఁ గెంపుజిగిపెంపు సెలంగెడుమోవివాని సం
ఫుల్లసరోజనేత్రములఁ జొల్చినవానిఁ బయోధి వీచికా
వేల్లితనీలనీరదనవీనతనుద్యుతివానిఁ గాంచెదన్. 17

తా. ఎఱ్ఱనై యమృతమువలె అతిభోగ్యమైయుండు అధరమునందుఁ దొలఁగుటచే మఱింతసొగసు గులుకుచున్న చిఱునవ్వు గలవాఁడును, సముద్రము ననుకరించు నల్లనికాంతి పెంపుగలవాఁడును, లేఁదామరరేకులవంటికన్నులు గలవాఁడును, గరుణాస్వరూపుఁడును, వాచామగోచరుఁడును అగుబాలుని శ్రీకృష్ణుని ఆశ్రయించుచున్నాను.

శ్లో॥ లావణ్యవీచీరచితాఙ్గభూషాం, భూషాపదారోపితపుణ్యబర్హామ్।
కారుణ్యధారాళకటాక్షమాలాం, బాలాం భజే వల్లవవంశలక్ష్మీమ్॥

టీ. లావణ్య...భూషామ్-లావణ్య = ముత్తెపుతేటవంటికాంతివిశేషముయొక్క, వీచీ=అలలచేత-అలలవలె పయిపయి నిగుడుచున్న యాకాంతిప్రసారముచేత ననుట, రచిత = రచింపఁబడిన, అంగ=అవయవములయొక్క, భూషాం=భూషణము గలదియు, లావణ్యమే అవయవముల కొకభూషణముగా నున్నది యనుట, భూషా...బర్హామ్-భూషా=భూషణముయొక్క, పద=స్థానమును, ఆరోపిత=ఎక్కింపఁబడిన, భూషణ స్థానీయమైన-భూషణముగాఁ జేయఁబడిన యనుట, పుణ్యా=పవిత్రమయిన, బర్హామ్-=నెమిలిపురిగలదియు-నెమిలిపురిని భూషణముగా సిగయందుఁ జెరువుకొన్నదియనుట, కారుణ్య...మాలామ్-కారుణ్య=కరుణారసముచేత, ధారాళ=ఎడతెగక నిగుడుచున్న కటాక్ష=కడగంటిచూపులయొక్క, మాలాం=సమూహముగలదియు-కరుణచేఁగడగంటి చూడ్కులను మిక్కిలి నిగుడ్చుచున్నదియనుట, 'కారుణ్యధారాచ్ఛకటాక్ష' అను పాఠమున, కారుణ్య=కరుణయొక్క-ధారా=ఎడతెగకనిగుడుటచేత, అచ్ఛ = నిర్మలమైన-సుప్రసన్నమైన, కటాక్షమాలగలది-లేక, కారుణ్యధారారూపమైనకటాక్షమాల గలదియని యర్థము. బాలాం=లేఁతప్రాయముఁగలదియు, అగు, వల్లవ...లక్ష్మీమ్-వల్లవ=గొల్లవారలయొక్క, వంశ=కులముయొక్క, లక్ష్మీం=లక్ష్మిని-సకలసంపత్కారణమైన దానిని-చిన్నికృష్ణుని అనుట, భజే=భజించుచున్నాను.

చ. మెఱుఁగుల కేమి చక్కఁదనమే పదిలక్షలు సేయు మాయురే
సురుచిరపించదామకమె సొమ్ములలో వెల లేనిసొమ్ముగుం
బరమకృపాకటాక్షసుమసమాలిక బావురె నందమందిరేం
దిరమురిపెంపుశైశవము సీటులు మీఱె నయారె కంటిరే. 18

తా. ముత్తెపుతేటవలె తలతలలాడుచు నిగుడుచున్న కాంతియే అవయవముల కెల్ల అలంకారమయి వెలుఁగఁగా, పవిత్రమయిన నెమలిపురిని సొమ్ముగా సిగయందు చెరువుకొని, కరుణచే మిక్కిలి కడగంటిచూడ్కులు పయిపయి నివ్వటిలఁగా గోపకులమునకు సకలసౌభాగ్యసంపదలు గూర్చులక్ష్మివలె వెలుఁగుచున్న బాలుం డగు శ్రీకృష్ణుని భజించుచున్నాను.

శ్లో॥ మధురైకరసం వపుర్విభో, ర్మధురావీథిచరం భజామహే।
నగరీమృగశాబలోచనా, నయనేన్దీవరవర్ష వర్షితమ్॥ 19

టీ. మధురా...చరం-మధురా = మధురాపట్టణముయొక్క, వీథి=వీధులందు, చరం=సంచరించుచున్నదియు, మధుర—రసం-మధుర = సౌందర్యముయొక్క, ఏక

సుందరమైన, ఏక=ముఖ్యమైన, రసం=రసమైనదియు-సౌందర్యైక సారమైనదియనుట, నగరీ.. వర్షితమ్-నగరీ=మధురయందలి, మృగశాబ=లేడిపిల్లయొక్క, లోచనా=కన్నుల వంటి కన్నులుగల స్త్రీలయొక్క, నయన=నేత్రము లనెడి, ఇన్దీవర=నల్లగలువలయొక్క, వర్ష=వర్షముచేత, వర్షితం=మిక్కిలి తడుపఁబడుచున్నదియు, నల్లఁగ్రుడ్డు కాంతితోఁ గూడిన చూడ్కులు అవ్వారిగా నిగుడ్పఁగా అవి నల్లగలువల చాలు కృష్ణుని మేనిపయిఁ గురిసినట్లు ఉండిన వనుట, ఇట్టిదైన, విభోః=శ్రీకృష్ణునియొక్క, వపుః=శరీరమును, భజామహే=సేవించుచున్నాము-ఇట వపువు 'మధురైకరస' మైనది గావున స్త్రీలచూడ్కులను ఆకర్షించునది; మధురావీథి చరమైనది గావున మధురానగరి మృగశాబవిలోచనలందఱియొక్క చూడ్కులను ఆకర్షించునది. కనుక నగరిలో నున్న పెక్కు స్త్రీలు అతి కామవశమున అవ్వారిగాఁ జూడ్కులు నిగుడ్చుటచేత ఆ చూడ్కుల ప్రసార బాహుళ్యమును వర్షముగా రూపించినాఁడు. మఱియు నా చూడ్కులు నల్లగలువలుగా రూపించుటచే యౌవనవతులకే యట్టి నల్లని చూడ్కులు గలవు గాన ఆ స్త్రీల యౌవనము, వారి మోహాతిశయమునవను దన్మూలమైన దృష్టివర్షమునకు నుపయుక్తమగుచున్నది. మఱియు విలోచనములు 'మృగశాబ'ముల విలోచనములవంటి వనుటచే వాని వలె చూడ్కులవు బెదవులును గలిగియుండు ననియుఁ దెలియునది.

మ. అమరన్ సాహిణు లెల్ల నుల్లసిలఁగా స్ నారట్టకంఖాణముం
దుమికించం దిశలందుఁ ద్రెళ్లుచుకుమా స్ ధుర్యైక కాంతుల్ ఘన
భ్రమ సేయన్ మధురావధూచపల నే స్ త్రవ్రాతనీలాబ్జవ
ర్షముపైఁ గ్రమ్మఁగఁ జిత్రమై చెలఁగు కృ స్ ష్ణస్వామినీక్షించెదన్.

తా. నిలువెల్లను ఒక చక్కఁదనంపు సారమే యగుచు, మధురాపట్టణపు వీథులను దిరుగుచుండు నా కృష్ణుని నెమ్మేనుఁ జూచి యా పురములోని స్త్రీలందఱును మరులుగొని నల్లగలువల చాలువలె నునుఁజూడ్కులు దానిపయి అవ్వారిగా వాన గురిసినట్లు నిగుడ్తురు. అట్టి కృష్ణుని మేనును భజించుచున్నాము.

శ్లో॥ పర్యాకులేన నయనాన్తవిజృమ్భితేన
వక్త్రేణ కోమలదరస్మితవిభ్రమేణ ।
మన్ద్రేణ మఞ్జులతరేణ చ జల్పితేన
నన్దస్య హాన్త తనయో హృదయం ధునోతి ॥ 20

టీ. పర్యాకులేన=చంచలమయిన, నయ... తేన-నయన+అంత=కడగన్నులయొక్క, విజృమ్భితేన=నిక్కుచేతను-అతిశయముచేతను-చలించుచున్న కడగన్నుల పెంపు

పొంపున ననుట, కోమల...విభ్రమేణ-కోమల=సుకుమారమైన, దరస్మిత=చిఱునగవు యొక్క, విభ్రమేణ=విలాసము గలిగిన, వక్త్రేణ=మొగముచేతను, మన్ద్రేణ=గంభీరమును, మంజులతరేణ=మిక్కిలి మనోజ్ఞమును, అగు, జల్పితేనచ=మాటచేతను, నన్దస్య=నందుని యొక్క, తనయే=కుమారుడైన కృష్ణునియందు, హృదయం=హృదయము, ధునోతి= ఉద్యుక్తమగుచున్నది, 'దినోతి' అను పాఠమున, ప్రేమముగలది అగుచున్నది. హన్త= సంతోషము-లేక సంతాపార్థకము. కడగన్నుల బెళుకు, మొగమందలి చిఱునవ్వు మెలుపు, గంభీరమయిన తియ్యని పలుకును జూచి కృష్ణుడు హృదయమును గలచుచున్నాడు. అయ్యో! వాని నెప్పుడు చూడగలుగునో అని హంతశబ్దమునకు సంతాపమును అర్థము.

మ. బెళుకుంగన్నులు మోముచుట్టుఁ దిరుగన్ బింబాధరోష్ఠంబుపైఁ
దళుకున్వెన్నెల లీను లేనగవు వింతల్ మాధురిం జెందఁగం
దళితాలాపసుధారుచుల్ చెవికి నానందంబు గా నందుమం
దల నానందముఁ జిందు బాలుని యశోదానందనుం గాంచెదన్.

తా. చంచలము అయిన కడగంటి చూపులును, లేత చిఱునగవు మెలుపు నెమ్మొగమును, వీనులవిందైగంభీరమై వినబడు మాటయుఁ, జూపి నందకుమారుఁడగు కృష్ణుఁడు మా హృదయమునకు వ్యామోహముపెట్టి కలఁచుచున్నాఁడు.

శ్లో॥ కన్దర్పకణ్డూలకటాక్షబన్ధీ, రిన్దీవరాక్షీ రభిలాషమాణాన్ ।
మన్దస్మితాధారముఖారవిన్దా, న్వన్దామహే వల్లవధూర్తపాదాన్॥

టీ. కన్దర్ప...బన్ధీః-కన్దర్ప=మన్మథునిచేత, కణ్డూల=తీఁటగలవియైన-ఇట తీఁట యనుటచే దుస్సహమైన యుద్రేకము గ్రాహ్యముగాన, దుస్సహమైన మన్మథవికారము యొక్క ఉద్రేకముగల, కటాక్ష=కడగంటిచూపులకు, బన్దీః=బందాలుఅయిన, కృష్ణుడు కామాతిరేకముచే నిగుడ్చు చూడ్కులకు మిక్కిలి వశమై ప్రవర్తించువారైన యనుట, ఇన్దీవర+అక్షీః=(నల్లగలువలవంటి కన్నులుగల) స్త్రీలను, అభిలాషమాణాన్=అభిల షించుచున్నవారును-కామప్రయుక్తములైన చూడ్కులు నిగిడ్చి వారి మనస్సులను మిక్కిలి వశముచేసికొని వారితో రమింపఁగోరువారును-ఇట బహువచనము పూజ్యవాచ కము, మన్ద...విన్దాన్-మందస్మిత=చిఱునవ్వునకు, ఆధార=పట్టుఅయిన, ముఖ+అర విన్దాన్=మోముఁదామర గలవారును, అగు, వల్లవధూర్తపాదాన్=గొల్లవిటకాఁడు గారిని-ఇట పాదశబ్దము పూజ్యవాచకము గనుక-గొల్లవిటకాండ్రమేటి యగు కృష్ణుని, పూజ్యవాచకమైన పాదశబ్దము బహువచనము గావున తక్కిన విశేషణములు నుబహు వచనములైనవని తెలియునది. వన్దామహే=నమస్కరించుచున్నాము. గొల్లజాతి యందుఁ బుట్టిన విటకాఁడు గావుననే ఇందీవరాక్షులను మరులుకొన్న చూడ్కుల చేతను చిఱునవ్వు గలుగు మొగముచేతను వశపఱచుకొని పొందఁగోరుచున్నాఁడని యర్థము.

మ. సరసాపాంగతరంగరంగితవిలాసప్రౌఢిచే వ్యగ్రమై
మరుబారిన్ వలిగుబ్బ లుబ్బి పులకింపంగ్రొమ్ముడుల్ వీడఁ ద
త్తఱపున్మేల్ సివమెత్తి మత్తిలినకాంతాపాళిలాలించుచి
త్తరపున్నవ్వుమొగంబునుం గలుగుధూర్తస్వామిఁ గీర్తించెదన్.

తా. మరువికారము ముంచుకొన్న తనసొగసుంజూడ్కులను మిక్కిలియు లోనైనకలువకంటులను కౌఁగిలించుచును, జిఱునవ్వు దొలఁకుమోముఁ దామరతోడ బెడఁగు మూపు గొల్ల విటకాఁడగుకృష్ణునికి నమస్కరించుచున్నాము.

శ్లో॥ లీలాటోపకటాక్షనిర్భరపరిష్వఙ్గప్రసఙ్గాధిక
ప్రీతే గీతివిభఙ్గసఙ్గరలసద్వేణుప్రణాదామృతే।
రాధాలోచనలాలితస్య లలితస్మేరే మురారే ర్ముదా
మాధుర్యైకరసే ముఖేన్దుకమలే మగ్నం మదీయం మనః॥ 23

టీ. రాధా...లాలితస్య-రాధా=రాధయొక్క, లోచన=కన్నులచేత, లాలితస్య = బుజ్జగింపఁబడినవాఁడైన - రాధ బుజ్జగింపుచూడ్కులతోఁ జూచుచున్న, మురారేః=కృష్ణునియొక్క, లీలా...ప్రీతే-లీలా = విలాసముయొక్క, ఆటోప=విజృంభణముగల, కటాక్ష=కడగంటిచూపులయొక్కయు, నిర్భర=నిబ్బరమైన, పరిష్వఙ్గ=కౌఁగిలియొక్కయు, ప్రసఙ్గ = ప్రసక్తిచేత-పొసఁగుపాటుచేతననుట, అధిక=మిక్కిలియు, ప్రీతే=సంతోషించినదియు-'రాధాలోచనలాలితస్య' అని మీఁదఁ జెప్పుటనుబట్టి యిట కటాక్షములును బరిష్వంగమును రాధవిగా గ్రహించునది. కాన రాధ మిక్కిలి వలువ దొలువునట్లు నిగిడ్చిన కడగంటిచూడ్కులవలను, మిక్కిలి గట్టిగాఁ జేసినకౌఁగిలింతవలను మఱిమఱి యుబ్బునొందిన దనుట; గీతి...దామృతే-గీతి=గానవిశేషములయొక్క, విభఙ్గ=విఱుపులయొక్క-లేకవిభాగములయొక్క, సఙ్గర=జగడముచేత-ఒకస్వరమును ఊఁదుచు దానిని విఱుపునొందించి మఱియొకస్వరమునూఁదఁగా నిట్లు విఱుపులుపొంది పరస్పరభిన్నములైన పెక్కుస్వరములు ఒండొంటితోఁ దాఁకుట చేత, లసత్=ప్రకాశించుచున్న, వేణు=పిల్లంగ్రోవియొక్క, ప్రణాద=ధ్వనిరూపమైన, అమృతే=అమృతము గలదియు వివిధము లైనస్వరములు ఒండొంటితోఁ గలయుటచే అత్యంతమనోజ్ఞమై కావుననే అమృతమువలె అతిభోగ్యమై యొప్పుచున్న వేణుధ్వని గలదియనుట; లలితస్మేరే-లలిత=సొగసైన, స్మేరే=చిఱునవ్వుగలదియు-రాధను జూచి చిఱునవ్వు నవ్వునదియనుట; మాధు...రసే-మాధుర్య=సౌందర్యమనెడి, ఏక=ముఖ్యమైన, రస=రసముగలదియు - కేవలసౌందర్యమయమైనది యనుట; ముఖేన్దుకమలే=చంద్రునివలెను దామరవలెను ఉన్నముఖమునందు, మదీయం = నాది

యగు, మనః=మనస్సు, ముదా=సంతోషముతో, మగ్నం=మునిఁగెను. ఇట్టి అత్యంత మనోహరమైన కృష్ణముఖారవిందమునుగూర్చిన చింతనమందు నామనస్సు మిక్కిలి లీనమై పారవశ్యము నొందినదనుట. రాధకనులువఁజూడ్కులవలనను బిగికౌఁగిలివలనను గలిగిన మిక్కిలి యుబ్బును, వివిధస్వరవిశేషముల సంఘర్షముచే మఱింత మనోజ్ఞమైన పిల్లఁగ్రోవిరవలియును, చిరునవ్వును, నిరతిశయసౌందర్యమును, జేరి ముఖముయొక్క మనోహరత్వమును మిక్కిలి అతిశయింపఁజేయుటచే అందు మనస్సు మగ్నమైన దన్నాఁడు.

మ. లలితాలోకతరంగసంగతము లీలామందహాసప్రభా
స్ఫురితంబుల్ మురళీరవామృతరసస్ఫూర్తంబు రాధికాలోచనో
త్పలసంభావితమాధురీగుణము నైర్భాసిల్లు శ్రీకృష్ణుని
ర్మలవక్త్రాంబురుహాకరంబున రమింపం గోరెద న్నామదిన్. 23

తా. రాధ మిక్కిలియొయ్యారపుఁజూడ్కులను బిగికౌఁగిలికిని మిక్కిలియుబ్బు చెందినదై, వివిధగానవిశేషముల మేళనమువలన మఱింత అమృతమువలె అతిభోగ్యమైన వేణుధ్వని గలిగి, సొగసైనచిఱునవ్వుతోఁగూడి, సౌందర్యమయమై, కమలమును జంద్రునిఁ బోలి, రాధ చూచునపుడు కనుపట్టుకృష్ణునిముఖమునందు నామనస్సు మగ్నమైనది.

శ్లో॥ శరణాగతవజ్రపఞ్జరే, శరణే శార్ఙ్గధరస్య వైభవే।
కృపయా ధృతగోపవిగ్రహే, కియదన్యన్మృగయామహే వయమ్॥

టీ. శరణా...జరే-శరణ+ఆగత=శరణుసొచ్చినవారికి, వజ్ర=(అభేద్యశిలావిశేషమైన) వజ్రముతోఁ జేయఁబడిన, పఞ్జరే=గూఁడు అయినదియు-పంజరము చిలుకలు మొదలగువానిని పిల్లులు మున్నగువానినుండి రక్షించురక్షకమైనది; వజ్రముతో నైనపంజరమో మిక్కిలి యభేద్యమగుటచే విశేషించి రక్షకమైనది; కనుక ఇట వజ్రపంజరమనఁగా అత్యంతరక్షకమనియర్థము; ఇట్టిదియు, కృపయా=దయచేత-పరస్వరూపము యోగులకు తప్ప తక్కినవారికి సులభముకానందున అందఱికిసులభముగా గోచరించి యుజ్జీవింపఁ జేయవలయునను కారుణ్యముచేత ననుట, ధృత...విగ్రహే-ధృత=ధరింపఁబడిన, గోప=గొల్లవానియొక్క, విగ్రహే=దేహము గలదియును-గొల్లపిల్లవాఁడై అవతరించినదియనుట, అగు, శార్ఙ్గధరస్య=విష్ణువుయొక్క, వైభవే=వైభవము-కృష్ణావతారరూపమైన పెంపుసొంపు, శరణేసతి=రక్షక మగుచుండఁగా-విష్ణుదేవుని యవతారవిభవమయిన కృష్ణుఁడు రక్షకుఁ డగుచుండఁగా ననుట, అన్యత్=ఇతరమయిన, కియత్=దేనిని, వయం=మేము, మృగయామహే=వెదకుదుము-దేనిని వెదక మనుట. ఇట శార్ఙ్గధరుని చెప్పక శార్ఙ్గధరుని వైభవమునే

శరణాగతవజ్రపంజర మని చెప్పినాఁడు. కనుక కేవలశార్ఙ్గధరునికంటె గోపవిగ్రహము దాల్చిన అతని వైభవమే-అనఁగా కృష్ణావతారరూపమైన యతనివిభవమే, మిక్కిలి రక్షకమైనదని యర్థము. మఱియు నిట ప్రకరణము కృష్ణపరము గనుక కృష్ణుని 'కృష్ణుఁ' డని చెప్పక 'శార్ఙ్గధరుని గోపవిగ్రహము దాల్చిన వైభవ' మని చెప్పుటచే శార్ఙ్గధరుని యవతారములలోను మూర్తివిశేషములలోను గోపవిగ్రహము గల కృష్ణావతారమే ఆ దేవుని వైభవమును మిక్కిలి ప్రకాశింపఁజేయునదనియు, కావుననే ఆ యవతారమును దదీయ వైభవమనియే చెప్పినాఁడనియుఁ దెలియునది. కావున విష్ణునవతారములలో నెల్ల కృష్ణావతారమే అత్యంత వైభవ ప్రకాశకమనియు అత్యంత కరుణాత్మక మనియును అత్యంత రక్షక మనియును అతిశయము తెలియునది.

ఉ. ఇవ్వల నవ్వలన్ వెదక ♩ నేటికి నన్యుల మాటిమాటికి
న్దవ్వుల నుండియైనఁ గరు ♩ ణావరుణాలయుగోపమూర్తియై
నవ్వుచు డాయ వచ్చి యద ♩ నన్ శరణాగతవజ్రపంజరుం
డవ్వనజాతనేత్రుఁ డన ♩ యంబు నయంబు సెలంగఁ బ్రోవఁగన్. 24

తా. శరణుఁ జొచ్చినవారికి వజ్రపంజరమువలె అత్యంత రక్షకుఁడై, కృపచే గొల్లవాఁడై పుట్టి, విష్ణుదేవుని వైభవమే యిట్టిరూపము నొందినదని చెప్పనొప్పు శ్రీకృష్ణుఁడు రక్షకుఁడై యుండఁగా మఱి యితరులను రక్షకులనుగా మాను వెదక నక్కఱలేదు.

శ్లో॥ జగత్త్రయైకాన్తమనోజ్ఞభూమి
చేతః వ్యజ్రసం మమ సన్నిధత్తామ్ ।
రమాసమాస్వాదితసౌకుమార్యం
రాధాస్తనాభోగరసజ్ఞ మోజః ॥ 25

టీ. జగత్ ...భూమి-జగత్రయ=ముల్లోకములకును, ఏకాంత=మిక్కిలిగా-లేక ఒక్కరూపుగానే, మనోజ్ఞ=రమణీయమైన, భూమి=స్థాన మైనదియు-ముల్లోకములును ఒక్కతీరున నెలకొనియుండు చోటైనది యనుట-ముల్లోకములకు ఆధారమైన దనుట, లేక, మనోజ్ఞ=సౌందర్యమునకు, భూమి=స్థానమైనది, ముల్లోకము లందును గల చక్కఁదనముల కెల్ల ఉనికిపట్టయినది-నిరతిశయ సుందరమైన దనుట, ఇట్టిదియు, రమా ...మార్యం-రమా=లక్ష్మీదేవిచేత, సమాస్వాదిత=మిక్కిలి యనుభవింపఁబడిన, సౌకుమార్యమ్=సుకుమారత్వము గలదియు-తన మేని సుకుమారత్వమును రుక్మిణి మిక్కిలి యనుభవించిన దనుట, రాధా...రసజ్ఞమ్-రాధా=రాధయొక్క, స్తన=కుచములయొక్క, ఆభోగ=పరిపూర్తియొక్క రసజ్ఞమ్=రసము నెఱిగినదియు-రాధగబ్బిగుబ్బల యుబ్బు పొంపును జక్కఁగా ననుభవించినది యనుట, అగు, ఓజః=తేజము-కృష్ణాఖ్యతేజస్సు,

మను=నాయొక్క, చేతసి=చిత్తమందు, అజస్రం=ఎల్లప్పుడును, సన్నిధత్తాం=సన్నిధానము చేయుఁగాత.

ఉ. నామది నామతింతు భువన । త్రయమోహనరూపధేయు రా
ధామది రేక్షణాపరిణ । త స్తనభారవిధేయు భోజక
న్యామహనీయవిభ్రమర । సాస్పదవిగ్రహసౌకుమార్యలీ
లామధురాధరస్మితక । లాపుఁ గళాగురువర్యు నెప్పుడున్. 25

తా. ముల్లోకములను ముల్లోకములందలి సౌందర్యములను ఈనికిపట్టయి, రుక్మిణీదేవి చక్కఁగా ననుభవించిన సౌకుమార్యము గలిగి, రాధాదేవి యుబ్బు చన్నుల వసయంతయు నెఱిఁగిన శ్రీకృష్ణాఖ్యతేజము నాహృదయమందు ఎల్లప్పుడు సన్నిహితమై యుండుఁగాక.

శ్లో॥ వయ మేతే విశ్వసిమః, కరుణాకరమూర్తికింవద న్త్వఙ్గే
అపిచ విభో తవ లలితే, చపలతరా మతి రియం బాల్యే॥ 26

టీ. హేవిభో=వ్యాపకుఁడవైన ఓకృష్ణా, కరుణాం...త్వఙ్గే,-కరుణా+ఆకర=కరుణకు గనియైన, మూర్తి=ఆకారముగలవాఁడు, అనెడి, కింవదన్తి=లోకప్రవాదరూపమైన అఙ్గే=శరీరమునందు-కరుణాకరమూర్తి అని జను లాడికొను కీర్తిరూపమైన నీశరీరమునందు, ఏతే=ఈ, వయం=మేము, విశ్వసిమః=నమ్మియున్నాఁము-కరుణాకరుఁడను నీకీర్తికాయమునందు మాకు నమ్మికగలదు అనుట, అపిచ=మఱియును, తవ=నీయొక్క, లలితే=సొగసైన, బాల్యే-బాల్యమందు, ఇయఁ=ఈ, మతిః=బుద్ధి, చపలతరా=మఱింత చపలముగా నున్నది కరుణాకరమూర్తి అనెడి నీకీర్తి శరీరమునందు మాకు నమ్మిక యుండుటచే దానియందు మాబుద్ధికూడ చపలముగానే యున్నది గాని, లలితమైన నీ బాల్యశరీరమునందు మఱింత చపలముగా నున్నది యని యర్థము. నీవు పెద్దగా పెరిఁగి అద్భుతకృత్యములు చేసి ఆశ్రితులను ఎందఱినోరక్షించి కరుణాకరమూర్తి అని కీర్తి నొందినను నొందుము.నాకుఁ బనిలేదు. నీ బాల్యశరీరమునందే నాకు మక్కువ యని యాశయము.

చ. అనిశము లోక మెల్లఁ గరు । ణాకరమూర్తి వటంచుఁ దెల్పఁగా
జననపరంపరల్ గడచి । సౌఖ్యము నొందుదు నంచుఁ గృష్ణ నా
మనమున నమ్మినాఁడ నను । మాత్రము కాదు భవత్కిశోరతా
జనితకథాసుధారసము । సారెకుఁ గ్రోలఁగఁ దత్తఱించెదన్. 26

తా. కృష్ణా! కరుణాకరమూర్తి వనెడి నీకీర్తి శరీరమునందు మాకు నమ్మికగలదు గాన దానియందును మాబుద్ధి చపలముగానున్నది. అయినను మిక్కిలి చెలువైన నీ బాల్యశరీరమునందే మాబుద్ధి మఱింత చపలముగా నున్నది.

శ్లో॥ వత్సపాలచరః కోఽపి వత్స శ్శ్రీవత్సలాఞ్ఛనః।
ఉత్సవాయ కదా భావీ త్యుత్సుకే మమలోచనే॥ 27

టీ. వత్స... చరః—వత్స=దూడలను, పాల = కాచునట్టి గొల్లపిల్లవాండ్రలో పల, చరః=తిరుగుచున్నవాఁడును.-తాను పసివాఁడుగనుక దూడలను గాచుపసిగొల్ల పిల్లవాండ్రతోఁగూడి తిరుగుచున్నాఁడనుట, 'వత్సవాటచరః' అను పాఠమున, వత్స వాట=దూడలను కట్టియున్నప్రదేశమునందు, చరః = తిరుగుచున్నవాఁ డనుట - పసి వాఁడుగనుక ఆవులనడుమ తలఁగక దూడలనడుమ తిరుగుచున్నవాఁడనుట, శ్రీవత్స లాఞ్ఛనః-శ్రీవత్స = శ్రీవత్సమనెడి, లాఞ్ఛనః=గుఱుతు-అనఁగా పుట్టుమచ్చ గలవాఁ డును, కోపి=ఇట్టిటివాఁడని చెప్పరానివాఁడును, అగు, వత్సః = బాలుఁడు - చిన్నికృ ష్ణుఁడు, ఉత్సవాయ = వేడుకకొఱకు, వేడ్క యగునట్లుగా ననుట, కదా=ఎప్పుడు, భావి=అగునో, ఇతి=అని, మమ=నాయొక్క, లోచనే = నేత్రములురెండును, ఉత్సు కే=తమకపడుచున్నవి. శ్రీకృష్ణునిబాల్యమందే నావు ప్రీత్యతిశయము గనుక దానిని చూచుటకు నాకన్నులు ఉవ్విళ్లూరుచున్న వని భావము.

శా. శ్రీవత్సాంకితవక్షుఁడుల్లసితనీర రేజాక్షుఁ డంభోధిక
న్యావక్షోరుహకుంభికుంభయుగళాన్యక్షుండు బ్రహ్మాదిసా
ఖ్యావిర్భావవిధానదక్షుఁ డగువాఁ డా నందపుత్రాకృతిన్
గోవత్సంబుల మేఁపఁ గన్గొనుచుఁ డ జక్షుః ప్రీతి వాటించెదన్. 27

తా. గొల్లపిల్ల వాండ్రతోఁ గూడి దూడలను మేపుచు, శ్రీవత్సమను పుట్టుమచ్చ యొప్పు, మెప్పుగులుబాలకృష్ణుని ఎప్పుడు గాంతుమో యని నారెండుకన్నులు తహతహపడుచున్నవి.

శ్లో॥ మధురిమభరితే మనోభిరామే, మృదులతరస్మితముద్రితాననేన్దౌ।
త్రిభువననయనైకలోభనీయే, మహసివయం వ్రజభాజి లాలసాఽన్మః॥

టీ. మధురిమభరితే-మధురిమ = సౌందర్యముచేత, భరితే = నిండినది-పరిపూర్ణ సౌందర్యముగలదియనుట, మనః + అభిరామే = మనస్సునకు ఇంపయినదియు; మృదుల ... న్దౌ-మృదులతర = మిక్కిలిమెత్తనైన, స్మిత=చిఱునగవుచేత, ముద్రిత=గుఱుతిడఁ బడిన-'ముద్రిత' అనుటచే ముద్రవలె వీడనిఅడియాలమై ఎన్నఁడునుచిఱునగవుతోలాని యున్న అనుట, ఆనన + ఇన్దు-ముఖచంద్రుఁడుగలదియు-చంద్రునివంటి ముఖముగలదియ నుట, త్రిభువ ..నీయే-త్రిభువన=ముల్లోకములవారియొక్క, నయన = కన్నులకు, ఏక= ముఖ్యముగా-అద్వితీయమైన, లోభనీయే=పేరాసపడఁదగినదియు-ముల్లోకములయందు ఒకొక్కర్కిని మిక్కిలి పేరాసతోఁ జూడఁదగినది అదితప్ప మఱిరెండవదిలేదనుట,

ఇట్టిదియు, వ్రజభాజి-వ్రజ=వ్రేపల్లెను, భాజి=పొందినదియు, అగు,మహసి = శ్రీకృష్ణాఖ్యతేజమునందు, వయం = మేము, లాలసాః = ఆసక్తులము, స్మః = అగుచున్నారము.

మ. రమణీయస్మితమాధురీకలితముగ్ధ్రాముద్రితం బై సుధా
సమసల్లాపకలాప మై త్రిజగతీసమ్మోహనాకార మై
కమలానేత్రమనోభిరామరుచి యై కన్పట్టువక్త్రేందుబిం
బమునన్ మీఱువెలుంగుగొప్పగృహసౌభాగ్యంబు నేఁగోరెదన్.

తా. మిక్కిలియుసౌందర్యముగలిగి, మనస్సునకింపై, లేఁతనవ్వు మొలకలు గుదురుకొన్న మోముచందురునితో నొప్పి, ముల్లోకములవారికిని మిక్కిలియాసతోఁ జూడందగినంతమోహనమై, సౌలభ్యవశమున గొల్లపల్లెయందు నెలకొనియున్న తేజస్స్వరూపుఁ డగు శ్రీకృష్ణునియందు మాకు మిక్కిలి యాసక్తి గలిగినది.

శ్లో॥ ముఖారవిన్దే మకరన్దబిన్దు, నిష్యన్దలీలాముర ళీనినాదే।
వ్రజాఙ్గనాపాఙ్గతరఙ్గభృఙ్గ, సఙ్గ్రామభూమౌ తవ లాలసాః స్మః॥

టీ. మకరన్ద... నినాదే-మకరన్ద=పూఁదేనెయొక్క, బిన్దు = బొట్లయొక్క, నిష్యన్ద=స్రవించుటగల పూఁదేనెబొట్లు కాఱునట్లు తీపారుచున్నయనుట; లీలా = విలాసార్థమైన, మురళీ=పిల్లఁగ్రోవియొక్క, నినాదే=ధ్వనిగలదియు - విలాసార్థముగాధరించిన పిల్లఁగ్రోవినుండి పూఁదేనెబొట్లు దొరఁగినట్లు నిగుడుచున్నధ్వనిగలదియనుట, ఇట్టిదియు, వ్రజా... భూమౌ-వ్రజ=వ్రేపల్లెయందలి, అఙ్గనా = స్త్రీలయొక్క - గోపికలయొక్క, అపాఙ్గ=కడగన్నులయొక్క - కడగంటిచూడ్కులయొక్క-అనుట,తరఙ్గ = అలలు అనెడు-అలలవలె పైపయి నిగుడుచున్న కడగంటిచూడ్కులు అనెడి, భృఙ్గ=తుమ్మెదలయొక్క, సఙ్గ్రామ=యుద్ధపు, భూమౌ = భూమియైనదియు-గొల్లచెలువలు ఒకరినొకరు మించి చూడ్కులు కృష్ణునిమొగమునందు దొందడిగా నిగుడ్పఁగా ఆచూడ్కులు ఒండొంటితో బెరసి జగడమాడునట్లుండెననుట-గోపికలచూడ్కులచే క్రిక్కిఱిసియున్నదనుట-దీనిచే గోపికల కామాతిశయమును, దన్మూలమున కృష్ణముఖము యొక్క సౌందర్యాతిరేకమును వ్యంజితములు; ఇట్టిదైన, తవ = నీయొక్క, ముఖారవిన్దే=మోముఁదామరయందు, లాలసాః=ఆసక్తులము, స్మః=అగుచున్నాము.

మ. మురళీగానమరందబిందుకృతసమ్మోదభ్రమద్వల్లవీ
సరసాపాంగతరంగభృంగపటలీసంగ్రామరంగస్థలీ
సరణిం జెల్వగునీముఖాంబుజమువం జూచన్మనఃపంకజా
కరమధ్యంబునఁ బాదుకొల్పుటకు నాకాంక్షింతు నెల్లప్పుడున్. 39

తా. పూఁదేనెబొట్లు కాఱునట్లు మీపార నిగుడుచున్న పిల్లనగ్రోవి రవళి గలిగి, గోపస్త్రీలు ప్రేమాతిశయమున అవ్వారిగా నిగుడ్చుచున్న తుమ్మెదలవంటి నల్లని చూడ్కులు గ్రిక్కిఱిసి గ్రాలఁగా, పెంపారుచున్న నీమోముఁదామరయందు మేము ఆసక్తుల మగుచున్నాము.

అవ:—గోపికలతోడి నృత్యమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ *ఆతామ్రాయతలోచనాంశులహరీలీలాసుధాప్యాయితైః
గీతామ్రేడితదివ్యకేళిభరితైః స్ఫీతం వ్రజస్త్రీజనైః।
స్వేదామ్భఃకణభూషితేన కిమపి స్మేరేణ వక్త్రేన్దునా
పాదామ్భోజమృదుప్రచారసుభగం పశ్యామి దృశ్యం మహః॥30

టీ. ఆతామ్ర...యితైః-ఆతామ్ర=కొంచెముఎఱ్ఱనివియు, ఆయత = నిడుదలైనవియు, అగు, లోచన=నేత్రములయొక్క, అంశు=కిరణములయొక్క, లహరీ=ప్రవాహముయొక్క, లీలా=విలాసమనెడి, సుధా=అమృతముచేత, ఆప్యాయితైః=క్రొవ్వినవియు-అమృతము మిక్కుటముగాఁ గలవియనుట-లోచనకాంతులవిలాసప్రసారములు సుధవలె అత్యంతభోగ్యములును అతిబహుళములునుగానుండుననిభావము, గీతా...భరితైః-గీత=గానముచేత, ఆమ్రేడిత=రెండింతలుగాఁ జేయఁబడినవియు, దివ్య = రమణీయములైనవియు, అగు, కేళీ=క్రీడలచేత-నర్తనవిశేషములచేత, భరితైః = నిండినవియును-గానవశమున నర్తనాదిక్రీడావిశేషములు మఱియు నధికమయ్యెననుట, ఇట్టివి అగు, వ్రజస్త్రీజనైః=గోపికాజనములచేత, స్ఫీతం = అతిశయించినదియు, పాదా...సుభగమ్-పాదాంభోజ=అడుగుఁదమ్ములయొక్క, మృదు=మెత్తని, ప్రచార=నడకచేత, సుభగం= మనోజ్ఞమైనదియు, స్వేదా...షితేన-స్వేద+అమ్భః = చెమటనీటియొక్క, కణ=బొట్లచేత, భూషితేన = అలంకరింపఁబడినదియు, స్మేరేణ = చిఱునవ్వుగలదియు, అగు, వక్త్ర+ఇన్దునా=ముఖచంద్రునితోడఁగూడినదియు, దృశ్యం=సౌలభ్యవశమునఁ గనఁదగినదియు, కిమపి=ఇట్టిదట్టిదనరానిదియు, అగు, మహః=కృష్ణాఖ్యతేజమును, పశ్యామి= చూచుచున్నాను.

మ. మురిపెంపుంజిఱునవ్వుఁగ్రొంజెమటసొంపుం బొంపునెమ్మోముపై
నరసాలోకసుధాతరంగములు మింపచన్ వేణుగానధ్వను
ల్దఱి జైరఁజిలఁ జొక్కి గోపికలు గొబ్బన్ నృత్యలీలాయత
స్ఫురణన్ మెల్లన సంచరించుహరి నంభోజాక్షు నీక్షించెదన్. 30

*ఈశ్లోకమునకు 'గోపీనాం పాణిపద్మాని గృహీత్వా సహనృత్యతః । ధ్యాయేల్లక్షం జపం చైవ కన్యకాముద్వహేచ్ఛుభామ్' అని శ్రీగోపాలకృష్ణమంత్రరాజధ్యానముగా గోపాలకల్పకమున నున్నది.

తా. ఎట్టిదైన విటివికన్నులమెఱుఁగులు అమృతమువలె అత్యంతభోగ్యముగా విలాసముతో వెల్లిగొలుపుచు, గీతవశమున రమణీయములైన నర్తనాదిక్రీడలు ఇను డింపఁగా నొప్పుచున్న గోపికాసమూహములతోడ మెల్లగా నడుగుఁదమ్ములు కొలుకులుగులుక నిడుచు, నృత్యవశమున ఘేమటబొట్లు నీటుగూప చిఱునవ్వులోలఁ కొడుచందురునివంటి నెమ్మొగముతో, కన్నులఁ జూడ నళక్యమై, యిట్టిదట్టిదని చెప్పనలవికానిదై యొప్పుకృష్ణాఖ్యతేజమును జూచుచున్నాను.

శ్లో॥ *పాణౌ వేణుః ప్రకృతిసుకుమారాకృతౌ బాల్యలక్ష్మీః
పార్శ్వే బాలాః ప్రణయసరసాలోకితాపాఙ్గలీలాః।
మౌళౌ బర్హం మధురవదనామ్భోరుహే మౌగ్ధ్యముద్రే
త్యార్ద్రాకారం కిమపి కితవం జ్యోతి రన్వేషయామః॥ 31

టీ. పాణౌ=హస్తమునందు, వేణుః = పిల్లఁగ్రోవియు, ప్రకృ...కృతౌ-ప్రకృతి=స్వభావముచేత, సుకుమార=కోమలమైన, ఆకృతౌ=ఆకారమునందు, బాల్యలక్ష్మీః =బాల్యముయొక్క సంపదయు-పసితనపుపెంపుసొం పనుట-మిక్కిలి పెంపుసొంపారు చున్న పసితనమని భావము, పార్శ్వే=ప్రక్కను, ప్రణయ...లీలాః-ప్రణయ = ప్రేమ చేత, సరస=రసయుక్తములైన, ఆలోకిత=చూపులుగల, అపాఙ్గ=కడగన్నులయొక్క, లీలాః=విలాసములు గలవారగు-ప్రేమచేత మనోహరములైన చూడ్కులు నిగుడ్చుట వలన కడగన్నులవిలాసములు ప్రకటించుచున్నవారనుట - కడగన్నులు తులుకుదొలఁక ప్రేమరసమొలుకు సొగసుంజూడ్కులు నిగుడ్చుచున్నవారని యర్థము, ఇట్టివారైన, బాలాః=బాలురును, మౌళౌ=సిగయందు, బర్హమ్ = నెమిలిపురియు మధుర...మ్భోరుహే-మధుర = మనోజ్ఞమైన, వదన+అమ్భోరుహే = మోముఁదామరయందు, మౌగ్ధ్యముద్రా-మౌగ్ధ్య=సౌందర్యముయొక్క - లేక - బేలతనముయొక్క, ముద్రా = అచ్చును, అచ్చు పడినట్లున్నసౌందర్య మనుట, ఇతి = ఇట్లు, ఆర్ద్రాకారం-ఆర్ద్ర = మనోజ్ఞమైన, ఆకారం=ఆకారముగలదియు, కితవం = ధూర్తమైనదియు, లేక కృత్రిమమైనదియు-కృత్రిమమైనబాల్యాదులు గలదియనుట, కిమపి = అనిర్వాచ్యమైనదియు, అగు, జ్యోతిః=శ్రీకృష్ణాఖ్యతేజమును, అన్వేషయామః = వెదకుచున్నాము. చేత పిల్లఁగ్రోవి, దేహమున బాల్యంపుసొంపు, చుట్టునుబాలురు, తలను నెమిలిపురి, మొగమున చక్కఁదనపుటచ్చు అనునివి గలిగియుండుటచే ఆకారము ఆర్ద్రమైన దన్నాఁడు.

---

*ఈశ్లోకమునర్థము 'హర్తనం నవనీతాదిచౌర్యేణ వ్రజయోషితామ్। గోపబాలైర్వృతం కృష్ణం ధ్యాయే న్మన్త్రి మిమం జపేత్' అని శ్రీగోపాలకృష్ణైకాదశాక్షరీమంత్రధ్యానముగా సనత్కుమారసంహితయందుఁ జెప్పంబడియున్నది.

మ. సరసాపాంగవినోదవాక్యములు మించంగా బాలకుల్ గొల్వఁగా
మురళిం గేల నమర్చి పింఛమకుటంబుం దాల్చి మోము చెల్వంబు సుం
దర వేషంబును బాల్యకాయము దయార్ద్రస్వాంతముం గల్గు చి
త్తరపుం ధూర్తశిఖామణిం వెదకి హృత్పద్మంబునం నిల్పెదన్.

తా. చేతను పిల్లఁగ్రోవియు, స్వభావముచేత నే సుకుమారమైన శరీరమునందు బాల్యంపుసొంపును, ప్రక్కల ప్రేమచే సరసంపుమాటలు నిగుడ్చు కడగంటివిలాసములుగల బాలురను, తలను నెమలిపురియు, ముద్దుమోముఁదామరయందు చక్కందనపు అచ్చును, గలిగియుండుటచే ఒక చిత్రపాలుపు గులుకు ఆకారము కలదై, దుడుకులు గలదై, ఇట్టిదట్టిదనరాని శ్రీకృష్ణాఖ్యతేజమును వెదకుచున్నారము.

అవ. ఇట్లు వెదకినట్లు పూర్వశ్లోకమునఁ జెప్పి వనదేవతలను గూడ వెదకుం డని సంబోధించుచున్నాఁడు.

శ్లో॥ ఆరూఢవేణుతరుణాధరవిభ్రమేణ
మాధుర్యశాలి వదనామ్బుజ ముద్వహన్తీ।
ఆలోక్యతాం కిమనయా వనదేవతా వః
కైశోరకే వయసి కాపిచ కాన్తియష్టిః ॥ 32

టీ. హే వనదేవతాః = ఓవనదేవతలారా, వః = మీరు, అనయా = దీనిచే - ఈవ్యర్థక్రియచేత, కిం = ఏమిప్రయోజనము, కైశోరకే = కిశోరసంబంధి అయిన - నినువుగా నుండెడి, వయసి = వయస్సునందు, ఆరూఢ...విభ్రమేణ - ఆరూఢ = మోపఁబడిన, వేణు = పిల్లఁగ్రోవిగలదియు, తరుణ = లేఁతదియు అగు, అధర = పెదవియొక్క, విభ్రమేణ = విలాసముచేత, మాధుర్యశాలి - మాధుర్య = చక్కఁదనముచేత, శాలి = ఒప్పుచున్న, వదన + అమ్బుజం = ముఖకమలమును - పిల్లఁగ్రోవితోఁ గూడిన పెదవియొక్క తలుకుంద్రిప్పులచేత మఱింతసుందరమై యొప్పుచున్న తామరవంటి మొగమును అనుట, ఉద్వహన్తీ = వహించుచున్నదియు, కాపి = అనిర్వాచ్యమైనదియు, అగు, కాంతియష్టిం = యష్టివంటికాంతిని - యష్టివలె నిలుకడగా గడలుకొనుచున్న కాంతిపుంజమైన కృష్ణమూర్తిని అనుట. ఆలోక్యతాం = చూడఁదగినది - వెదకఁదగినది యనుట - మీరు వెదకఁదగునని భావము.

ఉ. దావఁక వంశ మిం పొదవ దా నధరంబున మోపి నాదనం
పాదితమందహాసమధురాననుఁడై మహనీయతేజుఁడై
క్రేవుల మేప మీఁపొదల క్రేవనె పావఁడు నిల్చినాఁడు మీ
రోపితి రేని పట్టుఁ డిఁక నోవనదేవతలార తెల్పితిన్. 32

తా. ఓ వనదేవతలారా! మీ రీ వ్యర్థకార్యము నేల చేయుచున్నారు? నేనొక్క మంచి ప్రయోజనమును జెప్పెద బాల్యప్రాయము గలిగి, అధరమున వేణువుమోపి, పెదవులు విలాసముగాఁద్రిప్పుచు, దానిచే మఱింతయొప్పులు గులుకుచున్న తామర వంటి మొగముగలిగి, యప్పటివలె ఘనముగా నిగిడియున్న యొక కాంతిపుంజమును-కృష్ణుని-మీరు వెదకఁదగును. ఇదియే ప్రయోజనకరము.

శ్లో॥ అనన్యసాధారణ కాన్తికాన్త
మాక్రాన్తగోపీనయనారవిన్దమ్ ।
పుంసః పురాణస్య నవం విలాసం
పుణ్యేన పూర్ణేన విలోకయిష్యే ॥ 33

టీ. అనన్య...కాన్తమ్ - అనన్యసాధారణ=ఇతరులకు సాధారణముకాని-ఇతరులకులేనట్టియనుట, కాన్తి = కాంతిచేత, కాన్తం=మనోజ్ఞమైనదియు, ఆక్రాన్త... విన్దమ్-ఆక్రాన్త = ఆక్రమింపఁబడిన, గోపీ=గోపికలయొక్క, నయన+అరవిన్దమ్= కన్నుఁదామరలుగలదియు-గోపస్త్రీలకన్నులను నిజమనోజ్ఞత్వముచే ఆకర్షించుకొన్నదియనుట, పురాణస్య=పురాతనుఁడైన, పుంసః-పురుషునియొక్క - పురాణపురుషుఁడైన నారాయణునియొక్క, నవం=నూతనమైనదియు, అగు, విలాసం=విలాసము-నారాయణునియొక్క శ్రీకృష్ణరూపమైన నూతనవిలాసముననుట, పూర్ణేన = నిండినట్టి, పుణ్యేన=పుణ్యముచేత, విలోకయిష్యే = చూడఁగలను. 'పురాణపురుషుఁడైన నారాయణుఁడు, క్రొత్తగా నొక విలాసమును పచరించినాఁడు. ఆవిలాసము గోపికల కన్నులను ఆకర్షించినది' అని గోపికానయనాకర్షణమును జెప్పుటచే అది కృష్ణరూపమైన విలాసమని యూహ్యము. కృష్ణుఁ డనక నారాయణుని 'నవవిలాస' మనుటచే, నారాయణుని అపూర్వవిలాసమంతయు, కృష్ణరూపముగా పరిణమించెననియుఁ గనుక తక్కిన యవతారములకంటె కృష్ణావతారమే నారాయణుని అపూర్వవిలాసములను మిక్కిలి పచరించునట్టిదనియు నర్థముగ్రాహ్యము; అట్టిపురాణపురుషుండును సౌలభ్యప్రకర్షమున గోపికలకును గోచరమగునట్టి రూపమును, గోచరమగుటయే కాక వారిని ఆకర్షింపఁ జాలినట్టిరూపవిలాసమును, గలిగి కృష్ణుఁడై అవతరించినాఁడనుట. 'అనన్యసాధారణ కాన్తికాన్త' మనుటచేతనే యది గోపీనయనారవిందములను ఆక్రమించినదని భావము.

చ. ఇతరుల కంద రానిజగదేకమనోహరకాంతియుక్తి నమూ
గతనవయౌవనాకరవికాసము లన్నియు గోపబాలికా
యుతనయనారవిందములకై కగ్గము సేయుపురాణపూరుషున్
మతిఁ దలపోసి చూచెద నసమగ్రసనాతనపుణ్యసంగతిన్. 33

తా. ఇతరుల కందరానికాంతిచే మనోహరమై, కావుననే గోపికలకన్నుఁ దామరలను ఆకర్షించునదై, యొప్పుపురాణపురుషుని కృష్ణరూపమైన శ్రోత్రవిలాసము మిక్కిలి పుణ్యముచేసి చూతును.

శ్లో॥ సాష్టాఙ్గపాత మభివన్ద్య సమస్తభావైః
సర్వాన్ సురేన్ద్రనికరా నిద మేవ యాచే!
మన్దస్మితార్ద్రమధురాననచన్ద్రబిమ్బే
నన్దస్య పుణ్యనిచయే మమ భక్తిరస్తు॥ 34

టీ. సాష్టాఙ్గపాతమ్-సాష్టాఙ్గ=అష్టావయవములతోఁ గూడిన, పాతమ్=పాతము-క్రిందపడుట-గలుగునట్లుగా-సాష్టాంగముగాఁ గ్రిందఁబడియనుట, సర్వాన్=సమస్తమైన, సురేన్ద్రనికరాన్ - సురేన్ద్ర=దేవతాశ్రేష్ఠులయొక్క, నికరాన్=సమూహములను గూర్చి, అభివన్ద్య=నమస్కరించి, సమస్తభావైః=సమస్త ప్రకారములచేత, ఇద మేవ=ఇదియే-ఈచెప్పఁబోవునదియే, యాచే=యాచించుచున్నాను. యాచించువిషయమును జెప్పుచున్నాఁడు, మన్ద...బిమ్బే - మన్దస్మిత=చిఱునవ్వుచేత, ఆర్ద్ర=సరసమైనదియు, మధుర=సుందరమైనదియు, ఆగు, ఆననచంద్రబిమ్బే=చంద్రబింబమువంటి మొగము గలదైన, నన్దస్య=నందునియొక్క, పుణ్యనిచయే = పుణ్యసమూహంబునందు-పుణ్యసమూహస్వరూపమైన శ్రీకృష్ణునియం దనుట, మమ=నాకు, భక్తిః=భక్తి, అస్తు=అగుఁగాక-ఇదియ నేను యాచించెద ననుట-నందునిపుణ్యసమూహమే కృష్ణుఁడైపుట్టినదో యున్నట్లుండుటచేఁ గృష్ణుని నందునిపుణ్యచయముగానే చెప్పినాఁడని తెలియునది. మందస్మితముచే ఆర్ద్రమై, కావుననే మధురమై, చంద్రబింబమువలెనుండు మొగము గలది కావుననే దానియందు భక్తి గలుగవలయు నని నాకుఁ గోరిక యనియాశయము.

మ. అమరన్ సర్వసుపర్వముఖ్యతతికిన్ సాష్టాంగదండప్రణా
మము గావించుచు సర్వభావముల నాశత్మన్ వేడెదన్ మందహా
సముఖాంభోజవిలాసవైభవనివాసనం బైననందార్జితో
త్తమపుణ్యావలియందు భక్తి సెలు వంకదన్ మాకు నెల్లప్పుడున్.

తా. అష్టావయవములును నేల సోఁకునట్లు పడి నమస్కరించి సమస్తదేవతాశ్రేష్ఠులను సర్వవిధముల నొకటిని దయసేయునట్లు యాచించుచున్నాను. అది యేదనఁగా చిఱునవ్వుచే సరసమై, సుందరమై, చంద్రబింబమువలె వెలుంగుచున్న మొగము గలిగి, నందుని పుణ్యసమూహమంతయు నిట్లు రూపొందినదో యనఁదగి, యున్న శ్రీకృష్ణునియందు నాకు భక్తి కలుగుఁగాక.

శ్లో॥ఏషు ప్రవాహేషు సఏవమన్యే, క్షణోఽపి గణ్యః పురుషాయుషేషు।
ఆస్వాద్యతే యత్ర కయాపి భక్త్యా, నీలస్యబాలస్యనిజంచరిత్రమ్॥

టీ. ఏషు=ఈ-అనుభవింపఁబడుచున్న, ప్రవాహేషు = ప్రవాహరూపముగా ఎడతెగక సాఁగుచున్న, పురుషాయుషేషు=మనుష్యజీవితకాలములయందు, యత్ర= ఎప్పుడు-ఏక్షణమందనుట, కయాపి=ఇంతింతనరాని, భక్త్యా=భక్తిచేత, నీలస్య=నీల వర్ణుఁడయిన, బాలస్య=బాలకృష్ణునియొక్క, నిజ=స్వకీయమైన, చరిత్రం=చరిత్రము-పూతనాసంహారాదివృత్తాంతము, ఆస్వాద్యతే=అనుభవింపఁబడుచున్నదో-సుఖముగా చింతనము చేయఁబడుచున్నదోయనుట, సఏవ క్షణః=ఆక్షణమే, గణ్యః=లెక్కింపఁ దగినది యని-ఆక్షణమే సార్థకమైనదని, మన్యే=తలంచుచున్నాను. కృష్ణునిచరిత్ర మును జింతించి ఆనందించుక్షణముతప్ప మనుష్యజీవితకాలమందలి తక్కిన క్షణము లన్నియు నిరర్థకములే యగు నని భావము.

ఉ. ఏమిటి కంబుజాక్షు మది ౯ నెంచనియాయువు లెక్కపెట్టఁగాఁ
బామరవృత్తి నైన మఱి ౯ భక్తివిధంబున నైన బాలలీ
లామహనీయుఁడౌహరిఁదగ్ఁదలంచుని మేషములు౯ ముహూర్తముల్
జాములు లెక్క కెక్కునటు ౯ సల్పనికాలము లెల్లవ్యర్థముల్. 35

తా. ప్రవాహమువలె ఎడతెగక సాఁగుచున్న యీమనుష్యజీవితకాలము లందు నీలవర్ణుఁడైన బాలకృష్ణునిచరిత్రము మిక్కిలిభక్తితోఁ జింతించి యానందించు క్షణ మొకటియె సార్థకము గాని తక్కినకాలమంతయు వ్యర్థమే యగును.

శ్లో॥నిసర్గసరసాధరం నిజదయార్ద్రదివ్యేక్షణం
మనోజ్ఞముఖపఙ్కజం మధురసార్ద్రమన్దస్మితమ్।
రసజ్ఞహృదయాస్పదం రమితవల్లవీలోచనం
పునఃపున రుపాస్మహే భువనలోభనీయం మహః॥ 36

టీ. నిసర్గ...ధరమ్-నిసర్గ=స్వభావముచేత, సరస=రసవంతమైన, అధరమ్= పెదవిగలదియు, నిజ...క్షణమ్-నిజ=తనదైన, దయ=దయచేత, ఆర్ద్ర=తడిసినవియు-కూడినవియు, కావునసే, దివ్య=మహనీయము లైనవియు, అగు, ఈక్షణమ్=నేత్ర ములుగలదియు, మనోజ్ఞముఖపఙ్కజమ్-మనోజ్ఞ=సొగసైన, ముఖపఙ్కజమ్=తా మరవంటిమొగము గలిగినదియు, మధు...స్మితమ్-మధురస = తేనియచేత, ఆర్ద్ర = తడిసిన-తేనియవలెభోగ్యమైన యనుట, మన్దస్మితమ్=చిఱునగవు గలదియు, 'మధు రసార్ద్ర మన్దస్మితమ్' అనుపాఠమున, మధుర = తీయనై, రస తీయదనముచేత,

స్వాస్త్రి=దట్టమయిన-మిక్కిలి తీయఁదనముగల యనుట, మన్దస్మితమ్ = చిఱునగవు గలది యనుట, రసజ్ఞ...స్పదమ్-రసజ్ఞ=రసికులయొక్క, హృదయ=హృదయములే -ఆస్పదమ్=స్థానముగాఁ గలదియు- బ్రహ్మానందానుభవము గల వారి హృదయములందు ప్రకాశించునది యనుట, లేక శృంగారాది రసజ్ఞులైనవారి హృదయములందు వసించునది యనుట, తన పరత్వ సౌలభ్యముల ప్రభావములు యోగులును రసికులునే హృదయములఁ జింతించి యనుసంధింపఁగలరు గావున వారి హృదయములందుఁ బ్రకాశించుచున్నది యని భావము, రమిత...లోచనమ్-రమిత=రమించునట్లు చేయఁ బడిన-రంజింపఁబడిన, వల్లవీ=గోపికలయొక్క, లోచనమ్=నేత్రములు గలదియు- గోపికల నేత్రములను రంజించునట్టి సౌందర్యవిలాసములు గలది యనుట, భువనలోభనీయమ్=భువన=లోకముల చేత, లోభనీయమ్ = ఆసింపఁదగినదియు, అగు, మహః = శ్రీకృష్ణాఖ్యతేజమును, పునఃపునః= సారెసారెకును, ఉపాస్మహే = ఉపాసించుచున్నాము. నిసర్గసరసాధర త్వాదులుగలిగియుండుటచేతనే రసజ్ఞహృదయములకు విషయముగాను వల్లవీలోచనములకు రంజకముగాను భువనములకు లోభనీయముగాను ఉన్నదని యాశయము.

ఉ. కమ్మని తేనెవానజడి క్రగ్మ్మెడుమోవి సుధారసంబులం
  జిమ్మెడు తేటనవ్వు దయ చిప్పిలుచూపులు మోముదమ్మి చె
  ల్వమ్మును గోపికల్ గని హసళాహళిఁజెంద రసజ్ఞులెల్లలో
  కమ్ములుఁగాంచి సొక్క నవకం బగు తేజముఁ గొల్చెదన్ మదిన్. 36

తా. స్వభావముచే సొగసైన యధరమును, దయారసముచేఁ జిప్పిలుచు మహనీయములైన నేత్రములును, తామరవలె మనోహరమైన ముఖమును, తేనియవలె భోగ్యమైన చిఱునవ్వును గలదై రసజ్ఞ జనులు మనస్సునఁ జింతించి యానందింపఁగా, గోపికలకు కనుఁబండువుగా; జగములోనివారికెల్ల మిక్కిలి ఆసింపఁదగినదై, యొప్పుచున్న శ్రీకృష్ణాఖ్యతేజమును మాటికిఁ గొలిచెదము.

శ్లో॥ స కోఽపి బాల స్సరసీరుహాక్షః, సా చ వ్రజస్త్రీజనపాదధూళిః।
ముహు స్తదేతద్యుగళం మదీయే, మోముహ్యమానేఽపి మనస్యు దేతు॥

టీ. సః=ప్రసిద్ధుఁడును, కోఽపి=అనిర్వాచ్యుఁడును, సరసీరుహ+అక్షః= తామరవంటి కన్నులు గలవాఁడును, అగు, బాలః=బాలుఁడును-బాలకృష్ణుఁడును అనుట, సా=ప్రసిద్ధమైన, వ్రజ...ధూళిశ్చ- వ్రజస్త్రీజన= గోపికాసమూహము యొక్క, పాదధూళిశ్చ=అడుగులదుమ్మును, తత్+ఏతత్+యుగళమ్- (అనేడి) ఆ యీరెండును, మదీయే=నాదైన, మనసి=మనస్సునందు, మోముహ్యమానేపి= మాటికి మోహము పొందుచున్న దయినప్పటికిని, ముహుః=మాటికి, ఉదేతు=పుట్టు

నుగాక, మనసున ఉదయించుఁగాక యనఁగా మనస్సునందుఁ జింతింపఁబడుచుండు నుగాక యని యర్థము, బాలుఁడైన చిన్నికృష్ణుఁడును, వానిని ఎడతెగక కొలుచుటచేఁ బవిత్రలయిన గొల్లచెలువల పాదధూళియు, అనెడి యీరెండును నామనస్సునందే యుండునుగాక యనుట.

చ. అలఘువిమోహఘోరతమసావృతవల్కుచుఁ గుయ్యిడు నన్నుఁ బ్రోవఁగా
లలితవిశాలలోచనయుగలుం బరికించుచు వాయువేగుఁడై
దులదుల వచ్చు బాలుఁడును ౯ దోడనె కొనసాగ నాతనిం
గలిసికొనంగ వచ్చు వ్రజకాంతలపాదరజంబుఁ గాంచెదన్. 37

తా. నామనస్సు మాటిమాటికి తెలివి తప్పుచుండునదైనను, తామరరేకుల వంటి కన్నులు గల యాచిన్నిబాలకృష్ణుఁడును వానిని గొలిచిన పరమపావన లయి నయాగొల్లస్త్రీలపాదధూళియు అనెడి యీరెండును నా మనస్సునందు మాటికిఁ జింతింపఁబడుచుండును గాక.

శ్లో॥ మయి ప్రయాణాభిముఖే చ వల్లవీ, స్తనద్వయీదుర్లలిత స్సబాలకః।
శనైశ్శనై శ్శ్రావితవేణునిస్వనో, విలాసవేషేణపురః ప్రతీయతామ్॥

టీ. మయి=నేను, ప్రయాణాభిముఖే-ప్రయాణ=(లోకాంతర) ప్రయాణమునకు, అభిముఖే చ=ఎదురుకొన్నవాఁడ నగుచుండఁగా, వల్లవీ...లలితః-వల్లవీ=గోపస్త్రీలయొక్క, స్తనద్వయీ=చన్నుదోయిచేత, దుర్లలితః=అతిమాత్రము లాలింపఁబడిన వాఁడైన, సః=అ-ప్రసిద్ధుఁడైన, బాలకః=చిన్నికృష్ణుఁడు, శనైః శ్శనైః=మెల్లమెల్లగా, శ్రావిత...స్వనః-శ్రావిత=వినిపింపఁబడిన, వేణు=పిల్లఁగ్రోవియొక్క, నిస్వనస్సన్=ధ్వనిగలవాఁడగుచు, విలాసవేషేణ=విలాసార్హమైన వేషముతోడ, పురః=ఎదుట, మమ=నాకు, ప్రతీయతామ్=తోఁచుఁగావుత-కృష్ణుఁడు వల్లవీస్తనద్వయీదుర్లలితుఁడు అనఁగా వారికుచయుగములచే మిక్కిలి లాలింపఁబడి అందు మరగినవాఁడు-అనఁగా గోపస్త్రీలకుచములతోడిబిగికౌఁగిలింతలరాయిడిని మరగి నలఁగినవాఁడనుట. అట్లు గొల్లపడఁతులతోఁగూడి క్రీడించుచు వారికంటికింపైన విలాసవేషమును గయిసేసి వెలయుచుండు బాలకృష్ణునందే నాకుఁ బ్రీతిగనుక వాఁడట్టిబాల్యముతోను అట్టిగోపస్త్రీకుచములరాయిడిని నలఁగినమేనితోను మరణసమయమున నాకుఁ గనుపట్టుఁగాక అని కవిహృదయము.

ఉ. గొల్లమిటారిపూపచనుగుత్తులు హత్తినవింతలాగుతోఁ
జల్లనిచూపుతో వదలి ౯ సారెకు జాఱెడుపీలిదండతో
నల్లవరాతు దెల్పుటకు ౯ నై విలసిల్లినపిల్లఁగ్రోవితో
నల్లనిబాలుఁడొక్కరుఁడు ౯ నాపయనంబున నిల్చు ముంగలన్.

తా. నేను లోకాంతరమునకుం బోవ సమకట్టినపుడు గోపస్త్రీల చన్నులరాయిడిని మరగి విలాసంబగు వేషంబు పూనినయా బాలకృష్ణుఁడు, తనరాక తెలిపి నాకు తెంపు గలిగించుటకై ముందు మెల్లమెల్లగాఁ దనపిల్లఁగ్రోవిరవళి నాకు వినిపించుచు నాముందటం బొడసూపుంగాత.

శ్లో॥ అతిభూమి మభూమి మేవ వా, వచసాం వాసితవల్లవీ స్తనమ్।
మనసా మపరం రసాయనం, మధురాద్వైత ముపాస్మహే మహః॥

టీ. వచసాం=వాక్కులకు, అతిభూమిం = మిక్కిలియు విషయమైనదియు, వా=లేక, అభూమిమ్=విషయము కానిదియు, పరస్వరూపమున విషయము కానిదియు, సౌలభ్యప్రయుక్తమైన అవతారరూపమున విషయమైనదియు ననుట, లేక నిర్గుణస్వరూపమున అవిషయమును సగుణస్వరూపమున విషయమును అయినదనుట వాసిత... స్తనం–వాసిత= వసింపఁబడిన–వాసస్థానముగఁ జేసికొనఁబడిన, వల్లవీ = గొల్లచెలువలయొక్క, స్తనం = చన్నులుగలదియు – గోపికలకుచాలింగనములందే యెప్పుడును ఆసక్తమైనదియనుట, మనసాం = మనస్సునకు, అపరం = రెండవది లేని–అద్వితీయమైన, రసాయనమ్ = రసాయనమైనదియు–మనస్సునకు మిక్కిలియు రసాయనము వలె అతిభోగ్యమైనది యనుట, మధుర+అద్వైతమ్–మధుర = మధురమైన, అద్వైతమ్=రెండవది లేనిదియు–ఒక్కటియే యైనదియనుట–లేక, మధుర = మాధుర్యముచేత, అద్వైతమ్ = ఏకరూపమైనదియు–మఱి రెండవదాని మిశ్రణములేక నిలువెల్లమధురమాధుర్యమయమైనది యనుట–లేక, మధుర=మాధుర్యముయొక్క, అద్వైతమ్ = ఏకత్వమైనదియు–కేవల మాధుర్యమైనది యనుట–ఇది 'మధురైకరసమ్' 'మాధుర్యైకరసే' ఇత్యాదులకు పర్యాయములు, ఇట్టిదైన, మహః = తేజమును, ఉపాస్మహే = సేవించుచున్నాము.

చ. పలుకులఁ గొలంది గానియనుభావముఁ గాంచియు నద్వితీయమై
పొలుపు వహించి నెమ్మది కరసపూర్వరసాయనమై మహోన్నతి
న్దొలఁకెడు దివ్యతేజము మనోహరవల్లవపల్లవాధరీ
లలితపయోధరాంతరవిశాలాననివాసము గాంచెఁ గంటిరే. 39

తా. వాక్కులచే మిక్కిలి పొగడందగినదియు, లేక, వాక్కులచే పొగడుటకు అలవియే కానిదియు, గోపికలకుచాలింగనములందే యెప్పుడును ఆసక్తమైయుండునదియు, మనస్సునకు ఎనలేని రసాయనమువలె మిక్కిలి యింపైనదియు, కేవల మాధుర్యమయమైనదియు, అగు, కృష్ణాఖ్యతేజమును ఉపాసించుచున్నాము.

శ్లో॥ జననాన్తరేఽపి జగదేకమణ్డనే, కమనీయధామ్ని కమలాయతేక్షణే।
వ్రజసున్దరీజనవిలోచనామృతే, చపలాని సన్తు మమ లేన్ద్రియాణి మే॥

టీ. జగత్...మణ్డనే-జగత్ = లోకములకు, ఏక=ముఖ్యమైన-లేక అద్వితీయమైన, మణ్డనే = అలంకారమైనదియు, కమల...క్షణే-కమల = తామరరేకులవలె, ఆయత=విశాలమైన, ఈక్షణే = కన్నులు గలదియు, వ్రజ...నామృతే-వ్రజసున్దరీ = గొల్లచెలువలయొక్క, జన=సమూహముయొక్క, విలోచన = కన్నులకు, అమృతే = అమృతమైనదియు-అమృతమువలె అతిభోగ్యమైనదియనుట, అగు, కమనీయధామ్ని - కమనీయ = మనోజ్ఞమైన, ధామ్ని = తేజమునందు-కృష్ణాఖ్యతేజస్సునందు, జనన + అన్తరేపి = జన్మాంతరమందైనను, మే = నాయొక్క, సకల + ఇన్ద్రియాణి = అన్నియింద్రియములును, చపలాని = మిక్కిలి ఆసక్తిగలవి, సన్తు = అగుఁగాక. కృష్ణాఖ్యతేజము సర్వేంద్రియములచేతను అనుభవింపఁదగినది. అది యీ జన్మమున ననుబోఁటికి లభింపకున్నను జన్మాంతరమందైనను గన్నారఁజూచి చెవులారవిని చేతులార కౌఁగిలించి యిట్లు సకలేంద్రియములచేతను అనుభవించుట కలుగునుగాక యని యర్థము.

మ. శతపత్త్రోజ్జ్వలపత్త్రనేత్త్రు వ్రజకంజాతాననాలోకనా
మృతధారాధరచారుగాత్త్రు భువనోన్మైకభూషానము
న్నతచారిత్త్రుఁ బవిత్త్రుఁ గొల్చి యనుజన్మంబున్ విలోలేంద్రియ
ప్రతతుల్ సౌఖ్యము నొందుఁగాత నిజచాపల్యంబు లీడేరఁగన్. 40

తా. జగములకెల్లనలంకారభూతుఁడై, తామరరేకులవంటి విశాలములయిన కన్నులు గలిగి, గోపికాజనములకన్నులకు అమృతమువలె అతిభోగ్యమై రమణీయతేజస్స్వరూపమై యొప్పు శ్రీకృష్ణునియందు నాపంచేంద్రియములును జన్మాంతరమందేని ఆసక్తము లగుఁగాక.

శ్లో॥ మునిశ్రేణీవన్ద్యం మదభరలసద్వల్లవవధూ
స్తనశ్రోణీబిమ్బస్తిమితనయనామ్భోజసుభగమ్ ।
పునశ్లాఘాభూమిం పులకితగిరాం నైగమగిరాం
ఘనశ్యామం వన్దే కిమపి కమనీయాకృతి మహః॥ 41

టీ. ముని...వన్ద్యమ్-మునిశ్రేణీ = మునులసమూహములకు, వన్ద్యమ్ = నమస్కరింపఁదగినదియు, మద...సుభగమ్-మదభర = మిక్కుటమైనమదముచేత - మిక్కుటమైన యౌవనంపుమత్తుచేత-లేక మిక్కిలి మన్మథవికారముచేత, లసత్ = ప్రకాశించుచున్న, వల్లవవధూ = గోపస్త్రీలయొక్క, స్తన = చన్నులందును, శ్రోణీబిమ్బ = పిఱుఁదులమండలమందును - పిఱుఁదులచుట్టుప్రదేశమందును అనుట, స్తిమిత = నిశ్చలముగానిలుపఁబడిన, నయన + అమ్భోజ = తామరవంటి కన్నులచేత, సుభగం=నుందరమైనదియు-మదభరముచేతఁ జన్నులు ఉబ్బినవై పిఱుఁదులు బలిసినవై మతిం

మోహజనకములుగా నుండునుగావున అందుఁ జూడ్కులను మోహాతిశయమున స్థిరముగా నిలిపినాఁడనియు, తామరరేకులవంటి కన్నులను అట్లు నిలుపుటయు మిక్కిలి సొగసుగానుండెననియుఁ భావము. పునః=అయితే, పులకితగిరాం - పులకిత = గగురు పొడిచిన, గిరామ్=వాక్యములుగల, నైగమగిరామ్ = వేదవాక్యములకు - వేదములను కృష్ణుని మహిమాతిశయమునకు మిక్కిలి యానందముచే గగురుపాటుచు అతని ప్రతిపాదించు ననియు నట్లు ప్రతిపాదించు దానివాక్యములయొక్క, శ్లాఘాభూమిమ్- శ్లాఘా=పొగడ్తకు, భూమిమ్=విషయమైనదియు - వేదాంతములు హర్షముచేఁ బులకితములై కొనియాడఁదగినది యనుట, ఘనశ్యామమ్-ఘన = మేఘమువలె, శ్యామమ్= నల్లనైనదియు, కమనీయ+ఆకృతి-కమనీయ = మనోజ్ఞమైన, ఆకృతి = ఆకారము గలదియు, కిమపి=అనిర్వాచ్యమైనదియు, అగు, మహః = శ్రీకృష్ణాఖ్యతేజస్సును గూర్చి, వన్దే = నమస్కరించుచున్నాను. మునిశ్రేణీవంద్యుఁడును వేదాంతవాక్యములకు శ్లాఘాభూమియు నైనమహస్సు, వల్లవవధూ స్తనశ్రోణీబింబములందు మరులు కొన్నది కావునసే, 'కిమపి' అనిర్వాచ్యమైనది యని భావము.

చ. పులకలు గ్రమ్మ మానిజనశ్రముల్ శ్రుతివాక్యములన్ నుతింపఁగా
జలదమనోహరాకృతి యొకనంగ మదాలసవల్లవాంగనా
లలితపయోధరాంతరవిశాలాసకటీతటలోలలోచనం
బులఁ దనరారునందకృతపుణ్యనిధానము నన్నుఁ బ్రోచుతన్. 41

తా. మునిసమూహములకు నమస్కరింపఁదగినమహనీయుఁడై, వేదాంతములు మిక్కిలి హర్షముతోఁ గొనియాడుటకుఁ బాత్రమై యుండుపరాత్పరుఁ డయ్యును, గోపికలచన్నులను పిఱుదులందును మోహావేశముతో దృష్టులు నిలిపి సొగసుగాఁ జూచుచు కేవలునివలెఁ బొడసూపువాఁడును, కావునసే యిటటని నిర్వచింపరానివాఁడును, సుందరాకారుఁడును, తేజస్స్వరూపుఁడు నైనశ్రీకృష్ణునికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ అనుచుమ్బతా మవిచలేన చేతసా
మనుజాకృతే ర్మధురిమశ్రియం విభోః।
అయి దేవ కృష్ణ దయితేతి జల్పతా
మపి నో భవేయు రపి నామ తాదృశాః॥ 42

టీ. అవిచలేన=మిక్కిలి చలింపని-ఒకింతస్థిరమైన, చేతసా = మనస్సుచేత, విభోః = ప్రభుండైన శ్రీకృష్ణునియొక్క, మనుజ+ఆకృతేః = మనుష్యాకారముయొక్క, మధురిమ శ్రియమ్-మధురిమ = సౌందర్యముయొక్క, శ్రియం = సంపదను, అనుచుమ్బతామ్ = ఆస్వాదించుచున్నవారును, అయి = ఓయీ, దేవ = దేవా, కృష్ణ= కృష్ణా, దయిత = ప్రియుఁడా, ఇతి = అని, జల్పతామ్ = చెప్పుచున్నవారును, అగు,

నః అపి = మాకుఁగూడ - మముబోఁటులకుఁగూడ, తాదృశాః-అట్టివి-మేము మనస్సునందు చింతించి అనుభవించుచున్నట్టి సుందరమనుష్యాకారముగలిగి మేము చెప్పుచున్నట్టి, దేవుఁడును దయితుఁడును కృష్ణుఁడును అయినవాఁడుగా, మహాత్ముల కగపడు భాగ్యములు, అపి నామ భవేయుః = అగునా-అగునో కదా.

ఉ. మానుషవేషధారి యగుశ్రీమాధవుమోహనకాంతి చంచలం
బై నటియించుచిత్తమున కానుచుఁ గృష్ణ ముకుంద యంచు స
న్మానము మీఱఁగాఁ బలుక మాకొనఁగూడెడుఁ గాత నీదృశ
ధ్యానవిధేయులైనసనకాదిమహామునిభాగ్యసంపదల్. 42

తా. చలింపనిచిత్తముచేఁ బ్రభుండయిన శ్రీకృష్ణుని మనుష్యాకారముయొక్క సౌందర్యవిభవమును ఆస్వాదించి అనుభవించుచు ఓదేవా! కృష్ణా! దయితా! అని పేర్కొనుచున్న మముబోఁటులకుఁగూడ మహాత్ములభాగ్యములు గలుగునోకదా.

శ్లో॥ కిశోరవేషేణ కృశోదరీదృశాం. విశేషదృశ్యేన విశాలలోచనమ్।
యశోదయాలబ్ధయశోనవామ్బుధే, ర్నిశామయేనీలనిశాకరంకదా॥

టీ. కృశోదరీదృశామ్-కృశోదరీ = (సన్ననినడుములు గల) స్త్రీలకు-గోపస్త్రీలకనుట, దృశాం = కన్నులకు, విశేషదృశ్యేన-విశేష = మిక్కిలియు, దృశ్యేన = చూడఁదగిన, కిశోరవేషేణ = బాల్యవేషముతోఁడ, (ఉపలక్షితం = కూడుకొన్నవాఁడును), విశాల లోచనం = వెడలుపైనకన్నులు గలవాఁడును, యశోదయా = యశోదచేత, లబ్ధ...వామ్బుధేః-లబ్ధ-పొందఁబడిన, యశః = కీర్తియను, నవ = నూతనమైన, అమ్బుధేః = సముద్రమునకు, నీల నిశాకరం-నీల-నల్లనైన, నిశాకరం = చంద్రుఁడైనవానిని-చంద్రుఁడు సముద్రమును చెలరేఁగఁ జేయునట్లు, తాను యశోదాదేవికీర్తిని మిక్కిలి వర్ధిల్లఁ జేయువాఁడనుట. యశోదకీర్తి కృష్ణుని గాంచుటచే మిక్కిలియు నతిశయించినదని భావము. ఇట్టివాఁడైనకృష్ణుని, కదా = ఎప్పుడు, నిశామయే = చూతునో. ఇచట 'కృశోదరీ' అనుటచే అవయవవిభక్తి గలిగి నడుము సన్నగిలుట తెలియుచున్నదిగావున యౌవనవతులని తెలియునది. కిశోరుఁడయ్యును అట్టియువతులకును ఆశింపఁదగినవేషము గలవాఁడని బాల్యమునందే అత్యంతజగన్మోహనత్వము వ్యంజితమగుచున్నది.

శా. లీలాలోలవిశాలలోచనునిఁ గోశ్రీశైశవాలంకృతు
న్బాలుం బాలితలోకపాలు వ్రజకాన్తల్ సొక్కుచుం బెక్కుచం
దాలం గన్నులకొద్దిఁ గన్గొనుయశోదాకీర్తిరత్నాకర
ప్రాలేయాంశుని నీలనీరదతనుం గా భావింతు నెల్లప్పుడున్. 43

తా. స్త్రీలకును మిక్కిలియు చూడందగిన బాల్యవేషముతోఁ గూడి, విశాలములయినకన్నులు గలిగి, యశోద గాంచినకీర్తిని మిక్కిలి యతిశయింపఁజేయుచు నల్లని చంద్రునివలె విలసిల్లుకృష్ణుని ఎప్పుడు చూతును ?

శ్లో॥ ప్రకృతి రవతు నో విలాసలక్ష్మ్యాః, ప్రకృతిజడం ప్రణతాపరాధ
[వీథ్యామ్।

సుకృతికృతపదం కిశోరభావే, సుకృతిమనఃప్రణిధానపాత్ర మోజః॥

టీ. కిశోరభావే = బాలభావమందు - బాల్యమందనుట, విలాసలక్ష్మ్యాః-విలాస = మిలుకుబెళుకులయొక్క, లక్ష్మ్యాః = సంపదకు-పెంపుసొంపునకు, ప్రకృతిః= మూలకారణ మైనదియు-సమస్తములైన విలాసవిభవములకు జన్మస్థాన మైనదనుట, ప్రణత...వీథ్యామ్-ప్రణత = నమస్కరించినవారియొక్క -భక్తులయొక్క, అపరాధ = అపరాధములయొక్క, వీథ్యామ్ = పరంపరావిషయ మై, ప్రకృతిజడమ్-ప్రకృతి = స్వభావముచేత, జడమ్ = మందమైనదియు - ఆశ్రితులయపరాధములను పాటింపనిది యనుట, సుకృతి...పాత్రమ్-సుకృతి = పుణ్యపురుషులయొక్క, మనః = మనస్సుల యొక్క, ప్రణిధాన=ఏకాగ్రతకు, పాత్రమ్ = అర్హ మైనదియు-పుణ్యాత్ములు ఏకాగ్రముగా ధ్యానించువిషయ మైనదియనుట, సుకృతి...పదమ్ - సుకృతి = పుణ్యపురుషులయందు, కృత = చేయఁబడిన, పదం = స్థానము గలదియు - పుణ్యాత్ములయందు నెలకొని యుండున దనుట లేక, సుకృతి=ధన్య మైనదియు, కిశోరభావే = బాలభావమునందు-బాలుఁడై అవతరించుటయందు, కృతపదం = చేయఁబడినస్థానము గలదియు-బాలత్వమును గైకొన్నదనుట, అగు, ఓజః = తేజస్సు, నః=మమ్ము, అవతు = రక్షించుఁగాక.

చ. హితజనతాపరాధముల కెన్నఁడుపట్లు జడస్వభావ మై
కృతమతు లాత్మలోనఁ బరికింపఁగఁ బాత్రము నై కిశోరతా
ర్పితపద మై విలాసమృదుకరీతికి హేతువు నై మనోహరా
కృతిఁ గనిపించునాసుకృతికేవల తేజము మమ్ముఁ బ్రోచుతన్. 44

తా. విలాసంపు సొంపులకు పుట్టుచోటై, ఆశ్రితులయపరాధములను పాటించుటయందు మందమై, బాలభావమును దాల్చినదై, పుణ్యాత్ములు ఏకాగ్రముగా హృదయములందు ధ్యానించువిషయమై, యొప్పుశ్రీకృష్ణాఖ్యతేజము మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ అపహసితసుధామదావలేపైః, రతిసుమనోహర మార్ద్రమన్దహాసైః।
వ్రజయువతివిలోచనావలేహ్యం, రమయతుధామరమావరోధనం నః॥

టీ. అప...లేపైః-అపహసిత = ఎగతాళి సేయఁబడిన, సుధా = అమృతము యొక్క, మద=మదముచేఁ గలిగిన, అవలేపైః = గర్వముగలదియు-అమృతముయొక్క భోగ్యతాతిశయరూపమైన గర్వమును దిరస్కరించిన దనుట - అమృతముకంటె అత్యంతభోగ్యములైనవని భావము, ఇట్టివగు, ఆర్ద్రమన్దహాసైః-ఆర్ద్ర = సరసములయిన, మన్దహాసైః=చిఱునవ్వులచేత, అతిసుమనోహరమ్ = మిగులమిక్కిలి మనోజ్ఞమైనదియు -ఇచట 'అతి' 'సు' అనురెండును సమానార్థకములే యైనను అతిశయద్యోతక

ముగా నుంచఁబడిన దని తెలియుచున్నది, 'అధికమనోహరమ్' అను పాఠమున మిక్కిలి మనోహరమైనదని యర్థము, వ్రజ...లేహ్యాం - వ్రజయువతి = యౌవనవతులైన గోపస్త్రీలయొక్క, విలోచన = కన్నులచేత, అవలేహ్యాం = నాకఁదగినది-గసమును పీల్చుకొనఁదగినది-అనఁగా మిక్కిలి ఆస్వాదింపఁదగినది యనుట, రమా + అవరోధనమ్-రమా=లక్ష్మీదేవికి, అవరోధనమ్ - అంతఃపురమైనదియు, - లక్ష్మికి ప్రాణనాథుఁడైనది యనుట, అగు, ధామ = కాంతి-తేజస్సు-శ్రీకృష్ణుఁడనుట, నః = మమ్ము, రమయతు = రంజింపఁజేయునుగాత. మందహాసములచే అతిమనోహర మగుటచేతనే వ్రజయువతివిలోచనములకు అవలేహ్యమైనది. కనుక మమ్ము రంజిల్లఁజేయవలయు నని భావము.

చ. నవసుధ క్రొవ్వు నవ్వు చిఱునవ్వులు మోమున గోము నూప వ
ల్లవలలనావిలోచనవిశాలాసవి లేహ్యము నై రమామణీ
భవనభుజాంతరస్థలిని భాసిలు నందతపఃప్రభావసం
భవఫలమైన ధామము శుభంబు లభంగురభంగి నిచ్చుతన్. 45

తా. అమృతముయొక్క భోగ్యతాతిశయమును నిరసించునంత యింపైనచిఱునవ్వులచే మిక్కిలియు మనోజ్ఞమైనదియు, కావుననే జవ్వనులకన్నులవిందైనదియు, లక్ష్మీదేవికి పతియైనదియు, నగు శ్రీకృష్ణాఖ్యతేజము మమ్ము రంజిల్లం జేయును గాక.

శ్లో॥ అఙ్కూరితస్మేరదశావిశేషై, రశ్రాన్తహర్షామృతవర్షమక్ష్ణామ్।
సంక్రీడతాం చేతసి గోపకన్యా, ఘనస్తనస్వస్త్యయనం మహో నః॥

టీ. అఙ్కూ...విశేషైః—అఙ్కూరిత = అంకురించిన, స్మేర = చిఱునవ్వుతోఁగూడిన, దశావిశేషైః = అవస్థాభేదములచేత- చిఱునవ్వు చిగురొత్తుచుండు పలువిధములైన దశలచేత ననుట—అప్పుడప్పుడు వింతలు గులుకుచుండు పలువగల చిఱునవ్వుమొలకలచేత నని భావము, అక్ష్ణామ్ = కన్నులకు—చూచువారికన్నులను అనుట, అశ్రాన్త...వర్షమ్-అశ్రాన్త = ఎడతెగని, హర్ష = ఆనందమనెడి, అమృతవర్షమ్ = అమృతవర్షమైనదియు - ఎడతెగక కురియు అమృతవృష్టివలె ఎడతెగని యానందమును గూర్చుచున్నది యనుట-చిఱునవ్వుమొలకలు అమృతప్రాయములనియు వానిని నెఱపుటచే అమృతవర్షము కురిసినట్లుండు ననియు భావము. ఇట్టిదియు, గోప...స్వస్త్యయనమ్-గోపకన్యా = గోపస్త్రీలయొక్క, ఘన = గొప్పలైన 'ధన్యా' అనుపాఠమున, కృతార్థములైన-శ్రీకృష్ణకరగ్రహణముచేఁ జరితార్థములైన యనుట, స్తన = చన్నులయొక్క, స్వస్త్యయనమ్ = మంగళాయతనమైనదియు-చన్నులకు ఆలింగనగ్రహణాదులచే మిక్కిలిసుఖము అనెడిమేలును గూర్చునదియనుట, అగు, మహః = కాంతి-తేజస్సు, నః=మాయొక్క, చేతసి = మనస్సునందు, సంక్రీడతామ్ = లెస్సగాఁ గ్రీడించుఁగాక.

చ. అతులితమందహాసరుచిరాననముల్ విలసిల్ల దర్శనో
ద్యతజనితావలోకఘనహర్షసుధామయవర్షరూప మై
సతతము గోపికాఘనకుచస్థలనిస్తులదివ్యమంగళా
యతనము నైనధామము నిరంతరమున్ జనియించు నామదిన్.

తా. అప్పుడప్పుడు వింతవింతలుగ మొలకొత్తు చిఱునవ్వులచేఁ గన్నులకు విడ తెగనియమృతపుసోనలు గురియుచుండునదియు, గొల్లపడుచులచన్నుఁగవలకు నిబ్బరమైన యానందము గూర్చునదియు నగుకృష్ణాఖ్యతేజము మాహృదయమందు గ్రీడించునుగాక.

శ్లో॥ మృగమదపఙ్కసఙ్కరవిశేషితవన్యమహా
గిరితటగణ్డగైరికఘనద్రవవిద్రుమితమ్।
అజితభుజాన్తరం భజత హే బత గోపవధూ
స్తనకలశస్థలీఘుసృణమర్దనకర్దమితమ్॥ 47

టీ. మృగ...విద్రుమితం—మృగమద=కస్తూరియొక్క, పఙ్క = బురదయొక్క, సఙ్కర=కూడికచేత, విశేషిత=అతిశయించినదిగాఁ జేయఁబడిన, వన్య=అడవియందలిదయిన, మహాగిరి=గొప్పపర్వతముయొక్క, తట=చఱియయందలి, గండ=పెనుబండలయొక్క, గైరిక-గైరికధాతువిశేషములయొక్క, ఘన=దట్టమయిన, ద్రవ = ద్రవముచేత, విద్రుమితమ్=పగడముగాఁ జేయఁబడినదియు-ఎఱ్ఱగాఁ జేయఁబడినది యనుట, కస్తూరికూడికచే మఱింత అతిశయించిన ఎఱ్ఱని గైరికధాతుద్రవమును బూసికొని ఎఱ్ఱగా అగపడునది యనుట, ఇట 'గిరి'ని వన్యమగుటచేత వనమందలి కస్తూరిమృగములు సంచరించుటకు యోగ్యమైన దనియు, 'మహా' అనుటచే లెక్కలేనియామృగములు సంచరించుటకుఁ దగినదనియు కావున నే వానివలనిమృగమదము, 'పఙ్క' బురద గొన్నదనియు, 'తటగండ'ము లనుటచే దానిచఱియలయందలిపెనుబండలయందు ఆమృగములు పరుండుటచే వానికస్తూరి యంటుకొన్నదనియు, ఆకస్తూరితోఁగలసి గుబాళించుటచే గైరికధాతుద్రవమును బూసికొన్నాఁడనియు, 'పఙ్కసఙ్కర'అని ఆకస్తూరి మిక్కిలి బురదగొన్నదిగావున అట్టిదానితోఁ గలిసియే గైరికధాతుద్రవము, 'ఘన' మైనదనియు, 'ఘనద్రవ' అని చిక్కనిద్రవమును బూసికొనుటవలన నల్లని లోమ్ము 'విద్రుమితమ్' పవడమువలె అయిన దనియు, భావములు సూచితములు, గోపవధూ...కర్దమితమ్-గోపవధూ = గోపస్త్రీలయొక్క, స్తనకలశ=కలశములవంటి స్తనములయొక్క, స్థలీ=ప్రదేశమందలి, ఘుసృణ=కుంకుమముయొక్క, మర్దన= ఒరపిడిచేత, కర్దమితమ్=బురద గలిగినదిగాఁ జేయఁబడినదియు-గోపస్త్రీలయాలింగనములచేత వారిచన్నులఁబూసిన కుంకుమపూఁతలు మిక్కిలియంటుకొని రొంపిగొన్నది

యనుట, ఇట 'కర్దమితమ్' అని రొంపిగొనుటను జెప్పుటచేత అంటుకొన్నపంకము మిక్కిలి యనియు అది మిక్కిలియైనందులకు హేతువు అనేకగోపస్త్రీలయాలింగన మనియు సూచితము. ఇట్టిదైన, అజితభుజాన్తరమ్-అజిత = జయింపరానివాఁడైన కృష్ణునియొక్క, భుజాన్తరమ్=ఱొమ్మును, బత హే=ఓజనులారా, భజత=సేవింపుఁడు, గైరికధాతుద్రవముచే మిక్కిలి సుందరమైన గోపీకుచపంకసంగతిచే శృంగార రసము చిప్పిలఁజేయువక్షమును గొలువుఁడని హృదయము. ఆవక్షముయొక్క విశాలత్వమును ఉన్నతత్వమును స్ఫురించుటచే అది గలకృష్ణుఁడు 'అజితుఁ'డని స్ఫురించెనని కవిహృదయము.

చ. మృగమదపంకసంకరగిరిస్థితగైరికధాతురక్తిమం
దొగరు వహించి వల్లవవధూపృథులస్తనకుంకుమంబునన్
ద్విగుణితకాంతివక్షుఁ డగునీరరుహాక్షుఁ గృపాకటాక్షుని
దగిలి భజింప నిల్పుఁడు ముదంబున నుత్తములార చిత్తముల్.

తా. అడవియందలి పెద్దపర్వతముయొక్క చఱులయందలిబండలయందు కస్తూరిపిల్లులు లెక్కలేనివి బరుండఁగా వానిపొక్కిటికస్తూరి మిక్కిలియు అందు అంటుకొని రొంపికొనియుండును. ఆబండలందలి యెఱ్ఱనిధాతుద్రవము ఆకస్తూరిపంకముతోఁ గూడుకొని అనువై గుబాళించుచుండును. అట్టిచిక్కనైన యెఱ్ఱని గైరికరసముపూఁత గలిగి పగడమువలె కనఁబడునదియు గొల్లయిల్లాండ్రగబ్బిగుబ్బలపంకముపూఁత దట్టముగానంటుకొన్నదియునగు శ్రీకృష్ణునివక్షమును జనులారా! భజింపుఁడు.

శ్లో॥ ఆమూలపల్లవితలీల మపాఙ్గజాలై
రాసిఞ్చతీ భువన మాదృతగోపవేషా।
బాలాకృతి ర్మృదులముగ్ధముఖేన్దుబిమ్బా
మాధుర్యసిద్ధిరవతాన్మధువిద్విషో నః॥ 48

టీ. ఆమూల...లీలం యథాతథా-ఆమూల=మూలపర్యంతము - మొదలంట, పల్లవిత=చిగిర్చిన-చిగురొత్తిన, లీలమ్ యథాతథా = లీలలుగలుగునట్లుగా, నిలువెల్ల విలాసములుగా ననుట, అపాఙ్గజాలైః — అపాఙ్గ = కడగంటిచూపులయొక్క, జాలైః=సమూహములచేత, భువనం=ప్రపంచమును, ఆసిఞ్చతీ=అంతటను తడుపుచున్నదియు-నిలువెల్ల తలుపు దోఁగునట్లుగా కడగంటిచూడ్కులు జగములకెల్ల చల్లగా నిగుడ్చుచున్నదియనుట, ఆదృత...వేషా—ఆదృత=ఆదరింపఁబడిన - కయికొనఁబడిన, గోపవేషా=గొల్లవేషము గలదియు, బాల + ఆకృతిః-బాల=బాల్యసంబంధియైన, ఆకృతిః=ఆకారముగలదియు-బాలునియాకారముగలదియు, మృదుల ... బిమ్బా-మృదుల=కోమలమును, ముగ్ధ=సుందరమును, అగు, ముఖ + ఇన్దుబిమ్బా=చంద్రబింబముతో సమానమైన మొగము గలదియు, అగు, మధువిద్విషః=శ్రీవిష్ణుదేవుని

యొక్క, మాధుర్యసిద్ధిః—మాధుర్య = సౌందర్యముయొక్క లేక అతిభోగ్యత్వము యొక్క, సిద్ధిః=ఫలపరిపాకము-నిరతిశయమాధుర్యసర్వస్వ మనుట, నః=మమ్ము, అవతు=రక్షించుఁగాక-శ్రీవిష్ణుదేవుని మాధుర్యమంతయు పరిణమించి గోపవేషము గలబాలకృష్ణుఁడుగా పొడసూపినదనుట. శ్రీవిష్ణుని యవతారములలోనెల్ల శ్రీకృష్ణావతారమే నిరతిశయమాధుర్యము గలది. ఎట్లన, అది 'అమూలపల్లవితలీల' ముగా అపాంగజాలమును నిగుడ్చుచున్నది 'మృదులముగ్ధ' మై "ఇన్దుబిమ్బ" మువంటి మొగము గలిగియున్నది. అందఱికిని ఆదరణీయమైన 'బాలాకృతి'యు, ఆశ్రయణీయమైన 'గోపవేష' మును దాల్చి సుఖము గూర్చునది. ఇట్లు అన్నిట అత్యంతమధురమైనది గావున విష్ణుదేవుని మాధుర్యముయొక్క సిద్ధియే యిది యనఁదగు నని భావము. 'బాల్యాకృతిః' అనుపాఠమున 'ఆకృతి'ని కర్తగాఁగొని 'మాధుర్యసిద్ధి'ని దానికి విశేషణముగాఁ గొందఱు అర్థముసేయుచున్నారు కాని అది సరసము కాదు, అపాఙ్గజాలములు భువనమును 'ఆసిఞ్చతీ' తడుపుచున్నవనుటచేఁ కరుణాతిశయప్రేరితము లైనవనియు, 'అమూలపల్లవితలీల' మనుటచే అత్యంతాకర్షకము లైనవనియు, మాధుర్యసిద్ధికి పోషకములుగా కవి గూర్చుట తెలియుచునది.

చ. కరుణను బాదుకొల్పినజగంబుఁ గటాక్షసుధారసాప్తిచేఁ
బరిణతపల్లవప్రసవపక్వఫలంబును గా నొనర్చుచుం
జిఱుతమిటారిప్రాయమునఁ జెల్వగుచక్కఁదనాలపంట న
మ్మురహరుఁ బూర్ణచంద్రముఖు మోహనవల్లవవేషుఁ గొల్చెదన్.

తా. నిలువెల్ల విలాసములు దొలఁకుచును, కడగంటిచూడ్కుల జగమునంతయుఁ జల్లఁగాఁ దడుపుచున్నవాఁడును, గోపవేషము దాల్చినవాఁడును, సుకుమారమై సుందరమై చందురునిం బోలు మొగము గలవాఁడును, బాలుఁడును, శ్రీవిష్ణుదేవుని నిరవధికమాధుర్యస్వరూప మనఁదగినవాఁడును అగు చిన్నికృష్ణుఁడు మమ్ము రక్షించుఁ గాక.

శ్లో॥ విరణన్మణినూపురం వ్రజే, చరణామ్భోజ ముపాస్వ శార్ఙ్గిణః।
సరసే సరసి శ్రియాశ్రితం, కమలం వా కలహంసనాదితమ్॥ 49

టీ. వ్రజే=వ్రేపల్లెయందు, విరణ...నూపురమ్-విరణత్=మిక్కిలి మ్రోఁగుచున్న, మణి=మణిమయమైన, నూపురం=అందెలు కలదియగు, శార్ఙ్గిణః=కృష్ణుని యొక్క, చరణ+అమ్భోజమ్=అడుగుఁదామరను, ఉపాస్వ=సేవింపుము. వ్రజచ్చరణామ్భోజమ్ అను పాఠమున-వ్రజత్=నడచుచున్న, చరణాంభోజమని యర్థము. కావుననే అది విరణన్మణినూపురమని భావము, వా=లేక, సరసే=రసయుక్తమైన-మనోజ్ఞమైన యనుట, సరసి=సరస్సునందు, శ్రియా=కాంతిచేత, ఆశ్రితమ్=ఆశ్రయింపఁబడినదియు, కల...నాదితమ్- కలహంసః=రాయంచచేత, నాదితమ్=ధ్వని గలదిగాఁ జేయఁబడినదియు, అగు, కమలం= కమలమును, ఉపాస్వ=సేవింపుము.

మణులకాంతులు తళుకొత్తుచు గలగల మెఱయుచున్న అందెలుగల కృష్ణునిపాద కమలమును, కాంతి దళుకొత్తుచు కలహంసచే శబ్దించుచున్న సరస్సునందలికమలమును సమానములు గావున దానినైనను వీనినైనను సేవింపుమని యర్థము. పాద కమలమునకు విరణన్నూపుర మనుటకు సరిగా సరఃకమలమునకు కలహంసనాదిత మనియు, దానికి మణినూపుర మనుటకు సరిగా దీనికి శ్రియాశ్రిత మనియు విశేషణవ్యవస్థ తెలియునది.

ఉ. సారసకోమలాళవరసారసనన్నిభమూత్నరత్నమం
జీరవిలాసపాదములచేఁజరియించుచు వీధి లేఁగలం
బాఱఁగ దోలి వెంబడిన పర్వులువాఱుచుఁ జేరి పట్టుచుం
గేరి నటించుచిన్నియమునకేసరి నామది నాశ్రయించెదన్. 49

తా. వ్రేపల్లెయందు మణికాంతులు మెఱయ గలగల మొరయునందియలతోఁ గూడినశ్రీకృష్ణునిపాదకమలము, సరస్సున కాంతి తళుకొత్తఁగా కలహంసయొక్క శబ్దించుచున్నతామరవలెఁ జూపట్టుచున్నది. అట్టి శ్రీకృష్ణచరణమును సేవింపుము.

శ్లో॥ శరణ మశరణానాం శారదామ్భోజనేత్రం
నిరవధిమధురిమ్ణా నీలవేషేణ రమ్యమ్।
స్మరశరపరతన్త్రిస్మేరనేత్రామ్బుజాభి
ర్వ్రజయువతిభి రవ్యాద్బ్రహ్మసంవేష్టితం నః॥ 50

టీ. అశరణానాం=దిక్కులేనివారలకు, శరణమ్=దిక్కు-రక్షకము, అయినదియు, శారద... నేత్రమ్-శారద=శరత్కాలమందలి, అమ్భోజ=తామరలవంటి, నేత్రమ్=కన్నులుగలదియు, నిరవధిమధురిమ్ణా-నిరవధి=మేరలేని, మధురిమ్ణా=చక్కఁదనముగల, నీలవేషేణ=నల్లవేషముచేత, రమ్యమ్=మనోహరమైనదియు, స్మర... జాభిః—స్మర=మన్మథునియొక్క, శర=బాణములకు, పరతన్త్రి=అధీనములైన-మన్మథవికారము గలవియైన, స్మేర=వికసించిన, నేత్ర+అమ్బుజాభిః=తామరలవంటికన్నులు గలవారైన, వ్రజయువతిభిః=గోపికలచేత, సంవేష్టితం=చక్కఁగాఁ జుట్టుకొనఁబడినదియు, గోపస్త్రీలు మన్మథవికారము తెలుపుచూడ్కులఁ జూచుచుఁ జుట్టును మిక్కిలి బలసియున్నారనుట, ఇట్టిదైన, బ్రహ్మ=శ్రీకృష్ణాఖ్యబ్రహ్మము, నః=మమ్ము, అవ్యాత్=కాపాడుఁగాక.

మ. శరదంభోరుహనేత్రు నిస్తులకళాసౌందర్యపాత్రుఁ మనో
హరపౌరందరనీలగాత్రుఁ గుసుమాస్త్రావేశజాతస్మితాం
కురనంద వ్రజసుందరీపరివృతుం గోపాంగనాలింగితుఁ
శరణత్రాణసమున్నతుఁ వరదయాసారోన్నతుం గొల్చెదన్.

తా. దిక్కులేనివారికి దిక్కై, శరత్కాలమున వికసించినతామరరేకులఁ బోలిన కన్నులు గలిగి, మిక్కిలిచక్కనైననల్లనిమేను దాల్చి, గోపస్త్రీలు మన్మథపరవశలై మోహంపుఁజూడ్కులు నిగుడ్చుచుఁ జుట్టును మిక్కిలి బలసి కొలువఁగా, వెలుఁగుచున్న శ్రీకృష్ణాఖ్యబ్రహ్మము మమ్ము రక్షించుఁగాత.

శ్లో॥ సువ్యక్తకాన్తిభరసౌరభదివ్యగాత్ర
మవ్యక్తయౌవనపరీతకిశోరభావమ్।
గవ్యానుపాలనవిధావనుశిష్ట మవ్యా
దవ్యాజరమ్య మఖిలేశ్వరవైభవం నః॥ 51

టీ. సువ్యక్త...గాత్రమ్-సువ్యక్త = మిక్కిలిస్ఫుటమైన-ప్రకాశించుచున్న, కాంతి=కాంతులయొక్క, భర=అతిశయముచేతను, సువ్యక్త=మిక్కిలిస్ఫుటమైన, సౌరభ=వాసనచేతను, దివ్య=సుందరమైన-అప్రాకృతమైన, గాత్రం=దేహము గలదియును, అవ్యక్త...భావమ్ - అవ్యక్త=స్ఫుటముకాని - చక్కఁగాతలచూపని, యౌవన=యౌవనముచేత, పరీత = ఆవరింపఁబడిన, కిశోరభావమ్ = బాలభావము-బాల్యముగలదియు-యౌవనము కొంత తలచూపుచున్న బాల్యము గలదియు,గవ్య...విధౌ-గవ్య=గోసమూహముయొక్క, అనుపాలన=కాచుటయొక్క, విధౌ=విధానమందు, అనుశిష్టం=శిక్షితమైనదియు - మిక్కిలి నేర్పుగలదియు, అవ్యాజరమ్యమ్-అవ్యాజ=నిరుపాధికమైన-ఒకనెపముచేతఁగాని, రమ్యమ్=రమణీయమైనదియు, ఒకనిమిత్తముచేతఁగాక తనంతటనే సుందరమైనది యనుట, అఖిల...వైభవమ్-అఖిల+ఈశ్వర=సమస్తమునకును ఈశ్వరుఁడైన శ్రీవిష్ణుదేవునియొక్క, వైభవమ్=విభవము, శ్రీకృష్ణాఖ్యవైభవమనుట, నః=మమ్ము అవ్యాత్ =రక్షించుఁగాక-శ్రీవిష్ణునివైభవమే యిట్లు కృష్ణరూపముగాఁ బొడకట్టినదనుట. అవతారములలో నెల్ల 'గవ్యానుపాలనవిధావనుశిష్టమ్' అనుటచే సూచితమైన కృష్ణావతారమే మిక్కిలి విభవవిశిష్టమైనదని భావము.

చ. ప్రకటితకాంతిసౌరభకదంభితగాత్రము యౌవనార్భటీ
చకితకిశోరభావము నిసర్గమనోహరరూపధేయమై
సకలజగన్నియంతయగుశౌరిమహత్త్వము గొల్లపల్లెఁ బో
యక యొకయింట నావసులకై నారసి మేపెనిదేమిచిత్రమో. 51

తా. మిక్కిలి ప్రకాశించుచున్ననిరతిశయకాంతియు పరిమళమును గలిగి వెలయుచున్నశరీరము గలదియు, ఒకింతయౌవనముతోఁ గూడినబాల్యము గలదియు, గోవులను మేపుటయందు నిపుణమైనదియు, స్వభావముచేతనే సుందరమైనదియు శ్రీవిష్ణుదేవుని విభవసర్వస్వమైనదియు నగుశ్రీకృష్ణమూర్తి మమ్ము రక్షించుఁగాక!

శ్లో॥ అనుగత మమరీణా మమ్బరాలమ్బినీనాం

నయనమధురిమశ్రీనర్మనిర్మాణసీమ్నామ్।
వ్రజయువతివిలాసవ్యాపృతాపాఙ్గమవ్యా
త్త్రిభువనసుకుమారం దేవకైశోరకం నః॥ 52

టీ. అమ్బర+ఆలమ్బినీనామ్—అమ్బర=ఆకాశమును, ఆలమ్బినీనాం=ఆశ్రయించినవారును, నయన...సీమ్నామ్—నయన=కన్నులయొక్క, మధురిమశ్రీ=సౌందర్యసంపదయొక్క, నర్మ=విలాసముయొక్క, నిర్మాణ=సృష్టికి, సీమ్నామ్=పొలిమేరయైనవారును — నేత్రసౌందర్యసంపద్విలాసమును ఇంతకంటె ఎక్కువసొగసుగా బ్రహ్మ మఱియెచ్చటను సృజింపలేదు గాన ఆవిలాసమును సృష్టిసేయునైపుణ్యమంతయు ఇందే చూపినాఁడనియు కనుక అట్టిసృష్టికౌశలమునకు ఇదియే పొలిమేరయనియు భావము-ఇచట నయనములయొక్క కేవల 'మధురిమ' మంతోఁడ 'శ్రీ' శబ్దము గూర్చుటచే, మాధుర్యముయొక్క అతిశయమును 'నర్మ' శబ్దముచే దానిని అతిమోహనముగాఁ బచరించెడివిలాసమును, 'నిర్మాణసీమ్నామ్' అనుటచే అది నిరతిశయమైనదగుటయుఁ దెలియునది-కన్నులసౌందర్యాతిశయముయొక్క విలాసమంతయు నిరతిశయముగా నెఱపుచున్నవారనుట — మిక్కిలిసొగసైనకన్నులతో ఎనలేనివిలాసంపుఁజూడ్కులను నిగుడ్చుచున్నవారని భావము — మిక్కిలి సొగసైనకులుకుఁజూపులఁజూచుచున్నవారనుట, ఇట్టివారగు, అమరీణామ్=దేవతాస్త్రీలకు — దేవతాస్త్రీలచేత, అనుగతమ్=వెంటనంటఁబడినదియు— దేవతాస్త్రీలు కృష్ణుని బాల్యంపుసొంపును జూడుటకై ఆకాశమునందు వచ్చి నిలిచి అతనికైశోరముపై సొగసుంజూడ్కుల మిక్కిలియొయ్యారముగా నిగుడ్చుచు దానిచెలువునకు ఆకృష్టలై ఆకృష్ణుఁడు తిరుగు చోట్లకెల్లను వెంటఁబడి తిరుగుచున్నారని భావము. ఇట్టిదియు, వ్రజ...పాఙ్గమ్-వ్రజయువతి=గోపస్త్రీలయొక్క, విలాస = ఒయ్యారములందు, వ్యాపృత=నిగుడ్పఁబడిన, అపాఙ్గమ్=కడకన్నులుగలదియు — గోపికలకులుకుబెళుకులను కడగంటఁ జూచునది యనుట, త్రిభువ...కుమారమ్-త్రిభువన = ముల్లోకములందును, సుకుమారమ్=కోమలమైనదియు అగు, దేవకైశోరకమ్-దేవ = శ్రీకృష్ణునియొక్క, కైశోరకమ్ = బాల్యము, నః=మమ్ము, అవ్యాత్=కాపాడుఁగాక, 'త్రిభువనసుకుమార' మైనదిగాన నే దేవతాస్త్రీలును వచ్చిచూచి వెంటఁదగులునట్టి దయ్యెననుట, 'దేవకైశోరకమ్' అనుచో 'దేవ'శబ్దమునకు 'వ్రజ...పాఙ్గ'మనుటచే కృష్ణుఁడనియర్థము సూచితమైనది. సర్వోత్కృష్ట సౌందర్యాతిశయము గలదేవతాస్త్రీలు తన్నుఁజూడఁగా తాను గోపలగోపికాజనులవిలాసమును జూచువాఁడయ్యెనని సౌలభ్యచమత్కారము స్ఫురితము.

శా. లోలాలోకనహావభావముల నాకలోకించుచుర్ దేవతా
నాళీకాస్యలు మింట నంటి తిరుగన్ శ్రీనందవ్రజాంభోరుహా
క్షీలీలార్ద్రకటాక్షవీక్షలనురక్తిం బర్వఁ ద్రైలోక్యర
మ్యాలంకారము నై చెలంగుహరిబాల్యప్రౌఢి నన్ బ్రోచుతన్.

తా. దేవతాస్త్రీలు ఆకాశంబున నిలిచి మితిలేని విలాసము గలుగు సోగసుం జూపులఁ దనబాల్యంపుసొంపును జూచి సొక్కి తాను బోవుచోటికెల్లఁ బయిని వెంట నంటి రాఁగా, గొల్ల చెలువలయొయ్యారములందుఁ గడగంటిచూడ్కులు నిగుడ్చుచు, మల్లోకములందును మిక్కిలి సుందరంబైన బాల్యవేషముతో నొప్పు శ్రీకృష్ణుఁడు మమ్ముఁ గాపాడుఁగాత.

శ్లో॥ ఆపాదమాచూడ మతిప్రసక్త్యా,రాపీయమానా యమినాంమనోభిః।
గోపీజనజ్ఞాతరసావతాన్నో, గోపాలభూపాలకుమారమూర్తిః॥ 53

టీ. ఆపాదమ్ = పాదము మొదలుకొని, ఆచూడమ్ = శిరస్సువఱకును, నిలువు నందంతయు, అతిప్రసక్త్యా=మిక్కిలి యాసక్తి గలిగిన, యమినాం = మునులయొక్క, మనోభిః = మనస్సులచేత, ఆపీయమానా = మిక్కిలి పానముసేయఁబడుచున్నదియు, మునులు శ్రీకృష్ణదివ్యమంగళవిగ్రహమును నిలువెల్ల మనస్సులచే ఆస్వాదించుచు న్నారనుట—మనస్సునఁ జింతించి యనుభవించుటచే అతిభోగ్యమైన సౌందర్యసౌకు మార్యాదులు గలది యనుట, 'అతిప్రసక్త్యా' అనుటచే మునుల ఆతురత్వమును 'ఆపీ యమానామ్' అనుటచే ఆస్వాదనమునందలి భోగ్యతాప్రయుక్త మైనత్వరయు దెలి యుచున్నది, దప్పిగొన్నవాఁడు మిక్కిలి రుచ్యమైన పానీయమును మీఁదుమిక్కిలి త్రాగునట్లు మునులమనస్సులును మిక్కిలి యాతురములై యావిగ్రహసౌందర్యామృ తమును మిక్కిలి పానముచేయుచున్న వనుట—మునులు అవిగ్రహమును ఆత్యాసక్తితో మనసుల నిలిపి అతిభోగ్యమైన దానిసౌందర్యమును జింతించి యానందముతో మీఁదుమిక్కిలి యనుభవించుచున్నారని భావము, గోపీ...రసా—గోపీజన = గోపికల సమూహముచే, జ్ఞాత=ఎఱుఁగఁబడిన, రసా = రసము గలదియు—గోపికలు ప్రత్యక్షము గా ఆమూర్తిని అనుభవించి దానిసౌందర్యాదిసారస్యమును ఎఱుఁగుదు రనుట, ఇట్టి దైన, గోపాల...మూర్తిః—గోపాలభూపాల=గోపకుల రాజైన నందునియొక్క, కుమా ర=కొడుకైన కృష్ణునియొక్క, మూర్తిః = విగ్రహము, నః = మమ్ము, అవతాత్ = రక్షించుఁగాక.

మ. విమలాపాంగవిలాసగోపమహిళాసంవిజ్ఞాతసారస్యముం
దమితో నువ్విళు లూరు డెందములచేఁ దత్కాలమాను లాపాదమ
స్తము నాపోవఁగ నానునట్టిసుమమూర్తసౌభాగ్యధారామనో
జ్ఞము గోపాలక బాలరూపము మహోత్సవందంబు మీ కిచ్చుతన్. 53

తా. మునులు దేనిని మిక్కిలియాసక్తితో అడుగు మొదలుకొని శిరస్సువఱకును దమ మనస్సులందుఁ జింతించి దానిసౌందర్యమును ఆనందముతో అనుభవించుచుందు రో, దేనియొక్క సౌందర్యాదిరూపమైన సారస్యము గోపస్త్రీలు ప్రత్యక్షముగా అను భవించియెఱుంగుదురో యట్టినందకుమారునిసుందరవిగ్రహము మమ్ము రక్షించుఁగాత.

శ్లో॥ దిష్ట్యా బృన్దావనమృగదృశాం విప్రయోగాకులానాం

ప్రత్యాసన్నం ప్రణయచపలాపాఙ్గవీచీతరఙ్గైః।
లక్ష్మీలీలాకువలయదళశ్యామలం ధామ కామాన్
పుష్ణీయాన్నః పులకముకుళాభోగభూషావిశేషమ్॥ 54

టీ. విప్రయోగ + ఆకులానామ్—విప్రయోగ = ఎడఁబాటుచేత - కృష్ణుఁడు తమ్ము గొంతసేపు ఏమఱించిమఱుఁగై యెడబాయుటచేత ననుట, ఆకులానాం = కలఁగినవారైన, బృన్దావనమృగదృశామ్ = బృందావనమందలి స్త్రీలకు-గోపికలకు అనుట, ప్రణయ...తరఙ్గైః-ప్రణయ=ప్రేమచేత, చపల=చంచలములైన, అపాఙ్గ = కడగన్నులయొక్క - కడగంటిచూపులయొక్క, వీచీతరఙ్గైః = వీచీతరంగములచేత - వీచీతరంగరూపమైన వ్యాపారములచేత ననుట, సముద్రమందు అలలు వరుసగా ఒకటి నొకటి ఎడతెగక పోఁదుటచే అన్నియు జరిగి గట్టు చేరుచున్నవి. ఇట్లు విడువక పైపయి ఒకటివెనుక నొకటిగా నెడతెగక వరుసగఁ జేయువ్యాపారమునకు వీచీతరంగన్యాయమని పేరు. ఇచట అపాంగముల వీచీతరంగములనఁగా-అపాంగముల యెడతెగక పయిపయి నిగుడుచుండువరుస లనుట-గోపికల నెడఁబాసి అలంచినవాఁడుగావున వారివిరహాగ్ని యుపశమించునట్లు ప్రేమతోడిచల్లని బెళుకుఁజూపులను బయిపయి నెడతెగక నిగిడ్చినదనుట, ఇట్టిచూపులు గలదై, పులక...విశేషమ్ - పులకముకుళ-మొగ్గలవంటిగగుర్లయొక్క, ఆభోగ = పరిపూర్ణత యనెడి, భూషావిశేషమ్ యథా తథా = ఆభరణవిశేషము గలుగునట్లుగా-ఆగోపికల మేనులు గగుర్లచేత నలంకృతము గునట్లుగా, దిష్ట్యా = అదృష్టవశమున-భాగ్యవశమున, ప్రత్యాసన్నం = మిక్కిలి సమీపించివచ్చినదియు, లక్ష్మీ...శ్యామలమ్—లక్ష్మీ=లక్ష్మీదేవియొక్క, లీలా=విలాసార్థమైన, కువలయదళ = కలువపూరేకులవలె, శ్యామలం = నల్లనైనదియు, కేవలము 'కువలయదళ' మని చెప్పక 'లక్ష్మీలీలాకువలయదళ' మనుటవలన లక్ష్మీదేవి తాల్చుటచే అతిభోగ్యమైనకువలయదళ మని యర్థము - అనఁగా నల్లనికాంతిచేత మనోజ్ఞమై లక్ష్మీదేవి తాల్చుటచే భోగ్యము నైనకువలయదళ మని యర్థము. అట్టిదానివలె నల్లనై భోగ్యమైన కాంతి గలది యనుట. ఇట్టిదైన, ధామ = శ్రీకృష్ణాఖ్యతేజము, నః=మాయొక్క, కామాన్ = కోర్కులను, పుష్ణీయాత్ = పోషించుఁగాక-సఫలము సేయుఁగాక యనుట. పులకములను ముకుళము లనుటచే మొగ్గలవలె మిక్కిలి గగుర్పొడిచె ననియు దీనికి మూలమైన యానందాతిశయమును దెలియునది, అట్టిపులకలను 'భూషావిశేషమ్' అనుటచే సొమ్ములు దాల్చినట్లు మేనికిఁ జెలువుగాను సుఖముగాను నుండెనని గ్రాహ్యము.

మ. విరహోష్మన్ వ్రజభామినుల్ గరఁగి యుక్కవ్విళ్ళూర భాగ్యంబునం
దరళాపాంగతరంగసంతతుల సేదల్ దీర్చుచున్ వచ్చి ని
ర్భరరోమాంచవిశేషభూషుఁ డగుగోపాలుండు పద్మాలయా
కరనీలోత్పలనీలవర్ణుఁ డొసఁగున్ గళ్యాణపారంపరిన్. 54

తా. బృందావనమందు గోపికలను లీలార్థము ఎడఁబాసిపోవఁగా ఆవియోగముచే వారు కలఁగి నలంగుటఁ జూచి ప్రేమ దొలఁకు బెళుకుఁగడగంటిచూపులను ఎడతెగక పైపయి వారిమీఁదఁ జల్లగా నిగుడ్చుచు విరహాగ్నిని పోఁగొట్టుచు, వారలభాగ్యవశమున వారలమేనులు మిక్కిలిగగుర్పొడుచునట్లు సమీపమునఁ బొడగట్టినవాఁడును, లక్ష్మీదేవి విలాసముగా ధరించిననల్లకలువపూరేకువలె నింపైన నల్లనికాంతి గలవాఁడును, తేజస్స్వరూపుఁడును నైనశ్రీకృష్ణుఁడు ఆగోపికల విరహాగ్ని దీర్చినట్లు మాయభీష్టములను ఒసఁగూర్చుఁగాత.

శ్లో॥ జయతి గుహశిఖీన్ద్రపిఞ్ఛమౌళిః, స్సురగిరిగైరికకల్పితాఙ్గరాగః।
సురయువతివికీర్ణసూనవర్ష, స్నపితవిభూషితకున్తలః కుమారః॥ 55

టీ. గుహ...మౌళిః-గుహ = కుమారస్వామియొక్క, శిఖి+ఇన్ద్రః=నెమిలిమిన్నయొక్క, పిఞ్ఛ = పురి గల, మౌళిః=సిగగలవాఁడును-తన్ను సేవించుటకై వచ్చిన కుమారస్వామివాహనమైన నెమిలియొక్కపురిని సిగయందుఁ జెరువుకొన్నవాఁడనుట, సుర...రాగః-సురగిరి = మేరుపర్వతముయొక్క, గైరిక = గైరికధాతువులచేత, కల్పిత=కల్పింపఁబడిన, అఙ్గరాగః = మైపూఁత గలవాఁడును, ఇట మేరుపర్వతమును జెప్పుటచే అచ్చట వసించుదేవతలును, సేవింపవచ్చిరనియు వారా గైరికచందనము ఒసంగిరనియుఁ దెలియునది, సుర...కున్తలః-సురయువతి = దేవతాస్త్రీలచేత,వికీర్ణ = చల్లఁబడిన, సూనవర్ష = పుష్పవర్షముచేత, స్నపిత = తడుపఁబడినదై, విభూషిత= అలంకృతమైనట్టి-ఆపుష్పములచే అలంకృతమై యున్నట్టి, లేక, విభూషిత = తాయెతులు మొదలైనవానిచే అలంకృతమైనట్టి, కున్తలః=కురులు గలవాఁడును, అగు, కుమారః=బాలుఁడైన శ్రీకృష్ణుఁడు, జయతి = సర్వోత్కృష్టుఁడయి వర్తించుచున్నాఁడు. 'పిఞ్ఛమౌళి' యనుటచే ఇతరమూర్తివ్యావృత్తియుఁ దెలియునది. కుమారాదిదేవతలకు ఉపాస్యుఁ డగుటచేఁ గృష్ణుఁడు దేవదేవుఁ డనుట వ్యంజితము.

మ. సురకన్యాకరముక్తకల్పకసుమస్తోమంబు లొయ్యారపుం
దఱుచుం బెన్నెఱిగుంపుపై నిలిపి చెంగ్రతం దాయెతుల్ జుట్టి ని
ర్జరధాత్రీధరధాతుధారఁ జెలువార్పారం బూని సేనానివా
పురపుంబింఛపుఁదాపిళం బమర దేవుం డొప్పు బాల్యోన్నతిన్.

తా. తన్ను సేవింపవచ్చినకుమారస్వామివాహనమైన నెమిలియొక్క పురిని సిగయందుఁ జెరివి, మేరుపర్వతమందలి గైరికధాతువుపంకమును మేనఁ బూసికొని, తనసింగారపుఁజెలువునకు మెచ్చి దేవతాస్త్రీలు పువ్వులసోనఁ దనతలపైఁగురియఁగా మురువునూపుచున్న బాలకృష్ణుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తించుఁగాక.

శ్లో॥ మధురమన్దశుచిస్మితమఞ్జులం, వదనపఙ్కజమఙ్గజవేల్లితమ్।

విజయతాం వ్రజబాలవధూజన, స్తనతటీవిలుఠన్నయనం విభోః॥56

టీ. మధుర...మఞ్జులమ్-మధుర = మనోజ్ఞమైనదియు, మన్ద = కొంచెమైనదియు, అఙ్గజవేల్లితమ్_అఙ్గజ = మన్మథునిచేత, వేల్లితమ్ = చలితమైనదియు-మన్మథవికారప్రయుక్తమైనవ్యాపారములు గలదియనుట, వ్రజ...న్నయనమ్ వ్రజ = వ్రేపల్లెయందలి, బాలవధూ = బాలలైన స్త్రీలయొక్క_గోపబాలికలయొక్క, జన = సమూహముయొక్క, స్తనతటీ = కుచప్రదేశములందు, విలుఠత్ = మిక్కిలి పొరలుచున్న-మిక్కిలి తిరుగుచున్న, నయనం=కన్నులుగలదియు, అగు, విభోః = శ్రీకృష్ణునియొక్క, వదనపఙ్కజమ్ = మోముఁదామర, విజయతాం = సర్వోత్కృష్టమై వర్తించుఁగాక. 'అంగజవేల్లిత' మగుటచేతనే, 'వ్రజ...విలుఠన్నయన' మయ్యెనని తెలియునది.

మ. మురిపెంపుంజిఱునవ్వునివ్వటిలు కెంకెమ్మోవిఁ సుధాబిందువుల్
గురియం జొక్కపుమోముఁ జిత్తజునిచేఁ జొక్కుల్ సక్కఁగాఁ దీర్పన
బ్బురపుంబ్రాయపుగొల్లపల్లెకలికుం గ్రొంబాలిండ్లబి
త్తరపుంజన్నులఁ జూడు చూపు గలధూర్త స్వామి సెల్వొందెడిన్.

తా. ఇంపై, తెల్లనై యొప్పుచిఱునవ్వుచే నివ్వటిలునదియు, మన్మథవికారముచేఁ జలించునదియు, గోపబాలికలగుబ్బచన్నులందుఁ జూడ్కులు నెఱపుచుండునదియునగు ప్రభుండగుకృష్ణునితామరవంటి మొగము సర్వోత్కృష్టమై విలసిల్లుఁగాక.

శ్లో॥ అలసవిలసన్ముగ్ధస్నిగ్ధస్మితం వ్రజసున్దరీ
మదనకదనస్విన్నం ధన్యం మహద్వదనామ్బుజమ్।
తరుణమరుణజ్యోత్స్నాకార్త్స్న్యస్మితస్నపితాధరమ్
జయతి విజయశ్రేణీ మేణీదృశాం మదయన్మహః॥ 57

టీ. అలస...స్మితం_అలస = మందమైనదియు, విలసత్ = ప్రకాశించుచున్నదియు, ముగ్ధ = సుందరమైనదియు, స్నిగ్ధ = స్నేహముతోఁగూడినదియు-లేః నిద్రవుమెఱుఁగులుగలదియు, అగు, స్మితం = చిఱునవ్వుగలదియు, వ్రజ...స్విన్నమ్-వ్రజసున్దరీ =గొల్ల చెలువలతోడి, మదనకదన = మన్మథయుద్ధముచేత-రతిక్రీడచేత, స్విన్నం= చెమర్చినదియు, ధన్యం = కృతార్థమైనది_నిరుపాధికసుందరమైనదియు, తరుణ = లేతయైనదియు_ఎలప్రాయముతోఁ గూడినదియు, అరుణ...ధరం_అరుణ = ఎఱ్ఱని, జ్యోత్స్నా = వెన్నెలయొక్క, కార్త్స్న్య = అంతయునైన-ఎఱ్ఱనివెన్నెలపెంపుసొంపారుచున్న, స్మిత=చిఱునగవుచేత, స్నపిత = తడుపఁబడిన, అధరం = మోవిగలదియు-వ్రజసుందరీమదనకదనమునందుఁ గలిగినపలుగంట్లచే మోవి గొఱ్ఱనికాంతులు మఱియు నినుమడింపఁగా దానిపైఁబొలసినచిఱునవ్వు, తెలుపు మాని యెఱ్ఱనై యెఱ్ఱని వెన్నెలవలెఁ బ్రకాశించినదనుట_తెల్లనిచిఱునవ్వును ఎట్టగా మార్చునంతటియెఱ్ఱని కాంతి పెదవికిఁ గలిగించుటకై యందు దంతక్షతములు మిక్కిలిగా నుండు

నదనియు దానిచే గోపికలతోడి మదనకదనము మిక్కిలి గాఢమైనదనియుఁ గావున నే యట్టిరతిశ్రమముచే నలఁగిచెమర్చిన ముఖమును 'ధన్యం' అన్నాఁడనియుఁ దెలియు నది. ఇట్టిదియు, మహః=తేజోరూపమైనదియు - తేజోమయమైనది గావున కేవల తేజ మని చెప్పినాఁడు, ఇట్టిదగు, మహా...మ్బుజమ్-మహాత్=గొప్పదైన, వదన + అమ్బుజమ్= మోముఁదామర- కృష్ణుని తామరవంటి మొగ మనుట-ఇట, 'వ్రజసున్దరీ' అను వ్యావర్త కముచేఁ గృష్ణుని గ్రహించునది. ఏణీదృశాం=(లేడివంటి కన్నులుగల) స్త్రీలయొక్క, విజయశ్రేణీం=గెలుపులవరుసను=ఇచట, 'విజయ' మనఁ గార్యసిద్ధిగావున-కోర్కుల యొడఁగూడుట యగును. కనుక వరుసగా వారికోర్కులెల్ల నొడఁగూడుటను, మదయన్=మదింపఁజేయుచు-అతిశయింపఁజేయుచు- వారికోర్కులను మీఁదుమిక్కిలి యొడఁగూర్చుచుననుట, లేక 'విజయి శ్రేణీ మేణీదృశామ్' అని పాఠము గ్రహించి నచో, విజయి=జయశీలమైనదియు - సర్వాతిశాయియైనదనియు, ఏణీదృశామ్=స్త్రీల యొక్క, శ్రేణీం=సమూహమును, మదయన్=మదింపఁజేయుచున్నదియు - మరులు గొనఁజేయునది యని యర్థము. ఇట్టిదగుచు, జయతి=సర్వోత్కర్షముతో వర్తించు చున్నది.

మ. పొగఁ గ్రంగెంపులసొంపు నింపులలితంగ్రపుం దేటకెమ్మోవిపై
సొగసున్నిద్దపుఁదళ్కులేనగవుమోగ్రసుల్ మీఱ బృందావనీ
మృగనేత్రాసురతశ్రమాంబుకణికాగ్రన్మృద్వాననాబ్జంబుతోఁ
జిగురుంబోండ్ల విరాళిఁ గొల్వ్రరసికుల్ గ్రసేవించి భావించెదన్. 57

తా. సొగసై ప్రకాశించుచున్న చిఱునగవుతోఁ గూడి, గొల్లచెలువలతోడి రతిక్రీడలచేఁ జెమర్చి, యింతింతనరానిసొంపు పెంపు గులుకుచు, ఎలపరువంపుమురువు మీఱ, చిఱునవ్వు పోలని యొఱనివెన్నెలవలెఁ జెన్నొందుచున్న కెమ్మోవి గలిగి, చూచు స్త్రీలమఁ గోరినగోర్కులు అన్వారిగాఁదీర్చు నట్టికృష్ణుముఖారవిందము సర్వోత్కర్షముతో వర్తించుఁగాక.

శ్లో॥ రాధాకేళికటాక్షవీక్షితమహావక్షఃస్థలీమణ్డనా
జీయాసుః పులకాఙ్కురా స్త్రిభువనస్వాదీయస స్తేజసః।
క్రీడా స్నపతిసు స్తదుద్గతనయాముగ్ధావబోధక్షణ
త్రాసారూఢదృఢోపగూహనమహాస్రామ్రాజ్యసాన్ద్రశ్రియః॥ 58

టీ. త్రిభువనస్వాదీయసః - త్రిభువన=ముల్లోకములకును, స్వాదీయసః= మిక్కిలి యాస్వాదింపఁదగినదై- మిక్కిలి యానందముతో అనుభవింపఁదగినట్టి, తేజసః=శ్రీకృష్ణాఖ్యతేజస్సుయొక్క, రాధా... మణ్డనాః=రాధా=రాధాదేవియొక్క, కేళి=విలాసప్రయుక్తమైన, కటాక్ష=కడగంటిచూపులచేత, వీక్షిత=చూడఁబడిన, మహావక్షఃస్థలే=గొప్పదైన ఱొమ్ముప్రదేశమునకు, మణ్డనాః - అలంకారములైన వియు-రాధ, కృష్ణుఁడు మఱియొక స్త్రీని గూడెనో లేదో తెలియుటకై అతనితో

మ్మున మకరికాపత్త్రాదులు అంటియున్నవా యని కడగంట చూడనిదానివలె విలాస ముగా చూచినదనియు, ఆకడగంటిచూడ్కులచే కృష్ణునికి మరులు గలిగి గగ్గురువాడు వగా అదియాతనివిశాలవక్షమునకు ఒక యలంకారముగ నుండెననియు భావము, ఇట్టి దియు, క్రీడాన్త ... శ్రియః-క్రీడా + అన్త=రతికేళికడపట-రతిక్రీడ సలిపి యలసి కడపట, ప్రతిసుప్త=నిద్రించిన, దుగ్ధతనయా=(పాలసముద్రుని కూతురైన) లక్ష్మీ దేవియొక్క-లక్ష్మీరూపయైనరుక్మిణీదేవియొక్క, ముగ్ధ=మనోహరమైన, అవబోధ-మేలుకనుటయొక్క, క్షణ=క్షణమందలి, త్రాస=బెదరుచేత, ఆరూఢ=కలిగిన, దృఢ=గాఢమైన, ఉపగూహన=ఆలింగనమనెడి, మహాసామ్రాజ్య=సమ్రాట్టునకుఁ గల నిరతిశయమైన భోగవైభవముచేత నని యర్థము, సాన్ద్ర=మఱియు దట్టమైన, శ్రియః=సమృద్ధిగలవియును, రుక్మిణీదేవి రతిక్రీడసేసి యలసి నిద్రించి తిరిగి మేలు కొనునప్పుడు గయాళిరాధను జూచి బెదరి కృష్ణుని బిగ్గఁ గౌఁగిలించుకొన్నదనియు ఆబిగికౌఁగిలి మహాసామ్రాజ్యమువలె నిరతిశయసుఖావహమైనదనియు, అట్టి సుఖపా రవశ్యముచేత మున్నుగలిగిన గగ్గురు మీఁదుమిక్కిలి దట్టముగా అలముకొన్నదనియు భావము. ఇచట 'దృఢోపగూఢగహనాః సామ్రాజ్య' అనియు 'దృఢోపగూహన ఘనాః సామ్రాజ్య' అనియు పాఠాంతరములు తఱచుగాఁ జూపట్టుచున్నవి. అప్పుడు దృఢ + ఉపగూఢ = బిగికౌఁగిలిచేత, ఘనాః=మిక్కిలియైనవియు అని యర్థము. 'సామ్రాజ్య.. శ్రియః' అనుటకు-సామ్రాజ్య = సామ్రాజ్యముయొక్క, సాన్ద్ర= దట్టమైన, శ్రియః=సంపదగలవియు-అనఁగా రాధకటాక్షములచే మొలకెత్తి రుక్మిణి బిగికౌఁగిలిచేత మిక్కుటమైన పులకలు కృష్ణునికి సామ్రాజ్యముసొంపు పెంపువలె నుండెనని యర్థము. అయినను ఈపాఠము లంతగా కవిహృదయములుగావనితోఁచెడి. 'దృఢోపగూహన ఘనస్వారాజ్య' అనిగాని 'దృఢోపగూఢహనగస్వారాజ్య' అని గాని యుండునని తోఁచెడిని. ఇట్టివైన, పులక + అఙ్కురాః= గగ్గురు మొలకలు. జీయాసుః=సర్వోత్కృష్టములై వర్తించుఁగాక.

మ. రతికేళిం దమి దీఱఁగా నలసి నిద్రం జెంది స్వప్నంబుచే
నతిభీతిన్ రమ గౌఁగిలింప నిబిడంబై రాధికాపాంగవీ
క్షితవక్షఃస్థలనిస్తులాభరణమై చెన్నొందురోమాంచనం
తతి సామ్రాజ్యరమానుభూతిపరమానందాకృతిన్ శౌరికిన్. 58

తా. రాధ తలుకుఁగడగంటి చూడ్కులతోఁ జూచుచున్న వెడందఱొమ్మునకు అలంకారమువలె పొలుపుగూర్చునవియు, క్రీడించి యలసి నిద్రించిన రుక్మిణీదేవి మేలు కాంచి రాధను జూచి వెఱచి బిగ్గఁ గౌగిలించుకొనఁగా దానిచే మిక్కిలి దట్టములైనవియు, కావుననే మహాసామ్రాజ్యసంపద యిచ్చినట్లు మితిమీఱినసుఖము గూర్చునవియునై, ముల్లోకములకును ఇంపుగూర్చుచున్న తేజస్స్వరూపమైనశ్రీ కృష్ణునికిఁ గలిగిన పులకాంకురములు సర్వోత్కృష్టములై వర్తించుఁగాక.

శ్లో॥ స్మితస్నుతసుధాధరా మదశిఖణ్డిబర్హాఙ్కితా
విశాలనయనామ్బుజా వ్రజవిలాసినీవాసితా।
మనోజ్ఞముఖపఙ్కజా మధురవేణునాదద్రవా
జయన్తి మమచేతస శ్చిర ముపాసితా వాసనాః॥ 59

టీ. స్మిత...ధరాః—స్మిత=చిఱునవ్వు అనెడి, స్నుత=కాఱిన, సుధా=అమృతముగల, అధరాః = మోవి కలవియు - అమృతమువలె అతిభోగ్యమై తొలఁకుచున్న చిఱునవ్వు పెదవియందుఁగలవియనుట, మద...కితా - మద = మదముగల, శిఖణ్డి= నెమిలియొక్క, బర్హా = పురిచేత, అఙ్కితాః = గుఱుతింపఁబడినవియు - చెరువుకొన్న నెమిలిపురిగుఱుతుగాఁ గలవి యనుట, విశాల...మ్బుజాః-విశాల = వెడలుపైన, నయన + అమ్బుజాః=కన్నుఁదామరలుగలవియు, వ్రజ...వాసితాః-వ్రజ = వ్రేపల్లెయందలి, విలాసినీ = మలుపులాండ్రయందు - గొల్లచెలువలందు, వాసితాః = వసింపఁజేయఁబడినవియు-గొల్లచెలువలయందే మరగి యెప్పుడు మెలఁగుచుండునవియనుట, మనో...కజాః-మనోజ్ఞ = మనోహరమైన, ముఖపఙ్కజాః = మోముఁదామరగలవియు, మధుర...ద్రవాః-మధుర=తీయనైన, వేణునాద = పిల్లఁగ్రోవిరవళియనెడి, ద్రవాః = ఒలుకుచున్నరసము గలవియు - వేణుధ్వనియనెడి తేనియద్రవ మొలుకుచున్నదియనుట, చిరం =బహుకాలము, ఉపాసితాః = కొలువఁబడినవియు, ఇట్టివగు, మమ = నాయొక్క, చేతసః = మనస్సుయొక్క, వాసనాః = సంస్కారములు - పూర్వ మనుభవించినవానిని ఇప్పుడు స్మరించుట వాసనయనబడును, అట్టివాసనలు, జయన్తి = సర్వోత్కృష్టములై వర్తించుచున్నవి. ఆవాసనలు, 'చిరముపాసితాః' బహుకాలము ఉపాసింపఁబడినవి. బహుజన్మములనుండి ఉపాసింపఁబడుచున్నవి. ఇట్లు పూర్వజన్మములు పెక్కింట నుపాసింపఁబడినవి-అనఁగా అనుభవింపఁబడినవిగాన, ఆయనుభవముచే ఇప్పుడు తమంతట నామనస్సుయొక్క స్మరణమునకు వచ్చుచున్నవి. చిఱునవ్వుదొలఁకుమోవి, చెరివిన నెమిలిపురి, వెడఁదకన్నులు, గొల్ల చెలువలతోడి మెడతెగనిగోష్ఠి, సొగసైనమోముఁదామర, తీయఁగా నొలుకుచున్నపిల్లఁగ్రోవిరవళి, అను నివియె పూర్వము చిరకాల మనుభవింపఁబడినవి. కావున నవి యిప్పుడు వాసనలై నాస్మరణమునకు వచ్చుచున్నవి యని యర్థము. పూర్వజన్మములందు శ్రీకృష్ణునివిగ్రహ సౌందర్యాదులను ధ్యానముచేయుటచే నవి యిప్పుడు ఆవాసనాబలమున నామనస్సున గోచరించుచున్నవి ఇట్లు గోచరించుభాగ్యము చిరకాల ముపాసించుటచేఁ గలుగునదేకాని సులభముగాఁ గలుగునది కాదనుట.

చ. చెలు వగుమోముతోఁ దళుకుఁ జెక్కులతో మధురాధరంబుతో
సులువగునవ్వుతో సొలపుఁజూపులతో వ్రజబాలికాళితో

లలితకలాపభూషణవిశ్లాసముతో మురళీరవంబుతోఁ
బలుమఱు మీఱుఁ గాక మధుసభఁజనవాసన లెల్లదిక్కులన్. 59

తా. అమృతమువలెఁ జిలుకవ్వు దొలఁకుచున్న మోవియు, మత్తిల్లిన నెమలిపురి గుఱుతుగాఁ జెరువుకొనుటయు, విశాలములైన కన్నులును, గొల్లచెలువలతోడి యెడ తెగనికూడికయు, సొగసైన మోముఁదామరయు, తీయనిద్రవమువలె నొలుకుచున్న వేణునాదమును బూర్వము బహుకాలము మనస్సున ధ్యానించి యనుభవించినబలమున నిప్పుడు నాస్మరణమునకు వచ్చుచున్నవి.

శ్లో॥ జీయా దసౌ శిఖిశిఖణ్డకృతావతంసా
సాంసిద్ధికీ సరసకాన్తిసుధాసమృద్ధిః ।
యద్బిన్దులేశకణికాపరిమాణభాగ్యః
సౌభాగ్యసీమపద మశ్నుతి పఞ్చబాణః ॥ 60

టీ. ఇచట 'సరసకాన్తిసుధాసమృద్ధిః' అనునది కర్త, పఞ్చబాణః = మన్మథుఁడు, యత్...భాగ్యః-యత్ = దేనియొక్క - ఏసరసకాంతిసుధాసమృద్ధియొక్క యనుట, బిన్దు=బిందువుయొక్క, లేశ = కణముయొక్క, కణికా = సూక్ష్మావయవము యొక్క, పరిమాణ=కొలఁదిగల, భాగ్యః సన్ = భాగ్యముగలవాఁడగుచు-సౌభాగ్య... పదమ్-సౌభాగ్య=సౌందర్యముయొక్క, సీమ = పొలిమేర యైన, పదం = స్థానమును, అశ్నుతి = పొందుచున్నాఁడో-ఏసరసకాంతిసుధాసమృద్ధియందలి యొకచిన్నబిందువు లోని కణికయంతమాత్రము లభించినభాగ్యముచేత మన్మథుఁడు సౌందర్యముయొక్క పొలిమేరను అందినాఁడో - అనఁగా ఎనలేనిసౌందర్యమును జెందినాఁడో, శిఖి... తంసా-శిఖి=నెమలియొక్క, శిఖణ్డ=పురిచేత, కృత = చేయఁబడిన, అవతంసా = శిరోభూషణము గలదియు, సాంసిద్ధికీ = స్వభావసిద్ధమయినదియు - స్వాభావికముగాఁ దొరఁకుచున్నదియు అగు, అసౌ = ఈ, సరస...సమృద్ధిః-సరస = రసయుక్తమైన, కాంతి=కాంతియనెడు, సుధా = అమృతముయొక్క, సమృద్ధిః = పెంపు-అమృతము వలె అతిభోగ్యమై సరసమై యొప్పుకాంత్యతిశయ మనుట-ఇట్టి కాంత్యతిశయరూప మైనశ్రీకృష్ణుఁడనిభావము, జీయాత్ = సర్వోత్కృష్టమై వర్తించుఁ గాక. శ్రీకృష్ణుఁడు అతిభోగ్యమైన కాంత్యతిశయమే స్వరూపముగాఁ గలవాఁడు గాన అట్టికాంత్యతిశయముగానే చెప్పఁబడినాఁడు. అతనికాంతిసమృద్ధియందలి ఒక్క 'బిన్దులేశ' చిన్నబొట్టులోని 'కణికా' సూక్ష్మాంశమంత పొందునట్టి భాగ్యమును మన్మథుఁడు పడసినవాఁడై ముల్లోకములందును ఎనలేని సౌందర్యమునకు ఉపమాభూతుఁ డైనాఁడు. ఇంక అట్టి 'కణిక' లెన్నియో చేరి యొకబిందువు కాఁగా అట్టిబిందువు లెన్నియో చేరి కాఁగలిగిన యీ 'సరసకాంతిసమృద్ధి'యొక్క సౌందర్యవిభవమును ఇంతింతని కొలఁదిపెట్ట నశక్య మని భావము.

మ. అవతంసం బగుపింఛదామకము నెక్కొల్పందం బ్రభాసంపదు
ద్భవలీలామృతధార తెల్లదెసలన్ క్రభాసిల్లఁ ద్రైలోక్యమో
హావిహారాస్పదరూపధేయసుకుమారాంశప్రభావంబులో
లవమాత్రం బొదవన్ మురుండు జగమెల్లం గెల్చు లీలాగతిన్. 60

తా. నెమలిపురి శిరోభూషణముగాఁ గలిగి, స్వభావసిద్ధమై యమృతమువ నతిభోగ్యమై తోఁగగుచున్న కృష్ణరూపమైన కాంత్యతిశయము సర్వోత్కృష్టమై వర్తించుఁగాక. ఆకాంత్యతిశయమందలి యొక్క చిన్నబిందువులోని యతిసూక్ష్మాంశమును బొందునట్టి భాగ్యమును లభించినవాఁడై మన్మథుడు ముల్లోకములందు సాటిలేని సౌందర్యము గలిగినవాఁడయ్యె. ఇఁక నాకాంత్యతిశయరూపమైన శ్రీకృష్ణ సౌందర్యాతిశయము నెంతని చెప్పవచ్చు!

శ్లో॥ ఆయామేన దృశో ర్విశాలతరయో రక్షయ్య మార్ద్రస్మిత
చ్ఛాయాధర్షితశారదేన్దులలితం చాపల్యమాత్రం శిశోః।
ఆయాసా నవరాన్విధూయ రసికై రాస్వాద్యమానం ముహు
ర్జీయా దున్మదవల్లవీకుచభరాధారం కిశోరం మహః॥ 61

టీ. విశాలతరయోః=మిక్కిలి వెడల్పులైన, దృశోః = కన్నులయొక్క, ఆయామేన=పొడవుచేత, అక్షయ్యమ్=క్షయరహితమైనదియు, ఎన్నఁడు తఱుఁగక పంఱం బఱు వెడఁదలై కనుపట్టుచున్న వాలుఁగన్నులు గలది యనుట ఆర్ద్ర...లలితం- ఆర్ద్ర=సరసమైన, స్మిత=చిఱునగవుయొక్క, ఛాయా=కాంతిచేత, ధర్షిత=తిరస్కరింపఁబడిన, శారద=శరత్కాలసంబంధియైన, ఇన్దు=చంద్రునియొక్క, లలితమ్=ఒప్పిదము గలదియు - శరత్కాలమునందలి చందురుఁడు మిక్కిలి తెల్లనై ప్రకాశించును గాన 'శారదేన్దు' అనఁబడెను. అట్టిచంద్రునిఁ గూడ తిరస్కరించునంత తెల్లనై యాహ్లాదకరమైన చిఱునవ్వు గలదియు యనుట, శిశోః=బాలునియొక్క, చాపల్యమాత్రం=చపలత్వమాత్రమేయైనదియు-పైకి బాలునివలె కనఁబడుచున్నదైనను బాలునికిఁ గల లక్షణములు లేవు; కాని, బాలునిచపలత్వ మొకటి మాత్రమే పరిపూర్ణముగాఁ గలిగి యున్న దనుట. రసికైః=రసజ్ఞులచేత - సహృదయులైన విద్వాంసులచేత ననుట, అపరాన్=ఇతరములైన, ఆయాసాన్=ప్రయాసములను, విధూయ=ఎగఁజిమ్మి, ముహుః=మాటిమాటికిని, ఆస్వాద్యమానం = ఆస్వాదింపఁబడుచున్నదియు-దీనిభోగ్యతను దెలిసిన రసికులు దీనిని ఆస్వాదించుచు దానిచే నితరములైన సకలకష్టములను తిమా సుఖముగా నందు రనుట-సమస్తకష్టములను దూలించునంతభోగ్యమై యాస్వాదింపఁబడుచున్న దని యర్థము, ఇట్టిదియు, ఉన్మద ... ధారం-ఉన్మద = మత్తిల్లిన-యౌవనముచే మదించిన, వల్లవీ = గోపికలయొక్క,

కుచభర=గుబ్బలపెంపే-ఉబ్బుగుబ్బలే, ఆధారం=ఆశ్రయముగాఁ గలదియు-యౌవన వతులైన గోపికల కుచాభోగము నెప్పుడు ననుభవించుచు వర్తిలుచుండునది యనుట, గోపికల కుచభరమే దీనికి 'ఆధార' ఆధార మనుటచే తదనుభవమే దీనికి బ్రతుకుఁ దెరువువలె నున్నదనియు నందే యిది మగ్నమై యుండుననియుఁ దెలియునది, ఇట్టి దియు, కిశోరం=బాల్యమైనదియు, అగు, మహః=శ్రీకృష్ణాఖ్యతేజము, జీయాత్ = సర్వోత్కృష్టమై వర్తించుఁగాక.

ఉ. క్రొన్ననఁబోండ్లు గబ్బివలిగుబ్బల నానుచు గారవింపఁగా
వెన్నెల నవ్వు నవ్వ లరవిందముచందముఁ గ్రిందు సేయు వా
ల్గన్నులు బాల్యచాపలవిలాసము మీఱ రసజ్ఞలోక మీ
యన్నియు బుజ్జగింపహృదయంగమమైన వెలుంగుఁ గాంచెదన్. 61

తా. వాలుఁగన్నులు నిడివియై మిక్కిలియు బెడఁగు నూప, శరత్కాలపుఁ జంద్రునికన్న మిక్కిలివన్నె గులుకుచిరునవ్వు మీఱ, శిశువయ్యు తదీయచాపల్య మొకటి మాత్రమే సెలయఁ గలిగి నిజమునకుఁ దక్కిన శైశవలక్షణము లేనియు లేక ప్రౌఢునివలె వర్తించుచు, రసజ్ఞులకు మిక్కిలి యాస్వాద్యమై సకలకష్టములను బరిహరింపఁజేయుచు, యౌవనంపుమత్తు గలగొల్లగుబ్బెతలయుబ్బుగుబ్బలయందే యెపుడు మరగియుండు కృష్ణాఖ్యమైన చిన్నితేజము సర్వోత్కృష్టమై వర్తించుఁగాక.

శ్లో॥ స్కన్ధావారసదో వ్రజః కతిపయే గోపా స్సహాయాదయః
స్కన్ధాలమ్బిని వత్సదామ్ని ధనదా గోపాఙ్గనా స్స్వాఙ్గనాః
శృఙ్గారా గిరిగైరికం శివ శివ శ్రీమన్తి బర్హాణి చ
శృఙ్గగ్రాహికయా తథాపి తదిదం ప్రాహు స్త్రిలోకేశ్వరమ్. 62

టీ. వ్రజః=గొల్ల పల్లె, స్కన్ధావారసదః-స్కన్ధావార = పాళెముయొక్క, సదః=ఆస్థానమండపము-మంచివాసస్థల మయినను లేదనుట, గోపాః=గొల్లవాండ్రు, సహాయ + ఆదయః=సహాయులు మొదలయిన వారు-చతురంగబలములును గొల్లవాండ్రె యనుట - పరివారసంపత్తియు గొప్పది లేదనుట, వత్సదామ్ని=దూడపలుపు, స్కన్ధ + ఆలమ్బిని=మూఁపును ఆశ్రయించి యుండఁగా, ధనదాః=పన్నిచ్చువారు-మూఁపున వ్రేలుచున్న దూడపలుపే రాజవంశము. దానిని జూచియే గొల్లలు పన్నిచ్చుచున్నారనుట. దీనిచే పరికరసంపత్తియు లేదనుట, గోప + అఙ్గనాః=గొల్ల చెలువలు, స్వ + అఙ్గనాః=తనస్త్రీలు - మంచియిల్లాండ్రును లేరనుట, శృఙ్గారాః=అలంకారములు, గిరిగైరికం=కొండయందలి గైరికధాతువులు, శ్రీమన్తి=కాంతిగలిగిన, బర్హాణిచ=నెమిలిపురులును, మంచిసొమ్ములును లేవనుట, శివశివ=శివశివా-ఇది సంతాపార్థకము. మంచివసతియు సహాయాదిసంపత్తియు సొమ్ములును

ఏవియును లేవేయని సంతాపము, తథాపి=అట్లయినను, శృంగగ్రాహికయా=స్వల్ప గ్రహణముచేత, తత్=ఆ-ప్రసిద్ధమైన, ఇదం=దీనిని-శ్రీకృష్ణుని అనుట, త్రిలోక+ఈశ్వరం=ముల్లోకములకు నియామకునిగా, ప్రాహుః=పెద్దలు చెప్పెదరు. వసించుటకు మంచిస్థలము మొదలయినవి లేని దరిద్రుని త్రిలోకాధిపతిగాఁ జెప్పెద రనుట.

ఉ. బాలిశు లైనగోపకులు బంధులు పాళెము గొల్లపల్లె ము
త్యాలసరాలు దామెనలు చారలు గోపిక లంగరాగముల్
శైలశిలాంకధాతువులు చారువిభూషలు పింఛదామముల్
పోలిన నైన విష్ణుఁ డని బుద్ధి నెఱుంగుదు రెల్లపెద్దలున్. 62

తా. గొల్లపల్లె పాళెపట్టు. దూడపలుపులు దాల్చియున్నకొండలు గొల్లవాండ్రే సహాయులు మొదలైనవారును పన్నిద్దువారును. గొల్లచెలువలు స్వభార్యలు. కొండమీఁదనుండు ధాతువులును నెమలిపురులును అలంకారములు. శివశివా! ఇట్లు అన్నిట మిక్కిలి కొఱంత గలిగి యుండినను కృష్ణుని ముల్లోకములకును అధిపతి యని పెద్దలు చెప్పెదరు. ఇదేమి ఆశ్చర్యము!

శ్లో॥ శ్రీమద్బర్హిశిఖండమండనజుషే శ్యామాభిరామత్విషే
లావణ్యైకరసావసిక్తవపుషే లక్ష్మీసరఃప్రావృషే।
లీలాకృష్టరసజ్ఞధర్మమనసే లీలామృతస్రోతసే
కేవా నస్స్పృహయన్ని హా న మహసే గోపీజనప్రేయసే. 63

టీ. శ్రీ...జుషే-శ్రీమత్=కాంతి గల, బర్హిశిఖండ=నెమలిపురి యనెడి, మండన=సొమ్మును, జుషే=పొందినదియు, శ్యామ...త్విషే-శ్యామ-నల్లనై, అభిరామ=మనోహరమైన, త్విషే-కాంతి గలదియు, లావణ్య...వపుషే-లావణ్య=ముత్తెపుతేటవంటి నిగనిగనికాంతి యనెడి, ఏక=ముఖ్యమైన-కేవలమైన, రస=రసముచేత, అవసిక్త=తడుపఁబడిన, వపుషే=శరీరముగలదియు-శుద్ధలావణ్యమయమైన శరీరముగలదియనుట, లక్ష్మీ...ప్రావృషే-లక్ష్మీ=లక్ష్మియనెడు, సరః=సరస్సునకు, ప్రావృషే=వర్షర్తు వైనదియు-వర్షర్తువుచేత సరస్సు ఎట్లు రసపూరితమై అతిశయిల్లునో యట్లు దీనిచేత లక్ష్మీదేవియు శోభాపూరితయై యతిశయించు ననుట, లీలా...మనసే-లీలా=విలాసముచేత, ఆకృష్ట=ఆకర్షింపఁబడిన రసజ్ఞ=రసికులైన విద్వాంసులయొక్క, ధర్మ=ధర్మప్రధానములైన మనసే=మనస్సులు గలదియు-రసికు లగు ధార్మికులమనస్సులను లీలచేతనే హరించునది యనుట, లీలా...స్రోతసే-లీలా=విలాసములనెడి, అమృతస్రోతసే=అమృతప్రవాహమైనదియు - అమృతమువలె అత్యంతభోగ్యమై ప్రవాహమువలె అవిచ్ఛిన్నమై యొప్పులీలలు గలది యనుట, గోపీ...ప్రేయసే-గోపీజన=గోపస్త్రీసమూహమునకు, ప్రేయసే=ప్రియతరమైనదియు,

అగు, మహాసేః=శ్రీకృష్ణాఖ్యతేజముకొఱకు, కేవా=ఎవ్వరు, నస్పృహయన్తి=ఆస
గొనరు-అందఱును ఆశింతురే యనుట, హన్త=ఆశ్చర్యము.

శా. లావణ్యామృతసీముఁ గన్దళితలీలారాము లక్ష్మీసరః
పరివృద్ధాము నితాంతసంయమితబర్హశ్రీసముద్దాము రా
గావిర్భూతవయోభిరాము విలసద్ధారాధరశ్యాము నిన్
సేవింపన్ మదిఁ గోరరే రసికులాగ్రసీమాఖిలప్రేమునిన్. 63

తా. నిగనిగలాడు నెమిలిపురిని సొమ్ముగాఁ జెరువుకొని, నల్లనై సొగసుగులుకు
మేనికాంతి మీఱు, లావణ్యరసము నఁదోగిన మేనితో, వర్షాకాలము కొలఁకును
అతిశయింపఁజేయునట్లు లక్ష్మీదేవికి శోభావిషయముగూర్చునదై, లీలచేత రజ్ఞులైన
ధార్మికులహృదయముల నాకర్షించుచు, అత్యంతభోగ్యములైయెడతెగని లీలలు గలిగి,
గోపస్త్రీలకు మిక్కిలి ప్రియమై యొప్పు శ్రీకృష్ణాఖ్యతేజమును ఔరా! ఎవ్వరు గోరరు?

అవ. ఆనందపారవశ్యమునందుఁ జూపట్టుకృష్ణుని నెమ్మొగమును
వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ ఆపాటలాధర మధీరవిలోలనేత్ర
మామోదనిర్భరిత మద్భుతకాన్తిపూరమ్ ।
ఆవిఃస్మితామృత మనుస్మృతిలోభనీయ
మాముద్రితానన మహో మధురం మురారేః॥ 64

టీ. ఆపాటల + అధరమ్-ఆపాటల=అంతట నెఱ్ఱనైన, అధరమ్=పెదవి గల
దియు-గోపికలదంతక్షతములచే మిఁగు మిక్కిలి యెఱ్ఱనైన పెదవి గలది యగుట.
అధీర... నేత్రమ్ - అధీర=బెదరుగల, విలోల=చంచలమైన, నేత్రమ్=కన్నులు గల
దియు-బెళుకుఁగన్నులు గలదియు—కన్నుల మఱింత బెళుకు మీఱి గోపికలను గాం
చుచున్నది యనుట-'లోల' శబ్దమే చాలియుండఁగా 'అధీర' యనియు చంచలత్వ
మునకై కూర్చుట, బెళుకులు మీఁదుమిక్కిలి యయ్యె నని తెలుపుటకుఁగాఁ దెలియు
నది, ఆమోదనిర్భరితమ్-ఆమోద=ఆనందముచే, నిర్భరితమ్=నిబ్బరము గావింపఁబడి
నదియు-నిర్భరమైన యానందము గలదియు- అద్భుత...పూరమ్—అద్భుత=ఆశ్చర్య
కరమైన, కాంతిపూరమ్=కాంతివెల్లువ గలదియు - ఆశ్చర్యమగు కాంతి వెల్లిగొను
చున్నది యనుట, ఆవిః...మృతమ్ - ఆవిః =ఆవిర్భవించుచున్న, స్మిత + అమృ
తమ్=అమృతమువంటి చిఱునగవు గలదియు, చిఱునవ్వు అమృతమువలె తొలఁకు
చున్నదియనుట, మధురం - సుందరమైనదియు అగు, మురారేః=కృష్ణునియొక్క,

అముద్రిత + ఆననమ్-అముద్రిత = కొంచెము మోడ్పఁబడిన-కొంచెము అరమోడ్పుఁగన్ను గల, ఆననమ్ = మొగము, అనుస్మృతిలోభనీయమ్-అనుస్మృతి = ఎడతెగనిస్మరణమునను, లోభనీయమ్ = మిక్కిలి యాసింపఁదగినది-నాస్మరణము ఎడతెగక మిక్కిలి కోరుచున్నది యనుట-ఎడతెగక మిక్కిలి స్మరించుచుండునట్లు నాకు ఆసగొలుపుచున్నది యని భావము, అహో = ఆశ్చర్యము. ఇందు 'అపాటలాధర' మనుటచే గోపికలతోడిగాఢరతిక్రీడ సూచితము కావునసే, 'ఆమోదనిర్భరిత' మై 'అవిఃస్మితామృత' మై మొగము, 'అముద్రిత' మైనది అని యానందపారవశ్యపు అరచొప్పు మొగమునకుఁ జెప్పినాఁడు. 'అముద్రిత' అని నిద్రాపరముగా గ్రహించినయెడల 'అధీరవిలోలనేత్ర' మనుటయు 'అవిఃస్మితామృత' మనుటయుఁ జెల్లదు. కనుక 'ఆమోదనిర్భరిత' మనుచో 'ఆమోద' శబ్దమునకు పరిమళపరముగా గ్రహించుటకన్నను ఆనందపరముగా గ్రహించుటయే సరస మని తెలియునది.

మ. అతులానందరసామృతార్ణవ మహాంశగాభంగరంగత్తరం
గతతిం బొంగుచుఁ గెంపుమోవి నరిదాఁకం దత్సుధాబిందువుల్
స్మితలీలన్ విలసిల్లె నంచు జనముల్ స్వచిత్తంబులన్ మెచ్చున
ద్భుతశృంగారరసైకముద్రితముఖాంభోజున్ హరిం గొల్చెదన్.

తా. గోపికాగతిక్రీడ సలిపి వారలపలునొక్కులచే మతింతయెఱుపెక్కిన కెమ్మోవి గలిగి మిక్కిలి బెళుకులగు కన్నులతో వారలయొఱపులం జూచుచు, మిక్కిలి కాంతి వెల్లిగొలుపుచు, అమృతమువలె చిఱునవ్వు దొలఁకుచుండఁగా, నిబ్బరమైనయానందమున అరచొప్పు గలిగియున్న కృష్ణునిముద్దుమొగమును మాటికి స్మరించుచుండునట్లు నామనస్సు మిక్కిలి గోరుచున్నది.

శ్లో॥ జాగృహి జాగృహి చేత శ్చిరాయ చరితార్థతా భవతః।
అనుభూయతా మిద మిదం పురఃస్థితం పూర్ణనిర్వాణమ్॥

టీ. హే చేతః = ఓమనసా, భవతః = నీకు, చిరాయ = చిరకాలమునకు, చరితార్థతా=కృతార్థత్వము, కలిగినదని శేషము. జాగృహి = మేలుకనుము, జాగృహి = మేలుకనుము-చిరకాలముగా నున్ననిమోహమును విడుపుమనుట-చరితార్థత్వ మెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు, పురఃస్థితం = ముందున్న, ఇదం ఇదం = ఈయీ, పూర్ణనిర్వాణమ్-పరిపూర్ణమైన మోక్షానందమును - కృష్ణరూపమైన పరిపూర్ణానందాతిశయమును అనుట, అనుభూయతామ్ = అనుభవింపఁబడుఁగాక-అనుభవింపుమా యనుట, పరిపూర్ణ మోక్షసామ్రాజ్యమువలె నిరతిశయసుఖప్రదుఁ డగుటచే కృష్ణుఁడు పూర్ణనిర్వాణ మని చెప్పఁబడినాఁడు. మనస్సు చిరకాలము కృష్ణుని ననుభవింపఁగోరి దుఃఖమున మోహితమై యుండినది. చిరకాలమునకు కృష్ణసాక్షాత్కారము దానికి గలుగుటచే అనుభవింపు మని కవి చెప్పినాఁ డని తెలియునది.

చ. వెనుకటి వేళలం దనుభవించినజన్మశతంబులట్లు నేఁ
డును భ్రమ మోహపావక గ్రహంబుఁ దెలిసి వాంఛలు ద్రుంచుమా చిరం
తనతపముల్ ఫలించి పురతస్స్థితి నున్నది కృష్ణరూప మై
యనవరతానుచింతనసుధారసవీచుల నోలలాడుచున్. 65

తా. ఓమనసా! నీవు చిరకాలమునుండి కృతార్థమ వైతివి. ఇఁక మోహమును విడువుము. నిరతిశయమోక్షానందము కృష్ణరూపముగా నిదిగో ముందటఁ బొడసూపు చున్నది. దాని ననుభవింపుము.

శ్లో॥ చరణయో రరుణం కరుణార్ద్రయోః
కచభరే బహుళం విపులం దృశోః।
వపుషి మఞ్జుల మఞ్జనమేచకే
వయసి బాల మహో మధురం మహః॥ 66

టీ. చరణయోః=పాదములందు, అరుణం = ఎఱ్ఱనైనదియు - ఎఱ్ఱనియడుగులు గలదియు, కచభరే=సిగయందు, బహుళం=విస్తారమైనదియు-విస్తారము లైనవెండ్రుకలు గలది యనుట, కరుణా + ఆర్ద్రయోః-కరుణా = దయచేత, ఆర్ద్రయోః = తడిసిన దైన, నయనయోః=కన్నులయందు, విపులమ్ = విశాలమైనదియు-విశాలములైన కరుణ దొలఁకుకన్నులు గలదియనుట, అఞ్జనమేచకే-అఞ్జన = కాటుకవలె, మేచకే = నల్లనైన, వపుషి = శరీరమునందు, మఞ్జులమ్ = సొగసైనదియు - సొగసైననల్లనిమేను గలది యనుట, వయసి=వయస్సునందు-బాలం = పసిదైనదియు, అహో, మహః=కృష్ణాఖ్యతేజము, మధురం=మనోజ్ఞము, అహో=ఔరా-ఔరా యెంతమనోజ్ఞ మనుట.

ఉ. మేను ఘనాఘనప్రతిభ మించెను పాదపయోరుహంబు గెం
పూనె విలోల మయ్యెను దయార్ద్రిత మయ్యెను గన్నుదోయి తే
జోనిధి యయ్యెఁ బ్రాయపుసిరిశోభితుఁడయ్యెఁ బురాణుఁడయ్యె నౌ
రా! నెఱులందు నల్లనెలవప్రియముగాంచుట వింత యెంతయున్.

తా. ఎఱ్ఱనియడుగులును, మిక్కిలియైన నెఱిసిరులును, విశాలములైన కరుణారస మొలుకుకన్నులును, కాటుకవలె నల్లనయిన మేనును, పసిప్రాయమును, సొగసైనదియు నై శ్రీకృష్ణాఖ్యతేజము ఔరా! వర్తించుచున్నది.

శ్లో॥ మాలాబర్హమనోజ్ఞకున్తలభరాం వన్యప్రసూనోక్షితాం
శైలేయద్రవక్లృప్తచిత్రతిలకాం శశ్వన్మనోహారిణీమ్।
లీలావేణురవామృతైకరసికాం లావణ్యలక్ష్మీమయీం
బాలాం బాలతమాలనీలవపుషం వన్దే పరాం దేవతామ్॥ 67

టీ. మాలా...భరాం-మాలా = దండగా నున్న, బర్హ = నెమిలిపురులచేత-నెమిలిపురులదండచేత ననుట-ఇదియె 'కబరకలితచఞ్చత్పిఞ్ఛదామాభిరామమ్' అని చెప్పఁబడినది కనుక, 'మాలాబర్హ' అనుటవు పూదండలచేతను నెమిలిపురిచేతను, అనుసర్గము సగసము కాదు, మనోజ్ఞ=సొగసైన, ప్రస్తలభరామ్=పురుల అతిశయముగలదియు-మిక్కిలిపురులు గలదనుట, వన్య...క్షితాం-వన్య=అడవియందుఁబుట్టిన, ప్రసూన=పువ్వులచేత ఉక్షితాం=తడుపఁబడినదియు, శైలేయ...తిలకాం-శైలేయ = కొండధాతువిశేషములయొక్క, ద్రవ=ద్రవముచేత, క్లప్త=కల్పింపఁబడిన, చిత్ర = విచిత్రమైన, తిలకాం=తిలకముగలదియు, శశ్వత్...హారిణీం-శశ్వత్ = ఎప్పుడును, మనోహారిణీం=మనస్సును హరించుచుండునదియును, లీలా...రసికామ్- లీలా=విలాసార్గమైన, వేణుగవ=వేణుధ్వని యనెడి, అమృతి=అమృతమువిషయమై, ఏక=ముఖ్యముగా, రసికామ్=రసజ్ఞమైనదియు-అమృతమువలె అతిభోగ్యమైన వేణుధ్వని చవిచక్కఁగాఁ దెలిసినది యనుట, లావణ్య...మయీం-లావణ్య = ముత్తెపుకాంతివంటి కాంతివిశేషముయొక్క, లక్ష్మీ=సంపదచేత, మయీం=ప్రచురమైనదియు-కేవలము ఆకాంత్యతిశయముచేతనే గచింపఁబడినదానివలె నుండునది యనిభావము, బాలాం = బాల్యముగలదియు, బాల...వపుషం=బాల-లేతయైన, తమాల=కానుగుపువ్వులవలె, నీల=నల్లనైన, వపుషమ్=శరీరముగలదియు, అగు, పరాందేవతామ్=ఉత్కృష్టమైన దేవతనుగూర్చి - సర్వోత్కృష్టదేవమగు శ్రీకృష్ణునిగూర్చి, వన్దే = నమస్కరించుచున్నాను. తలయందు నెమిలిపురిదండ, ఒడలెల్ల నడవిపువ్వులు, నుదుటియందు గైరికధాతుతిలకము, ఇవియు సొమ్ములు. నిలువెల్ల లావణ్యము. మఱి యమృతమువంటి వేణుగవము, ఇవన్నిటికిని మఱి తమ ముద్దు గూర్చుటకు బాల్యప్రాయము. కావుననే అది 'శశ్వన్మనోహారిణి'గా నున్నదని భావము.

ఉ. వింతలుగాఁ గలాపములు ౯ వేనలిఁ జుట్టియు వన్యసూనాలికా
సంతతిఁ జుట్టి జేగురురసంబున దొంతరబొట్టు పెట్టి చె
ల్వొంతయు రాశి చేసినక్రియ ౯ మురళీతరళీకృతామృ తా
భ్యంతరసారమై పరఁగు ౯ నావిభు మేచకధాముఁ గొల్చెదన్.67

తా. నెమిలిదండ చెరువుటచే మురువు గులుకుచున్న నెత్తిపురులగుంపును, అడవి పువ్వులు నించి బెరపియున్న రొండలును, గైరికధాతురసముచేఁ గల్పింపఁబడిన వింతతిలకమును గలిగి, యమృతమువలె నొప్పువేణునాదము చవిగొనుటయందు మిక్కిలి రసికత్వముగలిగి, నిలువెల్ల లావణ్యమై, బాల్యప్రాయముతోఁగూడి, లేతకానుగుఁబువ్వ వలె నల్లనిదేహముతో సర్వోత్కృష్టదేవమై వెలుఁగుశ్రీకృష్ణునికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ గురు మృదువదే గూఢం గుల్ఫే ఘనం జఘనస్థలే
నళిన ముదరే దీర్ఘం బాహ్వో ర్విశాల మురఃస్థలే।

మధుర మధరే ముగ్ధం వక్త్రే విలాసి విలోచనే
బహుళ కచభరే వన్యం వేషే మనోజ్ఞ మహో మహః॥ 68

టీ. మృదుపదే-మృదు=మెత్తనైన, పదే=పాదమునందు, గురు=గొప్పదియు, మిక్కిలి మృదువులైన పాదములు గలదియనుట, గుల్ఫే=గుల్ఫములందు, గూఢం=మఱుఁగైనదియు-వెలికి తెలియక మఱుఁగైయుండు చీలమండలు గలది యనుట, జఘనస్థలే=కటిప్రదేశమునందు, ఘనం=గొప్పదియు-విపులమైన పిఱుఁదులు గలదియనుట, ఉదరే=బొజ్జయందు, నళినం=తామరయైనదియు-బొడ్డునందుఁ దామరగలదియనుట, బాహ్వోః=బాహువులయందు, దీర్ఘం=పొడవైనదియు-పొడవులైనబాహువులు గలదియనుట, ఉరఃస్థలే=వక్షఃప్రదేశమందు, విశాలమ్=వెడల్పైనదియు-విశాలమైన ఱొమ్ము గలదియనుట, అధరే=పెదవియందు, మధురమ్=సుందరమైనదియు-శోభించునదియు-తీయనై సొగసైనమోవి గలదియనుట, వక్త్రే=మొగమునందు, ముగ్ధం=సుందరమైనదియు-చెలువైన మొగము గలదియనుట, విలోచనే=కన్నులయందు, విలాసి=ప్రకాశించుచున్నదియు- ప్రకాశించుచున్నకన్నులు గలదియనుట, కచభరే=సిగయందు, బహుళ=మిక్కిలియైనదియు- మిక్కిలి దట్టమైనసిగ గలదియనుట, వేషే=వేషమునందు, వన్యం=అడవిలోఁ బుట్టినదియు-అడవిలోఁ బుట్టి మొలచునట్టి వనశోభావేషము గలదియనుట-'వన్యప్రసూనోక్షితామ్' అన్నట్లు అడవిపువ్వులు గురివింద నెమలిపురి చేకొని, శైలేయద్రవచిత్రతిలకము పెట్టుకొనియుండుటచేత వేషము వన్యముగా నున్నదనుట, ఇట్టిదై, మనోజ్ఞ=మనోహరమగు, మహః = తేజము - శ్రీకృష్ణాఖ్యతేజము, అహో=ఆశ్చర్యము-అనిర్వాచ్యముగా నున్నదని యాశ్చర్యము.

చ. గురుపదముల్ నిగూఢతరగుల్ఫములుం బలుపౌ పిఱుందు వి
స్ఫురదురునాభి దీర్ఘకరముల్ పృథువక్షముఁ దావిమోవి సుం
దరవదనంబుఁ బద్మనయనంబులు నీలశిరోజముల్ మనో
హరసుకుమారవేష మొఱకైపై తగు తేజము నాత్మ నెంచెదన్.

తా. మిక్కిలిమృదువులయినపదములును, మఱుఁగై యుండు చీలమండయు, విపులమైన కటియు, బొడ్డునఁ దామరయు, నిడుదలైన చేతులును, వెడలుపైన ఱొమ్మును, సొగసైనమోవియు, చెలువైన మొగమును, తులకించుచున్న కన్నులును, దట్టమైన సిగయు, అడవిలోనివారివేషమును, గలిగి శ్రీకృష్ణాఖ్యతేజము ఓరా! ఎంతమనోజ్ఞముగా నున్నది.

శ్లో॥ జిహానం జిహానం సుజానేన మౌగ్ధ్యం
దుహానం దుహానం సుధాం వేణునాదైః।

కూడిన, వదనమ్=మొగముగలవాఁడును, నవ్వుమొగము విలాసప్రయుక్తమైన శృంగారచేష్టావిశేషమువలె రమణీయమైనదని పాఠాంతరమున తాత్పర్యము. భ్రమత్ ...పాఙ్గమ్-భ్రమత్ =చలించుచున్న: క్రీడా=విలాసయుక్తమైన, అపాఙ్గమ్=కడగన్నులు గలవాఁడును-విలాసముగా చలించుచున్నకడగన్నులు గలవాఁడనుట, ప్రణత ...పదమ్-ప్రణత=నమ్రులైన, జనతా = జనులయొక్క, నిర్వృతి = చిత్తశాంతికి చిత్తశాంతిరూపమైన సుఖాతిశయములకు, పదమ్ = స్థానమైనవాఁడును-ఆశ్రితసమూహమునకు అత్యంతచిత్తానందము కూర్చువాఁడనుట, నవా...శ్యామమ్-నవ = నూతనమైన-జలము వర్షింపఁబడినయనుట, అమ్బోద=మేఘమువలె, శ్యామమ్=నల్లనైనవాఁడును, నిజ...భరితం-నిజ=స్వకీయమైన, మధురిమ=సౌందర్యముయొక్క, ఆమోద=పరిమళముచేత-వ్యాప్తిచేతననుట, 'ఆభోగ' అనుపాఠమున పరిపూర్తిచేత-పూర్ణమాధుర్యముచేతననుట-భరితమ్ = నిండినవాఁడును, పరి...రసమ్-పరిమిళిత = కూడుకొన్న, కైశోరక=శిశుసంబంధియైన, రసమ్ = సారస్యముగలవాఁడును-శిశుత్వపుచెలువుతోఁ గూడిన యౌవనప్రాదుర్భావము గలవాఁడనుట, 'పరిమిలితకైశోరకరసమ్' అను పాఠమున, పరిమళిత=పరిమళించినట్లు చేయఁబడిన-వ్యాప్తమైన యనుట, కైశోరక=శిశుత్వసంబంధియగు, రసమ్=రసముగలవాఁడనుట-శిశుత్వమువలని సౌందర్యాదిరసముచే మిక్కిలి ప్రసిద్ధమైనవాఁడనుట-మిక్కిలి సుందరుఁడైన శిశువు అని బాగ త్తగన్నవాఁడని భావము, ఇట్టివాఁడగు, పరం=ఉత్కృష్టుఁడయిన, దేవమ్=దేవుని-శ్రీకృష్ణుని, వన్దే=నమస్కరించుచున్నాను.

మ. పటుధారాధరశోభితాంగు విలసద్బర్హోత్తమాంగుఁ, సము
త్కటమందస్మితసుందరున్ జలదపాంగశ్రేణికాడంబరుఁ
స్ఫుటకైశోరకలావు మోహనకళాభోగస్వరూపుఁ విశం
కటసంసేవకనిర్వృతిప్రదు శుభాకారాస్పదుం గొల్చెదన్. 70

తా. ప్రకాశించుచున్న నెమిలిపురి తలసొమ్ముగాఁ దాల్చి,మిక్కిలి చెలువైన నగుమొగము గలిగి, విలాసముగా కడగన్నులు చలింప, నమస్కరించువారికి మిక్కిలినెమ్మదిని గలిగించువాఁడై, క్రొత్తమబ్బువలె నల్లనై, నిజసౌందర్యము నలుగడల బాగ త్తొక్క, చెలువైనబాల్యపుసొంపు విడనియెలప్రాయము గలిగి సర్వోత్కృష్టదైవమై యొప్పు శ్రీకృష్ణునిగూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ సారస్యసామగ్ర్యమివాననేన, మాధుర్యచాతుర్యమివస్మితేన।
కారుణ్యతారుణ్యమివేక్షితేన, చాపల్యసాఫల్యమిదం దృశోర్మే॥71

టీ. ఆననేన=ముఖముచేత, సారస్యసామగ్ర్యమివ-సారస్య=సరసత్వముయొక్క—శృంగారరసస్ఫూర్తియొక్కయనుట, సామగ్ర్యమివ = పరిపూర్తివలెను - పరిపూర్ణశృంగారరసముగల మొగముగలదియనుట,స్మితేన=చిఱునవ్వుచేత, మాధుర్యచాతుర్యమి

వ-మాధుర్య=మనోజ్ఞత్వముయొక్క, చాతుర్యమివ=నేర్పువలెను-మాధుర్యముయొక్క నీటులన్నియు = పచరించుచున్నచిఱునవ్వు గలది యనుట-చిఱునవ్వు చెలువంపునీటు మిటారించుచున్న దనుట, ఈక్షితేన=చూపుచేత, కారుణ్య తారుణ్యమివ-కారుణ్య=దయయొక్క,తారుణ్యమివ=యౌవనమువలెను-ఇట తారుణ్య మనుటచే తారుణ్యమందలి మంచిపుష్టిసౌష్ఠవము సూచితముగావున-కారుణ్యముయొక్క తారుణ్య మనఁగా కారుణ్యముయొక్క పుష్కలత్వము తెలియునది, పరిపూర్ణకారుణ్యాతిశయము దొలఁకుచూపులు గలదియనుట, ఇట్టిదగు, ఇదం=ఈకానఁబడుచున్న కృష్ణాఖ్యవస్తువు, మే=నాయొక్క, దృశోః=కన్నుఁగవయొక్క, చాపల్యసాఫల్యం-చాపల్య=పేరాసయొక్క, సాఫల్యమ్=సఫలత్వము, అగు నని శేషము. నాకన్నులు కృష్ణమూర్తిని జూడవలయు నని చిరకాలముగా చపలములై యున్నవి. ఆకృష్ణుఁడును, మిక్కిలి శృంగారరసము దొలఁకు మొగముతోడను, మాధుర్యంపునెఱనీటు మిటారించుచిఱునవ్వుతోను కారుణ్యము పరిపూర్ణమై తొరఁగుచున్న చూడ్కులతోను కనఁబడి నాచాపల్యమును సాఫల్యముచేసినాఁడని యర్థము. కేవలసారస్యమును మాధుర్యమును కారుణ్యమును గలిగి పొడసూపునేని నాచాపల్యము సాఫల్యము నొందదు. సారస్యముయొక్క సామగ్ర్యమును, మాధుర్యముయొక్క చాతుర్యమును, కారుణ్యముయొక్క తారుణ్యమును గలిగి పొడసూపుటచేతనే చాపల్యము సాఫల్యమొందినదని హృదయము. కనుక సామగ్ర్యాదులు మూఁడును చాపల్యసిద్ధికి ప్రయోజకములు. మిక్కిలి సొగసైన మొగమును, మిక్కిలి తీయనైనచిఱునవ్వును, మిక్కిలి కరుణ దొలఁకు చూపును గలిగి పొడసూపినందున నాకన్నులకఱవెల్లఁ దీఱెన దని యాశయము.

చ. మురిపెపునవ్వు గాదిది విశ్వమోహరసాస్పదరాశి గాని బి
త్తర మగుచూపు గాదిది నిశాంతదయానిధి గాని మోముఁదా
మర యిది గాదఖండరసమాధురి గాని ప్రజాలయాంగణాం
తరమిది గాదు నాదునయనంబులభాగ్యము గాని చూడఁగన్. 71

తా. మీఁద నుగమము.

శ్లో॥ యత్రవాతత్ర వా దేవ, యది విశ్వసిమ స్త్వయి।
నిర్వాణ మపి దుర్వార, మర్వాచీనాని కిం పునః॥ 72

టీ. హేదేవ-ఓదేవా, యత్రవాతత్రవా=ఎచటో నొకదానియందు-ఏజన్మమందుఁగాని యేదేశమందుఁగాని యేకాలమందుఁగాని అని సామాన్యముగా నిర్దేశించినాఁడని తెలియునది, త్వయి=నీయందు, యది విశ్వసిమః=నమ్మితిమేని-నీయెడల భక్తి చేసితిమేని, నిర్వాణమపి=అలభ్యమగు కడపటి పురుషార్థమైన మోక్షముగూడ, దుర్వారం=అడ్డగింపరానిది-అడ్డులేక ప్రాప్తించునదియనుట, అగునని శేషము, అర్వాచీనా

ని=దాని కేవలివైన తక్కిన పురుషార్థములు-ధర్మార్థకామము లనుట, కింపునః=ఏమిచెప్పను-మోక్షమే ప్రతిబంధకములేక సిద్ధించుచుండఁగా దక్కినపురుషార్థములు సిద్ధించునని చెప్పనేల యని యర్థము-సమస్తపురుషార్థములును సిద్ధించునని భావము.

మ. క్రతుహవ్యాదివిశిష్టభావనల కథా వాక్యసుజ్ఞానసం
తతి సొంపైనను విశ్వసించి నిను నాత్మం గొల్వ మోక్షంబు తా
వృతమై నర్తిలు నీకృపారసలసద్భక్తిప్రాప్తిచే నట్టిసు
వ్రతముం గాంచుమహాత్మకోటి కిల నర్థార్వాచీనముల్ భ్రాంతియే.

తా. ఏజన్మమునఁగాని యేదేశమునఁగాని యేకాలమునఁగాని నీయందు నమ్మికతోఁ భక్తి చేసినవారలకు మోక్షమే సులభమై యుండఁగా, తక్కిన ధర్మార్థకామములు సిద్ధించుట చెప్ప నక్కఱలేదు.

శ్లో॥ రాగాన్ధగోపీజనవన్దితాభ్యాం
యోగీన్ద్రభృఙ్గేన్ద్రనిషేవితాభ్యామ్।
ఆతామ్రపఙ్కేరుహవిభ్రమాభ్యాం
స్వామిన్పదాభ్యామయమఞ్జలిస్తే॥ 73

టీ. హేస్వామిన్=ఓస్వామీ, రాగా...తాభ్యామ్-రాగ=అనురాగముచేత, అన్ధ=గ్రుడ్డివారయిన-మిక్కుటమైన యనురక్తిచే కన్నుఁగానని, గోపీజన=గోపికాసమూహముచేత, వన్దితాభ్యామ్=నమస్కరింపఁబడుచున్నవియు, యోగీ...నిషేవితాభ్యామ్=యోగీన్ద్ర=యోగీశ్వరులనెడి, భృఙ్గ+ఇన్ద్ర=శ్రేష్ఠములైన తుమ్మెదలచేత, నిషేవితాభ్యామ్=మిక్కిలి సేవింపఁబడుచున్నవియు, ఆతామ్ర...మాభ్యామ్=ఆతామ్ర=అంతటనెఱ్ఱనయిన, పంకేరుహ=కమలముయొక్క, విభ్రమాభ్యామ్=విలాసములుగలవియు, అగు, తే=నీయొక్క, పదాభ్యామ్=పాదములకొఱకు, అయమ్=ఈ అంజలిః=చేమోడ్పు, చేయఁబడెనని శేషము. శ్రీకృష్ణుపాదములను రాగాంధులగుటచే గోపికలు మ్రొక్కిరనియు, భృంగేంద్రములవలె ఆపాదపద్మములరసము నాశించిన వారగుటచే యోగీంద్రులు గొల్చినారనియు, ఉభయులకును భోగ్యముగా నవి 'ఆతామ్రపంకేరుహవిభ్రమము' గలవిగా నున్న వనియు భావము. కేవలగోపస్త్రీలెక్కడ! సర్వోత్కృష్టులగు యోగీంద్రులెక్కడ! ఉభయులకును సేవ్యమగుటచే పరత్వసౌలభ్యముల సమ్మేళనముచే నైనవైలక్షణ్యము అద్భుతముగా నున్నదని హృదయము. యోగీంద్రులను భృంగేంద్రము లనురూపణముచే కృష్ణపాదములు పద్మములను అను రూపణము గమ్యము. ఆపాదపద్మముల రసమును జక్కఁగా నాశించినవారగుటచే యోగులు భృంగేంద్రము లని కవి చెప్పినాఁడు.

మ. అరుణాంభోజవిలాసమై ప్రబలమోహావేశగోపీమన

స్సరసీశోభిత మై మునీంద్రజనచంచచ్చంచరీకవ్రజా
కర మై హంసకనాదమేదురము నై కన్పట్టుపాదాబ్జముం
గరయుగ్మంబున నంటియుంటి తుద సోకన్ వీక నోలార్చెదన్.73

తా. ఓస్వామీ! శ్రీకృష్ణా! గోప స్త్రీలచేత రాగాతిశయముచే మ్రొక్కంబడు చున్నవియు, తామరలను గొలుచుగండు తుమ్మెదలవలె యోగీశ్వరులు గొలుచు చుండునవియు, అందెట మైనా తామరలవంటిచెలువు గలుగునవియు, నైన నీపద ములకు నిదె యంజలిసేయుచున్నాను.

శ్లో॥ అర్థానులాపా న్వ్రజసున్దరీణా, మకృత్రిమాణాంచ సరస్వతీనాం।
అర్ద్రాశయేన శ్రవణాఞ్చలేన,సంభావయన్తం తరుణం గృణీమః॥74

టీ. వ్రజసున్దరీణాం = గొల్లచెలువలయొక్క, అకృత్రిమాణాం = నిష్కపటము లైన, సరస్వతీనాం = వాక్యములయొక్క, అర్థా + అనులాపాన్ - అర్థ = అర్థముల యొక్క, అనులాపాణ్ = పలుకులను. శ్రవణ + అఞ్చలేన = చెవిప్రాంతములచేతను, అర్ద్ర + ఆశయేన-అర్ద్ర=సరసమైన, ఆశయేన = హృదయముచేతను, సంభావయన్తం =బహూకరించు చున్నవాడును, తరుణం = ఎలప్రాయము గలవాడునగు, కృష్ణమూర్తిని, గృణీమః=నుతించుచున్నాము.

చ. పులకిత మైనచూపు లొకచోట నెఱుంగనివ్వావు బోండ్లమేల్
సొలపుమిటారిచూపులును సొక్కు సెలంగెడు తేటమాటలున్
వలపులు రేవఁగా విని మనంబున నువ్విళులూరు చెల్వనన్
లలితవయోవిలాసుని ననారతముం నుతియింపఁ జెల్లదే. 74

తా. గోప స్త్రీలనిష్కపటంబు లగు వాక్యంబులయర్థంబులను చెవుల కింపు గను మనస్సునకు సొంపుగను వినుచు బహూకరించుచున్నవయసుకాఁడగుకృష్ణుని నుతించుచున్నాము.

శ్లో॥ మనసి మమ సన్నిధత్తాం, మధురముఖా మన్థరాపాఙ్గా।
కరకలితలలితవంశా, కాపి కిశోరా కృపాలహరీ॥ 75

టీ. మధురముఖా-మధుర = సుందరమైన, ముఖా = ముఖముగలదియు, మన్థర + అపాఙ్గా-మన్థర = అలసమైన-లేక సుందరమైన, అపాఙ్గా = కడగన్నులు గలది యును, కర...వంశా-కర=చేతియందు, కలిత = తాల్పఁబడిన, లలిత = సుందరమైన, వంశా=పిల్లఁగ్రోవి గలదియు, కిశోరా=బాల్యము గలదియు, కాపి = అనిర్వాచ్యమై నదియు, అగు, కృపాలహరీ = కృపాప్రవాహము-దయాతిశయస్వరూపుఁ డైనకృష్ణుఁ డనుట, మమ=నాయొక్క, మనసి = మనస్సునందు, సన్నిధత్తామ్ = సన్నిధి సేయుఁ గాక-కృపాలహరీస్వరూపుని కేవలము కృపాలహరిగానే యిట నిరూపించినాఁ డని తెలియునది.

ఉ. అందము నొందు నెమ్మొగమునందుఁ గృపామృతవృష్టి పైపయిం
గ్రందుకొనంగ నొప్పుకడకన్నులు సెన్నలరంగ వేణు వం
దంద కరంబులం జెలఁగ సంగజమోహనమూర్తి యై కరం
బుం దనరారుబాలకుఁడు పొల్చు మదీయహృదంతరంబునన్. 75

తా. సొగసైన మొగమును, సొలపు కడగంటిచూపులును, చేత మురిపెంపు పిల్లఁగ్రోవియుఁ గలిగి బాల్యప్రాయముచే నొప్పుచుఁ గృపాప్రవాహస్వరూపుఁ డయిన శ్రీకృష్ణుఁడు నామనస్సునందు సన్నిధానము సేయుఁగాక.

శ్లో॥ రక్షన్తు న శ్శిక్షితపాశుపాల్యా । బాలావృతా బర్హిశిఖావతంసాః
ప్రాణప్రియాః ప్రస్తుతవేణుగీతాః । శీతా దృశోః శీతలగోపకన్యాః॥

టీ. శిక్షితపాశుపాల్యాః-శిక్షిత = అలవఱుపఁబడిన, పాశుపాల్యాః = గోరక్షణము గలవియు-గోరక్షణము నభ్యసించినవియు, బాల్య+ఆవృతాః - బాల్య = పసితనముచేత, ఆవృతాః = ఆవరింపఁబడినవియు, ప్రాణప్రియాః = ప్రాణమువలె అత్యంతప్రియములైనవియు, ప్రస్తు...గీతాః—ప్రస్తుత = మిక్కిలి కొనియాడఁబడిన వేణుగీతాః = పిల్లఁగ్రోవిగానముగలవియు, దృశోః = కన్నులకు, శీతాః = చల్లనైనవియు-లేక 'స్ఫీతాదృశోః' అను పాఠమున, దృశోః=కన్నులయందు, స్ఫీతాః=అధికములైనవియు-విశాలమైనకన్నులు గలవియనుట, శీతల...కన్యాః-శీతల = చల్లనైన-మన్మథాగ్ని చల్లారిన, గోపకన్యాః = గొల్లకన్నెలుగలవియు, అగు, బర్హి ... వతంసాః-బర్హిశిఖా = నెమిలిపురి, అవతంసాః = తలసొమ్ములుగాఁ గలవి-తలసొమ్ముగాఁ గల శ్రీకృష్ణమూర్తులు అనుట. ఇచట బహువచనము పూజ్యవాచకము, నః=మమ్ము, రక్షన్తు = కాపాడుఁగాక, ఇట 'బాల్యావృతాః' అనుటకు 'బాలావృతాః' అను పాఠమున, బాల + ఆవృతాః = బాలురచే ఆవరింపఁబడినవి యని యర్థాంతరము. ఇందు గేవలగోపవేషమునకు వలయువిజ్ఞానము లన్నియు లక్షణము లన్నియు నుబ్రతిపాదింపఁబడినవి.

మ. పొలుపొందన్ వ్రజబాలకుల్ గొలువ రేపుల్ గేపులన్ మేపిమా
వులు గుంజామణిపుంజరంజితకరాంభోజంబుతోఁ బింఛభూ
షలతోఁ జల్లనిచూపుతో మధురవంశప్రౌఢితో వచ్చి కాం
తలలాలించుచుఁ గాకదీర్చుహరి నిత్యంబున్ మముం బ్రోచుతన్.

తా. గోవులను మేపుట గఱచి, బాల్యము గలిగి నెమిలిపురిని ధరించి, ప్రాణములవలె ప్రియమై, కొనియాడఁబడు వేణుగానముతోఁగూడి, విరివియైన కన్నులతో, గోపకన్యలమన్మథాగ్నిని చల్లార్చుచుండు కృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ స్మిత స్తబకితాధరం శిశిర వేణునాదామృతం
ముహు స్తరళలోచనం మదకటాక్షమాలాకులమ్।
ఉరఃస్థలవిలీనయా కమలయా సమాలిఙ్గితం
భువ స్తలముపాగతం భువనదైవతం పాతు నః॥ 77

టీ. స్మిత...ధరం-స్మిత=నవ్వుచేత, స్తబకిత = గుత్తులుగట్టిన-జొంపముగొన్న యనుట, అధరం=మోవిగలదియు-మోవియందు చిఱునవ్వు మొలకలు గుత్తులవలె గుబురుగొన్నది యనుట, శిశిర...మృతం-శిశిర=చల్లనైన, వేణునాద = పిల్లఁగ్రోవి ధ్వనియనెడి, అమృతమ్=అమృతము గలదియు - అమృతమువలె భోగ్యమై చల్లనై యొప్పు వేణుధ్వనిగలదియనుట, ముహుః=మాటికిని, తరళలోచనమ్-తరళ=చంచలము లైన, లోచనమ్=కన్నులుగలదియును - మిక్కిలి బెళుకులుగలకన్నులు గలదియనుట, మద...కులం-మద-మదించిన, కటాక్ష=కడగంటిచూపులయొక్క, మాలా=వరుస చేత, ఆకులమ్= నెఱసినదియు-మిక్కిలియు నిక్కుమిగిలి నెఱపి నిగుడుచున్న కడగంటి చూపులు గలది యనుట, ఉరః...లీనయా-ఉరఃస్థల=వక్షఃప్రదేశమందు. విలీనయా =మిక్కిలి హత్తియున్న, కమలయా=లక్ష్మీదేవిచేత, సమాలిఙ్గితమ్=మిక్కిలి కౌఁగి లించుకొనఁబడినదియు-లక్ష్మీదేవితో మ్మనఁ బ్రాలి యలమి బిగియఁ గౌఁగిలించుకొని యున్నదనుట. భువః = భూమియొక్క, తలం=ప్రదేశమును, ఉపాగతమ్=పొంది నదియు, అగు, భువనదైవతమ్=లోకమునకెల్ల దైవ మగునది - శ్రీకృష్ణపరబ్రహ్మ మనుట, నః=మమ్ము, పాతు=రక్షించుఁగాక. ఈశ్లోకమున పగత్వమునకు పూర్తి కలి గించు లక్ష్మీపతిత్వమును జెప్పినాఁడు.

చ. ఉరమున సింధురాజసుత యుంచియుఁ గౌఁగిట గారవించియుం
ధరణికి డిగ్గి యీభువనదైవత మెవ్వత వేఁడి కాంచెనో
తరళమదాలసేక్షణసుధారసముం మధురాధరోష్ఠము
న్మురళిరవామృతంబు సుమనోజ్ఞదరస్మితబిందుబృందమున్. 77

తా. అధరమునందు, చిఱునవ్వు మొలకలు దట్టముగా నిగిడి గుబురుకొన, అమృతమువలె భోగ్యమై చల్లనై వేణుధ్వని నిగుడ, మాటిమాటికిని కన్నుఁగవ బెళుకు లీన, నిక్కుతోఁగూడినకడగంటిచూడ్కులు నెఱసి మెఱయ, వక్షఃస్థలమునందు అత్తమిల్లి యుండు లక్ష్మీదేవి బిగియఁ గౌఁగిలింప, భూలోకమునకు వచ్చియున్న సర్వ లోకదైవమగు శ్రీకృష్ణుఁడు, మమ్ము రక్షించుఁగాత.

శ్లో॥ నయనామ్బుజే భజతి కామదుఘం
హృదయామ్బుజే కిమపి కారుణికమ్
చరణామ్బుజే మునికులైకధనం
వదనామ్బుజే వ్రజవధూవిభవమ్॥ 78

టీ. నయన + అమ్బుజే = కమలమువంటి నేత్రమునందు, కామదుఘమ్ = కోరికలను పిదుకునదియు-చూడ్కుల నిగిడ్చినంతనే కోరినకోరికల నొడఁగూర్చునది యనుట, హృదయ + అమ్బుజే = హృదయకమలమందు, కిమపి = ఇంతింతని చెప్ప నలవి కాని, కారుణికమ్ = దయావంతమైనదియు, చరణ + అమ్బుజే = అడుగుఁదమ్ములందు, ముని...ధనమ్-మునికుల = మునిసమూహమునకు, ఏక = ముఖ్యమైన, ధనమ్ = ధనమైనదియు, మునులు కృష్ణునిపాదపద్మములను పెన్నిధివలెఁ దలఁచి తమహృదయములందే పదిలముగా నుంచుకొని ధ్యానించుచుందు రనుట-అట్లు ధ్యానించుటచే వారికి నవి మూలధనమువలె కామితార్థము లన్నియు నొడఁగూర్చుచున్నవి గావున ధన మనఁబడియె. వదన + అమ్బుజే = మోముఁదామరయందు, వ్రజ...విభవమ్-వ్రజవధూ = గోపస్త్రీలయొక్క, విభవమ్ = ఐశ్వర్యమైనదియు-గోపికలకు మిక్కిలి పెంపు సొంపు గూర్చునంత ముద్దులుమూటగట్టు మోముఁదామరగ గలది యనుట. కావుననే దానిని గోపికలకు-ఐశ్వర్యముగాఁ జెప్పినాఁడు. ఇట్టిశ్రీకృష్ణుని, భజత = సేవింపుఁడు.

ఉ. కన్నులెచాలుఁ గోర్కులొసఁగఁ గల్గ హృదయాబ్జముచాలుఁ జెల్మికి
న్నున్నతపాదపంకజము చాలు మునీంద్రజనానురూపసం
పన్నధనాప్తికిన్ వదనపద్మము చాలు వ్రజాంగనావిలా
సోన్నతి కట్టిదివ్యవిభవోజ్జ్వలు నామది నాశ్రయించెదన్. 78

తా. కనుఁదామరగలచూడ్కులు నిగుడ్చుటచేతనే సమస్తములైనకోరికలను గూర్చువాఁడును, హృదయమందు ఇంతింతనరానికరుణ గలవాఁడును, మునిసమూహములు తమకు ముఖ్యధనమువలెఁ గొని హృదయములందు మననముచేయుచుండు పాదారవిందములు గలవాఁడును, గొల్ల చెలువలకు ఐశ్వర్యమువలె-మిక్కిలి పెంపుసొంపు గూర్చునంత సుందరమైన ముఖారవిందము గలవాఁడునగు శ్రీకృష్ణుని భజింపుఁడు.

శ్లో॥ నిర్వాసనం హన్త రసాన్తరాణాం
నిర్వాణసామ్రాజ్య మివావతీర్ణమ్।
అవ్యాజమాధుర్యమహానిధాన
మవ్యా ద్వ్రజానా మధిదైవతం నః॥ 79

టీ. రసాంతరాణామ్ = ఇతరరసములకు-ఆయారసములు గూర్చు నితరపదార్థములకు, నిర్వాసనం = వెసలఁగొట్టుట యైనదియును-తనయొక్క భోగ్యతారసమును ఆస్వాదించినవారికి తక్కిన సకలపదార్థములందును గల ఆయారసముల నన్నిటిని తఱిమఁగొట్టినది యనుట, నిరతిశయమైన నిజభోగ్యతాసారస్యముచే ఇతరవస్తువుల నెల్ల విరసములుగాఁ జేయునది యనుట, అవతీర్ణం = భూమికి నవతరించిన, నిర్వాణసామ్రాజ్యమివ-నిర్వాణ = మోక్షముయొక్క, సామ్రాజ్యమివ = సర్వాధిపత్యమువలె నున్నదియు-ఇట సామ్రాజ్యశబ్దముచే సర్వాతిశయమైన పెంపుసొంపు ఊహ్యముగాఁ పున మోక్షముయొక్క నిరతిశయమైన పెంపుసొంపే కృష్ణరూపమున భూమికి నవత

రించెనో యన్నట్లు నిరతిశయసుఖాబ్ధి నోలలార్చునది యనుట, అవ్యాజ...నిధానమ్-అవ్యాజ=నిరుపాధికమైన-అభరణములు మొదలైన సెపములచేఁ గలుగక తనంతట స్వాభావికముగా సిద్ధించినదైన, మాధుర్య = సౌందర్యమునకు, మహానిధానమ్ = గొప్పనిక్షేప మైనదియును-సౌందర్యసర్వస్వము ఇందే యున్నది గావున ఇది దానికి నిక్షేపమువలెనున్నదని చెప్పినాఁడు, వ్రజానాం = గోపకులకు-"ప్రజానామ్, అనుపాఠమున ప్రజలకు అని యర్థము-అయినను వ్రజానాం అనుటయే శ్రీకృష్ణావతారమునకు అనువర్తకముగావున సరసమైనది. అధిదైవతమ్ = అభిమానదైవతమైనదియు, 'ప్రజానాం' అనుపాఠమున ప్రజలకు దైవమైనదియు, నని యర్థము. ఇట్టిదగు శ్రీకృష్ణబ్రహ్మము, నః=మమ్ము, అవ్యాత్=రక్షించుఁగాక.

చ. ఇతరరసంబు లేమిటికి ? నీనవమోహనమాధురీనిధిన్
సతతముఁ గాంచినం దనివి ? చాలు నె ముక్తిసుఖానుభూతి యా
కృతి యొయారగాఁ దను నకరించె నసం దగు గోపరూపసం
గత మగు దైవతం బఖిలకాంక్షితముల్ జతగూర్చుఁగావుతన్. 79

తా. ఇతరపదార్థములన్నియు విరసములు గావించునట్టి భోగ్యతారసవిశేషమై, మోక్షంపు పెంపుసొంపే యిట్లు భూమికి దిగివచ్చెనో యన నిరతిశయసుఖప్రదమై, నిరుపాధికమైన సౌందర్యమునకు పెన్నిధియై, గోపకులకు నభిమానదైవతమై యొప్పు శ్రీకృష్ణబ్రహ్మము మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ గోపీనా మభిమతగీతవేషహార్దా
దాపీన స్తనభరనిర్భరోపగూఢమ్।
కేళీనా మవతు రసై రుపాస్యమానం
కాళిన్దీపులినచరం పరం మహో నః॥ 80

టీ. అభిమత...హార్దాత్-అభిమత = గొల్లచెలువలకు సమ్మతములైన - వారల మదికి సొంపుగూర్చునట్టి యనుట, గీత = వేణుగానముచేతను, వేష = అలంకారముచేతను, కలిగిన, హార్దాత్=సంతోషమువలన, గోపీనాం = గోపికలయొక్క, ఆపీన...గూఢమ్-ఆపీన=అంతట బలుపునొందిన, స్తనభర=గుబ్బలపెంపుచేత, నిర్భర = గాఢముగా, ఉపగూఢం = కౌఁగిలింపఁబడినదియు - గోపికలు తమకు మదులు సొంపుగూర్చునట్టికృష్ణుని వేణునాదమును వేషమును జూచి యుబ్బి బలుపైనచన్నుఁగవ లుబ్బ బిగ్గఁగౌఁగిలించుకొందురనుట, కేళీనాం=క్రీడలయొక్క, రసైః = సారస్యములచేత-సరసములైన క్రీడలయందలి ప్రీతివిశేషములచేత ననుట, ఉపాస్యమానం = సేవింపఁబడుచున్నదియు-మిక్కిలి క్రీడలాడవలయునని వింతవింతకోర్కులు గలిగియుండునది యనుట, కావునసే, కాళిన్ది...చరం-కాళిన్ది = యమునానదియొక్క, పులిన=ఇసుక

దిబ్బలయందు, చరం = తిరుగుచున్నదియు, పరం = ఉత్కృష్టమైనదియు, అగు, మహః = తేజస్సు, నః = మమ్ము, అవతు = రక్షించుఁగాక.

మ. నవలావణ్యవయోవిలాసమురళీనాదంబులం జొక్కి వ
ల్లవకాంతల్ యమునాధునీపులినలీలావేదికిం దార్చి గా
రవ మొప్పం గుచకుంభసంభృతపరీరంభంబులన్ సంధిబం
ధవిశేషంబులఁ దెల్పు మెచ్చుభువనాధారుండు నన్ బ్రోచుతన్.

తా. గోపికలమనంబులకుఁ బ్రియంబుగా వేణువు నూఁదుచు వారికి మరులు చెలంగునట్టివేషమునఁ బొడసూపుచు మిక్కిలియుబ్బు కలిగింపఁగా వారలచే ఆయుబ్బున గబ్బిగుబ్బలు మీఁదుమిక్కిలి యుబ్బ నబ్బురముగాఁ గౌఁగిలించుకొనఁబడినదియు, నానావిధములైన క్రీడలయందుఁ గోర్కులు మీఱ కాళిందియిసుకదిబ్బలయందు నాడుచుఁ దిరుగుచుండునదియు, సర్వోత్కృష్టమైనదియు నగు శ్రీకృష్ణాఖ్యతేజము మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ ఖేలతాం మనసి ఖేచరాఙ్గనా, మాననీయమృదువేణునిస్వనైః।
కాననే కిమపి నః కృతాస్పదం, కాలమేఘకలహోద్వహం మహః॥

టీ. ఖేచ...నిస్వనైః-ఖేచర + అఙ్గనా = దేవతాస్త్రీలకు, మాననీయ = కొనియాడఁదగిన, మృదు = మృదువులైన, వేణునిస్వనైః = వేణుధ్వనులతో, ఉపలక్షితం సత్ = కూడినదియు, కాననే = బృందారణ్యమందు, కృత + ఆస్పదం = చేయఁబడిన యునికి గలదియు-బృందావనమందు వర్తించునదియు, కాల...ద్వహం-కాలమేఘ = నల్లని మేఘముతోడ, కలహ = జగడమును, ఉద్వహం = వహించినదియు - తననల్లని కాంతినిబట్టి నీలమేఘముతో జగడమాడునది యనుట-నల్లనిమబ్బును మించినకాంతి గలది యని భావము, కిమపి = ఇట్టిదట్టిదని చెప్పరానిదియు, అగు, మహః = కృష్ణాఖ్య తేజము, నః = మాయొక్క, మనసి = మనస్సునందు, ఖేలతాం = విహరించుఁగాక.

మ. అమరీమానితవేణుగానమున బృందారణ్యమందారబృం
దము క్రిందన్ యమునాతరంగకణికాంతర్వేదికామధ్యదే
శమునన్ సాంద్రఘనాఘనప్రతిభటశ్యామద్యుతిం బొల్చుధా
మము నామానసపీఠికం గరుణ గ్రమ్మన్ నిల్చుఁగా కెప్పుడున్. 81

తా. దేవతాస్త్రీలును మిక్కిలి కొనియాడునట్లు మృదువుగా వేణునాదములు నిగుడ్చుచు, నల్లనిమబ్బుతో జగడమాడునును మేనికాంతి వెలుఁగ, ఇట్టిదట్టిదని చెప్పరానిదై బృందారణ్యమందువర్తించు శ్రీకృష్ణాఖ్యతేజము మామనంబులందు విహరించుఁగాక.

శ్లో॥ వేణీకాబవిలోచనాభి రలసశ్రోణీభరప్రౌఢిభి
ర్వేణీభూతరసక్రమాభి రభిత శ్శ్రేణీకృతాభి ర్వృతః।

పాణీ ద్వ్యాచ వినోదయన్ రతిపతే స్తూణీశయై స్సాయకై
ర్వాణీనా మపదం పరం వ్రజజనక్షోణీపతిః పాతు నః॥ 82

టీ. అలస...ప్రౌఢిభిః-అలస = మందములైన-జటువులగుటచే మందసంచారముగలవారనుట, శ్రోణీభర=పిఱుఁదలయొక్క భారముచే - నిబ్బరములైన పిఱుఁదులచేత ననుట, ప్రౌఢిభిః=సామర్థ్యములు గలవారును, నిబ్బరపు పిఱుఁదులచే మందముగా వచ్చువిలాసమున సమగ్రులైనవా రనుట, వేణీ...క్రమాభిః-వేణీభూత = ప్రవాహముగాఁ జేయఁబడిన- వెల్లిగొలుపఁబడిన యనుట, రస=శృంగారరసముయొక్క, ఆక్రమాభిః=ఆక్రమించుట గలవారును-శృంగారరసము వెల్లిగొని పయిఁగొన్నట్టివారనుట కావుననే, అభితః=చుట్టును, శ్రేణీకృతాభిః=బంతిగాఁ జేయఁబడినవారును-బారులుగా చుట్టుకొనియున్నవారనుట చుట్టును బంతులు గొనియున్నవారనుట, ఇట్టివారగు, ఏణీశాబవిలోచనాభిః-ఏణీశాబ=లేడిపిల్లవంటి, విలోచనాభిః=కన్నులు గల స్త్రీలచేత-లేడిపిల్ల కన్నులవలె మిక్కిలి బెళుకులైన కన్నులు గల గోపికలచేత ననుట, వృతః=చుట్టఁబడినవాఁడును-మిక్కిలి బెళుకుఁగన్నులు గల గోపయువతులు బలితంపుఁబిఱుఁదులబరువుచేసిన మెల్లని నడకలవిలాసముతో వచ్చి కృష్ణుం జూచి శృంగారరసము వెల్లిగొని తమ్ము మునుచుకొనఁగా వానిచుట్టును బంతులుగొని, బెళుకుఁజూపులు నిగుడ్చుచు బలసియుండిరని యర్థము, ఇట్టివాఁడును, రతిపతేః=మన్మథుని యొక్క, పాణీద్వ్యా=రెండుచేతులను, తూణీశయైః=వానిపొదులయందలి, సాయకైః=బాణములచేత, వినోదయన్=క్రీడించునట్లుగా చేయుచున్నవాఁడు- మన్మథుని రెండు చేతులతోను పొదులందలి బాణములెత్తి ప్రయోగించునట్లు చేయుచున్నవాఁ డనుట -ఇచట 'పాణీ' అని రెండుచేతులతోను బాణములెత్తినట్లు చేసినాఁడని చెప్పుటచే బాణములవ్యారిగా లెక్కలేనట్లు వేవేగ దొడిగించినాఁడని యర్థము- మీఁదుమిక్కిలి మన్మథవికారము గలిగించినాఁ డని భావము, వాణీనాం=వాక్కులకు, పరం=మిక్కిలియు, అపదమ్=విషయముకానివాఁడును- వాచామగోచరుండనుట, వ్రజ...పతిః-వ్రజజన=గోపసమూహమునకు, క్షోణీపతిః=రాజైనవాఁడును, చూచుటకు కేవలముగొల్లలకు రాజు: మహిమయా వాచామగోచరము అనుట, గోపకులరాజైన శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, పాతు=రక్షించుఁగాక.

మ. సొలపుంజూపులు గబ్బిగుబ్బలు ఘనశ్రోణీభరప్రౌఢి ని
స్తులశృంగారరసోర్మికల్ గలుగు సంగతుల్ బారులై గొల్వఁ గ
న్నిలతూణీశయబాణ మంగజుఁడు పాణిం బూనఁగాఁ జేయు న
చ్చెలువున్ వాఙ్మనసాతిలంఘితుఁ బరుం దా సేవింతు నందాత్మజున్.

తా. గొల్లజవరాండ్రు బలితంపుఁబిఱుఁదులబ్రేఁగున అల్లనినడలతో వచ్చి, శృంగారరసము వెల్లిగొని తమ్ముఁ గైకొనఁగా, లేడిపిల్లవంటి బెళుకుఁగనుచూడ్కులు

నిగుడ్చుచుఁ జుట్టును బంతులుగొని బలసియుండఁగా, మన్మథుని నవ్వారిగా తూపు లేయునట్లు చేసి వారిని మరులుకొలుపుచు, వాచామగోచరుఁడై, గొల్లజనులవు రాజైయొప్పుకృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో॥ కాళిన్దీపులినే తమాలనిబిడచ్ఛాయే పురస్సంచర
త్తోయే తోయజపత్రపాత్రనిహితం దధ్యన్న మశ్నాతి యః ।
వామే పాణితలే నిధాయ మధురం వేణుం విషాణం కటి
ప్రాన్తే గాశ్చ విలోకయన్ ప్రతికలం తం బాల మాలోకయే॥83

టీ. యః=ఎవఁడు-ఏచిన్నికృష్ణుఁడనుట, వామే=డాపలిదియైన, పాణితలే = అఱచేతియందు, మధురం=చెవులకింపైన, వేణుం=పిల్లఁగ్రోవిని, కటిప్రాన్తే=మొల ప్రక్కను, విషాణం = కొమ్ముబూరను, నిధాయ=ఉంచి, ప్రతికలం=ప్రతిక్షణ మును, గాశ్చ = గోవులను, విలోకయన్ = చూచుచున్నవాఁడగుచు, తమాల... ఛాయే-తమాల=చీఁకటిమ్రానులయొక్క, నిబిడ=దట్టమైన, ఛాయే=నీడ గలదియును, పురః..తోయే-పురః = ముందట, సంచరత్=ప్రవహించుచున్న, తోయః = జలము గలదియు, అగు, కాళిన్దీపులినే=యమునయొక్క యిసుకతిన్నెయందు, తోయజ... నిహితం-తోయజపత్ర = తామరాకనెడి, పాత్ర= పాత్రలందు, నిహితం=ఉంపఁబడి నదైన, దధి+అన్నం=పెరుఁగన్నమును-లేక చలిదిని, అశ్నాతి=భుజించుచున్నాఁడో, తం=ఆ-ప్రసిద్ధుఁడైన, బాలం = బాలకృష్ణమూర్తిని, ఆలోకయే = చూచు చున్నాను.

ఉ. చీఁకటిమ్రానిజొంపమునఁ దెన్నగుసైకతవేది నిలపు
న్యాఁక జలంబులో మురళి వామకరంబునఁ బట్టి దట్టిపైఁ
దా కొనగొమ్ముఁ జెక్కుకొని తామరపాకునఁ జల్ది మెక్కుచున్
గోకులముం బ్రతిక్షణముఁ గూరిమిఁ గన్గొను బాలుఁ గాంచెదన్. 83

తా. ఎడమచేత సొగసైనపిల్లంగ్రోవిని బట్టి, మొలప్రక్కను బూరగొమ్ము చెక్కుకొని, ప్రతిక్షణమును ఆవులను జూచుచు యమునానదియందు చీఁకటిమ్రాని నీడగల యిసుకదిన్నెలపై, గూర్చుండి, ముందు యమునాజలము లుండఁగా, తామర పాకును పాత్రగాఁజేసికొని, యందు పెరుఁగుకూటిని పెట్టుకొని భుజించుచున్న బాల కృష్ణుని నేను జూచుచున్నాను.

శ్లో॥ య ద్గోపీవదనేన్దుమణ్డన మభూ త్కస్తూరికాపత్రికం
య ల్లక్ష్మీకుచశాతకుమ్భకలశే వ్యాకోశ మిన్దీవరమ్ ।
య న్నిర్వాణవిధానసాధనవిధౌ సిద్ధాఞ్జనం యోగినాం
త న్నశ్శ్యామల మావిరస్తు హృదయే కృష్ణాభిధానం మహః॥ 84

టీ. యత్=ఏది, గోపీ...మణ్డలమ్-గోపీ = గోపస్త్రీలయొక్క వదన+ఇన్దు=చంద్రునివంటి మొగములయొక్క, మణ్డనం=భూషణమైన, కస్తూరికాపత్రకమ్=కస్తూరి తిలకము, అభూత్=అయ్యెనో, యత్=ఏది, లక్ష్మ్యాః=లక్ష్మీదేవియొక్క, కుచ=స్తనములనెడి, శాతకుమ్భకలశే=బంగారుకుండలయందు, వ్యాకోశం=వికసించినదైన, ఇన్దీవరమ్=నల్లగలువ, (అభూత్=అయ్యెనో), యత్=ఏది, యోగినాం=యోగులకు, నిర్వాణ...విధౌ-నిర్వాణ=ముక్తియనెడి, నిధాన = నిక్షేపముయొక్క, సాధన=సాధించుటయొక్క, విధౌ=విధానమందు, సిద్ధాఞ్జనం=సిద్ధులకాటుక-పాతర తెలుపునట్టి కాటుక, అభూత్=అయ్యెనో-కాటుకచేత పాతరలను దెలిసికొని పొందినట్లు దీనిచే యోగులు ముక్తినెఱింగి పడయుదురనుట, శ్యామలం=నల్లనిదైన, తత్=ఆ-ప్రసిద్ధమైన, కృష్ణ+అభిధానం = కృష్ణుడను పేరుగల, మహః=తేజము, నః=మాయొక్క, హృదయే=హృదయమునందు, ఆవిరస్తు=ప్రకాశించుఁగాక. 'శ్యామలం' అని నల్లనితేజస్సుగాన కస్తూరికాపత్రకముగాను, వికసించినయిందీవరముగాను, సిద్ధాంజనముగాను, రూపించినాఁడని తెలియునది. గోపీవదనములయందు కస్తూరిబొట్టు అనుటచే కస్తూరిబొట్టువలె వన్నెగలిగించువాఁడనుట-గోపీవదనములయెడ చుంబనాదిపరాయణుఁడని భావము. లక్ష్మీకుచకుంభములందు వికసించిన నల్లగలువ యనుటచే నట్టి నల్లగలువవలె చెలువు గులుకువాఁడనుట-లక్ష్మీకుచకుంభములయెడ నిరంతరాలింగనలోలుఁడనుట. యోగులకు సిద్ధాంజనమనుటచే ముక్తికి నొకఁడే ప్రాపకమైనవాఁడని భావము. 'కస్తూరికాపత్రక' మనుటచే సౌరభ్యమును 'వ్యాకోశ' మిందీవర మనుటచే శోభాతిశయమును 'సిద్ధ' అంజన మనుటచే అతిమానుషమహత్వమును ధ్వనితములు.

ఉ. ఏహరి వల్లవీజనముఖేందులకున్ మృగనాభిచిత్రకం
బేహరి లక్ష్మికొమ్మకుచహేమఘటంబుల నొప్పునుత్పలం
బేహరి ముక్తినేనిధి మునీంద్రులకుం గనఁ జేయునంజనం
బాహరినీలమూర్తి హృదయంబున సన్నిధిఁ జేయుఁగావుతన్. 84

తా. ఏది గోపస్త్రీలచంద్రబింబములవంటి ముఖములకు కస్తూరిబొట్టువలె నీటు చూపునో, ఏది లక్ష్మీదేవిబంగరుకుండలవంటికుచములందు వికసించిన నల్లకలువవలె చెలువు గులుకునో, ఏది యోగులముక్తి యనెడిపాతరలను దెలిసికొనుటకు సిద్ధాంజనమువలె నుండునో, కృష్ణుఁ డనెడియానల్లనితేజము, మాహృదయములందుఁ బ్రకాశించుఁగాక.

శ్లో॥ ఫుల్లేన్దీవరకాన్తి మిన్దువదనం బర్హావతంసప్రియం
శ్రీవత్సాఙ్క ముదారకౌస్తుభధరం పీతామ్బరం సున్దరమ్।
గోపీనాం నయనోత్పలార్చితతనుం గోగోపసఙ్ఘావృతం
గోవిన్దం కలవేణునాదనిరతం దివ్యాఙ్గభూషం భజే॥ 85

టీ. ఫుల్ల...కాన్తిమ్-ఫుల్ల=వికసించిన, ఇన్దీవర = నల్లగలువలవంటి, కాన్తి= కాంతి గలవాఁడుచు, ఇన్దువదనమ్=చంద్రునివంటి మొగము గలవాఁడును, బర్హా... ప్రియమ్-బర్హా=నెమిలిపురి యనెడి, అవతంస=శిరోభూషణమే, ప్రియమ్=ఇష్టమైనది గాఁ గలవాఁడు-నెమిలిపురిని తలయందు సొమ్ముగా చెరువుకొనుటయే వానికి మిక్కిలి యిష్టమనుట, శ్రీవత్స+అఙ్కమ్-శ్రీవత్స=శ్రీవత్సమను పుట్టుమచ్చ, అఙ్కమ్= గుఱుతుగాఁ గలవాఁడును, ఉదార...ధరమ్-ఉదార=గొప్పదియైన, కౌస్తుభ=కౌస్తుభ మనెడి కెంపును, ధరం=తాల్చువాఁడును, పీత+అమ్బరం=పచ్చనివస్త్రము గల వాఁడును, సున్దరం=చెలువైనవాఁడును, గోపీనాం=గోపస్త్రీలయొక్క, నయన... తనుమ్ - నయన=కన్నులనెడి - చూడ్కులనెడి యనుట, ఉత్పల=నల్లకలువలచేత, అర్చిత=పూజింపఁబడిన, తనుం=దేహము గలవాఁడును - గొల్ల చెలువ లెల్ల కృష్ణుని శరీరము సారెసు చూచుచుండురని భావము, గో...వృతమ్-గో=గోవులయొక్కయు, గోప=గొల్లలయొక్కయు, సంఘ=సమూహముచేత, ఆవృతమ్=ఆవరింపఁబడినవాఁడును, కల...నిరతం-కల=అవ్యక్తమధురమైన, వేణునాద=పిల్లఁగ్రోవిరవళియందు, నిరతమ్=ఆసక్తుఁడైనవాఁడును,-మిక్కిలి పిల్లఁగ్రోవిని మధురముగా నూఁదుచుండువాఁడనుట, దివ్య...భూషం-దివ్య=శ్రేష్ఠములైన, అఙ్గభూషం=దేహాలంకారభూషణములు గలవాఁడును, అగు, గోవిన్దమ్=కృష్ణుని, భజే=కొలుచుచున్నాను.

శా. శ్రీవత్సాంకితు గోపికానయనరాజీవార్చితుం గోపగో
సేవాభావితుఁ గౌస్తుభోల్లసితు వంశీనాదమోదాన్వితున్
గోవిందున్ నవపింఛయుక్తశశివక్త్రున్ ఫుల్లనీలోత్పలున్
శ్రీవిభ్రాజితు హాటకాంబరయుతున్ సేవింతు భూషాంచితున్. 85

తా. వికసించిన కలువలవంటి నల్లనికాంతి గలవాఁడును, చంద్రునివంటి ముఖము గలవాఁడును, నెమిలిపురి తలయందు చెరువుకొనుట కిష్టపడువాఁడును, శ్రీవత్సమను పుట్టుమచ్చగలవాఁడును, గొప్పకౌస్తుభమను కెంపు దాల్చువాఁడును, పచ్చని వలువ గట్టువాఁడును, సుందరమైనవాఁడును, గోపస్త్రీలచూడ్కు లనెడికలువలచే నిలువెల్లఁ బూజింపఁబడినవాఁడును, గోవులును గోపకులును జుట్టు బలసియుండువాఁడును, అవ్యక్తమధురమగు వేణుధ్వని గలవాఁడును, దివ్యములైన భూషణములు మేనం దాల్చినవాఁడును, అగు శ్రీకృష్ణుని భజించుచున్నాను.

శ్లో॥ యన్నాభీసరసీరుహాన్తరపుటే భృఙ్గాయమాణో విధిః
యద్వక్షః కమలావిలాసనదనం యచ్చక్షుషీ చన్ద్రినా।
యత్పాదాబ్జవినిస్సృతా సురనదీ శమ్భోశ్శిరోభూషణం
యన్నామస్మరణం ధునోతి దురితం పాయాత్స నః కేశవః॥ 86

టీ. యన్నాభీ...ప్లుష్టే-యత్ = ఎవ్వనియొక్క, నాభీ = బొడ్డునందలి, సరసీరుహ-తామరయొక్క, అన్తః = లోపలయున్నెడు, ప్లుష్టే = దొన్నెయందు-దొన్నెవలె నున్నయాతామరలోపలిభాగమున, విధిః = బ్రహ్మదేవుఁడు, భృఙ్గాయమానః = తుమ్మెదవలె సాచరించుచున్నవాఁడో, యత్ + వక్షః = ఎవనిఱొమ్ము, కమలా... సదనమ్-కమలా=లక్ష్మీదేవికి, విలాస=లీలార్థమైన, సదనమ్ = గృహమో, యత్ + చక్షుషీచ = ఎవ్వనిరెండుకన్నులును, ఇన్దు + ఇనౌ = చంద్రసూర్యులో, యత్... సృతా-యత్ పాదాబ్జ = ఎవ్వనిచరణారవిందములనుండి, వినిస్సృతా = వెలువడినదైవ సురనదీ = గంగానది, శమ్భోః = శివునియొక్క, శిరోభూషణమ్ = తలసొమ్మో, యత్ నామస్మరణం=ఎవ్వనిపేరు స్మరించుట, దురితం=పాపమును, ధునోతి = చెదరఁగొట్టునో, 'దునోతి' అను పాఠమున దహించునో, సః = ఆ-ప్రసిద్ధుఁడైన, కేశవః = శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, పాయాత్ = రక్షించుఁగాక. బొడ్డుఁదమ్మి బ్రహ్మకు పుట్టినిల్లు, కన్నులు రెండును సూర్యచంద్రులు. పాదతీర్థము శివుఁడు శిరసా వహించెను. నామస్మరణము సర్వపాపనిర్మూలనము. అట్టిమహత్త్వము గలవాఁడే రక్షింప సమర్థుఁడు గాన మమ్ము రక్షించుఁగాక యని భావము.

ఉ. ఎవ్వనినాభికంజమున ♦ భృంగముభంగిఁ జెలంగుఁ బద్మజుం
డెవ్వనికన్ను లిందురవు ♦ లెవ్వనివక్షము లచ్చి కాటప
ట్టెవ్వనిపాదపద్మజల ♦ మీశుజటాటవిఁ బొల్చుభూషణం
బెవ్వనిఁ బేర్కొనం గలుషసంఘము నాఁగు నొ యాహరి నన్నుఁ బ్రోచుతన్.

తా. ఎవ్వనిబొడ్డుఁదామరలోపల బ్రహ్మ తుమ్మెదవలెఁ జూపట్టునో, ఎవ్వని వక్షము లక్ష్మికి విలాసమందిరమో, ఎవ్వనికన్నులు రెండును సూర్యచంద్రులో, ఎవ్వని పాదారవిందములనుండి బయలుదేఱినగంగ శివునికి తలసొమ్ము అయ్యెనో, ఎవ్వనినామము స్మరింపఁగా పాపములు పటాపంచలగునో, యాశ్రీకృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

అవ. గోపికటాక్షములు కృష్ణునియవ్వయవయవములపైఁ బొలయునప్పుడు చూపట్టుభంగులను వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ రక్షన్తు త్వా మసితజలజై రఞ్జలిః పాదమూలే
మీనా నాభీసరసి హృదయే మారబాణా మురారేః।
హారాః కణ్ఠే హరిమణిమయా వక్త్రపద్మే ద్విరేఫాః
పిఞ్ఛాపీడా శ్చికురనిచయే ఘోషయోషిత్కటాక్షాః॥ 87

టీ. మురారేః = శ్రీకృష్ణునియొక్క, పాదమూలే = అడుగులమొదట, అసిత జలజైః=నల్లగలువలచేనయిన, అంజలిః = దోయిలియును, నాభీసరసి = బొడ్డు అనెడి కొలఁకునందును, మీనాః=చేఁపలును, హృదయే=ఱొమ్మునందు-మనస్సునందని భావ

ము, మారబాణాః=మన్మథునిబాణములును-ఇచట హృదయశబ్దమునకు బాణము లను టంబట్టి బొమ్మనియు మన్మథబాణప్రయుక్తమైన భావవికారమునుబట్టి మనస్సని యు నర్థములు గ్రాహ్యములు, కణ్ఠే=కంఠమునందు, హరిమణిమయాః = ఇంద్రనీలమణి వికారములైన, హారాః=హారములును, వక్త్రపద్మే=మోముదామరయందు, ద్విరేఫాః= తుమ్మెదలును, చికురనిచయే = కురులసమూహమునందు, పిఞ్ఛ + ఆపీడాః = నెమిలి పురి యనెడి శిరోభూషణములును, అగు, ఘోష...కటాక్షాః-ఘోషయోషిత్ = గొల్లచెలువలయొక్క, కటాక్షాః = కడగంటిచూపులు, త్వాం = నిన్ను, రక్షన్తు = రక్షించుగాక-గోపికలకటాక్షములు నల్లనివి గావున కృష్ణుపాదము మొదలుకొని, శిరస్సువఱకును నల్లగలువలు మొదలైనవిగా రూపింపబడియె నని తెలియునది.

చ. కమలదళాక్షునంఘ్రులకుఁ గల్వలదోయిలి నిమ్ననాభికా
పమునకు మీలు పేరెదకు భావజువాలు శిరోధి కింద్రర
త్నములసరాలు మోమువిరిదమ్మికిఁ దుమ్మెదచాలు మౌళికిన్
విమలవుఁబీలిడాలు దగుక్రేవలచూపులు నిన్నుఁ బ్రోచుతన్. 87

తా. గోపికలనల్లనికడగంటిచూపులు కృష్ణునిపాదమూలమునందు బోలసినప్పుడు నల్లకలువలదోయిలివలెను, కొలఁకువలె నుండుబొడ్డునందు చేపలవలెను, హృదయమునందు మన్మథునితూపులవలెను, కంఠమునందు ఇంద్రనీలమణిహారములవలెను, ముఖకమలమునందు తుమ్మెదలవలెను, కురులయందు నెమిలిపురిదండలవలెను, ప్రకాశించుచుండెను. అట్టికటాక్షములు నిన్ను రక్షించుగాక.

అవ. వేకువ నిదుర లేచునప్పటికృష్ణునిచిన్నెలను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ దధిమథననినాదై స్త్యక్తనిద్రః ప్రభాతే
నిభృతపద మగారం వల్లవీనాం ప్రవిష్టః।
ముఖకమలసమీరై రాశు నిర్వాప్య దీపాన్
కబళితనవనీతః పాతు గోపాలబాలః॥ 88

టీ. ప్రభాతే=కొంత తెల్లవాఱునపుడు, దధి...నాదైః-దధి = పెరుగుయొక్క మథన = చిలుకుటవలనఁ బుట్టిన, నినాదైః = ధ్వనులచేత, త్యక్తనిద్రః సన్-త్యక్త= విడువఁబడిన, నిద్రః సన్ = నిదురగలవాఁడగుచు, నిభృతపదం యథాతథా-నిభృత = రహస్యమైన, పదం యథాతథా = అడుగులు గలుగునట్లుగా-రహస్యముగ నెవ్వరికిని తెలియనట్లు అడుగులిడుచు ననుట, వల్లవీనాం = గోపికలయొక్క, అగారం=గృహమును-గృహములను అనుట, ప్రవిష్టఃసన్ = ప్రవేశించినవాఁడగుచు, ముఖ...సమీరైః -ముఖకమల = మోముఁదామరయొక్క, తామరవంటి మొగముయొక్క, సమీరైః= వాయువులచేత-నోటితో ఊఁదుటచేఁ బుట్టినవాయువులచేత ననుట, దీపాన్=దీప

ములను, ఆశు=శీఘ్రముగా, నిర్వాప్య=ఆర్పి, కబళితనవనీతః-కబళిత = మ్రింగఁబడిన, నవనీతః=వెన్నగలవాఁడగు-వెన్నను మ్రింగినవాఁడగు, గోపాలబాలః = గొల్లపిల్లవాఁడగు కృష్ణుఁడు,నః = మమ్ము, పాతు=రక్షించుఁగాక.

ఉ. ప్రొద్దునఁ జల్లఁ జిల్కు రవళ్ళముల్ చెవి సోఁకినయంతలోపలన్
నిద్దుర లేచి గోపరమణీసదనంబులఁ జొచ్చి యెయ్యెన
న్నద్దు మణంచి యాస్యపవనంబున నాళముఁ బూని దీపము
ల్పెద్ద యొనర్చి వెన్నఁ గబళించినగోపకుమారుఁ గాంచెదన్. 88

తా. తెల్లవాఱునపుడు పెరుఁగు చిలుకుధ్వనులు విని నిదురలేచి యెవ్వరికిని తెలియకుండునట్లు మెల్లగా నడుగు లిడుచు గొల్లచెలువలయిండ్లు చొచ్చి వెలుఁగుచున్నదీపముల నోటితో నూఁది వెన్నలను మ్రింగినచిన్నిబాలకృష్ణుఁడు మమ్ముఁ గాచుఁగాత.

శ్లో॥ ప్రాతః స్మరామి దధిఘోషవినీతనిద్రం
నిద్రావసానరమణీయముఖారవిన్దమ్ ।
హృద్యానవద్యవపుషం నయనాభిరామ
మున్నిద్రపద్మనయనం నవనీతచోరమ్॥ 89

టీ. దధి...నిద్రం-దధిఘోష = పెరుఁగు చిలుకుటవలనిచప్పుడుచేత, వినీత= అడఁప బడిన-పోఁగొట్టఁబడిన,నిద్రం = నిద్ర గలవాఁడును,నిద్రా...విన్దమ్ - నిద్రా= నిద్రయొక్క, అవసాన = కడపట, రమణీయ=సుందరమైన, ముఖ+అరవిన్దమ్= ముఖకమలము గలవాఁడును - నిదుర లేవఁగానే యానిదురమబ్బుచే సొగసైన తామర వలె తులకించుచున్నమొగము గలవాఁ డనుట, హృద్య ..వపుషం-హృద్య=మనోజ్ఞమై, అనవద్య = దోషరహితమైన, వపుషం = దేహముగలవాఁడును,నయన+అభిరామం= కన్నులకు మనోహరమైనవాఁడును-లేక కన్నులచేత మనోజ్ఞుఁడైనవాఁడును, ఉన్నిద్ర...నయనం-ఉన్నిద్ర = వికసించిన, పద్మ = తామరరేకులవంటి, నయనమ్ = కన్నులు గలవాఁడును, అగు, నవనీతచోరం = వెన్నదొంగ యైన చిన్నికృష్ణుని, ప్రాతః = రేపకడ, స్మరామి=స్మరించుచున్నాను. నిదురమబ్బుతోఁ గూడిన మొగముతో 'నవనీతచోరమ్' వెన్న దొంగిలించుటకై తమకపడుచున్న చిన్నికృష్ణుని స్మరణము అతిభాగ్యమని యిట హృదయము.

చ. పెరుఁగు మథించువేళఁ గని పెట్టుక లేచిననిద్రమబ్బుతో
నరుణిమఁ జెందుకన్నుఁగవ యందముఁ జారుముఖారవిందమున్
సరసతనూవిలాసములచందముఁ జూచెక్కి వేక్క నేను:గాఁ
బరఁగెడు వెన్నదొంగను బ్రభాతమునన్ మది నెంతు నామదిన్.

తా. పెరుగుఁ జిలుకుచప్పుడు విని నిదురలేచి యావులింతలతో నిదురమబ్బున మొకము ముడిచి కంటిచెలువై తామరవలెఁ దులకింపఁగా, అందమై యేకందును లేనిమేను గలిగి, కన్నులపండువై, విరిసినతమ్మివలె నున్నకన్నులు గల చిన్నారివెన్నదొంగను చిన్ని కృష్ణుని రేపకడ స్మరించుచున్నాను.

శ్లో. ఫుల్లహల్లకవతంసకోల్లస, ద్గల్ల మాగమగవీగవేషితమ్।
వల్లవీచికురవాసితాఙ్గుళీ, వల్లవం కమపి వల్లవం భజే॥ 90

టీ. ఫుల్ల...గల్లమ్_ఫుల్ల = వికసించిన, హల్లక = ఎఱ్ఱదామర యనెడి, వతంసక = కర్ణావతంసము చేత - చెవిని జెకునుకొనెడిభూషణము చేత, ఉల్లసత్ = ప్రకాశించుచున్న, గల్లమ్ = చెక్కిళ్లు గలవాఁడును, ఆగమ...గవేషితమ్_ఆగమగవీ = వేదాంతవాక్యముల చేత, గవేషితమ్ = వెదకఁబడుచున్నవాఁడును - వేదాంతవాక్యములచేతను ప్రతిపాదింపఁ బడిన వాఁడనుట, వల్లవీ...వల్లవమ్_వల్లవీ = గోపికలయొక్క, చికుర = కుంతలముల చేత, వాసిత = పరిమళించునట్లు సేయఁబడిన, అంగుళీపల్లవం = చిగుళ్ల వంటి వ్రేళ్లు గలవాఁడును-గోపికలకురులు దువ్వి పువ్వులిడి కొప్పు జడ మొదలగునవిగాఁ బన్నుచుండువాఁడు గావున నా కుంతలములచే వాసించు చున్న వ్రేళ్లు గలవాఁడనుట, కమపి = ఇట్టిట్టిదని చెప్పరానివాఁడును, అగు, వల్లవం = గొల్లవానిని_గోపాలకృష్ణునిని, భజే = సేవించుచున్నాను. నిజమునకు 'ఆగమగవీ గవేషి'తుఁడు. చూపునకు 'వల్లవీచికురవాసితాంగుళీపల్లవుఁ' డగు 'వల్లవు' డు కనుక 'కమపి' అనిర్వాచ్యుఁ డని భావము.

ఉ. హల్లకతల్లజశ్రుతిపుటాభరణోజ్జ్వలగల్లభాగునిన్
వల్లవకామినీచికురబంధసుమోత్కరవాసితాంగుళీ
పల్లవు మానిమానసవిభాసితు వేదగవీగవేషితున్
సల్లలితారుణాంబుజవిశాలవిలోచనుఁ గొల్చెదన్ మదిన్. 90

తా. చెవిసందుల విలాసముకొఱకుఁ జొనిపిన యెఱ్ఱదామగలచేతఁ గొమరు చూపుచున్న చెక్కిళ్లు గలవాఁడును, వేదాంతవాక్యములకును గోచరింపనివాఁడును, గోపికలకుంతలములను దువ్వి పువ్వులు దురిమి కైసేయుటచే వాసించుచున్న చిగుళ్ల వంటి వ్రేళ్లు గలవాఁడును, అనిర్వాచ్యుఁడును, అగుగోపాలకృష్ణుని భజించుచున్నాను.

శ్లో॥ స్తేయం హరే ర్హరతి యన్నవనీతచౌర్యం
జారత్వ మస్య గురుతల్పకృతాపరాధమ్।
హత్యాం దశాననహతి ర్మధుపానదోషం
యత్పూతనా స్తనపయ స్స పునాతు కృష్ణః॥ 91

టీ. యత్ = ఎందుచేత, హరేః = శ్రీకృష్ణునియొక్క, నవనీతచౌర్యం = వెన్న దొంగతనము, స్తేయం = దొంగతనమును, హరతి = హరించుచున్నదో, అస్య = ఈ

కృష్ణునియొక్క, జారత్వం = విటభావము, గురు...రాధం-గురుతల్ప = గురుభార్య యందు, కృత=చేయఁబడిన, అపరాధమ్ = అపరాధమును, హరతి = హరించు చున్నదో, యత్=ఎందువలన, దశాననహతిః-దశానన=రావణునియొక్క, హతిః= చంపుట, హత్యాం=బ్రహ్మహత్యాదికమును, హరతి = హరించుచున్నదో, పూతనా ...పయః-పూతనా=పూతనయొక్క, స్తన=చన్నులయొక్క, పయః=పాలు-పూతన చన్నుఁబాలు గుడుచుట, మధుపానదోషం=మద్యమును ద్రాగినదోషమును, హరతి= హరించుచున్నదో, తతః = అందువలన-నవనీతచౌర్యాదులను అనుభవించినమాత్రము ననే చౌర్యాదిదోషములన్నియు హతములగునట్టిమహత్త్వము గలవాఁడగుటచేత, సః=ప్రసిద్ధుఁడైన, కృష్ణః=కృష్ణుఁడు, పునాతు=పవిత్రులను జేయుఁగాక.

చ. గురుసతిఁ గూడినట్టి యఘుఁడు కోటిచనుల్ వ్రజజారతారతిం
బొరయును మద్యదోషములు పూతనచన్నులు సేపు లెంచినం
దరలును హత్య రావణహతిన్ వినఁజౌర్యము వాఁడు వెన్నదొం
గతికము లెన్న నట్టికథ గల్గినశౌరి పవిత్రుఁ జేయుతన్. 91

తా. శ్రీకృష్ణుని వెన్నదొంగతికమును స్మరింపఁగాఁ జోరత్వము చేసినపాపమును, జారత్వమును దలఁపఁగా గురుభార్యాసంగమదోషమును, రావణునిఁ జంపుట నను సంధింపఁగా బ్రహ్మహత్యయు, పూతనచన్నుఁబాలు ద్రావుట నెన్నఁగా మద్యపానము చేసినదోషమును, బరిహృతము లగునుగాన నట్టిపవిత్రచరిత్రుఁ డగుకృష్ణుఁడు మమ్ముఁ బవిత్రులను జేయుఁగాక.

అవ. శ్రీకృష్ణవిరహముచే మదనాతుర యగునొకగోపిక మన్మథు నుపాలంభించురీతిని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మార మావస మదీయమానసే, మాధవైకనిలయే యదృచ్ఛయా।
శ్రీరమాపతి రిహాగమే దసౌ, కస్సహేత నిజవేశ్మలఙ్ఘనమ్॥ 92

టీ. హేమార = ఓమన్మథా, మాధ...లయే-మాధవ = శ్రీకృష్ణునకు, ఏక= ముఖ్యమైన, నిలయే=వాసస్థానమైన, ఇహ=ఈ, మదీయమానసే=నామనస్సునందు, యదృచ్ఛయా=ఇచ్ఛవచ్చినట్లు, మావస=వసింపకుము సుమా, అసౌ=ఈ, శ్రీరమా పతిః=లక్ష్మీనాథుఁడగు శ్రీకృష్ణుఁడు, ఇహ=ఇచ్చటికి, ఆగమేత్=వచ్చెను, "హే రమారమణ వాగ్యతా మన" అను పాఠమున, హేరమారమణ=ఓలక్ష్మీపతీ, అసౌ= వీఁడు-ఈమన్మథుఁడు, వార్యతాం=వారింపఁబడుఁగాక, వీనిని వారింపుమా యనుట- నీవు వచ్చి నాకోర్కి దీర్చి యీమన్మథబాధను దీర్పుమా యని భావము. నిజ...లఙ్ఘ నమ్-నిజ=స్వకీయమైన, వేశ్మ=గృహమును, లఙ్ఘనమ్=అతిక్రమించుట - అక్రమించు కొనుట యనుట, కః=ఎవఁడు సహేత=ఓర్చును-ఎవఁడును ఓర్వఁడనుట. శ్రీకృష్ణుని

కామించి మన్మథపీడిత యై ఈయుక్తిచే శ్రీకృష్ణునిరాక ప్రార్థించి మన్మథాగ్నిని దూలింపఁజూచిన దని భావము.

చ. అనుపమదివ్యధామము ముకుందునికిని నాహృదయ మట్లు గావునన్
మనసిజ నిల్వ వద్దు చనుమమ్మ వినుమా యనుమాన మేటికిన్
వనరుహలోచనుం డిటకు వచ్చిన నేరము వచ్చు నెమ్మెయిం
దనగృహసీమ నొండొకఁడు దార్కొన నెవ్వఁడు నైనఁ జెప్పుమా.

తా. ఓమన్మథా ! నామనస్సు కృష్ణునికే వాసస్థాన మైనది. కనుక నిచట విడ్చలవిడిగా వసింపకుమా. శ్రీకృష్ణుఁడును ఇదె వచ్చెను. తనయింటిని ఆక్రమించు కొనుట నెవఁ డోర్చును?

శ్లో॥ ఆకుఞ్చితం జాను కరంచ వామం, న్యస్య క్షితౌ దక్షిణహస్తపద్మే
ఆలోకయన్తం నవనీతఖణ్డం, బాలం భజే కృష్ణ ముపాత్తతాఙ్గమ్॥

టీ. ఆకుఞ్చితం=ముడుచఁబడినట్టి, వామం=డాపలి, జాను = మోఁకాలిని, కరంచ=చేతిని, క్షితౌ=భూమియందు, న్యస్య=ఉంచి-ఎడమమోఁకాలిని ఎడమచేతిని ముడిచి భూమిపైనిడి యనుట, దక్షిణ...పద్మే-దక్షిణ=కుడిదియైన, హస్తపద్మే = తామరవంటిచేతియందు, నవనీతఖణ్డం-నవనీత=వెన్నయొక్క, ఖణ్డం=ముద్దను, ఉపాత్త + అంగం సంతం-ఉపాత్త=వ్రాల్పఁబడిన, అఙ్గం సన్తం=అవయవములు గల వాఁడగుచు-దేహమును వంచి యనుట, ఆలోకయన్తం=చూచుచున్నవాఁడును, బాలం=బాలుఁడును, అగు, కృష్ణం=కృష్ణుని, భజే=భజించుచున్నాను. 'బాలం ముకున్దం మనసా స్మరామి' అనుపాఠమున, బాలం=బాలుఁడు నగు, ముకున్దం = కృష్ణుని, మనసా=మనస్సుచేత-మనస్సునందంతటను, స్మరామి=స్మరించుచున్నాను అనియర్థము. ఎడమచేయియు ఎడమమోఁకాలును మడచి భూమిమీఁద నానించి దానిచే దేహమును వంచి కుడిచేతివెన్నముద్దను చూచుచున్నకృష్ణునిపాలుపును గవి యనుసంధించినాఁ డని తెలియునది.

ఉ. డాపలికేలు జానువు నుదారగతిన్ ధరణీతలంబున
న్నొ్మసి యుపాత్తాంగమున నూల్కొని దక్షిణహస్తపంకజ
స్థాపిత మైనవెన్నఁ బ్రియమందంబునఁ జూచి చెలంగుచెల్వాని
న్గోపకుమారు దంతిగమనున్ సతతంబు మదిం దలంచెదన్. 93

తా. ఎడమమోఁకాలును జేయియు ముడిచి భూమిపై మోపి శరీరము బొర గిలవంచి కుడిచేత నుండువెన్నముద్దను జూచుచుండుబాలకృష్ణుని భజించుచున్నాను.

శ్లో॥ జానుభ్యా మభిధావన్తం, పాణిభ్యా మతిసున్దరమ్
సుకుణ్డలాలకం బాలం, గోపాలం చిన్తయే ముహుః॥

టీ. జానుభ్యామ్ = మోఁకాళ్లచేతను, పాణిభ్యామపి = చేతులచేతను, అభిధావన్తం=పరువులిడుచున్నవాఁడును, సున్దరమ్ = చెలువైనవాఁడును, 'బాహుభ్యామతిసున్దరమ్' అను పాఠమున జానువుల చేతఁ బరుగిడువాఁడును. భుజముల చేత మిక్కిలి సొగసైనవాఁడును, అని యర్థము,- మిక్కిలి సొగసైనబుజములు గలవాఁడనుట, సు...లకమ్-సు=(శ్రేష్ఠములైన, వర్ణల=కుండలములను, అలకం=ముంగురులను గలవాఁడును, బాలం=బాలుఁడును-అగు, గోపాలం=గొల్లవానిని-గోపాలకృష్ణునిని, ఉషః =ప్రాతఃకాలమున, చిన్తయే=చింతించుచున్నాను, సువర్ణాలాలకం కృష్ణం ధ్యాయామ్యుషసి బాలకమ్' అను పాఠమున, బాలకమ్=బాలుఁడగు, కృష్ణం=కృష్ణుని, ఉషసి=ప్రాతఃకాలమున, ధ్యాయామి=ధ్యానించుచున్నాను అని అర్థము.

ఉ. నిద్దపుమద్దికాయ లరకనిక్కఁ బదంబున జానుయానమున్
ముద్దుమొగంబునం జెలఁగుకమ్ముంగురు లందపురావిరేకయున్
గద్దరి జెళ్కుఁజూపులుఁ జొకాటపునవ్వులుఁ గల్గుబాలకుం
బ్రొద్దున మేలుకాంచి దినకమున్ మది నెంచెద నందనందనున్. 94

తా. మోఁకాళ్లతోను జేతులతోను దోఁగాడి పరుగిడుచు, మిక్కిలి సుందరుఁడై, కుండలములు నెవుల వెలుఁగ, నెలయుబాలుని గోపాలకృష్ణుని ప్రాతఃకాలమున ధ్యానింపవలయును.

అవ. శ్రీవిష్ణుండు కవికి అవతారాంతరమునఁ గల భక్తిని బరిశోధింపఁదలఁచి తాను గోదండరాముఁడై యావిర్భవించి దర్శన మియ్యఁగా గవి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ విహాయ కోదణ్డశరౌ ముహూర్తం
గృహాణ పాణౌ మణిచారువేణుమ్ ।
మాయూరబర్హం చ నిజోత్తమాఙ్గే
సీతాపతే త్వాం ప్రణమామి పశ్చాత్॥　95

టీ. హేసీతాపతే=ఓరామా, కోదణ్డశరౌ=విల్లును బాణమును, విహాయ = విడిచి, పాణౌ=హస్తమునందు, ముహూర్తం=గడియసేపు, మణి...వేణుమ్=మణి=మణివికారగమై-రావునసే, చారు-సుందరమైన. వేణుమ్ = పిల్లఁగ్రోవిని; నిజ + ఉత్తమాఙ్గే=స్వాంతశిరమునందు, మాయూరబర్హం చ=నెమిలిపురిని, గృహాణ = గ్రహింపుము, పశ్చాత్=అనంతరము, అహం=నేను, త్వాం=నిన్నుఁగూర్చి, ప్రణమామి =నమస్కరించుచున్నాను.

మ. శరచాపంబులు మాని మానికపువంశంబున్నతిం గేలుఁదా
మరలం బూని కిరీట మంద మగునీకమాళిం విలాసంబు దా
ల్చి రవాణంబుగ నిల్చినన్ మఱి తగన్ సేవించి సీతామనో
హర నామచ్చట దీరునప్పుడుగ దాశరథీత్వం బ్రశంసించెదన్. 95

తా. ఓరామా! నీవిల్లును బాణములును విడిచి మహార్హకాలము కరమున మణిమయంబైన చెలువంపుఁబిల్లఁగ్రోవిని దాల్చి శిరంబున కిరీటంబు విడిచి నెమిలి పురిని జెరువుకొనుము. పిదప నేను నీకు నమస్కరించుచున్నాను.

అవ. ఒకగొల్లపిల్లవాఁడు కృష్ణుం జూచి చెప్పువాక్యము నిట యనుసంధించుచున్నాఁడు.

శ్లో॥ అయం క్షీరాంభోధేః పతి రితి గవాం పాలక ఇతి
శ్రితోఽస్మాభిః క్షీరోపనయనధియా గోపతనయః।
అనేన ప్రత్యూహో వ్యరచి సతతం యేన జననీ
స్తనాద ప్యస్మాకం సకృదపి పయో దుర్లభ మభూత్॥ 96

టీ. అయం=ఈ, గోపతనయః=గొల్లపిల్లవాఁడు-కృష్ణుఁడనుట, క్షీర+అంభోధేః=పాలసముద్రమునకు, పతిరితి=దొరయనియు, గవాం=గోవులకు, పాలక ఇతి=కాపరి యనియు, క్షీర...ధియా-క్షీర=పాలయొక్క, ఉపనయన=సంపాదించుకొనెడి, ధియా=బుద్ధిచేత, అస్మాభిః=మాచేత, శ్రితః=ఆశ్రయింపఁబడెను-పాలసముద్రమునకు దొరయనియు గోవులకు పాలకుఁడనియు మేము యథేచ్ఛముగా పాలుదొరకుననుతలంపుతో ఆశ్రయించితిమనుట, యేన=ఏహేతువుచేత, సతతం=ఎల్లప్పుడును, అస్మాకం=మాకు, జననీ స్తనాదపి=తల్లిచన్నునుండియు, సకృదపి=ఒకానొకప్పుడైనను, పయః=పాలు, దుర్లభం=పొందనలవికానిది, అభూత్=అయ్యెనో - మాకొకప్పుడైనను తల్లిపాలు సైతము త్రాగుటకు లేకపోవుకారణమున, అనేన=వీనిచేత-ఈకృష్ణునిచేత, ప్రత్యూహః=విఘ్నము, వ్యరచి=చేయంబడెను. తల్లిపాలే లేకుండఁజేసినప్పుడు మఱి మేము కోరినట్లు గోవులపాలెక్కడిది? కాఁబట్టి మేము పాలు ద్రాగుటకు విఘ్నము గావించినాఁడని యర్థము.

చ. చెలువుఁడు గోగణాధిపతి క్షీరపయోధివిహారి యీతనిం
గొలిచినఁ బాలు గల్గు ననుకోరికతోఁ గడుభక్తి సేయఁగా
బళిబళి మాదుతల్లిచనుఁబాలకు సైతము విఘ్నకర్తయై
యలవడె నెట్టుగొల్తు మిఁక నక్కట తేఁడని నమ్మి గోపకున్. 96

తా. ఈగోపాలకృష్ణుఁడు పాలసముద్రమునకు దొర యనియు ఆవులను గాచువాఁడనియు కావుననే మాకుపాలు వలయునంత దొరకునని తలంచి యాశ్రయించితిమి. తుదకు దల్లిచనుఁబాలుకూడ ఒకప్పుడైనను మాకులభించుట యరుదు గావించినాఁడు. కనుక మాకు పాలుదొరకుటకే విఘ్నముచేసినాఁడనుటచెప్పనేల?

అవ. ఒకగోపిక చతురముగాఁ జెప్పినమాటను అనుసంధించుచున్నాఁడు.

శ్లో॥ హ_స్త మాక్షిప్య యాతోఽసి బలాత్కృష్ణ కి మద్భుతమ్।
హృదయా ద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే॥ 97

టీ. హేకృష్ణ=ఓకృష్ణా! బలాత్=బలవంతముగా, హస్తం=చేతిని, ఆక్షిప్య= విదిల్చి, యాతఃఅసి=పోయినవాఁడవు, అసి = అగుచున్నావు, కిం = ఏమి, అద్భుతమ్ = ఆశ్చర్యము - నాచేయి విదుల్చుకొనిపోవుట ఒకయాశ్చర్యము కానేరదనుట, హృదయాత్=నా హృదయమునుండి, నిర్యాసియది = బయలువెడలిపోతివేని, తే=నీయొక్క పౌరుషం=పౌరుషమును-మగతనమును, గణయామి = లెక్కింతును-నాచేయి విదుల్చుకొనిపోవుట వింతకాదు, నామనస్సునుండి వెలికి పోయితివేని యప్పుడే నీవు పౌరుషముకలదని యెన్నుచున్నాననుట - నీవు నామనస్సును విడిచిపోవనేరవని యర్థము. నిన్ను నేను సదా మనస్సునందే మఱువక స్మరించుచుందును; నీవు మఱపించినను నిన్ను నేను మఱవను అని భావము.

చ. వలచితిరా యటంచుఁ జెయిసోఁకవట్టినఁ గౌఁగిటఁ గారవించి చెక్కిలిఁ గొనగోట నొక్కి కరగ్రహింపక చిమ్మికపోయె దీక్రియం దలఁపున నిల్వఁ జిక్కక సోఁకా చనఁ గల్గిన బౌరుషంబు నీ కలవడె నంచుఁ బల్కు చెలి సనక్కునఁ జేర్చినశౌరిఁ గాంచెదన్.

తా. కృష్ణా! నీవు నాచేయి విదుల్చుకొని పోవుట యొకయాశ్చర్యము కాదు; నామనస్సునుండి వెలికి పోఁజాలితివేని యప్పుడే నీకు మగతనమున్నదని నేను దలంతును. అంతవఱకు నీకు పౌరుష మున్నదని తలంపను.

శ్లో॥ తమసి రవి రి వోద్య న్మజ్జతా మమ్బురాశౌ
ప్లవ ఇవ తృషితానాం స్వాదువర్షీవ మేఘః।
నిధిరివ విధనానాం దీర్ఘతీవ్రామయాణాం
భిషగివ కుశలం నో దాతు మాయాతు శౌరిః॥ 98

టీ. తమసి సతి=చీఁకటియందు - చీఁకటియుండఁగా, ఉద్యన్ = ఉదయించుచున్న, రవిరివ=సూర్యునివలెను, అమ్బురాశౌ = సముద్రమునందు, మజ్జతాం = మునుఁగుచున్నవారికి, ప్లవఇవ = తెప్పవలెను, తృషితానాం = దప్పిగొన్నవారికి, స్వాదువర్షీ-స్వాదు=భోగ్యముగా, వర్షీ = వర్షించుచున్న, మేఘఇవ = మేఘమువలెను, విధనానాం = ధనములేనివారలకు, నిధిరివ = నిక్షేపమువలెను, దీర్ఘ...యాణాం - దీర్ఘ = ఎడతెగక సాఁగుచున్న, తీవ్ర=వేంద్రమైన, ఆమయాణాం = రోగములుగలవారికి, భిషగివ=వైద్యునివలెను, శౌరిః = శ్రీకృష్ణుఁడు, నః = మాకు, కుశలం = కుశలమును, దాతుం=ఇచ్చుటకు, ఆయాతు=వచ్చుఁగాక.

మ. అడవిం జీఁకటిఁ బోవువాని కుదయం బైనట్టిసూర్యాకృతిన్ జడధిం గ్రుంగఁగ నావ దగ్గఱినయోడజం బేదకున్ లిబ్బి చో

ప్పడురీతిం దృష దీర్పఁగా జడిమొగుల్ కై పైకొన్న చందాన నౌ
వ్వడరన్ మాన్పను వైద్యునట్లు హరి డాయన్ వచ్చి నన్ బ్రోచుతన్.

తా. చీఁకటి గలిగినప్పుడు సూర్యుఁడుదయించినట్లును, సముద్రమునం బడి మునుంగువానికి నావ చేకూఱినట్లును, దప్పిగొన్నవానికి నింగిపైనవర్షము మబ్బు గురిసినట్లును, పేదకు పెన్నిధి దొరకినట్లును, దీర్ఘరోగమును బాధపడువారికి వైద్యుఁడు లభించునట్లును, సంసారబద్ధులమైనమమ్ము కృష్ణుఁడు వచ్చి రక్షించుఁగాక.

అవ. ఇంకను మదనగోపాలమంత్రమూర్తిని కవి వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ కోదణ్డం మసృణం సుగన్ధి విశిఖం చక్రాబ్జపాశాఙ్కుశం
హైమీం వేణులతాం కరైశ్చ దధతం సిన్దూరపుఞ్జారుణమ్।
కన్దర్పాధికసున్దరం స్మితముఖం గోపాఙ్గనావేష్టితమ్
గోపాలం మదనాధిపం తమభజం త్రైలోక్యరక్షామణిమ్॥ 99

టీ. మసృణం = మృదువైన - చెఱుకుమయమైన - ఇచట 'మదనాధిపమ్' అని కృష్ణుని మన్మథాభిమానిదైవతముగా వర్ణించుటచే నిట మన్మథసాధర్మ్యమును జెప్పుచున్నాఁడు. మఱియు మీఁద 'కోదణ్డ మైక్షవమ్' అని చెప్పుచున్నాఁడుగనుక 'మసృణమ్' అనఁగా చెఱుకుమయమగుటచే మనోజ్ఞమైన యనియర్థము, కోదణ్డమ్ = విల్లును, సుగన్ధి = పరిమళించుచున్న-పుష్పమయమైన, విశిఖం = బాణమును, చక్రా... శమ్-చక్ర=చక్రము, అబ్జ = శంఖము, పాశ = పాశమును, అంకుశం-అంకుశమును హైమీం=బంగారుమయమైన, వేణులతాం = పిల్లఁగ్రోవిని, కరైః = హస్తముల చేత, దధతం = ధరించుచున్నవాఁడును, సిన్దూ...రుణమ్-సిందూరపుంజ = చెందిరపు రాశివలె, అరుణం = ఎఱ్ఱనయినవాఁడును-ఇచ్చట మన్మథాభిమాని యగుమూర్తివిశేషమును జెప్పుటచే నలుపును జెప్పక యెఱుపును జెప్పినాఁడని తెలియునది, కన్ద...దరమ్-కన్దర్ప = మన్మథునికంటె, అధిక = ఎక్కుడుగా, సున్దరమ్ = చక్కనైనవాఁడును, స్మితముఖం-స్మిత=చిఱునవ్వుగల, ముఖం = మొగము గలవాఁడును, గోపా...ష్టితమ్-గోప+అఙ్గనా = గోపస్త్రీలచేత, వేష్టితమ్ = చుట్టఁబడినవాఁడును, త్రైలోక్య... మణిమ్-త్రైలోక్య = ముల్లోకములకును, రక్షామణిమ్ = చింతామణియైనవాఁడును-చింతామణివలె ముల్లోకములవారికిని కోరినకోర్కు లొసఁగువాఁడనుట, మదన+అధిపం=మన్మథునికి అధిపతియైనవాఁడును - మన్మథాభిమానిదైవతమైనవాఁడును, అగు, తం=ఆ - ప్రసిద్ధుఁడైన, గోపాలమ్ = గోపాలకృష్ణుని, అభజమ్ = భజించితిని. ఇచ్చట 'కరైః' అనుటచే మీఁద 'బిభ్రాణ మష్టవిధబాహుభిః' అన్నట్లు అష్టకరము అని తెలియునది. గోపాలం సతతం భజామి వరదం త్రైలోక్యరక్షామణిమ్' అను పాఠాంతరమున, వరదం=వరప్రదుఁడగు, గోపాలం=గోపాలకృష్ణుని, సతతం = ఎప్పు

డును, భజామి=భజించుచున్నాను, అని యర్థము. ఈశ్లోకమునర్థమే మీఁదరాఁగల 'కోదణ్డమైక్షవమ్' అనుశ్లోకమున మఱియు స్పష్టము.

చ. అలరులకోరి యింటువిలువంశనంకుశపాశరథాంగశంఖవం
శలతలు బాహులన్ వెలయఁ జక్కనిగోపకుమారమన్మథున్
లలితదరస్మితాననుఁ ద్రిలోకజనావనుఁ గుంకుమారుణో
జ్జ్వలతరగాత్రుఁ గోపజనరాజితముఖిసుఖపాత్రుఁ గొల్చెదన్. 99

తా. చెఱకుగడయైన చెఱకువిల్లును, పుష్పములైన పరిమళము గల బాణములును, చక్రమును, శంఖమును, పాశమును, అంకుశమును, బంగారుపిల్లంగ్రోవియు ఎనిమిదిచేతులందు వాల్చి చందిరపుంబోడపలె నెఱ్ఱని, మన్మథునికంటె సుందరుఁడై, చిఱునవ్వు గొలుసుముఖముతో గోపస్త్రీలు బలసియుండఁగా నొప్పును, ముల్లోకములను రక్షించునట్టి గోరినకోర్కెలిచ్చునట్టి, మన్మథాభిమానిదేవతయై వెలుఁగుగోపాలకృష్ణుని భజించితిని.

శ్లో॥ సాయఙ్కాలే వనాన్తే కుసుమితసమయే సైకతే చన్ద్రికాయాం
త్రైలోక్యాకర్షణాఙ్గం సురనరగణికామోహనాపాఙ్గమూర్తిమ్ ।
సేవ్యం శృఙ్గారభావైర్నవరసభరితైర్గోపకన్యాసహస్రై
ర్వన్దేఽహం రాసకేలీరతమతిసుభగం వశ్యగోపాలకృష్ణమ్॥ 100

టీ. కుసుమితసమయే=వసంతకాలమందు - వసంతకాలమున, వనాంతే = నిమణీయమైన వనమందు-బృందావనమందనుట, చన్ద్రికాయాం=వెన్నెలయందు, సైకతే= ఇసుకతిన్నెయందు, త్రైలో...ఙ్గమ్-త్రైలోక్య = ముల్లోకములను, ఆకర్షణ = వశపఱచుకొనెడి, అఙ్గ = అవయవములు గలవాఁడును - అవయవసౌందర్యాతిశయముచే ముల్లోకములను వశముచేసికొన్నవాఁడనుట, సుర...మూర్తిం-సుర=దేవతల యొక్కయు, నర=మనుష్యులయొక్కయు, గణికా=వేశ్యలను- దేవవేశ్యలను మనుష్యవేశ్యలను ననుట, మోహన=మోహమును బుట్టించునట్టి, అపాఙ్గ=కడగన్నులు గల, మూర్తిం = ఆకృతిగలవాఁడును-కడగంటిచూపులచేతనే దేవమనుష్యవేశ్యలను వశముచేసికొనువాఁడనుట, నవరసభరితైః=నవరస-తొమ్మిదిరసములచేతను, భరితైః= నిండినవారగు, గోపకన్యాసహస్రైః = వేలకొలఁదిగోపస్త్రీలచేత, శృఙ్గారభావైః = శృంగారప్రయుక్తములైనభావములతోడ, సేవ్యం=సేవింపఁదగువాఁడును - ఇచట 'నవరస' అని తొమ్మిదిరసములు సామాన్యముగా చెప్పఁబడినను శృంగారరసమే యిచట ప్రధానమనియుఁ దక్కినవి అంగములై దానికిఁ బోషకములగుననియు దెలియునది. రాస...గతమ్-రాసకేళీ=రాసక్రీడయందు, గతమ్=ఆసక్తుఁడైనవాఁడును, అతిసుభగం=మిక్కిలిసుందరుఁడైనవాఁడును, అగు, వశ్యగోపాలకృష్ణం=సర్వవశ

లకు వశ్యుఁడైన గోపాలకృష్ణుని, అహం = నేను, సాయంకాలే-సాయంకాలము నందు, వందే=నమస్కరించుచున్నాను. ఇట రాసక్రీడ గావున గోపస్త్రీలు వేల కొలఁదిని బరివేష్టించియున్నారనియు, ఆరాసక్రీడలయందు ప్రయుక్తములైన భ్రూ విక్షేపములును అపాంగవిభ్రమములును, వానియందు నిపుణలైన దేవమనుష్యాగణికలకు ను మోహకరముగా నుండెననియును దెలియఁ నది. వేశ్యలకే నాట్యప్రయుక్తములైన యపాంగవిభ్రమాదులందు కౌశల మధికముగావున, దేవమనుష్య స్త్రీలను జెప్పక దేవ మనుష్యవేశ్యలను జెప్పినాఁడు. అపాంగవిభ్రమములందు నిపుణలైన వేశ్యలకుఁగూడ మోహము గొలుపునంతటి యపాంగవిభ్రమములు రాసక్రీడయందు నెఱపినాఁడని మోహకత్వాతిశయము తెలియునది.

మ. పటుశృంగారతరంగితాంగు లగుగోపాలాంగనల్ గొల్వ ను
త్కటబృందావనసైకతంబుల వసంతజ్యోత్స్నలన్ రోదసీ
తటవేశ్యాతతి దృగ్విలాసములచేతం జొక్క రాసక్రియా
నటనాటోపవశీకృతత్రిభువను నన్నందనున్ మదిం గొల్చెదన్. 100

తా. బృందావనములో వసంతకాలమున రాత్రియందు వెన్నెల గాయుచుం డఁగా నినుకతిన్నియలందుఁ జేరి, ముల్లోకంబులను వలపించునట్లు చెలువు గులుకఁ కడగంటివిభ్రమములు దేవమనుష్యవేశ్యలకుఁగూడ మరులు గొలుప, వేలకొలఁదిని, గోపికలు శృంగారరసప్రధానము లగురసములు చిప్పిలి తన్ను శృంగారచేష్టలు పచ రించుచుఁగొలుచుచుండగా, రాసక్రీడ సలుపుచు, భక్తజనులకు వశుఁడై విలసిల్లు గోపాలకృష్ణునికి నమస్కరించెద.

శ్లో॥ కదమ్బ మూలే క్రీడన్తం బృన్దావననివేశితమ్ ।
పద్మాసనస్థితం వన్దే వేణుం గాయన్త మచ్యుతమ్॥ 101

టీ. కదమ్బమూలే = కడిమిచెట్టుక్రింద, క్రీడన్తం = క్రీడించుచున్నవాఁడును, బృన్దా...వేశితమ్-బృన్దావన = బృందావనమందు, నివేశితమ్ = ప్రవేశించినవాఁడును, 'నిషేవితమ్' అనుపాఠమున, సేవించినవాఁడును- లేక, బృందావనమందలి గో గోప గోపీజనులచేత సేవింపఁబడినవాఁడును, పద్మాసనస్థితం=పద్మాసనమందుఁ గూర్చు న్నవాఁడును, 'పద్మోపరిస్థితం' అనుపాఠమున, పద్మ=తామరయొక్క, ఉపరి = మీఁద, స్థితం=ఉన్నవాఁడును అని యర్థము, వేణుం=పిల్లఁగ్రోవిని, గాయన్తం = గానము సేయుచున్నవాఁడును, అగు, అచ్యుతం = (వికారరహితుఁడైన) కృష్ణునిం గూర్చి, వన్దే=నమస్కరించుచున్నాను.

ఉ. పావనయామునాంబుకణభావితశీతలవాతధూతబృం
దావనపాళిఁ బుష్పితకదంబకవృక్షముమూల కేళి రా

జీవనపీనపీఠిక వసించుచు వేణువినోదనాది యా
నావనజాయతేక్షణు నహర్నిశ మెన్నెద నిష్టసిద్ధికిన్. 101

టీ. బృందావనమును జొచ్చి యందలిగోగోపికాదులెల్లఁ గొలువఁగాఁ గడిమిచెట్టుక్రిందఁ గ్రీడించుచుఁ దామరపై గూర్చుండి పిల్లఁగ్రోవి యూఁదుచునుండు శ్రీకృష్ణునికి నమస్కారంచెనను.

శ్లో॥ బాలం నీలామ్బుదాభం నవమణివిలసత్కింకిణీజాలబద్ధ
శ్రోణీజఙ్ఘాన్తయుగ్మం విపులరురునఖప్రోల్లసత్కణ్ఠభూషమ్ ।
ఫుల్లామ్భోజాభవక్త్రం హతశకటమరుత్పూతనాద్యం ప్రసన్నం
గోవిన్దం వన్దితేన్ద్రాద్యమరవర మజం పూజయే ద్వాసరాదౌ॥ 102

టీ. నీల + అమ్బుద + ఆభం = నల్లనిమబ్బువంటికాంతి గలవాఁడును, నవ...యుగ్మమ్-నవ = తొమ్మిదివిధములైన, మణి = వజ్రము మొదలైనమణులచేత, విలసత్ = ప్రకాశించుచున్న, కింకిణీ = చిఱుగంటలయొక్క, జాల = దారముచేత, బద్ధ = కట్టఁబడిన, శ్రోణీ = పిఱుఁదలయొక్కయు, జఙ్ఘాన్త = పిక్కలచివరలయొక్కయు, ద్వంద్వమ్ = జంటగలవాఁడును - పిఱుఁదలయందు మొలనూలిగజ్జెలును కాళ్ళయందు మువ్వగజ్జెలును గలవాఁడనుట, విపుల...భూషమ్-విపుల = పెద్దదియైన, రురు = నల్లచాఱలదుప్పియొక్క, నఖ = గోటిచేత, ప్రోల్లసత్ = మిక్కిలిప్రకాశించుచున్న, కణ్ఠభూషమ్ = కంఠభూషణము గలవాఁడు దృష్టిదోషపరిహారముకొఱకు మెడయందలిభూషణముతో పెద్ద దుప్పిగోరు గూర్చుట నిట తెలియునది, ఫుల్లా...వక్త్రం-ఫుల్ల = వికసించిన, అమ్భోజ = తామరపూవుతో, ఆభ = సమానమైన, వక్త్రం = మొగముగలవాఁడును, హత...ద్యం-హత-చంపఁబడిన, శకట = శకటాసురుఁడు, మరుత్ = తృణావర్తుఁడును, పూతనా = పూతనయు, ఆద్యం = మొదలుగాఁగలవాఁడును, శకటాసురతృణావర్తపూతనాదులను జంపినవాఁడనుట, ప్రసన్నం = నిర్మలుఁడైనవాఁడును, -అనుగ్రహము గలవాఁడును, వన్ది...వరమ్-వన్దిత = వందనము సేయఁబడువారైన, ఇన్ద్ర = ఇంద్రుఁడు, ఆది = మొదలుగాఁగల, అమర = దేవతలకు, వరమ్ = శ్రేష్ఠుఁడైనవాఁడును, వందితులకెల్ల వందితుఁడైనవాఁడనుట, అజం = పుట్టుకలేనివాఁడును, బాలం = బాలుఁడును, అగు, గోవిన్దం = కృష్ణుని, వాసర + ఆదౌ = ప్రాతఃకాలమున, పూజయేత్ = పూజింపవలయును.

ఉ. బాలుఁ బయోదనీలు సురశపాలకవర్ణితశీలు ఘంటికా
లోలకటీతటీపదతలున్ హతచక్రసమీరశాంబరీ
జాలుఁ బ్రఫుల్లపద్మవిలసన్ముఖు వ్యాఘ్రనఖాభిరాము గో
పాలుఁ బ్రసన్ను నచ్యుతుఁ బ్రభాతసమర్చితుఁ జేయుఁగాఁ దగున్.

తా. నల్లనిమబ్బువంటిమేనిచాయ గలిగి, పిఱుఁదులయందును పాదములందును వజ్రములు మొదలైన రత్నములు దాఁపినచిఱుగజ్జెలదారములు విలసిల్లఁగా, పెద్దపులిగోరు కంఠభూషణముసఁ బ్రకాశింపఁగా, వికసించిన తామరవంటినెమ్మొగము గలిగి, శకటాసురునిని తృణావర్తుఁడు పూతన మొదలగువారిని జంపి, యింద్రాదులకెల్లఁ దలమిన్నయై పుట్టుపుడేనివాఁడయ్యు లీలారసము బాలుఁడై యవతరించిన కృష్ణుని వేడ్కను బూజింపవలయును.

శ్లో॥ వన్ద్యం దేవై ర్ముకున్దం వికసితకురువిన్దాభ మిన్దీవరాక్షం
గోగోపీబృన్దవీతం జితరిపునివహం కున్దమన్దారహాసమ్ ।
నీలగ్రీవాగ్ర్యపిఞ్ఛగ్రథనసువిలసత్కున్తలం భానుమన్తం
దేవం పీతామ్బరాఢ్యం యజ యజ దినశో మధ్యమాహ్నే రమాఢ్యమ్॥

తా. దేవైః=దేవతలచేత, వన్ద్యం=నమస్కరింపఁదగినవాఁడును, వికస...దాభమ్-వికసిత=ప్రకాశించుచున్న, కురువిన్ద=కెంపులయొక్క, ఆభం=కాంతిగలవాఁడును, ఇందీవర+అక్షం=నల్లకలువరేకులవంటికన్నులు గలవాఁడును, గో...వీతం-గో=గోవులయొక్కయు, గోపీ=గోపికలయొక్కయు, బృన్ద=సమూహముచేత, వీతం=చుట్టఁబడినవాఁడును, జిత...వహమ్-జిత=గెలువఁబడిన, రిపు=శత్రువులయొక్క, నివహమ్=సమూహముగలవాఁడును, కున్ద...హాసం-కున్ద=మల్లెలవంటియు, మన్దార=కల్పవృక్షములవంటియు, హాసం=చిఱునవ్వు గలవాఁడును, నీల...కున్తలం-నీలగ్రీవ=నెమిలియొక్క, అగ్ర్య=శ్రేష్ఠమైన, పిఞ్ఛ=పురియొక్క, గ్రథన=కూర్పుచేత, సు+విలసత్=మిక్కిలి ప్రకాశించుచున్న, కున్తలం=కురులుగలవాఁడును 'పిఞ్ఛకలనసువిలసత్' అనుపాఠమున, పిఞ్ఛ=నెమిలిపురియొక్క, ఆకలన=కట్టుటచేత, మిక్కిలి ప్రకాశించుచున్నకురులు గలవాఁడని యర్థము. భానుమన్తం=కాంతులతోఁ గూడినవాఁడును, పీతామ్బర+ఆఢ్యం=పీతాంబరముచేఁ బూర్ణుఁడైనవాఁడును-పచ్చని వలువను గట్టినవాఁడనుట, దేవం=దేవుండగు, ముకున్దం=శ్రీకృష్ణుని, దినశః=ప్రతిదినమును, మధ్యమాహ్నే=మాధ్యాహ్నకాలమందు, రమాఢ్యమ్=సంపన్నుఁడగు, యజ యజ=పూజింపుము పూజింపుము.

మ. కురువిందప్రతిమానమోహనతనున్ గోగోపికాసంవృతు
న్స్మరసందోహ మునీంద్రవందితు ముకున్దుం గుందమందారసుం
దరమందస్మితుఁ బింఛభూషణు రిపుధ్వంసిన్ సువర్ణాంబరున్
సరసీజాక్షుని మధ్యమాహ్నమునఁ బూజల్ సేసి శ్రీలొందెదన్.

తా. దేవతలకు వందనీయుఁడై, వికసిల్లిన కెంపులజిగి గల మేనిచాయతో,

నల్లగలువరేకులవంటికన్నులు గలిగి, గోవులు గోపికలును గుంపులు గట్టి చుట్టును బలిసియుండఁగా, శత్రుసమూహముల జయించి, మొల్లలను గల్పవృక్షములను బోలు తెలినవ్వులు నివ్వటిల, మేలైన నెమిలిపురిని జెరువుటచేఁగురులు ప్రకాశించుచుండఁగా, కాంతులు దొంతరలుగొనుచు, పచ్చవలువఁ గట్టి వెలయుచుండుదేవుని శ్రీకృష్ణుని మధ్యాహ్నమునందు సంపద గలుగుకొఱకు యజింపుము.

శ్లో॥ చక్రాస్త్రధ్వస్తవైరివ్రజ మజిత మపాస్తావనీభార మాద్యై
రావీతం నారదాద్యై ర్మునిభి రభినుతం తత్త్వనిర్ణీతిహేతోః
సాయాహ్నే నిర్మలాఙ్గం నిరుపమరుచిరం చిన్తయే న్నీలభాసం
మన్త్రీ విశ్వోదయస్థిత్యపహరణపదం ముక్తిదం వాసుదేవమ్॥104

టీ. మన్త్రీ = గోపాలమంత్రము జపించువాఁడు, చక్రా...వ్రజం-చక్ర + అస్త్ర=సుదర్శనచక్రముకొనచే, ధ్వస్త=పటాపంచలు సేయఁబడిన, వైరి = శత్రువుల యొక్క, వ్రజం=సమూహముగలవాఁడును, కావుననే, అజితం=శత్రువులచే జయింపఁబడనివాఁడును, అపా...భారం-అపాస్త=పోఁగొట్టఁబడిన, అవని = భూమియొక్క, భారం=బరువును గలవాఁడు - భూభారమును దొలఁగించినవాఁడనుట, ఆద్యైః= ఆద్యులగు బ్రహ్మాదులచేత, ఆవీతమ్ = పరివేష్టింపఁబడినవాఁడును నారద + ఆద్యైః= నారదుఁడు మొదలైన, మునిభిః = మునులచేత, తత్త్వ...హేతోః - తత్త్వము యొక్క, నిర్ణీతి = నిశ్చయించుట అనెడు, హేతోః=కారణమువలన - తత్త్వము నిర్ణయించుకొఱకు అనుట, అభినుతం=స్తోత్రముచేయఁబడినవాఁడు - నారదాదులు శ్రీకృష్ణునితత్త్వమును నిర్ణయించువాక్యములచే స్తోత్రము చేయుచుండిరనుట, నిరుపమరుచిరం- నిరుపమ=సాటిలేని, రుచిరం=మనోజ్ఞుఁడైనవాఁడును, 'నిరుపమ మచిరం' అను పాఠమును, నిరుపమం=సాటిలేనివాఁడును, 'అచిరం' అనునది 'చింతయేత్' అను క్రియతో నన్వయించుచున్నది. నిర్మల + అఙ్గం - నిర్మల=నిర్మలములైన - సత్త్వనిర్మితములైన యనుట, అఙ్గ=అవయవములు గలవాఁడును, నీలభాసం=నల్లనికాంతి గలవాఁడును, విశ్వో...పదం-విశ్వ=జగత్తుయొక్క, స్థితి=ఉనికికిని, అపహరణ= లయమునకును పదం=స్థానమైనవాఁడును-వానియందే జగము పుట్టి లయించుననుట, ముక్తిదం=మోక్షము నొసఁగువాఁడును, అగు, వాసుదేవం=వసుదేవుని కుమారుఁడైన కృష్ణుని, సాయాహ్నే=సాయంకాలమునందు, చిన్తయేత్=చింతింపవలయును.

మ. క్షితిభారాపహు నారదాదిమునిరాజీసేవ్యు విశ్వోదయ
స్థితిసంహారవిశారదున్ నిరుపమశ్రీనిర్మలాంగున్ సము
న్నతచక్రాయుధఖండితారి నజితుం గ్రన్సాయంబునం గొల్వ నం
తతవిజ్ఞానము భుక్తిముక్తు లమరుం దన్మంత్రసంసిద్ధికిన్.

తా. చక్రము చేతచే శత్రుసమూహములం బటాపంచలు సేయువాఁడు గావున

శత్రువులచే జయింపంబడనివాఁడును, భూభారమును దొలగించినవాఁడును, అర్థ్యులగు బ్రహ్మాదులచేఁ బరివేష్టింపంబడినవాఁడును, నారదుఁడు మొదలైనమునులచే తత్త్వము నిర్ణయించుకొనుటకు స్తోత్రము చేయబడినవాఁడును, శుద్ధసత్త్వమయవిగ్రహుఁడును, సాటి లేని కాంతి దళుకొత్తువాఁడును, నల్లనిమేనిచాయ గలవాఁడును, జగమునకు జననమును లయమును గలుగుస్థాన మైనవాఁడును, మోక్షదాయకుఁడును అగు వసుదేవుని కుమారుని కృష్ణుని గోపాలమంత్రజపపరుఁడు సాయంకాలమున ధ్యానింపవలయును.

శ్లో॥ కోదణ్డ మైన్దవ మఖణ్డ మిషుంచ పౌష్పం
చక్రాబ్జపాశసృణికాఞ్చనవంశనాళమ్।
బిభ్రాణ మష్టవిధబాహుభి రర్కవర్ణం
ధ్యాయేద్ధరిం మదనగోపవిలాసవేషమ్॥ 105

టీ. అఖణ్డం = సంపూర్ణమైనదియు, ఐక్షవం = చెఱకువికారమైనదియు అగు, కోదణ్డం=విల్లును, పౌష్పం=పుష్పమయమైన, ఇషుంచ=బాణమును, చక్రా... నాళమ్-చక్ర=చక్రమును, అబ్జ=శంఖమును, పాశ=పాశమును, సృణి=అంకుశమును, కాఞ్చన=బంగారుమయమైన, నాళమ్ = పిల్లఁగ్రోవిని, అష్టవిధబాహుభిః = ఎనిమిదివిధములైనచేతులతో, బిభ్రాణం = ధరించుచున్నవాఁడును, అర్కవర్ణం = సూర్యునివంటివర్ణముగలవాఁడును, మదన... వేషమ్-మదనగోప = మదనగోపాలరూపమైన, విలాస=విలాసముతోఁగూడిన, వేషమ్ = వేషముగలవాఁడును - విలాసయుక్తమైన మదనగోపాలమూర్తి గలవాఁడనుట, అగు, హరిం=విష్ణువును, ధ్యాయేత్=ధ్యానింపవలయును- ఇచట మదనగోపాలరూపమైన మూర్తివిశేషమును జెప్పుటచే అష్టవిధబాహువులును, అర్కవర్ణమును జెప్పినాఁడని తెలియునది. మదనగోపాలుఁడు గావున నే మదనత్వసూచకముగా చెఱకువిల్లును పూబాణమును, గోపాలత్వసూచకముగా పిల్లఁగ్రోవియుఁ దాల్చినాఁడని తెలియునది.

చ. విరులలకోరియుం జెఱకుఁవిల్లు గుణాంకుశశంఖచక్రముల్
కరముల నాఱిటం జెలఁగఁ గాంచనవేణువు రెండుచేతులన్
మెఱయఁగఁ బట్టి సూర్యరుచి మీఱినగోపకుమారమన్మథు
న్హరి నవమోహనాంగుని మనంబున నిల్పెద నిష్టసిద్ధికిన్; 105

తా. రెండుచేతుల శంఖచక్రములను, రెండుచేతుల చెఱకువిల్లును పుష్పబాణమును, రెండుచేతుల పాశాంకుశములను తక్కినరెండుచేతులతో బంగారువేణువును బట్టి వాయించుటయు, నిట్లెనిమిదివిధములైనహస్తములందును ఆయుధాదిని దాల్చి సూర్యునివలె నెఱ్ఱని కాంతిం దేజరిల్లుచు, విలాసప్రయుక్తమైన మదనగోపాలమూర్తిని దాల్చిన శ్రీవిష్ణుని ధ్యానింపవలయును.

* అవ.— ఒకగోపికకును గృష్ణునికిఁ గలిగినయుక్తిప్రత్యుక్తికను గవి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అఙ్గుళ్యా కః కవాటం ప్రహరతి? కుటిలే! మాధవః, కిం వసన్తో?
నో చక్రీ, కిం కులాలో?, నహి ధరణిధరః, కిం ద్విజిహ్వః ఫణీన్ద్రః?
నాహం ఘోరాహిమర్దీ, కిమసి ఖగపతి? నో హరిః, కిం కపీన్ద్రః?
ఇత్యేవం గోపకన్యాప్రతివచనజితః పాతు వశ్చక్రపాణిః॥ 110

టీ. కః=ఎవఁడు, అఙ్గుళ్యా=వ్రేలిచేత, కవాటం=తలుపును, ప్రహరతి=కొట్టుచున్నాఁడు—ఇది గోపికవాక్యము. కుటిలే = కుటిలురాలా—కొట్టువాఁడు వీఁడని తెలిసియు తెలియనట్లు నటించుకపటాత్మురాలా యనుట, మాధవః=కృష్ణుఁడు—ఇది కృష్ణుని యుత్తరము—ఇట్లే మీఁదనెల్ల నూహించునది, వసన్తః కిం=వసంతుఁడా యేమి? మాధవశబ్దమునకు విష్ణుఁడనియు వసంతుఁడనియు నర్థములుగనుక కృష్ణుఁ డనునర్థమును గావలయునని వదలి వసంతుఁడని యర్థముగొన్నట్లు వసంతుఁడాయని యడిగినదని తెలియునది. నో = కాదు, చక్రీ=చక్రధారి యగు కృష్ణుఁడను, (గోపిక) కులాలః కిం=కుమ్మరివాఁడా—చక్రియనుటచేఁ గృష్ణుఁడును కుమ్మరివాఁడును అర్థములుగనుక కుమ్మరవాఁడా యని యడిగినది. (కృష్ణ) నహి=కాదుకాదు, ధరణిధరః=(భూమిని ధరించు) విష్ణుఁడను. (గోపి) ద్విజిహ్వః=సర్పమగు, ఫణీన్ద్రః కిం = శేషుఁడవా యేమి — ధరణిధరశబ్దమునకు విష్ణుదేవుఁడును భూమిని దాల్చు శేషుఁడును అర్థములు గనుక శేషుఁడా యేమి యని యడిగినది. (కృష్ణ) న=కాను, అహం=నేను, ఘోరాహిమర్దీ—ఘోర=భయంకరమైన, అహి=సర్పమును—కాళియసర్పముననుట, మర్దీ = మర్దించినవాఁడను—నలఁగఁద్రొక్కినవాఁడను—కృష్ణుఁడ ననుట—నేను సర్పము గాను; సర్పమును గెలిచినవాఁడనని స్వాతిశయప్రకాశనము తెలియునది. (గోపి) ఖగపతిః=గరుడుఁడు, అసి కిం=అగుదువా యేమి? సర్పమును గొట్టువాఁడు గరుడుఁడును అగును గాన గరుడుఁడా యని యడిగినది. (కృష్ణ) న=కాను, హరిః=కృష్ణుఁడను. (గోపి) కపీన్ద్రః కిం=కోఁతులరాజా యేమి—పెద్దకోఁతివా యేమి? యనుట, హరి యనఁగా కృష్ణుఁడును కోఁతియు నర్థమగును గావున కోఁతివా యని యడిగినది. ఇతి=అని, ఏవం=ఈప్రకారముగ, గోప...జితః—గోపకన్యా=గొల్లకన్నియయొక్క, ప్రతివచన=బదులు మాటచేత, జితః=గెలువఁబడినవాఁడగు, చక్రపాణిః=కృష్ణుఁడు, వః=మిమ్ము, పాతు=రక్షించుఁగాక.

తా. శ్రీకృష్ణుఁ డొకగోపికయింటికిఁబోయి తలుపు తట్టఁగా నది కృష్ణుఁడని తెలిసి-

* ఈశ్లోకములు రెండును పెక్కుప్రతులం గనఁబడవు. కావున నీ తెనుఁగుపద్యములును వీనికి లేవని తెలియునది.

యుం గపటముగా 'ఎవరు వ్రేలితోఁ దలుపు దట్టుచున్నారు?' అని యడిగెను కృష్ణుఁడు 'కుటిలాత్మురాలా! మాధవుఁడు' అనెను. అంగుల కది 'వసంతుఁడా' యని యడుగఁగాఁ గృష్ణుఁడు 'కాదు చక్రి' యనెను. దానికది 'కుమ్మరియా' యనఁగాఁ గృష్ణుఁడు 'కాదు ధరణీధరుఁ' డనెను. అది 'సర్పమగు ఆదిశేషుఁడా' యనఁగాఁ గృష్ణుఁడు 'కాదు నేను భయంకరమగు సర్పమును మర్దించినవాఁడను' అనెను, అందుకది 'గరుడుఁడా' యనఁగాఁ గృష్ణుఁడు 'కాదు నేను హరిని' అనెను. దాని కది 'కోఁతియా' యని యడిగెను. ఇట్లా గొల్లకన్నియ ప్రతివచనములచే గెలువంబడిన కృష్ణుఁడు మిమ్ము రక్షించుఁగాక.

అవ. రాధగృహమునుండి చంద్రావళియింటికిఁ బోయి తలుపు దట్టఁగా చంద్రావళికిని కృష్ణునికిని గలిగిన యుక్తిప్రత్యుక్తిను జెప్పుచున్నాఁడు.

శ్లో॥ రాధామోహనమన్దిరా దుపగత శ్చన్ద్రావళీ మూచివాన్
రాధే క్షేమ మయేఽస్తి తస్యవచనం శ్రుత్వాఽఽహ చన్ద్రావళీ
కంస క్షేమ మయే విముగ్ధహృదయే కంసః క్వ దృష్ట స్త్వయా
రాధా క్వేతి విలజ్జితో నతముఖః స్మేరో హరిః పాతు వః. 111

టీ. రాధామోహనమన్దిరాత్-రాధయొక్క మనోజ్ఞమైన గృహమునుండి. ఉపగతః సన్=వచ్చినవాఁడై, చన్ద్రావళీం=చన్ద్రావళీ యనుమటియొక గోపికనుగూర్చి, ఊచివాన్=ఇట్లుచెప్పినవాఁడయ్యె, అయే రాధే=ఓ రాధా, క్షేమం=కుశలము, అస్తి=కలదా-నీవు కుశలమా యనుట, ఇట చంద్రావళిని రాధ యని తలఁచి 'రాధా! క్షేమమా' యని యడిగినాఁడని తెలియునది, తస్య=ఆకృష్ణునియొక్క, వచనం=మాటను, శ్రుత్వా=విని, చన్ద్రావళీ=చంద్రావళి, కంస=ఓ కంసా, క్షేమం=క్షేమమే, అని, ఆహ=చెప్పెను. చంద్రావళి తనకు రాధ మిక్కిలిపగతురాలు గనుక అట్టిరాధగాఁదలఁచి తన్నుఁ గృష్ణుఁడడుగఁగాఁ గోపించి తాను కృష్ణునికి మిక్కిలి పగవాఁడగుకంసునిగాఁ గృష్ణునిగాని 'కంసా! క్షేమమా' అనెనని మర్మోద్ఘాటనము తెలియునది. ఇందులకుఁ గృష్ణుఁడు, 'అయే=ఓసీ, విముగ్ధహృదయే-విముగ్ధ=మిక్కిలిచేలమైన, హృదయే=హృదయము గలదానా, కంసః=కంసుఁడు, క్వ=ఎక్కడ, త్వయా=నీచేత, దృష్టః=చూడఁబడినాఁడు-కృష్ణుఁడ నగు నేను వచ్చియుండఁగాఁ గంసుఁడంటివే! ఇక్కడఁ గంసుఁడు నీకగపడినాఁడా? యని కృష్ణుఁడడుగుట తెలియునది. అందులకుఁ జంద్రావళి, రాధా=రాధ, క్వ=ఎక్కడ (త్వయా=నీచేత, దృష్టా=చూడఁబడినది) ఇతి, అని, (ఆహ=చెప్పెను) అని అధ్యాహార్యము. కంసుఁడెక్కడఁ గనబడినాఁడని నన్నడిగితివే నీకు రాధ యెక్కడఁ గనఁబడినది చెప్పుమని యన్నదని తెలియునది. 'నీకుఁ గంసుఁడట్లో నాకు రాధ యట్లు' అని దీనిచేఁ దెలిపినదని యూ

లు పెట్టిన యున్నమందును, ఏప్రీతి కలుగుచుండెనో యట్టిప్రీతి యీకర్ణామృతమందున గల్గు చున్నది.

శ్లో॥ *కృష్ణానుస్మరణా దేవ పాపసఙ్ఘాతపఞ్జరః ।
శతధా భేద మాయాతి గిరిర్వజ్రహతో యథా॥ 112

టీ. పాప...పఞ్జరః-పాప=పాపములయొక్క, సఙ్ఘాత=సమూహము నెడి, పఞ్జరః=గూడు-గూటివలె బంధకమైయున్న పాపసమూహ మనుట కృష్ణ + అనుస్మరణాత్ ఏవ=కృష్ణు నెడ తెగక స్మరించుటచేతనే, వజ్రహతః=వజ్రాయుధముచేఁ గొట్టఁబడిన, గిరిః యథా=కొండవలె, శతధా=నూఱుపలియలుగా, భేదం=బ్రద్దలు పాఱుటను, ఆయాతి=పొందుచున్నది.

తా. వజ్రాయుధముచేత కొండ నూఱుబ్రద్ద లగునట్లు, బంధక మైనపాపసమూహము కృష్ణు నెడతెగక స్మరించుటచేతనే పటాపంచలగును.

ఇతి శ్రీలీలాశుకవిరచితే శ్రీకృష్ణకర్ణామృతే తృతీయశతకం సమాప్తమ్.

క. వనజాక్షునకు కర్ణామృత
మును జదివిన వ్రాయ వినినఁ బురుషులకును నో
ధనకనకవస్తువాహన
తనయాదిసమృద్ధి శాశ్వతంబుగ నొనఁగున్.

మాలినీవృత్తము. జలరుహదళనేత్రా సర్వరాడ్వైరిపత్రా
ఖలజనఘనవాతా కంజసంజాత తాతా
సలలితగుణభూషా సత్యనిత్యైకభాషా
విలసితసితహాసా వేంకటాహార్యవాసా.

మ. ఇది కృష్ణాశ్రయయోగిపుంగవకృపాశ్రీవిశ్వా త్తసారస్వతా
భ్యుదయశ్రీవిభవప్రసిద్ధ చిదచిద్వోధతత్త్వమాశాంతిస
త్హృదయాభూషణ వెల్లపూడిమణి పెద్దామాత్య వెంగాగ్రణీ
గదితాఖ్యానము వొల్చుఁ బాఠమిక మై కర్ణామృతస్వీకృతిన్.

---

* ఈ శ్లోకము మొకానొకప్రతియందే కనుపట్టుచున్నది కనుక దీనికి వ్యాఖ్యానము లేదు.